వ్యాస ప్రపంచం - 2

# చరిత్ర వ్యాసాలు

రచన

కొడవటిగంటి కుటుంబరావు

కూర్పు

కృష్ణాబాయి, ప్రసాద్




విప్లవ రచయితల సంఘం
ఆంధ్రప్రదేశ్

వ్యాస ప్రపంచం - 2

# చరిత్ర వ్యాసాలు

కొడవటిగంటి కుటుంబరావు



ప్రచురణ :
విప్లవ రచయితల సంఘం, ఆంధ్రప్రదేశ్

మొదటి ముద్రణ :
1999, అక్టోబరు

కవర్ డిజైన్ :
చలసాని ప్రసాదరావు

ముద్రణ :
చరిత గ్రాఫిక్స్, చిక్కడపల్లి, హైదరాబాద్.

ప్రతులకు :
నవోదయ బుక్ హౌస్, కాచిగూడ, హైదరాబాద్
దిశ పుస్తక కేంద్రం, చిక్కడపల్లి, హైదరాబాద్
ప్రగతి బుక్ హౌస్, ఏలూరు రోడ్, విజయవాడ

వెల : రూ. 60/-

# కృతజ్ఞతలు

సారస్వతనికేతనం , వేటపాలెం ;
గౌతమీ గ్రంథాలయం, రాజమండ్రి ;
భ్రమరాంబ గ్రంథాలయం, విజయవాడ ;
ఆంధ్ర మహిళాసభ, మద్రాసు.

'విశాలాంధ్ర' సంపాదకవర్గం, 'ప్రజాశక్తి', 'ఆంధ్రపత్రిక', 'తెలుగు విద్యార్థి',
'సృజన', 'అరుణతార', 'ప్రజాసాహితి' .

పురాణం సుబ్రహ్మణ్యశర్మ (ఆంధ్రజ్యోతి)
నండూరి రామమోహన రావు (ఆంధ్రజ్యోతి)
లీలావతి రాఘవయ్య (జ్యోతి)
ఆలూరి సుధాకర్, ఆలూరి రంగారావు (యువ)

కె. వి. ఆర్., వి. సుబ్రహ్మణ్యం – కావలి, వెలగా వెంకటప్పయ్య – తెనాలి,
లంకా సూర్యనారాయణ – గుంటూరు, సజ్జా వెంకటేశ్వర్లు – వేటపాలెం,
సన్నిధానం నరసింహశర్మ – రాజమండ్రి, దాసరి సుబ్రహ్మణ్యం – మద్రాసు,
కాత్యాయనీ విద్మహే– వరంగల్లు, సుంకర కనకారావు – విజయవాడ,
కాకరాల –మద్రాసు, వలసాని ప్రసాదరావు, కేతు విశ్వనాథరెడ్డి, ఎన్.వేణుగోపాల్
శివలక్ష్మి, వసంతలక్ష్మి, బి. జగన్, వాసిరెడ్డి వేణుగోపాల్–హైదరాబాద్, ఆంధ్ర
శేషగిరిరావు,
స్థానాపతి రుక్మిణమ్మ, మసూనా, అత్తలూరి నరసింహరావు, ఉత్తిలి కృష్ణారావు,
టి.వేణుగోపాలరావు – విశాఖపట్నం, కొత్తపల్లి రవిబాబు – నగరం.

కొడవటిగంటి వరూథిని గారి సహకారం, ప్రోత్సాహం మాకెంతో
ఉత్తేజాన్నిస్తున్నాయి.

విరసం

# ముందుమాటలు

కొడవటిగంటి కుటుంబరావుగారి వ్యాస ప్రపంచంలోని రెండో సంపుటం- చరిత్ర వ్యాసాలు - ఇప్పటికి వెలువడుతోంది. నిజానికిది ఆరేళ్ళ క్రితమే రావలసింది. కాని అడుగడుగునా మాకు ఎదురైన ఇబ్బందుల వలన ఎనలేని ఆలస్యం జరిగింది. ఈ చేదు అనుభవం దిగమింగి ఇక ముందు సంపుటాలు ప్రచురణ వేగం పుంజుకుంటుందని ఆశిస్తున్నాం.

ఆయన రాసిన వ్యాసాలు 1500 పైమాటే. వాటిని వర్గీకరించి ఈ రకంగా పొందు పరుస్తున్నాం.

1. సైన్సు వ్యాసాలు
2. చరిత్ర వ్యాసాలు
3. సంస్కృతీ వ్యాసాలు
4. సినిమా వ్యాసాలు
5. సాహిత్య వ్యాసాలు
6. రాజకీయ వ్యాసాలు
7. తాత్విక వ్యాసాలు
8. లేఖలు

ఇక ఈ సంపుటి గురించి :

చరిత్రని కొ.కు పరిశీలించిన తీరు విభిన్నం. కాలక్రమణిక ప్రకారం మనదేశపు చరిత్ర రాయలేదాయన. అందుకు పూనుకోలేదు కూడా. వేదాలు, ఉపనిషత్తులు, రామాయణ మహాభారతాలు, పురాణాలు మనదేశ చరిత్రకి ప్రామాణికం కావు. కాని మన ప్రాచీన భారత సమాజపు పొరలని తెలుసుకోవడానికి ఇవి ఒక మేరకి ఉపకరిస్తాయి. అందుకే దీనిని 'ప్రాచీన భారతం' అన్నాం. చరిత్ర ఒంటికాలి మీద నడవదు. అది ఏ ఒక్కరి సొత్తూకాదు. అందరి ఉమ్మడి, పూనికల, పనుల సారాంశమే. అంటే మానవ సంబంధాల సమాహారమే చరిత్ర పరిణామ క్రమంలో స్త్రీల పరిస్థితి, పురోగతి విశదం కాకపోతే మన అధ్యయనం అరకొరగానే మిగిలిపోతుంది. అందుకే 'స్త్రీ పర్వం' అన్నాం. సామాజిక స్థితిగతులలో స్త్రీ ఏ మార్పులకి లోనయిందో పరిశీలించే ప్రయత్నం చేశారు కుటుంబరావుగారు. ఇక్కడ ఆయన ఒక్క మన దేశానికే పరిమితం కాకుండా దేశదేశాలలోని వింతవింత ఆచార వ్యవహారాలని, వాటి సరళిని కూడా ఓపిగ్గా వివరించారు.

ఇవి తెలుసుకోడానికి లిఖిత ఆధారాలు పరిమితంగానే పనికొస్తాయి. చరిత్రని పలుగు, పారలతో తవ్వి తీయవలసిందే పాతాళం లోతుల్లోకి వెళ్ళే కోరిక, ఓపిక, దీక్ష, దక్షత ఉండాలి. మన ప్రాచీన చరిత్రకి సంబంధించినంతవరకు వీటిని తమలో నింపుకుని కృషి చేసిన వారిలో ముఖ్యుడు కొశాంబి. అతనే మార్గదర్శి. ఇతరులు, ఇతర దేశాలవారు ఎందరో ఈ రంగంలో కొశాంబి చేసిన పనిని కొనసాగించారు. రకరకాలుగా సాగిన చరిత్ర రచనా వ్యాసంగాన్నంతా బాగా ఆకళింపు చేసుకున్నవారు కొ.కు. ఈ పునాది మీదే ఆయన తన కృషిని ఇంకా ముందుకి తీసుకెళ్ళారు. దీనికి వెనక దన్నుగా నిలబడింది ఆయన సామాజిక శాస్త్రాల అధ్యయనం.

ఏ దేశానికయినా కొన్ని సాధారణ లక్షణాలూ, కొన్ని ప్రత్యేక లక్షణాలు వుంటాయి. మనదేశానికయినా అంతే ఈ చిన్నమాట మర్చిపోయి మనదేశ చరిత్రకి ఏ సామాజిక సిద్ధాంతాలూ వర్తించవని కొందరు అదేపనిగా వల్లె వేస్తున్నారు. ఇంకోవంక మరి కొందరు మనదేశానికి ప్రత్యేక లక్షణాలంటూ ఏమీలేవని పెడవాదన లేవనెత్తుతున్నారు.

ఎక్కడ బయల్దేరామో తెలిస్తేగాని ఎక్కడికి వెళ్ళాలో తెలియదు. మన దేశ చరిత్రని సవ్యంగా అధ్యయనం చేసి అవగతం చేసుకోవడానికి రెండు పెద్ద అవరోధాలున్నాయి. వీటిల్లో ఒకటి గతం. ఇది పెద్ద గుదిబండలా తయారయింది. 'అన్నీ మన వేదాల్లోనే ఉన్నాయి' అనే వాదానికి ఇవాళ వాపు ఎక్కువయింది. అది బలుపు కానేకాదు. వీళ్ళు కావాలని చరిత్రనీ, పురాణాలని కలగా పులగం చేస్తున్నారు. యాభై ఏళ్ళ కిందట కోటా వెంకటాచలం రాసిన పుక్కిటి పురాణ రచనలని ఇవాళ తవ్వి తలకెత్తుకుంటున్నారు. విదేశాలకు వెళ్ళి శాస్త్ర సాంకేతిక రంగాలలో ప్రశంసా పూర్వకమైన కృషిచేసి, కీర్తి శిఖరాలందుకున్న తెలుగు శాస్త్రవేత్తలు ఎందరో వున్నారు. వీరు కూడా కోట వెంకటాచలంగారి పురాణ రచనలు అనే సాలిగూట్లో చిక్కుకున్నారు. ఇదే చరిత్ర అని పొరబడుతున్నారు. ఈ పౌరాణిక దృష్టితో మన దేశ చరిత్రని పునః పరిశీలిస్తున్నారు. పుస్తకాలు కూడా రాస్తున్నారు.

మన చరిత్ర రచనకి రెండో గుదిబండ వలసపాలన. రెండు వందల ఏళ్ళు మన రక్తమాంసాలు పీల్చి పిప్పి చేశారు తెల్లదొరలు. వలసపెత్తనం మన మెడ మీద కాడిలాగే మిగలకుండా, మన మెదడులో సీలలా దిగబడింది. మనకి వీలయినంత త్వరలో ఈ పీడ వదిలించుకోవాలని ఉద్బోధిస్తూ రాసిందే గూగి ''డీకాలనైజింగ్ ది మైండ్''. ఇది మనం చదివి తీరాలి. వందల ఏళ్ళుగా మన మెదళ్ళలో దట్టంగా పేరుకుపోయిన 'చదల చీకటి కదలబారు' తుంది. ప్రపంచ చరిత్రనీ, నాగరికతని పాశ్చాత్య దేశాల గుత్తసొమ్ముగా

భావించడం పరిపాటి అయిపోయింది. ఇది పూర్తిగా పొరపాటు. చరిత్ర, నాగరికతలతో పాటు సైన్సు, టెక్నాలజీల క్కూడా బీజాలు ఆసియా, ఆఫ్రికా దేశాల్లోనే పడ్డాయని మార్టిన్ బెర్నాల్ అంటున్నాడు. 'బ్లాక్ ఎథీనా' అనే తన పెద్ద పుస్తకంలో ఇలాంటి సంగతులనెన్నిటినో విశదపరిచాడు. బెర్నాల్‌తో గొంతు కలుపుతున్నాడు క్లాడ్ అల్వారిస్. ఇతను మనదేశం వాడే. 'డికాలనైజింగ్ హిస్టరీ' అనే పుస్తకం రాశాడు. వీళ్ళ పరిశీలనలు ఇవాళ మరింత అర్థవంతంగా కనిపిస్తున్నాయి. నిజానికి కుటుంబరావుగారు ఈ వ్యాసాలు రాసేనాటికి ఈ రెండు పుస్తకాలూ వెలువడనే లేదు. అయినా చారిత్రక భౌతికవాదం కుటుంబరావుగారికి ప్రాతిపదిక. ఈ దృక్పథాన్ని అనుసరించి ఆయన రాశారు. దీని అన్వయింపు చాలా ముఖ్యం. ఈ వ్యాసాలు అందుకు తోడ్పడతాయని నమ్ముతున్నాం.

విశాఖపట్నం

1, మార్చి 1999

**కృష్ణాబాయి, ప్రసాద్**

ఇందులో.........

## I. ప్రాచీన భారతం

## II. స్త్రీ పర్వం

# 1. నరక వార్తలు

ఆ మహనీయుడు వేదవ్యాసుడు అవతారం చాలించింది లగాయతు మనకు నరక వార్తలు బొత్తిగా తెలియకుండా పోయినై దీనికి కారణం ఏమిటా అని ఆలోచిస్తే ఒక్కటే కనిపిస్తుంది. భారత యుద్ధానంతరం మిగిలిపోయిన ప్రజలు వట్టి నాశిరకం వేదవ్యాస మహర్షి లాగు జీవించి ఉండగానే సమస్తమైనటువంటి లోకాలూ సంచరించి అక్కడి వార్తావళి సంగ్రహించ గల సత్తా కలవారు మచ్చుకు ఒక్కరైనా లేకుండా పోయినారు * అంతే! మరి మనకు నరకవార్త లభించలేదు

అయితే మనం నరకాన్ని గురించి మాట్లాడటం మానలేదు వేదవ్యాసుడు నరకాన్ని ఊహించి రాశాడని భ్రమపడి మనం కూడా నరకాన్ని మన యిష్టం వచ్చినట్టు ఊహించి వ్యాసుడు వర్ణించిన నరకాన్ని మన చిత్తం వచ్చినట్టు మార్చాం ఇది ఇట్లా ఉండగా అనేక వేల సంవత్సరాలపాటు నరకాన్ని గురించి నికరమైన వార్తలు రాకపోవడం మూలాన మన యువకులు 'నరకమనేది ఉందా?' అని ఆశ్చర్యపడటం ప్రారంభించి త్వరలోనే 'ఛా! నరకమూ లేదూ గిరకమూలేదూ!' అన్న నమ్మకానికి వచ్చారు.

రేపు ఇంగ్లీషు వారు మనదేశాన్ని వదలిపెట్టి పోతే రెండు మూడు వందల సంవత్సరాల్లో'అసలు ఇంగ్లండనేది ఉండేదా?' అని మన వారికి శంక రాక తప్పదు.

వ్యాసుడు టైములో నరకం ఎట్లా ఉండేదో మనం సులభంగా ఊహించవచ్చును. యముడనే ఆయన నరకాన్ని తన స్వాధీనంలో ఉంచుకుని నిరంకుశ పరిపాలన చేసేవాడు ఆయన దగ్గిర చిత్రగుప్తుడనే గొప్ప ఆడిటర్ ఉండేవాడు ఆ యముడి యొక్క కింకరులు నరకకూపాలూ అవీ ఉండే చోటికి వస్తూపోతూ ఉండాలి కనక ఫైర్‌ప్రూఫ్ దుస్తులు ధరించేవారు. అవి చప్పున చూడటానికి మట్టితో చేసినట్టు కనిపించేవి.

యముడు హిందూ పక్షపాతి అనీ అందులోనూ బ్రాహ్మణ పక్షపాతి అనీ అనుకోవటానికి ఎటువంటి సందేహమూ అక్కర్లేదు ఆరోజుల్లో అటువంటి పక్షపాతాలు అదో అలంకారంగా ఉండేవి గొప్పవాళ్ళకు. 'హే సురపక్షపాతీ!' అని విష్ణువును సిగ్గు లేకుండా దేవతలు పిలవటం కద్దు. యముడికి గల ఈ పక్షపాతాన్ని బ్రాహ్మణులు నిరసించినట్టుకనిపించదు. మీదు మిక్కిలి వారంతా కలిసి యముణ్ణి యమధర్మరాజని కూడ పిలిచేవాళ్ళు.

అప్పటి రోజుల్లో యమలోకంలో ముఖ్యమైన పంట నువ్వులు, ముఖ్యమైన

* డిజార్మమెంటును సమర్థించడానికి ఇంతకంటె మంచి ఉదాహరణ ఏం కావాలి ? – కొ. కు

పరిశ్రమ తైలం తియ్యటం, ముఖ్యమైన వ్యాపారం కట్టెలు వ్యాసుడి నాటికింకా రాక్షసి బొగ్గూ, హైప్రెషర్‌స్టీమూ లేవు ఎలెక్ట్రిసిటీ బొత్తిగా తెలియదు

యమధర్మరాజు శిక్షలివ్వటంలో నిధి 'పదివేల అర్బుదాలు కుంభీపాకం', 'పన్నెండు వేల అర్బుదాలు కౌరవం', ' ఇరవై తొమ్మిది వేల అర్బుదాలు పుం ' ( ఈ పుం లనే నరకం, ప్రత్యేకంగా, ఆర్యబుుషులు ఏర్పాటు చేయించినటువంటిది ఆ రోజుల్లో ఆర్యుల సంఖ్య భూమి మీద క్షీణించసాగింది అందుకని పిల్లలు లేని అర్యులకు బుద్ధి వచ్చేటందుకు ఆనరకం ఏర్పాటు చేశారు. ఆర్యులేం వెర్రివాళ్లా? తమకు పిల్లలు పుట్టకపోతే మరొక రకంగా పిల్లలను పుట్టించుకుని, ఎనిమిది రకాల పుత్రులను లీగలైజు చేసి పుం నరకాన్నుంచి తప్పించుకున్నారు అందువల్లనే ఆర్యరక్తం ఏకోశానా లేని మనమంతా బ్రాహ్మణులమని చెప్పుకుంటూ ఒకరి కొకరం ' ఆర్యా' అని ఉత్తరాలు రాసుకుంటున్నాం )

రాను రాను యమధర్మరాజు ప్రకృతి అతి విచిత్రంగా మారిపోయింది. మొదట్లో మనుష్యులను శిక్షించటం తనకు ఇష్టం లేనట్టూ, కేవలమూ న్యాయబుద్ధి చేత తప్పని సరిగా శిక్షలు విధిస్తూ ఉండినట్టూ నటించేవాడు కాని కాల క్రమాన ఇది పోయింది ఏరోజున శిక్ష విధించేటందుకు జనం లేకపోతే ఆరోజు అతనికి దుర్దినంగా ఉంటూవచ్చేది. భూమి మీద పుణ్యం జాస్తి అయి నరక కూపాలకు పంపేటందుకు మనుషులు లేకపోతే ఈ యమధర్మరాజు ఇతర దిక్పాలకులతో మొరపెట్టుకుని ఏ విష్ణుమూర్తి దగ్గరికో వెళ్ళి భూమి మీద పుణ్యం తగ్గేమార్గం ఏర్పాటు చేయించుకునేవాడు *

ఇందుకు కేవలమూ యమధర్మరాజునే మనం దూషించనక్కర్లేదు ఎందు చేతనంటే ఆర్మమెంటు మాగ్నెట్స్ కొన్ని మిలియనుల పౌనులను ఆయుధాలు చేసి కూర్చుని యుద్ధమంత్రిగారిని ప్రేరేపించి యుద్ధం చేయించినట్టే, నరకంలో నూనెకూ కట్టెలకూ లాభకరమైన టెండర్ల మీద కాంట్రాక్టు తీసుకున్న మహనీయులు ఆ నూనెకట్టెల యొక్క వాడకం సరిగా జరగని పక్షాన యమధర్మరాజును బతకనిచ్చేవారు కారు.

అంతే! అంతవరకు మనం ఊహించ గలుగుతున్నాం. పురాణాదులను బట్టి మొన్న మొన్న మన స్పిరిచువలిస్టు పోయి చూతురుగదా యమలోకం పూర్తిగా మారి ఉంది. ఎక్కడా నరకకూపాలు లేవు. యమధర్మరాజు లేడు. నువ్వుల పొలాలు లేవు. కట్టెల అడితీలు లేవు. మట్టిలాగుల వాళ్ళులేరు. చిత్రగుప్తుడు లేడు. హిందూమత పక్షపాతమూ

---

* ఇది నమ్మలేనివాళ్లు నేషనల్ మూవీటోనువారి 'రుక్మాంగద' చూతురుగాక! (ఆం. సం.)

బ్రాహ్మణ పక్షపాతమూ లేవు. శిక్షలు లేవు యమధర్మరాజు స్థానే ఒక దివ్యపురుషుడు నిశ్శబ్దంగా పనిచేస్తున్నాడు యమలోకం యావత్తూ సుఖమయంగా ఉంది పాపాలు చేసినవాళ్లు రోగుల మాదిరిగా తమకు తామై అక్కడి వైద్యుల దగ్గిరకు పోయి చికిత్సచేయించుకుంటారు నరకకూపాల స్థానే అక్కడ ఆస్పత్రులు వెలిసినై ఇక్కడి వైద్యులు విశ్వప్రయత్నాలు చేసి కనిపెట్టలేకుండా ఉన్న రహస్యం అక్కడి వైద్యులు కనిపెట్టారు - ప్రతి పాపమూ ఒక విధమైన రుగ్మతేనని ! అంతే కాదు ఈ పాపాలకి చికిత్సకూడా కనిపెట్టారు

ఈ నాలుగైదు వేల సంవత్సరాలలో ఇంత మార్పు! ఈ మార్పు నమ్మటానికి వీలులేనిదిగాకనిపిస్తుంది చప్పున చూడటానికి కాని జాగ్రత్తగా పరిశీలిస్తే ఈ మార్పును సూచించిన వారు ఈ మధ్యకాలపు కవులలో ఒకరిద్దరు లేకపోలేదు. ఇటలీలో దాంతి అని ఒక పొలిటీషియన్ ఉండేవాడు ఈయన ప్రతిపక్షులు ఈయన్ను కనపడిన చోట నిలువునా కాల్చివేయవలసిందిగా ఒక శాసనం చేశారు – ( అప్పుడు వాళ్ళదీ మెజారిటీ). అందుమీద ఈ దాంతికి కోపం వచ్చి 'డివైనా కామెడియో' అని ఒక గ్రంథం రాశాడు. ఆగ్రంథంలో తనకిష్టంలేని వారినందరినీ నరకకూపాల్లో తొక్కాడు ఆ గ్రంథం రాయటానికని ఈ దాంతి బొందితో నరకానికి వెళ్ళి వచ్చాడని ప్రతీతి. ఆయన్ను వార్ధక్యంలో చూసినవాళ్లు 'అడుగో నరకానికి వెళ్ళివచ్చిన వాడు!'' అని చెప్పుకుంటూ దూరంగా తొలిగి పోయేవాళ్లుట ఇంతకూ ఈ దాంతి తన పుస్తకంలో 'పర్గేటరీ' అనే ఒక విధమైన ఆసుపత్రి ఒకటి నరకంలో ఉన్నట్టు రాసున్నాడు.

మిల్టన్ అనే మరొక ఇంగ్లీషు కవి 'పారడైజ్ లాస్ట్' అనే మరొక గ్రంథం రాశాడు. ఈయన కూడా నరకకూపాలను వర్ణించాడు. ఈయన కూడా నరకాన్ని స్వయంగా చూచి వచ్చినట్టు కనపడుతుంది. కాని ఈయన వర్ణనలు మనం సంపూర్ణంగా విశ్వసించటానికి లేదు. ఏమంటే ఈయన గుడ్డివాడు. (అందుకనే 'కాంతిలేని జ్వాలలు' అంటాడు. ఆయనకు వేడి తెలుస్తుంది కాని కాంతి కనిపించదు). ఇంతకూ ఈ మిల్టన్ తన గ్రంథంలో నరకంలో ఒక విప్లవంజరిగిందని స్పష్టంగా సూచించుతున్నాడు. ఆ సమయానికి అక్కడ సోషలిజం వచ్చి ఉండిందనుకోవచ్చును.

మన సమకాలికుడు జార్జి బెర్నార్డుషా 'మాన్ అండ్ సూపర్ మాన్' అనే నాటకంలో నరకం చాలా సుఖప్రదమైన చోటని చెబుతున్నాడు. దీనికేమీ సందేహం లేదు నరకానికి అధిపతిగా భావించబడే మెఫెస్టోఫిలిస్ అనే పెద్దమనిషి యొక్క మూడు మూర్తులూ అయిన షా నరకాన్ని గురించి తెలిసే చెబుతున్నాడనుకోవాలి.

నంకంలో కూడా భూలోకపు రాజకీయాలు తప్పవా అని అనుకోవద్దు. స్వర్గానికి వెళ్ళినా తప్పని విడాకులు నరకంలో ఏం తప్పుతవి గనక?

*ఆంధ్రభూమి, మాసపత్రిక, జూలై,1937*

# న్యాయపరిపాలన -1

వెనకటికి హిందూ మహాసముద్రగర్భాన నూరు చదరపు మైళ్ళ విస్తీర్ణం కల చిన్న లంక ఒకటి ఉండేది దాని మీద దాదాపు ఒక లక్ష జనం నివసిస్తూ ఉండేవారు

ఆ జనాభాలో రెండు జాతుల కలయిక కనిపించేది అందులో ఒక జాతి కురచగా నల్లగా ఉండి కనుముక్కు తీరులేని జాతి. రెండవ జాతి దీర్ఘకాయులూ మంచి శరీరచ్ఛాయ కలవారూ, సుందరరూపులూను

నల్లజాతి వారు ఆ ప్రదేశం సృష్టి నుంచీ తమదేననీ తమ పూర్వులు మాతృద్రోహం చెయ్యటం వల్ల దేశమాత తమ జాతిని శపించి తమ మీద ఆగ్రహించిందనీ చెప్పుకొనేవారు. నిజానికి ఆజాతి కిప్పుడు అక్కడి భూమి మీద ఉన్న హక్కు బహుకొద్ది ఆ హక్కులూ అక్కడి సంపద యొక్క అనుభవమూ తెల్లజాతివే. సముద్రకన్య పుత్రవాంఛ కలిగి సూర్యభగవానుణ్ణి గురించి తపస్సు చేయగా ఆయన ప్రత్యక్షమై ఆమెకు పుత్ర ప్రదానం చేశాడని ఆ పుత్రులే తామనీ చెప్పుకొనేవారు తెల్లజాతివారు.

ఇప్పటి కాలపు మన అభిప్రాయాలను బట్టి మనం ఊహించదగిన దేమంటే, తెల్లజాతివారు ఆ ద్వీపం మీద అడుగుపెట్టే సమయానికి అక్కడ ఈ నల్లజాతి ఉండి ఉంటుంది. వారికొక నాగరికత కూడా ఉండి ఉంటుందని మనం ఊహించుకొనవచ్చును. ఏమంటే బాహ్యస్వరూపంలో ఈ నల్లజాతి తెల్లజాతి కంటె మృగాలకు దగ్గిరగా ఉన్నట్టు కనిపించినప్పటికీ వారి ఉద్రేకంలేని ప్రవృత్తీ, సాధుత్వమూ చూసినట్టయితే ఆ నల్లజాతివారు అనేక శతాబ్దాలుగా ఏదో ఒక విధమైన నాగరికత గలిగి ఉండాలనిపిస్తుంది.

ఉండటానికి తెల్లవారికి పెద్ద పెద్ద ధర్మ శాస్త్రాలూ నీతిచట్టాలూ ఉన్నై, కాని వాటినిబట్టే వారు కొత్తగా సంపాదించుకున్న నాగరికతను బందోబస్తు చేసుకొనటానికి ఇంత అట్టహాసం ఏర్పాటు చేసుకొన్నారనుకోవాలి. నల్లజాతివారికి ఒక ధర్మ చట్టంగానీ, నీతిచట్టంగానీ ఉన్న నిదర్శనం లేదు. అటువంటి చట్టం అవసరం లేకుండానే వారు సాంఘిక జీవనం శాంతంగా చేసినట్టు కనిపిస్తుంది.

మొదటినుంచీ కూడా తెల్లజాతివారు తమ వర్ణాన్ని కాపాడటానికి చాలా శ్రద్ధ తీసుకున్నారు. కాని వర్ణసాంకర్యం తప్పలేదు. దేశంలో తెలుపు నలుపు వర్ణాలే కాక ముదురు గోధుమరంగు''వర్ణమూ'' లేతకాపీరంగు ''వర్ణమూ''తయారయినై. కాని

వ్యవహారానికి మాత్రం రెండే వర్ణాలు కొంచెం పాళ్ల హెచ్చు తగ్గుగా ప్రతివర్ణంలోనూ అన్ని రంగులూ ఉంటూ ఉండేవి

సాంఘికంగా తెల్లవర్ణం పెద్దదీ, నల్లవర్ణం చిన్నదీనూ సంఖ్యకు మాత్రం నల్ల వర్ణమే జాస్తి, నల్లజాతి సాంకర్యం వైవాహికంగా కాని శారీరకంగా గాని కలగకుండా తెల్లజాతి చాలా కట్టుదిట్టాలు చేసుకుంది నల్లజాతి ఈ ఏర్పాటు ఆమోదించింది శరీర కష్టమంతా నల్లజాతిది తత్ఫలం అనుభవిస్తూ కావలసినంత విరామంలో జీవించే తెల్లజాతి జ్ఞానాన్వేషణ చేసి కర్మవల్ల నల్లవర్ణంలో వారి మోస్తరుగా జీవించే వారికి ఇహంగాని పరంగాని లేదని వేదాంత సిద్ధాంతం చేసి ప్రచారం చేసింది జ్ఞానానికి దూరంగా ఉన్న నల్లజాతి ఈ సిద్ధాంతాన్నీ ఇందులో ఉన్న ద్రోహాన్ని విమర్శించలేక విశ్వసించి, నల్ల వర్ణంలో పుట్టటం ఏమాత్రమూ పాపం కాకపోయినప్పటికి, ఎంతో పాపం చేసుకున్న వాళ్లుగాని నల్లవర్ణంలో పుట్టరని నమ్మి నిట్టూర్పువిడిచింది సంఘం యొక్క చాకిరి యావత్తూ తమ మీదనే ఉండటం వల్ల తమకు విరామం లేకుండా ఉందనీ, అందువల్ల తమకు విజ్ఞానం సంపాదించటానికి అవకాశం కలగటం లేదనీ, చాకిరి యావత్తు తమ మీదికి తోసి విజ్ఞానం లేనందుకు తమను తెల్లవర్ణం పశువుల కిందా మెదడులేని వాళ్ల కిందా గణిస్తున్నదనీ నల్లవాళ్లు తెలుసుకొనటానికి చాలాకాలం పట్టింది. ఈ విషయం తెలియగానే నల్లజాతి కుర్రకారులో కొంత అలజడి బయలు దేరింది. కాని ఆచారానికి అలవాటయిపోయిన పెద్దవాళ్లు కుర్రకారు నోళ్ళుకట్టెయ్యాలని ప్రయత్నించారు. నిర్బంధం మరింత స్వేచ్ఛాప్రియత్వం కలిగిస్తుంది. కుర్రవాళ్ళు తిరగబడి, మనిషికి విజ్ఞానం అవసరం లేదనీ, కాయకష్టమే భగవంతుడనీ, భూదేవే మానవ జాతికి తల్లి అనీ పద్యాలు రాశారు ఇట్లా ప్రబోధం చేసినవారిని కొందరిని ఉరిశిక్ష వేయించాడు రాజు మరికొందరు బుద్ధిమంతులు ఈ కవులకు విరుద్ధమైన ప్రచారం మరొకటి చేశారు విజ్ఞానం కావాలి; మానవుడు పశువు కాకుండా కాపాడేది అదే. కాని సంస్కారం అగ్రవర్ణం వారి సొమ్ముకాదు. అందులో అందరికీ హక్కున్నది. సాంఘికమైన శ్రమ రెండు వర్ణాల వారూ సమంగా పంచుకుంటే విజ్ఞానం కూడా అందరికీ సమంగా అబ్బుతుంది.

ఈ అభిప్రాయం ఉద్రేకంతో ఉన్న కుర్రవాళ్లకు నచ్చలేదు. ''వీరు గోడ మీది పిల్లిపద్ధతి అవలంబించారు. ఎండలో పాటుపడి నీడను విశ్రమించటానికీ, సెలయేట్లో దాహంతాగటానికీ, వెన్నెల్లో షికార్లు చెయ్యటానికీ, ప్రియురాలితో క్రీడించటానికీ విజ్ఞానం దేనికి?'' అని అడిగారు కవులు. అప్పటి మట్టుకు వాళ్ల మాటేనెగ్గింది. కొత్త ఉద్యమంలో ప్రాణాలు ఆహుతి చేసిన కవులు కుర్రకారుకు ఆదర్శపురుషులయినారు. కాని రాజశాసనానికి వెరచి ఉద్యమం మటుకు తాత్కాలికంగా అడుగంటింది

## II

మత విషయికంగా కూడా నల్ల వర్ణం అధోగతిలోనే ఉండింది మత సిద్ధాంతాలన్నీ అగ్రవర్ణులే చేసేవాళ్ళు. సహజంగా ఆ సిద్ధాంతాలన్నీ తమకు అనుకూలంగానే చేసుకొనేవాళ్లు కాలానుగుణ్యంగా ఏ కొత్త సిద్ధాంతాలు చేసినా, పాత సిద్ధాంతాలను ఏవిధంగా సంస్కరించినా మొత్తం మీద అమలులో ఉంటున్న మతం మాత్రం అనాదిగా ఉంటూ ఉండినదేనని అగ్రవర్ణాలు వాదించేవారు.

తక్కువ వర్ణం వారు మత జిజ్ఞాస చెయ్యటానికి లేదు, మత గ్రంథాలు పరిశీలించటానికైనా లేదు ఈ రెండు పనులూ చెయ్యటానికి ఉద్యుక్తులైనవారు రాజ శాసనానికి ఆహుతి అవుతూ వచ్చారు. వారి తాలూకు గాథలు ఇతిహాసంలో చేరిపోయినై. ఆ గాథలకు ప్రచారం ఇస్తే మిగిలిన వారికి హడలు ఉంటుందని మాత్రమే ఆలోచించారు అగ్రవర్ణులు. ముందు ముందు శాస్త్రీయంగా చరిత్ర శోధన చేసేవారికి ఇవన్నీ అగ్రవర్ణం వారి అత్యాచారాలుగా తెలిసిపోతవని వారు తెలుసుకోలేదు

మతగ్రంథ పరిశీలనకూ మత జిజ్ఞాసకూ నల్లజాతి అర్హత పొందనప్పటికీ, మతశాసనం మాత్రం వారికి తప్పలేదు ఆ జాతియొక్క ప్రవర్తనను మతమే నిర్ణయించేది. ఆ ప్రవర్తన అగ్రజాతికి అధమ జాతివల్ల ఏ విధమైన అపాయమూ కలగకుండా ఉండేటందుకు ఏర్పాటు చేయబడ్డది.

ఏ శాసనం మన కర్తృత్వం లేకుండా జరుగుతుందో ఆ శాసనాన్ని మనం ఎప్పటి కైనా ధిక్కరించి తీరుతాం. నల్లజాతివారి ప్రవర్తన సగటున తెల్లజాతివారి ప్రవర్తన కంటె ఎక్కువ మతవిరుద్ధంగా ఉండేది నల్లజాతి యొక్క అధమత్వానికి అదే తార్కాణమని అగ్రవర్ణంవారు సిద్ధాంతం చేసి తక్కువ వర్ణంవారిని చాలావరకు నమ్మించగలుగుతూ ఉండేవారు.

మత విషయంలో జోక్యం కలిగించుకుని తమకు అనుకూలమైన పరివర్తన కొంత తీసుకు రావాలని తక్కువ వర్ణంవారు చాలా ప్రయత్నాలు చేశారు. అటువంటి ప్రయత్నాలు సంపూర్ణంగా విఫలం కాలేదు. వాటి ఫలితంగా అప్పుడప్పుడు కొద్ది భేదాలతో మత శాఖలు పుట్టినై ఆదిలో తెల్లవాళ్ళు, నల్లవాళ్లూ క్రమంగా ఒకరి ఆచారాలు ఒకరు అవలంబించుకున్నట్లు ఇప్పుడు కూడా వివిధ ఆచారాలు క్రమంగా సంఘమంతటా వ్యాప్తి చెందినై. ఆఖరుకు సంఘంలో నిజమైన మత భేదం ఏమీ లేకుండాపోయింది. అందరివీ ఇంచుమించు ఒకటే రకమైన విశ్వాసాలూ, ఆచారాలూను. మతజిజ్ఞాస కూడా పూర్తిగా నశించిపోయింది. ఎక్కడ మత సమ్మేళనాలూ సభలూ జరిగితే అక్కడ తమ మూఢవిశ్వాసాలనూ ఎవరూ పాటించని పాత సిద్ధాంతాలను గురించి కొందరు పెద్దలు

గంభీరోపన్యాసాలిచ్చి ఎవరి దారిన వారు ఇంటికి వెళ్లి ఎప్పటి మాదిరిగానే ప్రవర్తిస్తూ ఉండేవారు

మతమూ, మతసిద్ధాంతాలూ ప్రవర్తనను శాసించేకాలం వెనకపడింది నిజమైన మత జిజ్ఞాస లేకపోవటంచేత కలగాపులగంగా మానవులకు ఒక మూఢవిశ్వాస పరంపరమాత్రం మిగిలింది ఛాందసులు కొందరు సనాతనులమని పేరు పెట్టుకొని ఆ మూఢవిశ్వాసాలకోసం వాపోతూ ఉండేవారు వారికి కూడా తమ విశ్వాసాలలో విశ్వాసం లేదు వాటి ప్రకారం ప్రవర్తించటం తమకు కూడా అసంభవమేనని వారు గుర్తించేవారు కారు విశ్వాసం వల్ల కూడా మానవుడికి ప్రయోజనం ఉండాలి ఏ విధమైన ప్రయోజనం గాని సమర్థింపుగాని లేని విశ్వాసం మూఢ విశ్వాసం అవుతుంది సనాతనులు పట్టుకుని వేళ్లాడుతూ ఉండినవన్నీ అటువంటి విశ్వాసాలే. మాటవరుసకు చంద్రమండలంలో మనుష్యులున్నారని నేను నమ్మవచ్చును. అట్లా నమ్మడానికి నాకు ఏమీ ఆధారంలేక ఆవిశ్వాసం వల్ల నాకు కించిత్తు ప్రయోజనం లేకపోయినప్పటికీ దాని కోసం నేను నాప్రవర్తనను ఒకవిధంగా మార్చుకుని కొంత ఆత్మ సుఖ త్యాగం చేస్తే నేను మూఢుణ్ణి అవుతాను; నావిశ్వాసం మూఢవిశ్వాస మవుతుంది. సనాతనుల విశ్వాసాలన్నీ ఇట్లాగే ఉండేవి అందులో కొన్ని ఏమైనా ఉంటే వ్యక్తిగతమైన ప్రయోజనం మాత్రమే ఉండదగినవి. అంటే ఆ విశ్వాసాలు ఎవరికుంటే వారికి మాత్రమే దాని ఫలం దక్కుతుంది. ఆవిశ్వాసం కలవాడు వాటి ప్రచారానికై ఏమీ శ్రమ పడనక్కర్లేదు. నేను పరస్త్రీ గమనం చెయ్యకుండా ఉన్నట్టయితే నాకు మరణాంతరం రంభా సంభోగం లభిస్తుందని నేను విశ్వసించవచ్చును కాని ఈ విశ్వాసం నాకు తప్ప ప్రపంచంలో మరెవ్వరికీ లేక పోయినప్పటికీ నాకేమీ నష్టం ఉండదు. ఇటువంటి వ్యక్తిగతమైన ప్రయోజనం గల విశ్వాసాల విషయంలో కూడా అందరికీ నిర్లక్ష్యత ఏర్పడ్డందుకు సనాతనులు వలవలా ఏడిచేవాళ్ళు

మత శాసనం ద్వారా ప్రవర్తన నిర్ణయం కావటమనేది అడుగంటటానికి ప్రబలమైన కారణం ఒకటి ఉంది. కాల పరిస్థితులు మారి మనుష్యుల ప్రవర్తనకు కొత్త కొత్త అవకాశాలు ఏర్పడుతున్న కొద్దీ కొత్త కొత్త నిర్బంధాలు అవసరమైనై. ఈనిర్బంధాలకు మూలం మత సిద్ధాంతాలలోనే అన్వేషించటం రాను రాను దుర్ఘటమైపోయింది. ప్రతి స్వల్ప విషయానికీ కొత్త మత సిద్ధాంతాలు చేయటమూ అవి అనాదిగా ఉండినవని ఒప్పించటమూ అసంభవంగా పరిణమించింది. అందువల్ల వెనక మతం ద్వారా జరిగిన శాసనం ఇప్పుడు రాజశాసనం ద్వారా జరగసాగింది. తమ శరీరాలకు గాని ఆత్మలకుగాని ఎంతమాత్రమూ అపకారం చెయ్యని పనులు కూడా

రాజశాసనానికి బద్ధులైజనం చెయ్యటం మానుకోవలసి వచ్చింది. అట్లా మానుకోవటం సాంఘికమైన ప్రయోజనం కలదని వాదించారు రాజుగారి మంత్రాంగములు కాని ఆ విషయం నిరూపించే బాధ్యత మాత్రం వారు తమ మీద ఉంచుకోలేదు

మతం వెనుకబడిన తరువాత అగ్రవర్ణం వారిలో కొందరు విష్పాక్షికమైన బుద్ధితో తక్కువ వర్ణంవారి స్థితిగతులననుసరించి వారికి అన్యాయం జరుగుతున్నదని ఆలోచించ గలిగారు కాని రాజశాసనం మూలకంగా ఏమీ చెయ్యలేని వారయినారు సంఘంలో ఉన్న సమస్యలను తీసుకుని విడివిడిగా చర్చించగల ధీమంతులు చాలామంది ఉన్నప్పటికీ సంఘాని కేమీ ఉపకారం లేకపోయింది కాలక్రమాన అనేక సమస్యలు ఒకదానితో ఒకటి అల్లుకుపోవటంవల్ల ఏ తీగ కదిలించినా పాదంతా కదలసాగింది రాజకీయ, ఆర్థిక, మత, సాంఘిక సమస్యలు ఒకదానితో ఒకటి చిక్కుపడటం వల్ల ఏ ఒక సమస్య ఎత్తుకున్నా మిగతా సమస్యలన్నీ వాటంతటవే పైకి రాసాగినై కాని ఏ సమస్యను చర్చించేవారు ఆ సమస్యతో ఇతర సమస్యలేవీ జతకానట్టుగా భావించటంవల్ల వట్టి చర్చల వల్ల పని ఏమీలేదు.

## III

ఆర్థికంగా సంఘంలో చాలా తెగలు ఏర్పడినై ఉన్న భూమిలో దాదాపు సగం వరకూ రాజుగారి స్వంత ఆస్తి. మిగిలిన సగమూ పది పన్నెండు మంది పెద్ద మనుష్యుల హక్కు భుక్తాలలో ఉంటున్నది లాభం వచ్చే రెండు మూడు పరిశ్రమలూ వారి చేతుల్లోనే ఉన్నై వారి తరవాత భాగ్యవంతులు పెద్ద పెద్ద రాజోద్యోగులు రాజానుచరులూనూ. ఆకొద్ది పాటి సామ్రాజ్యంలో విశేషమైన వ్యాపారం లేదు ఉన్నకొద్దిపాటి వ్యాపారమూ హక్కుల మూలకంగా ఏర్పాటయినదే పత్తి, కొవ్వు, నూనె మొదలైన కొన్ని వస్తువులను కొందరు హక్కుదార్లు గుత్తకు తీసుకుని చాలా లాభాలు పొందేవారు. అటువంటి గుత్తదార్ల వల్ల పెద్దవాళ్లకున్న అవసరాన్ని బట్టి ఆ హక్కులు కూడా పుట్టినవనుకోవాలి

పైన చెప్పిన వారు కాక మిగిలిన వారంతా దరిద్ర నారాయణులే. కాని ఏ మనిషైనా కానీ స్వేచ్ఛను ఎంతవరకు త్యాగం చెయ్యగలిగితే అంత సుఖంగా బతకటానికి వీలుండేది రాజశాసనం విమర్శించిన వాడికి మంచినీళ్లు పుట్టేవి కావు ఎంతలేనివాడికి కూడా ఒక ఆస్తి ఉండి తీరేది – ఆడది.

రాజశాసనం కేవలమూ రాజుగారు చేసే శాసనం మాత్రమే కాదు. ఆయన కింద లౌక్యులయిన మంత్రులిద్దరుండేవారు. వారిలౌక్యం ఎందులో కనిపించేదంటే వారు రాజగారి కష్టసుఖాలను కనిపెట్టటమే కాక దేశంలో ఉన్న ఇతర బలవంతుల యొక్క మంచిచెడ్డలనూ, కష్టసుఖాలనూ కూడా కనిపెట్టి వాటికీ వీటికీ సమన్వయం కుదర్చటంలో ఉండేది. దేశంలో కల్లా బలవంతుడు రాజు కాడు. బలశాలులూ, యుక్తిశాలులూ,

ధీశాలులూ - వీరందరినీ మంచి చేసుకొని వారికి అపకారం లేని శాసనంచేస్తూవారి పక్షాన ఉంచుకోవటం రాజనీతిగా ఉంటూండేది వారి ద్వారా వారి దగ్గిర వారంతా బాగుపడుతూ ఉండేవారు.

సంఘంలో పేరుకు రెండే జాతులయినప్పటికీ క్రియకు చాలా జాతులయినై. వర్ణ వైషమ్యం కలవారు మాత్రం తమ వర్ణంలోనే ఐకమత్యం లేనట్టూ రెండో వర్ణం వారు తమ కులాభిమానం వల్ల ఐకమత్యంతో జీవిస్తున్నట్టూ భావించుకుని ఖేదిస్తూ ఉండేవారు పరిపూర్ణమైన ఏకత్వం సృష్టిలో ఏ ఇద్దరికీ కూడా కలగదు భక్తుడికీ భగవంతుడికీ కలిగేది మానవుడు ఊహించ గలిగిన ఐక్యత లన్నింటిలోకీ ఆదర్శప్రాయమైనది దాని తరువాత దానంతటది ప్రియులకు కలిగే ఐక్యత. మిగిలిన వన్నీ అంతంత మాత్రపువే కాని పైరెండు కూడా పరిపూర్ణమైన ఐక్యతలు కావు ఇద్దరికీ పరిపూర్ణమైన ఐక్యతే కలిగితే ఇద్దరి వ్యక్తిత్వాలూ నశించి ఆ ఇద్దరి వ్యక్తిత్వాలలో ఏదో ఒకటి కాని రెండు కాని మరొకటి కాని కలగాలి. అది ప్రకృతి విరుద్ధం జీవి దేన్నయినా విసర్జించగలడు; కాని వ్యక్తిత్వం లేదు ఎవరి అనుభవం వారే అనుభవించగలరు గాని ఒకరి అనుభవం మరొకరు పొందలేరు - అర్థం చేసుకోగలరు, సానుభూతి పొందగలరుకాని అనుభూతి ఉండదు. అటువంటప్పుడు మానవులు కొన్ని భాహ్యప్రయోజనాల కోసం ఒక సంఘంగా అవుతారు. ఆ ప్రయోజనం మళ్ళీ వ్యక్తుల కందరికీ ఉపయోగించేదిగా ఉండాలి. వ్యక్తిగతంగా సాధించలేనిదిగా ఉండాలి. నలుగురే కలిసి ఒక సంఘం కావచ్చును. కాని ఆ నలుగురి ఐక్యత వల్లా సాధించిన ప్రయోజనం నలుగురూ అనుభవించాలి. అంతకంటె ఎక్కువమందికి ఆ అనుభవం లభ్యమయితే మరీ మంచిది కాని ఆ నలుగురిలోనే ఇద్దరికి ఫలం ముట్టకపోతే అన్యాయం ఎందుకు నలుగురమూ కలిసి ఒక సంఘం అవుతున్నామో తెలిసి ఆ ప్రయోజనం సాధించే వరకే సంఘీభావం ప్రకటించినంత కాలమూ, దేశంలో ఎన్ని సంఘాలున్నప్పటికీ సంఘ దురభిమానం గాని సంఘాలకు పరస్పర వైషమ్యం కాని ఉండదు అనేక సహకార సంఘాలుంటై. పారిశ్రామిక సంఘాలుంటై, కళాసంఘాలుంటై. వాటి వాటి ఐక్యత వాటి వాటి ప్రయోజనాలను దాటిపోదు. వాటి వాటి ఆశయాలకు పరస్పర వైరుధ్యం వుంటే తప్ప వాటికి పరస్పర వైషమ్యాలుండవు

తెల్లజాతి అంతా ఒకటి, నల్లజాతి అంతా ఒకటీ అయింది. ఇట్లా ఒకటి కావటంలో పూర్వం ఏమి ఉద్దేశం ఉండిందో తెలియదు ఈ రెండు జాతులకూ ఇప్పుడు ఉమ్మడి ఆశయాలు లేవు. ఈ సంఘీభావం వల్ల సాధ్యమయ్యే ప్రయోజనాలే తెలియవు; వాటికి వైరుధ్యం ఉందో లేదో యెట్లా తెలియటం. '' నల్లజాతి అంతా ఒకటి కావాలి'' అని

ప్రబోధం చేసేవాళ్లే కాని ఎందుకో చెప్పేవాళ్లు లేరు. అది చెప్పకుండానే తమ ప్రయోజనం తెల్లజాతి యొక్క ప్రయోజనాలకి విరుద్ధంగా ఉన్నట్టుగా భావించి మనం ''తెల్ల వర్ణాన్ని ఎక్కి రానివ్వరాదు'' అనటం, నిలదీసి అడిగితే నల్లజాతికి ఐక్యత ఎందుకంటే తెల్లజాతి ఐక్యత వల్ల ఏమైనా సాధించబడితే దాన్ని పడగొట్టటానికని చెప్పవలసిన గతిలో వుంది నల్లజాతి. మానవులు సంఘాలుగా కావటం ఇందుకు మాత్రం కాదు

''వర్ణాలు అర్థం లేనివై పోయినై పాటుపడే వాళ్లు సంఘసేవ చేసేవాళ్లు రెండు వర్ణాలలోనూ ఉన్నారు. వెనుకటి ఆట అయిపోయింది. పావులు కలిపి కొత్త ఆట ప్రారంభింతాం; కొత్త ప్రయోజనాల కోసం కొత్త సంఘాలు ఏర్పాటు చేతాం; వెనుకటి వర్ణాల ఆశయం పంక్తి భోజనాలు చెయ్యడమూ అంతర్వివాహాలు చెయ్యటమూగా పరిణమించింది ఇందువల్ల వ్యక్తులకు ఏవిధమైన ప్రయోజనమూ కలగటం లేదనటానికి జరిగిపోయిన చరిత్రే నిదర్శనం!'' అని కొందరు బుద్ధిమంతులు చెప్పారు. కాని వర్ణాభిమానులు ఈ మాటలు సహించలేక పోయినారు ''మీరు జాతిలో చెడపుట్టారు మీ వంటి వాళ్ల వల్ల జాతి నశిస్తుంది మీ మాటలు నమ్మి మన జాతిని మనంపోగొట్టుకుంటే వారు వారి జాతిని పోగొట్టుకుంటారా?'' అన్నారు వర్ణాభిమానులు. ''జాతి ఉండి ఏమి చేస్తున్నదర్రా? పోనివ్వండి. మనకు కావలసింది దురహంకారమా, ప్రయోజనమా?'' అన్నారు బుద్ధిమంతులు కాని వారి మాటలు ఎక్కిరాలేదు. సంఘీభావం మీద ఒక యువకుడు చిన్న గ్రంథం రాశాడు. దాన్ని వెంటనే రాజభటులు తగలబెట్టి అతన్ని జైలులోకి తోసి అతన్ని నానాహింసలూ పెట్టారు. కాని అతను వేసిన విత్తు చావ లేదు. చవిటి నేలను పడటం వల్ల వెంటనే మొలకెత్తనూ లేదు.

## IV

ఆ దేశంలో రెండే వర్గాలున్నట్టు ఇంత వరకూ చెప్పుకుంటూ వచ్చాను కాని అక్కడ మరొక వర్గం కూడా తయారయింది. వారిని ఇతర వర్ణాలవారు అవర్ణులని పిలుస్తూవుండే వారు. వారి వెంట్రుకలు రాగి వర్ణంగానూ, కళ్లు తేనె రంగుగానూ ఉండేవి. వారి ఆచారాలు వేరు వారి మతంవేరు. విశ్వాసాలు వేరు.

ఆ అవర్ణులను సవర్ణులు దూరంగా ఉంచారు. వారి స్పర్శ కూడా ఎవరూ సహించేవారు కారు వారికి దేశంలో ఏవిధమైన హక్కులూ లేవు. వారి ప్రవర్తనను నిర్ణయించటానికి కఠినమైన శాసనం తయారయింది. సామాన్యంగా వారు సంఘంలో ప్రవేశించేవారు కారు. వారి అలవాట్లను బట్టి వారు నావికులని ఊహించవచ్చు. వారు సముద్రపు ఒడ్డునే తెప్పలలో సముద్రం మీద వెళ్లి చేపలను పడుతూ ఎవరి జోలికీ రాకుండా నివసిస్తూ ఉండేవారు.

కొంత కాలం క్రిందట ఒక తుఫానులో నాలుగు తెప్పలు కొట్టుకొని వచ్చి ఈ ద్వీపం చేరైనై. వాటి మీద మొత్తం పన్నెండుగురు మనుష్యులూ ఇద్దరు పసిపిల్లలూ ఉన్నారు. వారి కీ దేశస్థులు కొందరు సహాయం చేసి తిండిపెట్టి బట్టలిచ్చి వారి ప్రాణాలు కాపాడారు

ఈ వార్త ఆస్థానం చేరినప్పుడు ఆస్థానంలో ఉండే ఒక పెద్ద మనిషి '' వారిని మళ్లా సముద్రం మీద వదిలెయ్యండి వారికి ఎటువంటి ఆశ్రయమూ ఇవ్వవద్దు లేదా వారిని ఉరితీసి వెయ్యండి!'' అని ఆందోళన చేశాడు.

ఇతరులకు ఈ మాటలు చాలా పరుషంగానూ దయారహితంగానూ తోచినై. ''వారు మన అతిథులు. అతిథులను ఆదరించమని ధర్మశాస్త్రం చెబుతున్నది'' అన్నారు కొందరు ''ఆ ధర్మశాస్త్రమే మూడో వర్ణం లేదని చెబుతున్నది. వీర్ని రెండు వర్ణాలవారు ఆమోదించరు. మనకు మూడో వర్ణం ఏర్పడుతుంది ఇందువల్ల చాలా ముప్పున్నది'' అన్నాడు మొదటి పెద్దమనిషి. ఆయన ఛాందసుడన్నారు మిగతావారు. ''వారికి వర్ణమేలేదు; అవర్ణులు! మూడో వర్ణం ఎక్కడిది? ధర్మశాస్త్రాని కేమీ అపకారం లేదు'' అన్నారు కొందరు ఈ ముక్కను అందరూ హర్షించారు.

కాలక్రమాన మొదటి పెద్దమనిషి ఛాందసుడనేది రూఢి అయిపోయింది అవర్ణులు దేశానికి చాలా ఉపకారం చెయ్యసాగారు వారు సముద్రంలో నించి పెద్ద పెద్దచేపలూ, ముత్యాలూ తెచ్చి రాజుగారికి బహుమానం చెయ్యసాగారు. చిన్న చిన్న పడవల మీద సముద్రంలో చాల దూరం వెళ్లిషికారు చెయ్యటం వారి మూలకంగా సాధ్యమయింది. వారు గజయీతగాళ్లు కావటంచేత అనేక మంది ప్రాణాలు కూడా రక్షించారు అవర్ణులకు సంఘంలో స్థానం ఏర్పడి పోయింది కాని రాజ శాసనం ద్వారా ఆ స్థానమేదో స్పష్టంగా నిర్వచించబడక పోవటంవల్ల వ్యక్తులే తమ యిష్టానుసారం దాన్ని నిర్ణయిస్తూ ఉండేవారు కొందరు వారిని చూస్తేనే స్నానాలు చేసేవారు మరి కొదరు వాళ్లకు సమీపంగా వెళ్లితే గుడ్డలు విడిచేసేవారు.మొత్తంమీద వారిని ఎంత దూరంగా ఉంచినవాడు అంత శుచిప్రియుడని పించుకొనేవాడు అయిన్నటికీ సవర్ణులలో రాగి జుట్టువాళ్లూ తేనెకళ్ల వాళ్లూ పుట్టుకు రావడం తప్పలేదు. కొందరు అవర్ణస్త్రీలు ధరించే దుస్తులూ, నగలూ ఎక్కడనించి వస్తున్నదీ ఊహించటం కష్టమయింది.

కాలం గడచిన కొద్దీ అవర్ణుల దుస్థితిని గురించి కొందరు సంస్కారులు బాధపడ సాగారు వారిని అస్పృశ్యులుగా ఉంచటం వారి సంస్కారానికి దుస్సహమయింది.

''మనం వాళ్ల వల్ల ఉపకారం పొందుతున్నాం వాళ్లను ఆవిధంగా సంఘంలోకి రానిచ్చాం. సంఘంలోకిరానివ్వటమంటే వాళ్ల వల్ల చాకిరి చేయించుకోవటం కంటేవేరే ఏమీలేదు సంఘంలో వాళ్ల స్థానం ఏదో మనం ఎందుకు నిర్ణయించడం? వాళ్లు మన

సంఘంలో లేనట్టు ఎందుకునటిస్తాం? వారికి మనసంఘంలో స్థానం లేకపోతే వారిని దేశంలోనించి తరిమివెయ్యండి వాళ్లకు నీళ్లయినా ఇవ్వకండి వారి వల్ల ఉపకారం పొందకండి వారు హక్కులకోసం కత్తిపట్టి యుద్ధం చేస్తే వారిని నిర్మూలించేసెయ్యండి కాని ఇట్లా ఉంచటం ఘోరం.

''సంఘ సేవ చెయ్యటంలో వాళ్లు మనలో ఏ ఒకరికీ తీసిపోరు అవకాశాలిస్తే మనం చెయ్యగల ఏ పనీ వాళ్లు చెయ్యలేకపోరు ఆఖరుకు వారి రక్తమూ మన రక్తమూ ఒకటి కాదనే వంక పెట్టటానికి కూడా ఈనాడు అస్కారం లేకుండా ఉంది. ఒక వేళ మన రక్తమూ వారి రక్తమూ వేరువేరయిన్నటికీ, ఆ తేడా ఏమిటో అందువల్ల వ్యక్తిగతంగా వారికీ మనకూ ఉన్న తేడా ఏమిటో శాస్త్రీయంగానిర్ణయించే శక్తి మనకు లేదు. అటువంటి తేడాలు ఆలోచించటం మనకు అభ్యాసం కూడా లేదు. మనలో ఎంత భ్రష్టులు పుట్టినా సంఘసేవ చేసేశక్తి వాళ్ల కెంతఉందో కొలిచి మన వాళ్లను ఉరితియ్యటం లేదు ఈ అవర్ణులైనా అంతే కనుక పెద్దలు ధర్మం ఆలోచించండి!'' అని సంస్కారులు అలజడి సాగించారు

ఈ సంస్కారులను సంఘం మొదట్లో తీవ్రంగా ప్రతిఘటించింది. కాని ఈ బీజం కూడా వృధా పోలేదు. చవిటి నేలను పడి ప్రాణంకోసం బలహీనంగా దేవులాడుతూ ఉంది

*మహతి, మాస పత్రిక, మార్చి, 1939*

# న్యాయపరిపాలన - 2

'మనం మృగాల మాదిరిగా జీవిస్తేనేం?'

'మానవులకు ప్రభుత్వం దేనికి?''

ఒక మానవుడు అనేక మందిని శాసించటానికి ప్రకృతిసిద్ధమైన అధికారం ఏమైనా ఉందా? లేక రాజరికం మానవుడు కల్పించిన సంస్థా? మానవ కల్పితమైతే దీని వల్ల ప్రయోజనం ఏమిటి? అది ఎవరికి? ఈ సంస్థదౌర్జన్యం మీద నిర్వహణ అవుతున్నదా? లేక ప్రజ యొక్క సమ్మతి మీదనా? దౌర్జన్యం మీద నిర్వహింప బడుచున్న సంస్థను దౌర్జన్యంతో ప్రతిఘటించటానికి మానవుడికి హక్కున్నదా లేదా?

'' ఈ ప్రశ్నలకు మేము నిష్పాక్షికమైన సమాధానాలు ఆలోచించి నిర్భయంగా వాటి ప్రకారం నడచుకుంటామని ఇందు మూలకంగా భగవంతుడు ఎదుట ప్రమాణం చేస్తున్నాం.''

ఈ రహస్య పత్రాన్ని ఆరుగురు సంతకం చేశారు. అందులో నలుగురు

యువకులూ, ఒక వృద్ధుడూ, ఒక స్త్రీ ఉన్నారు. ఆరుగురిలోనూ ముగ్గురు రాజ కుటుంబానికి సంబంధించినవారు వృద్ధుడు తప్ప మిగిలినవారందరూ పరిపాలనలో అన్యాయం జరిగిన వారే. స్త్రీ స్వయంగా రాజుగారి వల్ల అన్యాయం పొందింది ఆమెకు రాజుగారి మీద వ్యక్తిగతమైన పగ ఉన్నది నలుగురు కుర్రవాళ్లలోనూ ఇద్దరికి ఆస్త్రీతో అరాజకీయమైన లౌకిక సంబంధం ఉన్నది కనక ఈ ముఠా ఆదర్శప్రాయమైనది కాదని చెప్పవచ్చును. కాని పని జరిగిపోయింది పై ప్రశ్నలకు ఆ ఆరుగురునూ చాల వరకు నిష్పాక్షికంగానే సిద్ధాంతాలు చేశారు.

తరువాత వారం రోజులకే రాజహత్య జరిగిపోయింది. కాని మరిరెండు రోజులలో ద్రోహులు చిక్కిపోయినారు వారు చావును ధైర్యంగానే ఎదుర్కొన్నారు. ఉరిస్తంభాన్ని చేరబోతూ వారు తమ సిద్ధాంతాలను బిగ్గరగా ఏకరువు పెట్టారు అనేక వేల మంది జనం ఆ సిద్ధాంతాలు విన్నారు. ఆ ఆరుగురి మరణ దండనతో దేశం తుమ్మెదల తుట్టెఅయిపోయింది ఆ మరణ దండన అన్యాయమని మనస్ఫూర్తిగా నమ్మి ఇతరులను నమ్మించటానికి ప్రయత్నించే వారు కొందరు బయలుదేరారు తమ సాటివారు ఆత్మ ప్రయోజనార్థం కాకుండా అంతధైర్యం ప్రకటించి పరిపాలనను అంత తీవ్రకంఠంతో విమర్శించి తమ విశ్వాసాలకు బలి కావటం చూసి మిగిలిన వారికి కొంత నైతిక ధైర్యం వచ్చింది ''వారు నాకోసం ప్రాణాలు అర్పించారు'' అని కొందరైనా అనుకోగలిగారు. రాజశాసనమంటే భయం తగ్గి అసహ్యం హెచ్చింది. అక్కడక్కడ చిన్న చిన్న సమావేశాలూ, విమర్శలూ బయలుదేరినై

రాజుగారి సభా భవనం మూసి ఉంటున్నది. ఒకనాటి సాయంకాలం కొందరు పెద్దలు అక్కడ రహస్య సమావేశం జరిపారు. కర్తవ్యం గురించి ఆలోచించటానికీ, మిగిలిన రాజ కుటుంబాన్ని కూడా నాశనం చెయ్యటానికి ప్రయత్నాలు జరుగుచున్నవని వదంతి పుట్టింది

దేశానికి రాజు అవసరం లేదని పెద్దలు తీర్మానించారు. రాజకుటుంబానికి కొంత భరణం ఏర్పాటు చేస్తే సరిపోతుంది

''రాజు పేరిట చాలా ఆస్తి ఉంది. అది ప్రజలకే ఉపయోగపడుతంది. దేశదరిద్రం తీరిపోతుంది!'' అన్నాడొక గడ్డం ఉన్న వృద్ధుడు గడ్డంమాటున చిరునవ్వు నవ్వుతూ.

మరొక లావాటి మనిషి ''భేష్! భేష్'' అంటూ పొట్ట ఎగరవేస్తూ పట్టలేని సంతోషంలో పడిపోయినాడు. ఇంకొక వరుగువంటి వృద్ధుడు మరొక బకంవంటి నడివయస్సు మనిషికి కన్నుకొట్టాడు బకం పళ్ల సందునించి గాలి గట్టిగా పీల్చిచేతులు రుద్దుకున్నాడు.

ఈ లక్షణాలన్నీ చప్పున అర్థం చేసుకోలేక ఒకాయన గంభీరంగా కూర్చున్నాడు

''మిత్రులారా !'' అన్నాడు ఒక పొడుగు పాటి పెద్ద లేచి, ''మనమంతా రాజు గారికి ఆప్తులమూ , మిత్రులమూనూ. విచారకరమైన ఆయన మరణం మనకందరికీ పెద్ద దెబ్బ. అందుకని మనం ప్రజాసామాన్యానికి దూరమైన వాళ్లమా? ఒక్కనాటికీ కాదు. వారు మన పుత్రులు - మన సంతానం. పిల్లలు గనక తల్లియందు ఎటువంటి విశ్వాసం ఉంచుతారో వారికి మన యందు అటువంటి విశ్వాసం ఉంది వారికి అన్యాయం జరగకుండా చూడటం మన విధి

'' ప్రజలకు రాజరికం వల్ల ప్రయోజనం ఉండే రోజులు గడిచిపోయినై వారిలో వికాసం కలిగింది. మన దేశంలో ఇక రాజరికం ఎక్కిరాదని నేను అశ్రుపూర్వకంగా మనవి చేస్తున్నాను ''

కొందరు కళ్లు తుడుచుకున్నారు

''మనకు రాజవంశం మీది అభిమానం కొద్దీ మళ్లా రాజును సింహాసనం ఎక్కిస్తామే అనుకోండి. ఆ రోజు గతిన్నీ ఇంతే కదా! మిత్రులారా! ఇది క్షేమమా? కాదు. మనకు నిజంగా రాజవంశం మీద ప్రేమ విశ్వాసాలే ఉండినట్టయితే మనం మళ్లీ సింహాసనం మీద యువరాజును కూర్చోపెడతామా?'

అందరూ ఏకగ్రీవంగా తలలు అడ్డంగా తిప్పారు.

''కనుక ఇప్పుడు కర్తవ్యం ఏమిటి? ఇక ముందు ప్రభుత్వం ఏవిధంగా సాగేటట్టు? నేను చెబుతాను వినండి. ప్రజాపక్షప్రభుత్వం తప్ప మార్గాంతరం లేదు. తొందరపడకండి! నేను చెప్పేదంతా వివరంగా వినండి 'ప్రజలకు రాజులకు రాజప్రభుత్వం అనుకూలంగాలేదు. అవునా? సరే ఎవరి ప్రభుత్వం వారికి అనుకూలంగా ఉంటుందో ప్రజలనే నిర్ణయించుకోనివ్వండి. ఒకరిని కాదు నలుగురిని నిర్ణయించ నివ్వండి, వారు నలుగురి సమ్మతి మీదా ప్రభుత్వం సాగిపోతుంది. ఇంతకంటె న్యాయం ఏముందీ?''

ఉపన్యాసకుడు కూర్చున్నాడు. అందరూ నిశ్శబ్దంగా ఉన్నారు లావాటి పెద్దమనిషి ప్రక్కకు వంగి గడ్డం ఆయన చెవిలో ''నలుగురు కాపులను తెచ్చి ప్రభుత్వం నడిపించరు కద ప్రజలు?'' అన్నాడు.

'' ఎబ్బే! అట్లా ఎందుకు జరుగుతుందీ? ప్రజలకైనా న్యాయ ప్రభుత్వం కావాలి కాని అరాజకస్థితి కావాలా?'' అని గడ్డం మనిషి సమాధానం చెప్పాడు.

''అన్ని విషయాలూ తెలియచెప్పేటందుకు అన్ని విధాలా సహాయం చేసేటందుకు ప్రజల యోగక్షేమాలు కోరే మనం లేమా? మనకు అంతకంటే కావలసినది

ఏముందీ?'' అన్నారు మరొకరు

ఆ విధంగా అధికారం రాజు చేతినించి పెద్దల చేతిలో పడ్డది ప్రజ వారి మాయలో సులభంగా పడిపోయింది. పెద్దలలో తమ మీద ఎక్కువ అభిమానం ప్రకటించినట్టు కనిపించిన నలుగురిని జీవితాంతం వరకు తమకు పాలకులుగా ఉండమని ప్రజలు కోరారు. వారే తమకు అనుకూలంగా శాసనం చేసేటట్టు ఏర్పాటయింది.

ఈ ఏర్పాటు పదవి పొందిన నలుగురికీ తప్ప ఇతర పెద్దలకెవరికీ రుచించలేదు. పెద్దలలో కక్షలు ఏర్పడినై ఇది పెద్దల మంచికి రాలేదు. అధికారం ఆశించిన వారు సంపాదించిన వారితో కొన్ని ఏర్పాట్లు చేసుకోవటానికి ప్రయత్నించారు కాని లాభం లేకపోయింది అధికారం చేజిక్కిన తరువాత ఆ నలుగురు ప్రజాభక్తి ప్రకటించసాగారు

'' పెత్తందారీ ఒకడి నెత్తిమీది నించి తీసి నలుగురి నెత్తిన పెట్టారు. అది వరకు ఒకడే బాగుపడ్డాడు ఇప్పుడు నలుగురు బాగుపడుతున్నారు. ఇప్పటికైనా మించిపోయిందేమీ లేదు ప్రభుత్వ చట్టంలో కొద్ది సవరణలు చేసి మీ పాలకులను అప్పుడప్పుడూ మార్చుతూ ఉండేటందుకు వీలు కల్పించుకోండి. అట్లా అయితే మీకు చాలా క్షేమం ఉంది. ఎవరైతే మీమంచి విచారించరో వాళ్లను అధికారంలో నించి తొలిగించే హక్కు మీకుండాలి లేకపోయినట్టయితే చిక్కున పడిపోతారు'' అని పెద్దలు ప్రజలలో ప్రబోధం కలిగించసాగారు. ఇందువల్ల తమ తరగతికే ద్రోహం జరుగుతున్నదని పెద్దలకు తెలియకపోలేదు. కాని అసలు అధికారానికి అవకాశమేలేని దాని కంటే ఎప్పుడైనా ఒకసారి పొందే అవకాశమే మంచిదనిపించింది వారికి పెద్దలలో అధికారవాంఛ ఒకటి కొత్తగా పుట్టుకొచ్చింది

కాని ఈ ప్రబోధం చాలా కాలం ప్రజలలో ఎక్కలేదు రాజును హత్యచేసిన తరువాత దేశ శాంతి సంపూర్ణంగా చెడిపోయింది ప్రజలు మళ్లీ అశాంతిలో పడేటందుకు సంసిద్ధులుగా లేరు అది కూడా కాక ఈ కొత్త ప్రభుత్వంలో జన సామాన్యానికి వెనకటికన్న స్వేచ్ఛ జాస్తి అయింది. '

## VI

ప్రజలో కొత్త కలవరం ప్రారంభమవుతున్నది. పదవిని వాంఛించిన పెద్దలు జనసామాన్యంలో పలుకుబడికల సామాన్య జనులను చేరదీశారు. వారు సామాన్యజనులు కారనీ, జనసామాన్యం కంటె జన్మతహా ఉత్కృష్టమైన జాతి అనీ నమ్మించారు రాజ్యాంగ విధానం మారినపక్షంలో వారికి ప్రత్యేక హక్కుల ఆశ పెట్టారు. వారి ద్వారా అలజడి సాగించారు

''పిల్లవాడి చేతికి పండిచ్చినట్టు మనను వంచించి నలుగురు పెద్దలు అధికారం

తమ వశం చేసుకున్నారు. మన దరిద్రం ఏం తీరింది? మన స్థితిగతులు ఏం మారినై? మనవాళ్లు ఆరుగురు ఆత్మ త్యాగం చేసుకున్నది ఈనలుగురు పెద్దలూ బాగుపడటానికా! చూడండి. మన అధికారులు వెనుక ఎట్లాఉండేవారు! ఇప్పుడెట్లా ఉన్నారు! వారి సంపద వృద్ధిఅయింది వారి వారంతా అధికార గౌరవం సంపాదించుకున్నారు. వారు కొమ్మెక్కి కూర్చున్నారు. వెళ్లివారి దర్శనం చెయ్యండి చూతాం! వారితో మీ కష్టాలు మొరపెట్టుకోండి వింటారేమో! ఈవిధంగా ప్రచారం చెయ్యసాగారు పెద్దల చేతి పనిముట్లయిన వాళ్ళు.

అధికారులు వెనుకటి కన్న నిజంగా ఇప్పుడు ఉన్నత మైనస్థితిలో ఉన్నారో లేదో తెలుసు కొన్న వాళ్లెవ్వరూ లేరు. ఆ అధికారులను గురించి విరుద్ధంగా ఏమి చెప్పినా ప్రజలునమ్ము తున్నారు. వారి వ్యక్తిగతమైన లోపాలు కూడా వారి పరిపాలన యొక్క లోపాలుగానే స్వీకరించుతున్నారు. తమలో ప్రబోధం కలుగుతున్నట్టే ఉంది వారి ప్రాణానికి.

అగ్నిపర్వతంలాగా ఒక్కసారిగా ఈ కలవరమంతా పైకి వచ్చేసింది జనం వేలకొద్దీ వచ్చి సభా భవనం చుట్టుముట్టి 'మాహక్కులు ! మాస్వేచ్ఛ! మా యోగ క్షేమాలు!' అని అరవసాగారు

అధికార్లు నలుగురూ వచ్చి వరసగా నిలబడి 'మీకేం గావాలి? మీ తరపున మాట్లాడే వాళ్లెవరు?' అన్నారు. ఆ ప్రశ్నకైనా సమాధానం చెప్పే శక్తి జనసామాన్యానికి లేదు. పెద్దల చేతి పని ముట్లుగా ఉండి జనంలో ప్రచారం చేసిన ప్రముఖులు నోరు చేసుకొని అయిదారుగురు పెద్దల పేర్లు చెప్పి వారే తమ తరుపున మాట్లాడతారని చెప్పారు.

మరుక్షణం అయిదారుగురు పెద్దలూ జనాన్ని తోసుకుంటూవెళ్లి సభాభవనం మెట్లెక్కారు. అందరూ కలిసి లోపలికి వెళ్లారు

రాజహత్యానంతరం రహస్యంగా సమావేశమైన పెద్దలంతా మళ్లీ అక్కడే బహిరంగంగా ఈనాడు సమావేశమైనారు కాని ఆనాటికీ ఈ నాటికీ తేడా ఏమంటే ఆనాడు అంతా ఒకటే జాతి ఈనాడు రెండు కక్షలు; అందులో ఒక కక్షవారు సర్వాధికారులు

అధికారులూ అధికార వాంఛితులూ ఎదురు మళ్లగా కూర్చున్నారు అధికార్ల తరుపున మాట్లాడటానికి గడ్డం ఆయన గడ్డం సవరించుకున్నాడు. ''మీ ఆరుగురూ ప్రజల తరపున మాట్లాడటానికి అర్హత పొంది వచ్చారని నమ్మటానికి మాకు తగిన ఆధారం లేనందుకు చాలా చింతిస్తున్నాం . మీరు ఏం చెబుతారో వినే లోపల-''

బకంలాటి పెద్ద మనిషి సమాధానం చెప్పటానికి లేచి, ''బయట ప్రజలంతా ఉన్నారు. కావాలంటే వారిని ఒక్కొక్కరినే లోపలికి పిలిచి అడగవచ్చును!'' అన్నాడు.

''బయట ఉన్న జనం దేశవాసులలో సగమయినా లేరు. వారంతా సమ్మతించి నప్పటికీ-''

''దేశంలో ఉండే ఆడవాళ్లనూ పిల్లలనూ లెక్కపెట్టకుండా ఉంటే బయట ఉన్న జనం సగం పయిగానే ఉన్నారు. అది అట్లా ఉంచి మీ నలుగురినీ పాలకులుగా ఎన్నుకున్ననాడు ఇంతమంది జనం లేరనే విషయం నేను జ్ఞాపకం చెయ్యవచ్చునా?''

అధికార్లు ఒకరి మొహాలు ఒకరు చూసుకున్నారు.

'' సరే, ఇంతకూ మీరు కోరేదేమిటి?''

ఆనాడు దేశానికి ప్రజా ప్రభుత్వ విధానచట్టం ఒకటి తయారయింది. దానికి కారణభూతులు ప్రజలు కారు. ప్రజాసామాన్యానికి చెందని పెద్దలే – వారిలో బయలుదేరిన అంతఃకలహమే

కాని ఈ చట్టంతో ప్రజల క్షేమం చాలా అభివృద్ధి అయింది. ప్రభుత్వంలో వారి సమస్యలకు ఒక ముఖ్యస్థానం ఏర్పడ్డది, వ్యక్తిగతమైన స్వేచ్ఛ చాలా లభించింది. వారికి న్యాయచట్టం కూడా ఏర్పడ్డది. తన్మూలంగా కొన్ని హక్కులు ఏర్పడినై

ఈ ప్రజా ప్రభుత్వంలో కూడా న్యాయపరిపాలనకుండవలసిన లక్షణాలు లేవు ప్రభుత్వాన్ని విమర్శించేటందుకూ తమ అభిప్రాయాలు స్వేచ్ఛగా ప్రకటించేందుకూ, తమ ఇష్టానుసారం ప్రవర్తించేటందుకూ ప్రజలకు స్వేచ్ఛ లభించింది. కాని ఆ స్వేచ్ఛను వారు దుర్వినియోగ పరచకుండా – వర్ణద్వేషం పురికొల్పటమూ, అధికారంలో ఉన్న వారిని గాని తదితరులను గాని వ్యక్తిపరంగానిందించటమూ, సంప్రదాయాలను పరిహసించటమూ మొదలైన పనులు చెయ్యకుండా – శాసనం చెయ్యవలసి వచ్చింది.

కాని ప్రభుత్వం మాత్రం తప్పని సరిగా ఈ పనులు అమలు చేస్తూనే ఉంది పాలక వర్గంలో వర్ణవిభేదం ఉండనే ఉంది. సరి అయిన పరిపాలనకు కక్షలు అవసరమని కొందరు సిద్ధాంతం కూడా చేశారు. అగ్రవర్ణం వారే పరిపాలించితే అగ్రవర్ణానికే ఎక్కువ ఉపకారం జరుగుతున్నది ఎన్నికలలో పోటీ చేస్తే అగ్రవర్ణం వారికి పదవి లభించే సదుపాయమే లేదు కనుక అగ్రవర్ణం వారికి కొంత మందికి స్థానం ఉండాలని చట్టాన్ని సంస్కరించారు తక్కువ వర్ణంవారు పరిపాలనలో అధిక సంఖ్యాకులుగా ఉండకుండా ఈ చట్టం కూడా ఏమీ చెయ్యలేక పోయింది ఈ కొత్త చట్టం ప్రకారం పాలకవర్గంలో పదకొండు మంది ఉండవచ్చును. అందులో అధమం నలుగురైనా అగ్రవర్ణంవారు

ఆఖరుకు ప్రభుత్వమంటే వర్గ వైషమ్యం కిందికి దిగింది దేశానికి జరిగే కించిత్తు ఉపకారమూ శాశ్వతోద్యోగియుల వల్ల జరుగుతున్నది. ప్రభుత్వం వారికి అంతరాయంగా ఉంది గాని సహకారంగా లేదు.

ఎన్నికల సహాయాలలో పోటీచేసే అభ్యర్థులు వ్యక్తినిందకు స్వేచ్ఛగా దిగేవారు అందులో ఎంతదూరం వెళ్లితే అంత ప్రయోజకుడు.

సంప్రదాయాల విషయంలో కూడా పాత సంప్రదాయాలు ఖండించి కొత్త వాటిని సూచించిన వారికే, ప్రభుత్వంలో అడుగు పెట్టిన వారికే ఎక్కువ అవకాశా లుండేవి.

పైన చెప్పిన ప్రకారం అవినీతిగా ప్రవర్తించటానికి వ్యక్తులకు లేని సావకాశం ప్రభుత్వానికి ఉండేది

వ్యక్తిగతమైన స్వాతంత్ర్యం మోస్తరుగానే న్యాయసంబంధమైన స్వాతంత్ర్యం కూడా ప్రజలకు నామమాత్రమే. చట్టపరంగా దేశంలోఅందరికీ ఒకే విధమైన న్యాయం. కాని న్యాయానికి చిక్కకుండా తప్పించుకునే అవకాశాలు అందరికీ సమానంగా ఉండేవి కావు. ఆర్థికమైన తారతమ్యం ఉన్నంతకాలమూ అటువంటి భేదాలు ఉంటూనే ఉంటై అంతకాలమూ ''ప్రజా ప్రభుత్వమూ'', ''సమత్వమూ'' అనే మాటలలో విశేష అర్థం ఉండదు.

## VII

ఈ ప్రజా ప్రభుత్వం దేశంలో బాగా పాతుకపోలేదు. ప్రజలు ఇంతకంటె మంచి ప్రభుత్వ విధానం ఏదైనా ఉంటే స్వీకరించటానికై సంసిద్ధులై ఉన్నారు. ఈ సమయంలో ఓ విచిత్రమైన వ్యక్తి పైకి వచ్చాడు. చాలా కాలంగా అతను జనంలో ఏదో గోలచేస్తూనే ఉన్నాడు. కాని ఎవరూ అతని మాటలు లక్ష్యం చేయలేదు ఒకసారి ఎన్నికల సమయంలో చిన్న కలహం ఒకటి ప్రారంభమై అది హత్యలతో అంతమయింది. దేశం ఒక్క రోజులో అరాజకం అయిపోయింది ఆ మహావిప్లవంలో అతని ఉచ్ఛస్వరం అందరికీ వినిపించింది.

'' ఈ ప్రజా ప్రభుత్వం మన మంచికి రాలేదు. మనకు కావలసింది కక్షల ప్రభుత్వం కాదు, నియంత. రాజు కాదు - సమర్థుడైన నియంత రాజకీయపు లోతుపాతులన్నీ తెలిసినవాడు! స్వార్థంలేనివాడు! దేశం యొక్క సంపదను దేశం మీదనే వెదజల్లేవాడు! దేశసంపదను అభివృద్ధి చెయ్యటానికి అనుకూలమైన ఏర్పాట్లు చేసేవాడు కావాలిమనకు. ఈ ఎన్నికలూ ఈ వేలాకోళమూ దేనికి? ప్రభుత్వమంటే నవ్వులాట కిందికి దిగింది. నన్ను నియమించండి దేశం పరిపాలించటానికి. నేను పరిపాలన ఎట్లా ఉండాలో చూపిస్తాను'' అని అతను అరుస్తున్నాడు

జన సమ్మర్దంలో అతని అనుచరులూశిష్యులూ ఉన్నారు. వారంతా అతనికి ప్రోత్సాహకరంగా పెడబొబ్బలు పెట్టారు. జనమంతా నిశ్శబ్దంగా వినసాగారు.

'' ఇది ఏం ప్రజా ప్రభుత్వం ? మీరు ఎన్నుకుంటున్నారో, ఎందుకు ఎన్నుకుంటున్నారో, మీరెన్నుకున్న వాళ్ల వల్ల ఏమి అవుతున్నదో, ఏం కావటంలేదో

మీకేమైనా తెలుసునా? ప్రభుత్వం తిరుగుళ్లేమీ మీరెరుగరే! కొత్త ఎన్నికలు రాగానే మీరు వాళ్ళూ వాళ్ళూ అనే మాటలను బట్టి ఫలాని వాడిని ఎన్నుకోవటమే కాని పాతవాళ్ళు ఏంచేశారో, వాళ్ళుచెయ్యగలరోలేరో, పాతవాళ్లకన్న కొత్తవాళ్లు మేలో కీడో కూడా మీకు తెలీదే!

''మీ శరీరశ్రమ తగ్గిందా? మీ సంపద హెచ్చిందా? దారిద్ర్యం నశించిందా? ప్రభుత్వం వల్ల ఏం ప్రయోజనం కలిగింది? నన్ను దేశం పాలించటానికి నియమించండి. నేను మీలో వాణ్ణి న్యాయపరిపాలనకు అంతరాయం లేకుండా చండశాసనం చేస్తాను.''

అతని మాటలు అందరికీ ఉద్రేకం కలిగించినై. ఆనాటి నుంచీ అతను దేశానికి నియంత అయినాడు. అతని రాకతో అందరికీ వేడి పుట్టుకొచ్చింది. ప్రతి ప్రభుత్వశాఖా, ప్రతి ఉద్యోగస్థుణ్ణీ అతను స్వయంగా తణిఖీ చేశాడు. కొందరిని తీసి వారి స్థానంలో ఇతరులను పెట్టాడు. పాత చట్టాలన్నీ చించిపారేసి కొత్త చట్టాలు ఏర్పాటుచేశాడు అ కొత్త చట్టాలను అమలులో పెట్టటానికి తనకు సహాయంగా కొన్ని సైనికదళాలు తయారుచేశాడు అతని పద్ధతులు ఆమోదించని వాళ్లను విచారణ లేకుండా చంపివేశాడు. యువకులకు వ్యాయామ మందు అభిలాష కల్పించాడు. విద్యావిధానం పూర్తిగా మార్చేశాడు ప్రతి వానికీ ఒక యుద్ధపు ఖత్తు ఏర్పాటు చేశాడు.

జనానికి అతనంటే భయమూ గౌరవమూ కలిగినై. అతనిది చండశాసనం అయినప్పటికీ ఆ శాసనం కొంతమంది మీదనే ఉండక అందరి మీదా ఉండటం వల్ల అంత ఇబ్బంది లేక పోయింది తాము త్యాగం చేసిన స్వేచ్ఛ యొక్క ఫలితాన్ని మరొకరు పొందనంతకాలమూ ఎంత త్యాగం చెయ్యటానికి కూడా ఎవరికీ అభ్యంతరం లేదు. పైగా ఇదంతా దేశసౌభాగ్యానికి అత్యవసరమని నియంత అంతరినీ నమ్మించాడు.

ఈ ప్రభుత్వంలో ప్రజల యొక్క స్వాతంత్ర్యం సంపూర్ణంగా నశించింది. వ్యక్తులు ధరించే దుస్తుల మీద లగాయతు వారు చేసుకునే వివాహాల వరకూ నియంత యొక్క శాసనం వున్నది. అతన్నిగాని అతని పద్ధతులను గాని, రహస్యంగా కూడా విమర్శించటానికి లేదు. ఇవాళ విమర్శించినవాడు రేపు అదృశ్యుడైపోతున్నాడు.

అతను ఆదర్శ పురుషుడనీ స్వార్థరహితుడనీ అతనికి రాగి దమ్మిడీ విలువ చేసే ఆస్తి కూడా లేదనీ అతను ఆఖురుకు మంచి గుడ్డలైనా వేసుకోడనీ మంచి ఆహారమైనా తినడనీ ఏ విధమైన సుఖం కోరని యోగి అనీ ప్రచారం చేసేవాళ్లు బోలెడుమంది అతని పక్షాన ఉన్నారు. అతను మాట మాట్లాడితే జనాన్నంతా కూడ బిలిచి గంభీరోపన్యాసాలిచ్చి తన ప్రభుత్వం ఏవిధంగా ఆదర్శప్రాయంగా ఉన్నదీ వాళ్ళకు బోధచేసేవాడు. అతను మాట్లాడితే మేఘాలు గర్జించినట్టుండేది ప్రజల ప్రాణానికి.

గిట్టనివాళ్లు అతని ఉపన్యాసం కాకుల అరుపును స్ఫురింప జేస్తుందనే వాళ్లు.

ఈ నిరంకుశ ప్రభుత్వంలో అతి బీదవాళ్లు బాగుపడ్డారు. ఆ తరగతికి చింత అనేది లేకుండా పోయింది అంతేకాక ఆ తరగతికి స్వేచ్ఛ గాని, దాన్ని ఉపయోగించుకునే అవకాశం గాని ఎన్నడూ లేని ఆజాతి ఈ ప్రభుత్వంలో స్వేచ్ఛ వృగ్యమయిందనే విషయమే గమనించలేదు. వారంతా నియంతను వెయ్యివిధాల కీర్తించి భృత్యులైనారు

మధ్య తరగతివారికి ఈ ప్రభుత్వం చాలా అపకారం చేసింది ఆర్థికంగా వారికీ అంతకంటె తక్కువవారికి తేడా లేకుండా పోయింది. కాని ఆ సంగతి మధ్య తరగతివారు గమనించలేదు.వెనక తమ సమస్యలలో ప్రభుత్వం జోక్యం కలిగించుకోని రోజుల్లో మధ్య తరగతి వారికి ఎంత ఉన్నా దారిద్ర్యంలోనే ఉన్నట్టుండేది. ఈ ప్రభుత్వంలో తమ సమస్యలన్నీ నియంత తన చేతుల్లోకి తీసుకున్న తరవాత వెనకటికంటె కూడా తక్కువ సంపదతో ఎక్కువ సౌఖ్యంగా జీవించగలిగారు మధ్య తరగతి వాళ్ల రాబడి బీదలకు పంచగా ధనికులకు పంచటానికి ఇంకా చాలా మిగలటంవల్ల ధనికులు ఈ ప్రభుత్వంలో చాల బాగుపడుచున్నారు

కాని ఈ నియంతకు, ఈ మానవ మాత్రుడికి ధనికులంతా వెనక అండ ఉన్నారనే రహస్యం ఎవరికీ తెలియదు అతను కాకులను కొట్టిగద్దలకు పెడుతున్నాడు. దేశస్థితి ఆర్థికంగా ఏక్షణాన ఎట్లా ఉందో ఎవరికీ తెలియదు. మొత్తంమీద వెనుకటి కంటె ప్రజలు ఎక్కువ పాటుపడుతున్నారనీ, సంపద ఎక్కువ సృష్టి అవుతున్నదనీ మాత్రమే అందరికీ తెలుసును కాని అది ఎట్లా పంపకమవుతున్నదీ ఎవరికీ పట్టలేదు.

మనని నిర్బంధించి మనచేత వెట్టిచాకిరి చేయించి ఆ చాకిరికి ఫలితం తానే పొందే వాణ్ణి మనం సహించలేము. వెనుకటి ప్రభుత్వాలలో ధనికులు బీదలను ఒత్తిడిచేసి వారి కష్ట ఫలితం తామే అనుభవిస్తూ వచ్చారు. ఇప్పుడల్లా కాదు. అందరినీ నియంతే ఒత్తిడి చేస్తున్నాడు. అతనికి ఫలితంతో ఏమీ సంబంధంలేదు. మరింత శ్రమపడటం మరింత దేశభక్తిగా గణించబడుతున్నది. శరీరశ్రమ పడటంలో జనం ఒకరితో ఒకరు పోటీ చేస్తున్నారు. ఫలితం యథాప్రకారం ధనికులకు చేరుతున్నది. వెనుకటికీ ఇప్పటికీ తేడా ఏమంటే ప్రజాప్రభుత్వంలో ఏది ఎట్లా జరుగుతున్నదీ తెలుసుకోవటానికీ, విమర్శించటానికీ కొంతమందికైనా అవకాశం ఉండేది ఇప్పుడది లేదు. జనానికి నోళ్లూ మెదళ్లూ మూసుకుపోయినై

ఈప్రభుత్వంలో అప్పుడప్పుడూ కొందరు సంపన్నులు దేశక్షేమానికనే వంక మీద ఉరితియ్యబడుతూ ఉండేవారు. వారి అపచారం ఏమిటో ఎవరికీ తెలిసేదికాదు. కాని అటువంటి ఉరిశిక్షలు దేశానికి రెండు విధాల లాభదాయకాలుగా ఎంచబడుతూ

ఉండేవి దేశక్షేమం ఒకటీ, వారి ఆస్తి ప్రభుత్వానికీ దాని ద్వారా ప్రజలకూ సంక్రమించటం మరొకటీ.

మహతి, మాసపత్రిక, 1939, ఏప్రిల్

# న్యాయపరిపాలన - 3

ఆకలితో ఉన్నవాడికి వెలుతురు యొక్క ఆనందమూ చల్లగాలి యొక్క ఆనందమూ తెలియకపోవచ్చును కాని ఆ క్షుద్బాధ తీరగానే వాటియొక్క ఆవశ్యకత బయటపడుతుంది ఈ నియంత యొక్క పరిపాలనలో ప్రజల యొక్క ఆకలి మాత్రమే తీరింది వారికి వెలుగుగాని గాలిగాని లేదు. రాజకీయ విషయాల్లో వారు గాఢాంధకారంలో తడువుకుంటున్నవాళ్లే వారికి స్వేచ్ఛ అనేది ఈషణ్మాత్రమైనా లేదు.

అయితే నియంత చేసిన తెలివిగల పని ఏమంటే దేశంలో స్వేచ్ఛతోపాటు స్వేచ్ఛాప్రియత్వం కూడా నిర్మూలనం చేశాడు. ప్రజలు కొన్ని విశ్వాసాలకు బానిసలైపోయినారు. ఆ విశ్వాసాలు నియంత యొక్క పరిపాలనా విధానానికి అనుకూలమైనవి.

కాని సేచ్ఛా ప్రియత్వం సంపూర్ణంగా నాశనం చెయ్యటానికి ఎవరి తరమూ కాదు. సంశయమూ, జిజ్ఞాసా, తర్కమూ మొదలైన మానసిక ప్రవృత్తులు మనిషికి స్వభావసిద్ధంగా ఉంటై. వాటి బలం జాస్తి అయినప్పుడు అవి పవిత్రమైన విశ్వాసాల మీదికి కూడా పోతై అనాదిగా వస్తూవున్న విశ్వాసాలను కూడా సంశయించి, ''ఇది ఏమిటి? ఎందుకు?'' అని జిజ్ఞాస చేసి తర్కించే మానవులు ప్రతితరంలోనూ ఉంటూనే ఉంటారు శాస్త్రీయమైన బుద్ధికిచోటివ్వని సంఘం వారిని నిరుత్సాహ పరుస్తూ ఉంటుంది.

ఈ నియంత ప్రభుత్వంలో కూడా కొందరు విప్లవకారులు బయలుదేరారు. వారు మొదటినించీ అతిరహస్యంగా నియంత యొక్క పరిపాలనను గురించి చర్చించుతూ వచ్చారు అది న్యాయపరిపాలన కాదని వారికి తోచింది. వారు పరిపాలనను గురించి కొన్ని సిద్ధాంతాలు చేశారు పరిపాలనా విషయంలో మానవులంతా ఒకటే – జాతులు లేవు మానవుడికీ మానవుడికీ తేడాలుండవచ్చును. ఆతేడాలు ప్రకృతిసిద్ధమైనవి. ఆ లెక్క ప్రకారం చూసినా ఏ ఇద్దరు మనుష్యులూ ఒకజాతి కాదు. కనుక మానవులలో చేసే విభజన కూడా న్యాయసమ్మతం కావటానికి వీలులేదు.

''సమాజం కన్న వ్యక్తులే ప్రధానం. వ్యక్తి యొక్క ఉన్నతికి బాహ్యంగా సమాజం యొక్క ఉన్నతి అంటూ ఉండటం అసంభవం కనక సమాజం కోసం వ్యక్తులు

బలికావటంలో అర్థం లేదు. ఆదర్శప్రాయమైన పరిపాలన అందరికీ సమ్మతంగా ఉండి తీరాలి.

''ఎవరి జీవితం వారు జీవించటం అసంభవం మానవులకు వ్యక్తిగతమైన అనుభవమే కాని వ్యక్తిగతమైన జీవితం కాదు – ఉమ్మడి జీవితం మాత్రమే ఉంది మానవుడు ఇంకొకరికి సహాయపడకుండా ఇంకొకరి నుంచి సహాయం పొందకుండా జీవించలేడు. ధనికులు – ఆస్తికలవారు – వ్యక్తిగతమైన జీవితం సంభవమనే సూత్రంలో విశ్వాసం ప్రకటిస్తున్నారు. వారు తమకు అవసరమైనదానికన్నా, తాము ఉపయోగించే దాని కన్న అధికమైన సంపదను తమ వద్దే ఉంచుకుంటున్నారు; కాని దానివల్ల ప్రయోజనం ఎవరికున్నదో వారివల్ల లాభం పొందటం మానటం లేదు.

'' ఒకవ్యక్తి ఖర్చు చేసిన సంపద న్యాయంగా అతనిది. ఒక వ్యక్తి ఒక వస్తువును తను ఉపయోగించుకుంటున్నంత కాలమూ ఆ వస్తువు న్యాయంగా అతనిది అంతవరకూ అది స్వార్థం – క్షంతవ్యం. తను ఉపయోగించనిదీ ఖర్చు చెయ్యనిదీ తనదని చెప్పుకోవటంలో స్వార్థం వికటిస్తున్నది

''వస్తువులనూ సంపదనూ స్వంతం చేసుకోవటం మూలాన దారిద్ర్యం హెచ్చుతున్నది. పది మంది వుపయోగించదగిన వస్తువు ఒకడి హక్కు భుక్తాలలో నేడు ఊరికే ఉండిపోతున్నది.

''సంపదను సృష్టించే హక్కూ పంచే హక్కూ వ్యక్తుల కుండటానికి వీలు లేదు. వ్యక్తులు తమకు లాభం వచ్చే సంపదను మాత్రమే సృష్టించుతారు. ధాన్యం తయారు కావలసిన చోట నల్లమందు తయారవుతుంది. అదీ వ్యక్తులు సంపదను సృష్టించే విధానం, పంచే విధానం కూడా అంతే. తమకు ధాన్యం అమ్ముడు పోక పోయినట్టయితే, అవతల గింజలులేక మాడిచస్తున్నా సరే, తమకు ఎక్కువైన ధాన్యాన్ని వంటచెరకుగా ఉపయోగించుతారు.

''మానవుడి ఆధ్యాత్మిక పరిణామానికి అవకాశం కలిగే పరిపాలన అసంభవం. ఏ ప్రభుత్వం కానీ అటువంటి అవకాశం ఇచ్చినట్టు నటిస్తే అది దగాచేస్తున్నదన్నమాట. మానవుడి భౌతిక క్షేమం గురించి మానవులంతా ఏకీభవించటానికి అవకాశం ఉంది. ఆధ్యాత్మిక క్షేమం గురించి కలిగే అభిప్రాయ భేదాల గురించి విమర్శించటానికి కూడా ఉపాయం లేదు

''న్యాయ ప్రభుత్వం చెయ్యవలసిన కనీసపు పనులు–

1. ప్రభుత్వం కింద ఉన్న వ్యక్తుల పేర్లు, వారి చదువు సంధ్యలూ, వారి శక్తులూ, ప్రావీణ్యతలూ, వారికి అవసరమైన కనీసపు సంపదా – వీటిని గురించిన జాబితాలు

తయారుచెయ్యటం.

2 దేశంలో సృష్టి అయే సంపదను న్యాయంగా అందరికీ పంచటం.

3 పరిశ్రమలు ఎక్కువ తక్కువ సంపదను సృష్టించకుండా చూడటం.

4 మానవుడు చెమటోడ్చి చేసే కాయకష్టానికి సాధ్యమైనంత ప్రతిఫలం ముట్టే సదుపాయాలు చెయ్యటం

5 వ్యక్తుల సుఖాలను అభివృద్ధి చేసేటందుకు కొత్త మార్గాలు అన్వేషించటం. ఈ పనులు చెయ్యలేని ప్రభుత్వం ప్రభుత్వం కాదు.

ఈ సిద్ధాంతాలను ఆచరణలో పెట్టాలంటే విప్లవం జరగక తప్పదు. దేశంలో చూడబోతే ఇటువంటి సిద్ధాంతాలను వినటానికైనా సంసిద్ధులైన వాళ్ళెవరూ కనిపించలేదు. అంగబలం ధనికులకే ఉంది. నియంత సర్వశక్తిమంతుడు. ధనికులు అతని చాటున ఉన్నారు

ఈ పరిస్థితులలో దైవికంగా దేశంలో క్షామం పుట్టుకొచ్చింది. అకాల వర్షాలూ ఉప్పెనలూ మొదలైన వాటివల్ల పంట చాలా భాగం ధ్వంసమయిపోయింది. మిగిలిన పంటకోతకు రాకుండానే జనం దోచుకుపోసాగారు. అందువల్ల చేలకు సైన్యాన్ని కాపలా పెట్టవలసి వచ్చింది.

ఈ సంక్షోభంలో విప్లవం సాగింది. ఒకస్థితిలో మానవుడు ఎటువంటి శాసనాన్ని కూడా ఎదిరిస్తాడు. ఇప్పుడు అటువంటి స్థితి వచ్చింది. న్యాయ ప్రభుత్వవాదులు ఈ విప్లవానికి ఆజ్యం పోశారు. రోజు రోజూ అధికారాన్ని పురస్కరించుకున్న వారంతా జనం చేతుల్లో పడి చచ్చి పోతున్నారు. బలమే ప్రభుత్వం చేస్తున్నది

కరువు అణిగి దేశం చల్లబడేటప్పటికి కొత్త ప్రభుత్వం వచ్చేసింది. కొత్త సిద్ధాంతాలను అమలులో పెట్టదలచిన వాళ్లని అడ్డగించేవాళ్ళెవరూ లేకపోయినారు. నియంత గతి ఏమయిందో తెలియదు ఒక్కరైనా బీరుపోకుండా ధనికులంతా దెబ్బతిన్నారు విప్లవంలో వారి వంశాలు చితికిపోయినై

## IX

ఈ విత్తనం నాటటం సులభంగానే జరిగిపోయింది. కాని ఇది మొలకెత్తటం చాలా దుర్ఘటంగా కనపడ్డది. కొత్త సిద్ధాంతాలు ప్రజలకు అర్థం కాకుండానే భయం కలిగించినై. ఒక పరిపాలనలో అందరూ సమానమేనని చెప్పటం యుద్ధంలో యోధులతో పాటు సామాన్య సైనికులను కూడా ముందు నిలబెట్టటం మాదిరిగా కనిపించింది ముందు నిలబడకుండా ఉండేటందుకుగాను – ఒకరి చాటున ఉండే అవకాశం కోసం – తమకు పరిపాలనతో ఏ జోక్యమూ లేకుండా ఉండే అవకాశం కోసం ప్రజలు చాలా

సుఖాన్ని త్యాగంచేస్తూ వచ్చారు నిజానికి వారి వారి పాలిటికి ప్రభుత్వాలు ఫిరంగులే అయినై ఈ మనస్తత్వం తరతరాల ప్రజలలో జీర్ణించి ఉండటం వల్ల ఈ కొత్త చట్టం భయంకరంగా కనిపించింది. దీనికి విరుద్ధంగా చేసే వాదనలన్నీ యుక్తమైనవిగానే ప్రజలకు తోచినై. అటువంటి వాదనలు చేసేవాళ్లు దేశం నిండా ఇంకా ఉన్నారు

న్యాయప్రభుత్వ సంస్థాపకులు దౌర్జన్యంతో కాని కొత్త పరిపాలన ఎక్కిరాదని తెలిసికొని చండశాసనం ప్రారంభించారు తాము ఏర్పాటు చేసిన ప్రభుత్వ చట్టాన్ని విమర్శించిన వారిని నిర్మూలనం చెయ్యసాగారు. అంతటితో విమర్శన కట్టుబడింది. ప్రభుత్వం సాగింది

ఈ పరిపాలనలో సంపద అపారంగా అభివృద్ధి అయింది. విద్యావ్యాప్తి బాగా జరిగింది. శాస్త్ర శోధన చాలా ఉన్నతికి వచ్చింది. గడిచిన ఏడెనిమిది శతాబ్దాలకు గాను శాస్త్ర విజ్ఞానం ఎంత అభివృద్ధి చెంది ఉండిందో ఈ పరిపాలన యొక్క మొదటి సంవత్సరములోనే దాదాపు అంత అభివృద్ధి కొత్తగా పొందింది. వర్ణవిచక్షణ అంతరించిపోవటం వల్ల ప్రజలకు సాంఘిక మైన స్వేచ్ఛ లభించింది. స్వేచ్ఛా వివాహాలు అమలులోకి వచ్చినై జనసంఖ్య అభివృద్ధి కాసాగింది. ఏ ఆశయాలతో ఈ ప్రభుత్వం బయలుదేరిందో ఆ ఆశయాలు సంపూర్ణంగా ఫలించినై. ఇంతకు పూర్వం దేశంలో నడిచిన ఏ ఇతర ప్రభుత్వం కిందా ప్రజల యొక్క భౌతిక స్థితి ఈ విధంగా అభివృద్ధి అయిఉండదు

కాని ప్రజలకు వ్యక్తిగతమైన స్వేచ్ఛ లేదు. నియంతృత్వం వెంట ఉండదగిన లోపాలన్నీ ఈ ప్రభుత్వానికి ఉండినై. ఆధ్యాత్మిక జిజ్ఞాసను శాసనం ద్వారా అణిచిపెట్టారు. కొందరికి భోజనం ఎట్లాగో మరి కొందరికి ఆధ్యాత్మిక జిజ్ఞాస అట్లాగూ

'' ఆధ్యాత్మిక చింతనకు కూడా భౌతిక కారణాలే ఉంటై. ఆ చింతన యొక్క ఫలితాలు కూడా భౌతికమైనవే. న్యాయప్రభుత్వంలో ఆధ్యాత్మిక చింతనకు ఆవశ్యకత లేదు'' అని వాదించింది ప్రభుత్వం.

వారు చెప్పినట్టే కావచ్చును. కాని ఆధ్యాత్మిక చింతన మానటానికి మాత్రం కారణాలు భౌతిక మైనవి కావు. కావు కనకనే శాసనం అవసరమయింది.లక్ష్యాలు దూరానే ఉంటై. వాటిని మనం ఎన్నడూ చేరం. కాని అవి అక్కడ కనిపించకపోతే చాలా కంగారు పడతాం. మా ఇల్లున్న సందు కొండమీద గుడికెదురుగా ఉంటుంది. మా సందు ప్రవేశించగానే నాకా గుడి కనపడు తుంది. నే నా కొండ ఎక్కి ఎన్నడూ గుడికి పోలేదు. కాని ఒకనాడు ఆకస్మాత్తుగా ఆ రెండూ మాయమైతే నేను మా యింటికి చేరేటప్పుడు చాలా కంగారు పడతాను. మా సందు ప్రవేశించగానే నేను వెంటనే అగి

ఊరుకుంటాను ఒక్క క్షణంపాటు నేను కదలలేను ఆ క్షణంలో నేను దారి తప్పినట్టే అవుతుంది కొంతకాలానికి నేను అలవాటు పడిపోవచ్చును కాని కొండ మీది గుడి బదులు మరొక లక్ష్యం చూసుకోకుండా ఉండను. ఈసారి ఏ తాడిచెట్లో అవుతై మరొకటి ఏదో అవుతుంది మా యింటి సందుకు కాకపోతే మా సందు పక్క సందుకైనా ఏదో ఒక లక్ష్యం చూసుకుంటాను ఆధ్యాత్మిక లక్ష్యాలు అటువంటివే

ఈ ప్రభుత్వంలో ఆధ్యాత్మిక లక్ష్యాలు మాత్రమే కాక సాంఘిక లక్ష్యాలు కూడా పోయినై తనకన్న తక్కువ వాళ్లను చూసి తన్నుతాను అభినందించుకునే ప్రతి ఒక్కడికీ తన కన్న గొప్పవాళ్లను చేసి ఆనందించి, వారి గొప్పతనంలో తమ తక్కువ తనాన్ని మరిచిపోగలవాళ్లు కనీసం వందమంది ఉంటారు నా సమర్థత వల్ల నాకు లభించే కన్న ఇతరుల సమర్థతను గుర్తించటంలో నాకు అనేక రెట్లు ఆనందం లభిస్తుంది. మంచికిగాని చెడుకిగాని నా జీవితమంతా నాకు బయటనే ఉంది నా అనుభవమంతా నాకు బయటినుంచే రావాలి నేను కొన్ని పనులు చెయ్యగలగటమూ, చెయ్యటమూ నా అనుభవంలోకి రావు ఆ పనులు చేసినా మానినా, నా అనుభవం ఏమీ మారదు. కాని ఇతరులు కొన్ని పనులు చెయ్యకపోతే నా అనుభవం లోటుపడుతుంది కొందరు రచయితలు కొన్ని గ్రంథాలు రాయక పోతే, కొందరు కళాభిజ్ఞులు కొంత కళను సృష్టించకపోతే, కొందరు వ్యక్తులు నాకు సాంఘిక లక్ష్యాలుగా లేకపోతేనేను స్వయంగా ఎంత రచయితనయినప్పటికీ, కళాకోవిదుణ్ణి అయినప్పటికీ, ప్రజ్ఞకల వాణ్ణి అయినప్పటికీ నా జీవితం వ్యర్థం నాసుఖాన్ని కొంతమంది కోసం త్యాగం చెయ్యకపోతే నామనస్సుకు సంతోషంలేదు

వెనకటి ప్రభుత్వాలు నాచేత బలవంతంగా త్యాగం చేయిస్తే ఈ ప్రభుత్వం అటువంటి త్యాగం నాకు అసాధ్యం అయేటట్టు చేసిందన్న మాట. నిజానికి ఈ పరిపాలనలో వ్యక్తుల మీద అటువంటి శాసనం లేదు. కాని ఏ వాతావరణంలో పైన చెప్పిన సాంఘికారాధన సాధ్యమవుతుందో అది ఈ పరిపాలనలో లోపించింది.

పరిపాలనలో కూడా చాలా పొరపాట్లు చెయ్యటమూ దిద్దుకోవటమూ జరిగింది. అవి కేవలమూ విప్లవానికి సంబంధించిన అత్యాచారాలే కాదు కేవలమూ పరిపాలనలో పొరపాట్లు సంది సూచించటానికి తెల్లజండా ఎత్తినట్లు ప్రభుత్వం మొదట్లోపరిపాలన యొక్క బాధ్యత సామాన్య మానవుల నెత్తిన పడేసింది – సామ్య సిద్ధాంతం మీది అభిమానం కొద్దీ అదివరకు ప్రత్యేకత గలిగినవారు నిర్వహించిన కార్యభారం ఏ ప్రత్యేకతా లేనివాళ్లమీద పడ్డది. ఆ భారాన్నివారు మోయలేక పోయినారు. ప్రభుత్వం ప్రత్యేకతలను తప్పనిసరిగా గుర్తించవలసి వచ్చింది. కాని నూతన ప్రభుత్వం సంస్థాపించిన

వాళ్ల ధీరులూ, కార్యశూరులూనూ, కొద్ది అనుభవంతో వాళ్ళు తప్పులు దిద్దుకోగలిగారు. క్రమంగా అన్ని ప్రభుత్వశాఖలలోకీ సమర్థులు ప్రవేశించారు పూర్వం ప్రతి శాఖలోనూ కర్రపెత్తనం చెయ్యగలిగినవాళ్లు మాత్రమే ఉండేవాళ్లు ఇప్పుడున్న వారంతా స్వయంగా పనిచేసే విజ్ఞానం కలవాళ్లు పూర్వపు ప్రభుత్వాలు ఈ విజ్ఞానాన్ని చౌకగా చూసి కొనుక్కునేవి.

వెనకటి ప్రభుత్వాలతో పాటు ఈ ప్రభుత్వం కూడా తన సిద్ధాంతాలకు తనే విరుద్ధంగా ప్రవర్తించి, తన శాసనాన్ని తనే ఉల్లంఘించవలసి వచ్చింది. సామ్యం స్థాపించటానికిగాను భేదం గుర్తించటమూ, స్వేచ్ఛను నిర్బంధం ద్వారా ఇయ్యటమూ, మతాన్ని నిర్మూలనం చేసిన అనంతరం తన సిద్ధాంతాలను మతం చెయ్యటమూ అ ప్రభుత్వానికి కూడా తప్పనిసరి అయింది కాని ఇంతకంటె మంచి ప్రభుత్వం అది వరకు ఉండి ఉండలేదు. దీన్ని ఎవరు ఆచరణలో పెట్టినా ఇంతకంటె జయప్రదంగా జరిగి ఉండదు.

*మహతి, మాసపత్రిక, మే,1939*

# మహాప్రస్థానం

వాళ్ల ఒకచోట నిలవరు. కొండలూ, గుట్టలూ, నదులూ, వాగులూ, అరణ్యాలూ, అడవులూ దాటి ప్రయాణం చేస్తూనే ఉంటారు. వాళ్ళకి స్వక్షేత్రమంటూ లేదు.

వాళ్లంతా అయిదు వందల కుటుంబాలు. అందరూ ఒక్క ముసలిదాని సంతతి వాళ్లు. ఆ ముసలిదాని పేరు మనవి. వీళ్లంతా మానవులు. తన సంతతి వాళ్లందరినీ ప్రస్థానం పంపిన మనిషి ఆ మనవి.

'' మీరంతా వెళ్లి, ఒక మహానగరం కట్టండి. ఎక్కడ కట్టాలో మీకే తెలుస్తుంది. అది కట్టవలసిన చోటుచేరేవరకూ మీరు ఆగరాదు ప్రయాణంచేస్తూనే ఉండాలి '' అని శాసించింది మనవి.

ఇప్పుడు ప్రయాణం చేసేవారిలో ఏ ఒకడూ మనవిని స్వయంగా చూడలేదు. వీళ్ళందరూ ప్రస్థానంలో పుట్టినవాళ్లే. వీళ్ళ తండ్రులూ తాతలూ కూడా ప్రస్థానంలోనే పుట్టారు.

మనవిని గురించి, మహాప్రస్థానంలో జరిగిన సంఘటనలను గురించి రకరకాల కథలూ, పాటలూ బయల్దేరాయి. అవే ఆ మానవుల సాహిత్యం. అందులో ఉన్న అనేక విషయాలు ఈనాడు మనం అక్షరాలా నమ్మలేం. మనవి ఏడువేల సంవత్సరాలు

బతికిందనీ, ఆవిడ మహాబలశాలి అని, ఆవిడ గర్భాన రెండువేల సంతానం కలిగిందనీ, ఆవిడ భల్లూకాసురుణ్ణీ, పదితలల సింహాన్ని చంపిందనీ, ఒకసారి పిడుగుల వాన కురిస్తే తన పిల్లలను రక్షించుకునేందుకు ఒక కొండఅడ్డంగా పట్టుకున్నదనీ కథలు చెబుతారు. మొత్తానికి మనవి అనే మనిషి ఒకతె ఉండి ఉంటే అదీ దాని సంతతివాళ్లూ కొండల్లోనూ,అడవుల్లోనూ ఉండేవారని తోస్తోంది. మహా ప్రస్థానం పాటలు వింటే దానికి మొదటి నాయకులుగా ఉన్న వాళ్లు తోళ్లు కట్టుకున్నారనీ, అంబులూ, బాణాలూ తప్ప పనిముట్లు ఎరగరనీ తోస్తుంది ఆ నాయకుల శౌర్యపరాక్రమాలు ఆపాటల్లో అద్భుతంగా వర్ణించబడ్డాయి అనేకచోట్ల ఈ మానవులకు ఇతర జాతులతో పోట్లాటలూ యుద్ధాలూ జరిగాయి. ఒకసారి మానవులు దాదాపు నిర్మూలమైనంత పని కూడా జరిగింది. కాని మళ్లీ ఈ జాతి తెప్పరిల్లుకున్నది

ప్రస్థానం వారికి పరమార్థం మనవి చెప్పిన మాటలన్నీ ఒక చిన్న గీతంలో ఇమిడి ఉన్నాయి. ఈ గీతం చూసినట్లయితే ఈ మానవుల ధర్మాలన్నీ వ్యక్తం కావు. మానవులు ఇట్లా ఎంతకాలం ప్రస్థానం సాగించాలి? ఒక ప్రదేశంలో విడిస్తే అక్కడ ఎంతకాలం ఉండవచ్చు? పురుళ్లూ పుణ్యాలూ వస్తే ఆగాలా? మానవుల్లో కొందరు చీలిపోయి ఇతర జాతుల వాళ్లతో చేరిపోతే వారిని శిక్షించాలా, వదలేసెయ్యాలా? ఒక కొండగాని, నదిగాని అడ్డొస్తే ఎటు ప్రయాణం సాగిచాలనే విషయం అభిప్రాయభేదాలొస్తే ఎవరిమాట మిగతా వాళ్లు వినాలి? ఇటువంటి ధర్మ సందేహాలన్నీ మానవులకు బ్రహ్మాండమైన సమస్యలు అయినై. కొన్ని విషయాల మీద రక్తపాతం కూడా జరిగింది. కాని కాలక్రమాన మనవి చేసిన శాసనం మీద చీలిపోయినారు ఇట్లా చీలిపోయినవారు ఇతర జాతుల్లోచేరి బాగుపడ్డారు. కొందరు కష్టాలపాలై నశించారు. నశించిన వారిని గురించి మానవులు పాటలల్లి, మనవిచేసిన శాసనాన్ని ఉల్లంఘించడం మహపాతకమని నీతికూడా చెప్పారు. మహానగరం స్థాపించటం మాట ఎవరికీ పట్టలేదు. అది ఎప్పటికీ జరిగేది కాదని తెలిసిపోయింది. ప్రస్థానమే ఒక పరమార్థమయింది మనవి సంతతి వాళ్లు సూర్యచంద్రాదులున్నంత కాలమూ ఎక్కడికోవెళ్లుతూ ఉండవలసిందే.

మొదట్లో ఉండేవో లేవో గాని రానురాను మానవుల్లో వర్గాలు ఏర్పడ్డాయి. పాటలు చూస్తే అందరు మానవులూ ఒక తల్లిబిడ్డలే అని ఉన్నా ఆ అయిదు వందల కుటుంబాల్లోనూ యాభై కుటుంబాలు అగ్రజాతివి. వాళ్లు ఇతర జాతుల సంపర్కంవల్ల మిగిలిన వాళ్ల కన్న కొంచెం పచ్చగా ఉండేవాళ్లు. ఇతరజాతుల దగ్గిర దొంగిలించి, గొర్రెలనూ మేకలనూ పెంచడం నేర్చుకున్నారు; గొర్రెబొచ్చుతో దారంఅల్లి గుడ్డలు నేయటంనేర్చారు. అందుచేత వాళ్లు అగ్రవర్ణం వాళ్లు. నాయకులు వాళ్లలో నుంచే రావాలి.

అయితే ఇప్పుడు అగ్రవర్ణం వాళ్ళకి వర్ణమే మిగిలింది. పశువుల్ని చూసేదీ, ఉన్ని

నుంచి దారం తీసేదీ, విడిసినప్పుడు బట్టలల్లేదీ అంతా తక్కువ వర్ణం వాళ్లే విడిసినప్పుడు, చెట్లకొమ్మలు కొట్టిగుడిసెలు వేసేదీ, నడిచేటప్పుడు అగ్రవర్ణం వాళ్ళ వస్తువాహనాలు మోసేది తక్కువ వర్ణం వాళ్లే

ఎక్కడ ఎంతకాలం మకాం వెయ్యవచ్చుననే దాన్ని గురించి ఎవరి భాష్యాలూ అమలు జరగలేదు. అడవి ఫలాలు, వనమృగాలూ సమృద్ధిగా ఉన్నచోట నెలరోజులు మకాం వేసేవాళ్లు చెట్లన్నీ ధ్వంసం చేసి, చుట్టుప్రక్కల ప్రదేశమంతా దుర్గంధ పూరితం చేసి మకాం ఎత్తేవాళ్లు. కొల్లగొట్టటానికి తప్ప జానపదాల కేసి వెళ్లేవారు కారు సామాన్యంగా నదులూ, కొండలూ, అడవులూ కలిసి వచ్చేచోట్లు వాళ్ల ఆచార వ్యవహారాలకు అనుకూలించేవి. అందుచేత వాళ్లు వాటిమీద పాటలు రాసి అవి ప్రార్థనల కింద చదివేవారు.

  

మానవులు ఈ మహా ప్రస్థానంలో ఒకసారి విడిసిన చోటికి మళ్లా రావచ్చునా అనేది ఒక పెద్ద విప్లవానికి దారితీసింది. అగ్రవర్ణంవారు ఏకగ్రీవంగా రావచ్చునన్నారు. తక్కువవారిలో కొందరు రాకూడదన్నారు. తర్కం జరిగింది.

రాకూడదన్న వారిలో ప్రముఖుడు మనవడు. మహాప్రస్థానం యొక్క ఆశయం ఏమిటి? మనవి చేసిన శాసనం ఇప్పటి వరకు ఎందుకు అమలు జరగలేదు? ఈ అగ్రవర్ణాలు జాతిని నడిపించే బాధ్యత తమ మీద వేసుకుని ప్రస్థానం సాగిస్తున్నారు కదా ఇంత వరకూ ఎక్కడా నగరం ఎందుకు కట్టలేదు? ఒక స్థలం చూసి అక్కడ నగరం కట్టకుండా ముందుకు పోయినాక మళ్ళీ అక్కడికే రావటంలో అర్థమేమిటి? అని మనవడు సవాలు చేశాడు పెద్దల్ని.

పెద్దలు వాడిమీద విరుచుకుపడ్డారు.''వీడు ప్రస్థానానికి అపచారం చేస్తున్నాడు. అగ్రవర్ణం వారిని ఎదిరిస్తున్నాడు మనవిని మనిషి కింద జమకడుతున్నాడు. మన వేదం అపౌరుషేయమనేది శంకించి దాని మీద తర్క ప్రయోగం చేస్తున్నాడు'' అని అగ్రవర్ణాలు మనవణ్ణి గురించి న్యాయ సభ జరిపి, వాణ్ణి జాతి ద్రోహిగా నిర్ణయించి వాణ్ణి సజీవంగా రెండు నిలువుల లోతున పూడ్చి పెట్టారు

ఇది పెద్ద పొరపాటుగా పరిణమించింది. నీచవర్ణులందరూ ఒక్కసారిగా మారినట్టయిపోయినారు. వారి చూపులూ, వాలకమూ, వాళ్లలో వాళ్లు మాట్లాడే ధోరణీ, అగ్రవర్ణులతో మాట్లాడే ధోరణీ అంతా మారిపోయినై. వాళ్లు అగ్రవర్ణం వారికి అర్థంకాకుండా మాట్లాడుకునేటందుకు సాంకేతిక పదజాలం కూడా కల్పించు కున్నారు. పైకి వారి జీవితం మామూలుగానే వెళ్లిపోతున్నప్పటికీ ఈ నీచవర్ణులకూ, అగ్రవర్ణులకూ మధ్య అగాధం ఏర్పడింది.

పాతకానికి పరిహారం జరక్కపోతే మరింత పాతకానికి దారి తీస్తుంది మనవడి దారుణ హత్య జరిగిన తరువాత అగ్రవర్ణులు తక్కువ వర్ణంవారిని హింసించటమూ, శంకించటమూ అధికమయింది అనేక మంది నీచవర్ణులను విద్రోహులని నిర్ణయించి తలలు కొట్టేశారు. అందులో చాల మంది నిజంగా ద్రోహులే అయి ఉండవచ్చు. మనవడి హత్యకు కారణం లేదుగాని ఆ తరువాత అగ్రవర్ణులు చేసిన ఘాతుక కృత్యాలకు అంతో ఇంతో సమర్థింపు ఉంది మనవణ్ణి చాలా గొప్పవాణ్ణి చేసి వాడి మీద పాటలు రాసి అగ్రవర్ణులు తమ మిగతా చర్యలను మాత్రం సమర్థించు కున్నారు కాని నీచవర్ణులను శత్రువులుగా చేసుకున్నది నిజానికి అగ్రవర్ణులే.

మనవడి చావుతో ఉన్న సమస్యపరిష్కారం కాకపోగా కొత్త సమస్య ప్రారంభమయింది. మనవడు వచ్చాడని నీచవర్ణులు నమ్మలేదు. వారిలో కొందరు మనవణ్ణి చూశామనీ, వాడితో మాట్లాడామనీ చెప్పసాగారు మనవడు తమ వెంట అదృశ్యంగా ఉండి తమను రక్షిస్తున్నాడని కూడా వాళ్లనమ్మసాగారు. వాడికి అన్ని రకాల అమానుష శక్తులూ ఆపాదించి అద్భుతమైన పాటలు కట్టి అతి ఉద్రేకంతో పాడసాగారు. మనవడి మీద అగ్రవర్ణులు రాసిన కల్లబొల్లి పాటలు వీటి ముందర ఎందుకూ పనికొచ్చేవి కావు ఆ పాటలు పాడుతుంటే నీచవర్ణులంతా కూచుని నిశ్శబ్దంగా ఆలకించే వాళ్లు. ఆడవాళ్లు ఎక్కెక్కి ఏడిచేవాళ్లు మనవడి హత్య జరిగిన అమావాస్య వాళ్ళకి పుణ్యదినం. ఆరోజు వాళ్లెవరూ పచ్చి మంచినీళ్లు తాగేవాళ్లుకారు.

మనవడు పెద్దల్నడిగిన ప్రశ్నలకు సమాధానం రానేలేదు. నీచవర్ణం వాళ్లు సభలు చేసినప్పుడల్లా ఈ ప్రశ్నలతోనే సభ ఆరంభమయేది ఈ ప్రశ్నల అనంతరం కాస్సేపు అందరూ తలలు వొంచి నిశ్శబ్దంగా ఉండేవారు తరువాత సభ సాగేది

  

నీచవర్ణం వాళ్లని తమ ఆగర్భశత్రువులల్లే చూడటానికి వంకదొరికినాక అగ్రవర్ణులు వారిని అతినీచంగా చూడసాగారు. ప్రతి చిన్నతప్పుకూ తలతీసెయ్యటమూ, వాళ్ల యోగ క్షేమాలను గురించి ఏమీ జాలిచూపక పోవటమూ పరిపాటి అయింది అగ్రవర్ణులకు. వాళ్లకి అగ్రవర్ణం వాళ్ల పాటలు పాడే హక్కు లేదు, అగ్రవర్ణం స్త్రీలకేసి చూసే హక్కు లేదు, ఆయుధాలు పట్టుకునే హక్కు లేదు తిండి అగ్రవర్ణం వారితో ఎపా పంచుకునే హక్కులేదు అగ్రవర్ణులు సుష్టుగా తిన్నాక మిగిలితే తినాలి, లేకపోతే పస్తుండాలి ఇది శాసనం.

అగ్రవర్ణం వాళ్లు నీచవర్ణపు స్త్రీలకు కడుపులు చెయ్యొచ్చు. నీచవర్ణంలో భార్యా భర్తలు సుఖంగా ఉంటే వారి పెళ్లిరద్దు చేసి ఆ స్త్రీని మరో నీచవర్ణం వాడికి కట్టబెట్టవచ్చు. ఇది ఆచారం

అయితే చిక్కొచ్చిందంటే ఈ అగ్రవర్ణం వారిలోనే ఈ శాసనాన్ని ఆచారాన్ని ప్రతిఘటించిన వాళ్లున్నారు.

'' నీచవర్ణాల పట్ల మనం ఎంత పశుప్రాయులుగా ప్రవర్తిస్తే మనం అంత సంస్కారం కలవాళ్లం అనే సిద్ధాంతం హేయమైనది,'' అని సంస్కారం గల అగ్రవర్ణం వాళ్లు వాదించారు కొందరు వాదించలేదు చాటుగా నీచవర్ణంతో చేరిపోయి వాళ్లకు సహాయపడసాగారు. ఇట్లా తమ పక్షం వహించిన అగ్రవర్ణులను నీచవర్ణులు కళ్ళకద్దుకుని స్వీకరించారు. ఇది నీచవర్ణులకు నష్టం కలిగించింది

తమలో కొందరు నీచవర్ణుల పక్షం అవుతున్నారని తెలియగానే అగ్రవర్ణులు కొందరు విద్రోహులను నీచవర్ణుల దగ్గిరికి పంపారు. వీరు నీచవర్ణులకు విహితులల్లే వెళ్లి వాళ్ల రహస్యాలన్నీ ఆరాతీసి అగ్రవర్ణ నాయకులకు పట్టిచ్చారు. ఒకనాడు ముప్పైమంది నీచనాయకులకు వరసగా శిరచ్ఛేదం జరిగింది.

ఇది అగ్రవర్ణులు తక్కువ వాళ్లకు చేసిన ఆఖరు అత్యాచారం. ఇది జరిగినాక ఉభయ పక్షాలకూ మధ్య ఏ విధమైన బంధమూ లేకుండా పోయింది.

ఆ రాత్రే అగ్రనాయకులు ప్రయాణానికి ముహూర్తం పెట్టారు. ఏదైనా ఘోరం జరిగిన చోట నిద్రచెయ్యకపోటం వారి ఆచారం. ఎక్కడ నీచవర్ణులు దెబ్బతిన్నారో ఆ స్థలం వారు వెంటనే వొదిలిపోవాలి. లేకపోతే ఆ స్థలదేవత వారి కనుకూలించవచ్చు.

యాభై కుటుంబాలూ ప్రయాణ సన్నాహం జరిపినై. కాని నీచవర్ణు లెవరూ కదల్లేదు. వాళ్లప్రస్థానం అయిపోయింది. అగ్రవర్ణులు మండిపోయినారు నీచవర్ణులను బెదిరించారు, వారికి అమానుష శక్తుల భయం కూడా పెట్టజూశారు తమ వేదాల్లో నుంచి అందరు మానవులూ ఒకటేనని చదివి బుజ్జగించారు, బతిమాలారు; '' మాకన్న ఒక విధంగా మీకే మనవి మీద గౌరవం ఉంది; అటువంటి మీరు ఆ మహాతల్లి శాసనం ఉల్లంఘిస్తారా?'' అన్నారు.

నీచవర్ణులంతా ఒక్క సమూహంగా గుమికూడారు. పెద్దవాళ్ళు చెప్పినదంతా విన్నారు గాని వినిపించుకున్నట్టు కనపడలేదు. అనేక క్షణాలు గడిచినై. నిశ్శబ్దం.

''ఏమిటి మీ నిర్ణయం చెప్పరేం ?'' అన్నారు నాయకులు.

''మహాప్రస్థానం ఇక్కడితో ముగిసింది. మనవి శాసనం ఇక అమలు జరుగుతుంది. మానవులు మహానగరం కడతారు'' అన్నాడొక ముసలాడు ముందుకువచ్చి.

'' ఎవరి అనుమతితో? ఎక్కడ?''

''మానవుల అనుమతితో, ఇక్కడే. ఇక్కడ మానవులు కళ్లు తెరిచారు. ఇక్కడ వాళ్లకి వివేకం ఉదయించింది. ఈ కట్టబోయే నగరంలో అందరూ ఒకతల్లి బిడ్డలల్లే

ఉంటారు కొందరిది అగ్రవర్ణమూ, కొందరిది నీచవర్ణమూగా ఉండదు కాసేవాళ్లవే పశువులు, పాలించేవాళ్లదే బాధ్యత . ఈనగరంలో ఏదన్నా తప్పు జరిగితే నాయకులు విచారించబడతారు, అనాథలు కాదు. ఈ నగరంలో వేదాలలో ఉన్నదొకటీ ఆచరణలో ఒకటీ కాదు వేదాలు అమలు జరగటానికివీలులేని పరిస్థితిలో వేదాలను మార్చటం జరుగుతుంది గాని మనుషులను మార్చటం మటుకు జరగదు.''

అగ్రనాయకులు ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. వారి కేమనాలో తెలియలేదు యరాబై కుటుంబాల అగ్రత్వమూ అనుకోని విధంగా అంతమయిపోయింది. ఆ విషయం వారికి అవగాహన కావటం చాలా కష్టమయింది

*ఆంధ్రజ్యోతి, మాసపత్రిక సెప్టెంబర్,1948.*

# రామాయణంలో దాగిన నిజం ఫాసిజం

రాముడు అనార్య స్త్రీలని చంపాడు, ముక్కులూ చెవులూ కోయించాడు; ఇతర జాతుల సహాయం పొంది వాళ్లలో బలవంతులైన వాలినీ, రావణుణ్ణీ చంపాడు, సుగ్రీవుణ్ణీ, విభీషణుణ్ణీ భ్రాతృ ద్రోహులుగా తయారుచేశాడు, వాళ్ల రాజకీయాల్లో జోక్యం కలిగించుకుని తన ఏజంట్లకు పట్టం కట్టాడు; ముక్కు మూసుకుని తపస్సు చేసుకుంటున్న శూద్రుడిగొంతు కోశాడు. దక్షిణవాసులను రావణుడి 'బారి' నుంచి 'విడిపించి' నందుకు పరిహారం కింద రామేశ్వరంలో ఒక ఈశ్వరాలయం - వాళ్లదేవుడికిగుడి - కట్టించి తన పేరు ఆ ఈశ్వరుడి పేరుతో జోడించనిచ్చాడు - ఒకప్పుడా ఈశ్వరుడి విల్లే విరిచి తన శౌండోతనం రుజువు చేసుకున్నప్పటికీనీ! ఈ అపర (పూర్వ?) హిట్లర్ తాలూకు చరిత్రను ఇతరుల ప్రేరణమీద వాల్మీకి ఒక మహత్తరమైన మైన్‌కాంఫ్ గ్రంథంగా రచించాడు. రాముణ్ణి గురించి సరయినభావం వాల్మీకికి లేదనడం చాదస్తం - కేవలం పొరపాటు కాదు. రాముణ్ణి గురించి ఏమనుకున్నదీ మనం సులభంగానే ఊహించవచ్చు. రామాయణంలో కీర్తించబడిన మహానుభావులు పట్టెడు మందిలోనూ గట్టిగా అరడజనుమంది అనార్యులు లేరు. వాళ్లలో ఇద్దరు క్విజ్లింగులూ, ఒక పల్లెవాడూ, ఒక ఊరూ పేరూ లేని ముసలిదీనూ! రాముడి వాతపడిన బలవంతులైన అనార్యులు రాక్షసులూ దుర్మార్గులూనూ!

*ఆనందవాణి, వారపత్రిక,1948.*

# రామాయణం మోత

పరిణామ వాదాన్ని శాస్త్రవేత్తలు సమగ్రంగా రుజువు చేశాక సృష్టిని గురించి బైబిల్ గ్రంథంలో ఉన్న గాథను కొట్టివెయ్యవచ్చునని బెర్నార్డ్‌షా అన్నాడు దేవుడు సృష్టి యావత్తూ ఆరు రోజులపాటు చేసి ఏడోరోజు విశ్రాంతి తీసుకున్నాడన్నది నిజం కాదని పసిపిల్లలకు కూడా అర్థమయేటట్టు ఈనాడు నిరూపించవచ్చు గడచిన నూరేళ్ల కాలంలోనే నూరు జాతుల ప్రాణులు అంతరించిపోయాయని శాస్త్రజ్ఞులు చెబుతున్నారు. మానవుడు భూమి మీద జీవించిన ఆరు లక్షల పై చిల్లర సంవత్సరాల కాలంలో ఇంకెన్ని ప్రాణిజాతులు అంతరించిపోయాయో? పూర్వశిలాయుగపు మానవులు వేటాడి, గుహలలో బొమ్మలు కూడా గీసిన జడల ఏనుగులు ఈనాడు భూమిపై లేవు – వాటి కళేబరాలు సైబీరియా మంచు ఎడారుల్లో మాత్రం చెక్కుచెదరకుండా దొరికాయి అది అలా ఉంచి మన కళ్ల ఎదుట అంతరించిపోతున్న జాతులు కొన్ని ఉన్నాయి. వాటిని మన మునిమనవలు చూడక పోవచ్చు మానవుడు ప్రపంచం మీద లేక పూర్వం - నూరుకోట్ల ఏళ్ళ క్రితమూ, 50 కోట్ల క్రితమూ – ఉండిన ప్రాణుల తాలూకు ఫాసిల్ రూపాలు భూగర్భంలో దొరుకుతున్నాయి. దేవుడు టైలో బైట్‌లనూ , మనుషులనూ ఒకేసారి – ఆరు రోజుల కాలంలో – సృష్టించాడనటం హాస్యాస్పదం – సృష్టి క్రీస్తు పూర్వం 4004 సంవత్సరాల నాడు జరిగిందని చెప్పడం ఎంత హాస్యాస్పదం!

పచ్చి అబద్ధాలూ, శాస్త్రీయంగా హాస్యాస్పదమైనవీ అయిన విశ్వాసాలను మనం వదిలించుకోవటానికి యత్నిస్తాం. కాని ఏవి పచ్చి అబద్ధాలో, ఏవి హాస్యాస్పదమైన విశ్వాసాలో జనానికి తెలియాలి. రామాయణం పచ్చి కల్పన అని జనసామాన్యానికి తెలియదు. భారతం కూడా కల్పనేనని వాసిష్ఠగణపతి మునిగారన్నారు. మౌర్యుల అనంతరం పుష్యమిత్రుడి హయాంలోనో, అగ్నిమిత్రుడి హయాంలోనో, వాల్మీకి (అసలు పేరో, మారుపేరో) రామాయణం రాసినట్టు రాహుల్ సాంకృత్యాయన్ అన్నారు రామాయణం అశోకుడి అనంతరం రాయబడిందనటానికి అందులోనే ఆధారాలున్నాయి.

బౌద్ధ జాతక కథలలో రామాయణ కథ మూడు ముక్కల్లో చెప్పబడి ఉన్నది. దశరథుడు అయోధ్యరాజు కాడు కాశీరాజు. శాంతా, సీతా ఆయన కుమార్తెలు వారి తరవాత దశరథుడికి కుమాళ్లు కలిగారు. సీత రాముడికన్న పెద్దది, అతనికి అక్క. రాముడి వెంట సీత కూడా అడవికి వెళ్లింది. ఆమెను రావణుడు ఎత్తుకుపోయాడు. రావణుణ్ణి చంపి సీతను విడిపించి అయోధ్యకు తిరిగి వచ్చాక రాముడు సీతను పెళ్ళాడాడు.

జాతకకథలలో ఉన్న ఈ టూకీ కథ వాల్మీకికి తెలిసి వుండవచ్చు వాల్మీకి రామాయణం బహుశా జాతకకథలు రాసిన వారు ఎరిగి వుండరు.

సాటిలేని వాల్మీకి కవిత్వం పండితులను ఆకర్షించటంలో ఆశ్చర్యం లేదు. అది జన సామాన్యానికి పవిత్ర గ్రంథం కావటమూ, వాల్మీకి కథపైన చిలవలూ పలవలూ పుట్టివేలకు వేల రామాయణాలు ఉత్పత్తి కావటమూ చిత్రం. అదే రామాయణంలో వున్న గొప్పతనం అనేవారు కూడా ఉన్నారు; తిరుపతి యొక్క గొప్పతనాన్ని అక్కడికి వెళ్ళే అసంఖ్యాకులైన యాత్రికుల ద్వారా రుజువు చేసినట్టు

ఇంతకన్నా వింత ఏమిటంటే ఆధునికి సాహిత్య రంగంలోనూ రాజకీయ రంగంలోనూ రామాయణం ఇంకా మోతపెడ్తూ ఉండటం, రామాయణం సాకుగా పెట్టుకుని కులవిద్వేషాలనూ, జాతి విద్వేషాలనూ రెచ్చగొట్టకుంటున్నారు. రామాయణం రాసినవాడి కులమూ, దాన్ని విమర్శించినవాడి కులమూ ప్రస్తావించ బడుతున్నాయి. దక్షిణాన ద్రావిడవాదులు రామాయణాన్ని తగులపెట్టటం రాజకీయోద్యమం చేశారు! వర్గపోరాటం అంటే ''హరి, హరీ, కమ్యూనిజం!'' అని చెవులు మూసుకునే వారు, చచ్చి కుళ్ళువాసన కొట్టేకుల వైషమ్యాలనూ, జాతి వైషమ్యాలనూ ఎందుకు ఆశ్రయిస్తున్నారో, వారికిగల సాంఘిక శాస్త్ర పరిజ్ఞానం ఎటువంటిదో ఊహించటం కష్టం. వర్గపోరాటం కనీసం ఆధునిక యుగానికి చెందినది. పురోభివృద్ధికిగాను సాగుతున్నటువంటిది. జాతి విద్వేషం యొక్క ఫలితాలను నాజీల హయాంలో యూదులు అనుభవించారు, పాకిస్థాను విడిపోయాక మనమూ అనుభవిస్తున్నాం. ఏ అభ్యుదయం కోసం ఈ హత్యాకాండ జరుగుతున్నదీ చెప్పేవారు లేరు

రామాయణం నిజమైనా, కల్పన అయినా అందులో మనం నేర్చుకోవలసింది చాలా ఉన్నదని నమ్మేవారు కొందరున్నారు ఆ నేర్చుకోదగిన దేమిటో నాకింత వరకు స్పష్టం కాలేదు దశరథడిలాగా పడుచుపెళ్ళాలకు ముసలి మొగుళ్ల కోరిన వరాలిచ్చే హక్కు ఈనాటి సంఘంలో ఒక్కడికి కూడా లేదు. రాముడి లాగా పితృవాక్య పరిపాలన చేద్దామన్నా వెయ్యమంది తండ్రులలో ఒక్కడికైనా కొడుకు శ్రేయస్సు కోరి ఆనతులిచ్చే శక్తి ఉంటుందనుకోలేం, ఎందుకంటే మనం నూటికి తొంభైమంది యువకులు తండ్రులకన్న ఎక్కువ తెలిసినవారై ఉంటారు. రాముడి లాగా మనలో ఎవడన్నా మరొకళ్ళ పెళ్ళాన్ని తగులుకున్నందుకు హత్యచేస్తే ఉరితీస్తారు. ప్రేమించానని వచ్చిన దాన్ని ముక్కూ, చెవులూ కోయిస్తే కోసినవాణ్ణీ, కోయించిన వాణ్ణీ జైలుకి తోస్తారు. ''నాపెళ్ళాన్ని ఎవడో ఏదో అన్నాడు. అందుకని అడవుల్లో వదిలిపెట్టాను'' అన్నా అదే

రుగుతుంది.

రామాయణంలో మన ఈనాటి జీవితానికి పనికి వచ్చేది లేకపోవటం వింత కాదు ండువేల ఏండ్లనాటి పుస్తకంలో ఈనాడు మనం అమలుచేసే నీతులుంటేనే వింత ామాయణానికి సంబం ధించిన ఈరభసలన్నీ మన అయోమయ పరిస్థితిని రుజావు ేస్తాయి. అంతకంటే ఇంకేమీ లేదు.

*విశాలాంధ్ర, దినపత్రిక, 12-11-1961*

# ఒకరామాయణం

''చరితం రఘునాధస్య శతకోటి ప్రవిస్తరం.''

శతకోటి రామాయణాలన్నది అతిశయోక్తి కావచ్చుగాని, రామాయణాలు చాలా ఉన్నమాట అబద్ధంకాదు. రామాయణం కావలసిన వాళ్లే అల్పసంఖ్యాకులు అందులో అధికసంఖ్యాకులకు వాల్మీకి రామాయణం అవసరం లేదు హిందీ వాళ్లకు తులసీదాసు రచన ప్రమాణం. ఆధ్యాత్మిక చింతనగల తెలుగువాళ్లకు ఆధ్యాత్మ రామాయణం. అరవవారికి కంబరామాయణం. కన్నడిగులకు కుమార వాల్మీకి ఒకడు ప్రత్యేకంగా ఉన్నాడు చెప్పవచ్చిందేమంటే ఇన్ని రామాయణాలూ వాల్మీకి రామాయణానికి కొంత భిన్నంగానే ఉంటాయి. అలాంటి రామాయణాలలో ఒకటి బౌద్ధ రామాయణం. దాన్ని గురించే ఇప్పుడు రాస్తున్నాను. ఇదివరకు చాలా మంది రాసి ఉంటారు. నేను కూడా మళ్లీ రాస్తున్నాను. ఎన్నిసార్లయినా రాయదగినది గదా రామాయణం !

ఈ రామాయణం ప్రకారం దశరథుడు 'వారణాసిరాజు' అయోధ్య రాజుకాడు ఆయనకు 16000 మంది భార్యలు. ( ఈ సంఖ్యను మన పౌరాణికులు వృధాపోనివ్వకుండా కృష్ణుడికి అంటగట్టారు ! బౌద్ధవాఙ్మయంలో కూడా కృష్ణుడి కథ ఉన్నది గాని, ఆ కథలో అతనికి 1600 మంది గోపికలు భార్యలుగా లేరు)

దశరథుడి పట్టపు రాణికి ఇద్దరు కొడుకులూ, ఒక కుమార్తె కలిగారు. వారి పేర్లు రామపండితుడూ, లక్ష్మణ కుమారుడూ, సీతాదేవి (ఈ బౌద్ధ కథ విన్నవాడే, ''రామునికి సీత ఏమవుతుంది?'' అని అడిగి ఉంటాడు. రామపండితుడికి సీత చెల్లెలు అవుతుంది.)

కొంతకాలానికి దశరథుడి పట్టమహిషి చనిపోయింది. శోకతప్తుడైన దశరథుణ్ణి ఊరడించారు. దశరథుడు మరొక భార్యను చేసుకున్నాడు. ఈమెకు భరతకుమారుడు కలిగాడు. దశరథుడు పరమానందం చెంది భరతకుమారుడి తల్లిని వరం కోరమన్నాడు. ఆమె అప్పుడు ఏమీ కోరక, తన కొడుక్కు ఏడేళ్ళు నిండిన మీదట, ''రాజ్యాభిషేకం

భరతుడికి చెయ్యాలి.'' అని భర్తను వరం కోరింది

దశరథుడు మండిపడి, ''తేజశ్శాలులై ఎదిగి వస్తున్న కొడుకులు ఇద్దరుండగా నీ కొడుకు ఎలా రాజవుతాడు ? అన్నాడు. భరతకుమారుడి తల్లి అలిగి వెళ్ళిపడుకున్నది తరువాత ఆమె తన కొడుక్కు పట్టం కట్టమని పీడిస్తూ వచ్చింది.

దశరథుడు ఈమెకు ఆ వరం ఇవ్వనేలేదు. కాని ఆమె తన మొదటి పట్టపు రాణి పిల్లలను రాజముద్ర సహాయంతో చంపిస్తుందని మటుకు భయపడ్డాడు. అందుచేత ఆయన రామపండితుణ్ణి, లక్ష్మణకుమారుణ్ణి పిలిచి ''ఇక్కడ ఉంటే మీ ప్రాణాలకు అపాయం ఉన్నది , ఏ సామంత దేశానికో, అరణ్యానికో వెళ్ళి, నేను చచ్చిపోయినాక వచ్చి రాజ్యం ఏలుకోండి'' అన్నాడు. ఆయన జ్యోతిష్కులను పిలిచి తనకింకా ఎంత ఆయుర్దాయం ఉన్నదని అడిగితే, వాళ్ళు ఇంకా పన్నెండేళ్లు ఉన్నదని చెప్పారు. అందుచేత దశరథుడు తన పిల్లలను పన్నెండేళ్ళ అనంతరం తిరిగి రమ్మన్నాడు. సీతాదేవి తన అన్నల వెంట తాను కూడా పోతాన్నది.

వాళ్లు ముగ్గురూ వారణాసి నుంచి బయలుదేరేటప్పుడు అనేక మంది పౌరులు ఏడుస్తూ వారి వెంట బయలుదేరారు సీతారామలక్ష్మణులు వారిని వెనక్కు పంపి తాము ఉత్తరంగా హిమాలయాలకు వెళ్ళారు (దక్షిణంగా దండకారణ్యం కాదు.) జలసమృద్ధీ, ఫలసమృద్ధీ గల అరణ్య ప్రాంతంలో వారు కుటీరం నిర్మించుకుని నివసించసాగారు లక్ష్మణ కుమారుడూ, సీతాదేవి రామపండితుణ్ణి కుటీరం నుంచి కదలవద్దని చెప్పి, తామే బయటకి వెళ్ళి కందమూలఫలాలు తెస్తూ, రామపండితుడికి సకల ఉపచారాలూ చేశారు.

జ్యోతిష్కులు చెప్పినట్టు జరగలేదు; పుత్రశోకంతో తొమ్మిదేళ్ళు తీసుకొని దశరథుడు మరణించాడు. ఆయనకు ఉత్తరక్రియలు ముగిసినాక భరతకుమారుడు తల్లి తన కొడుక్కు పట్టం కట్టమంటే పురోహితులు ఒప్పుకోక, ''నిజమైన రాజు అడవులల్లో ఉన్నాడు'' అన్నాడు.

అప్పుడు భరతకుమారుడు రామపండితుణ్ణి తీసుకువచ్చి, అతనికి పట్టాభిషేకం చేయించ నిశ్చయించాడు. అతను రాజోచితమైన ఛత్రచామరాదులూ, చతురంగబలాలూ వెంటతీసుకుని రాముడున్న ప్రాంతానికి వెళ్ళి, రాముడుండే కుటీరానికి కొంతదూరంలో విడిసి, లక్ష్మణ కుమారుడూ, సీతాదేవీ కుటీరంలో లేని సమయం చూచి, రామపండితుడి వద్దకు వెళ్లి, నమస్కారం చేసి, చేతులు కట్టుకుని ఎడంగా నిలబడి, తండ్రి మరణవార్తచెప్పి రామపండితుడి కాళ్లపైనపడి భోరున ఏడ్చాడు.

రాముడీ వార్త విని చలించలేదు. సాయంకాలం తన తమ్ముడూ,చెల్లెలూ

కుటీరానికి వచ్చారు  వారు తనలాగా దృఢచిత్తులు కారని గ్రహించి రామపండితుడు వారిద్దరినీ స్నానం చెయ్యమన్నాడు. వారు నీటిలో ఉండగా తండ్రి మరణవార్త వారికి చెప్పాడు. వారు నీటిలోనే మూర్ఛపోయారు. వారిని నీటినుంచి ఇవతలికి తీసుకురావలసి వచ్చింది.

అనంతరం రామపండితుడు భరతకుమారుడితో, ''లక్ష్మణకుమారుణ్ణీ, సీతాదేవినీ నీవెంట తీసుకుపోయి రాజ్యం చెయ్యి. నేను పితృవాక్యపాలన చెయ్యాలి పన్నెండేళ్లూ ఇక్కడ గడిపిగాని రాను''అన్నాడు.

''అంతదాకా రాజ్యం ఎవరు చేస్తారు?'' అని భరత కుమారుడు అడిగాడు

''నువ్వే'' అన్నాడు రామపండితుడు.

''నాకు రాజ్యం చెయ్యటం తెలీదు'' అన్నాడు భరతకుమారుడు. అప్పుడు అతనికి ఈకథ ప్రకారం పదహారేళ్లు.

''నీకు తెలియకపోతే నా పాదుకలకు తెలుసు'' అని రామపండితుడు తన గడ్డిపాదుకలను  భరతకుమారుడికి ఇచ్చాడు.

లక్ష్మణకుమారుణ్ణీ, సీతాదేవినీ వెంట బెట్టుకుని భరతకుమారుడు వారణాసికి తిరిగి వచ్చి, పాదుకలకు పట్టంకట్టి, తాను రాజ్యం చేశాడు. రాజ్యపాలనలో తప్పుడు నిర్ణయం జరిగినప్పుడు ఆపాదుకలు ఒకదానితో ఒకటి జగడమాడి, సరి అయిన నిర్ణయం జరిగితే గాని శాంతించేవి కావు.

మూడేళ్ళూ కుడా ముగిసినాక రామపండితుడు వారణాసికి తిరిగివచ్చి, ఉద్యానంలో దిగాడు  అది తెలిసి భరతకుమారుడు మంత్రులతో సహావెళ్ళి, రాముణ్ణి రాజుగానూ, సీతను పట్టపుదేవిగానూ చేసి, వారికి రాజ్యాభిషేకం చేశాడు. రామపండితుడు 16000 సంవత్సరాలు చక్కగా పరిపాలించాడు.

ఇదీ బౌద్ధ రామాయణ కథ. ఇందులో రాక్షస సంహారం లేదు. రావణుడు లేడు  కోతి సేనా లేదు. వాలి సుగ్రీవులు లేరు. ఒక్కముక్కలో చెప్పాలంటే ఈ కథ రచించినది వాల్మీకి రామాయణ రచన అనంతరమే కావచ్చుగాని, వాల్మీకి రామాయణ ప్రభావం దీనిపైన ఏమీ ఉన్నట్టు కనబడదు. పైపెచ్చు ఈ కథ వాల్మీకికి పూర్వం ఉన్నది లాగా కనిపిస్తుంది. (వాల్మీకి రామాయణంలో సీత రావణుడితో తాను ఇక్ష్వాకుల ఇంట పదమూడేళ్ళు ఉండినట్టూ, సవతిఅత్తగారు తమను అరణ్యాలకు పంపినట్టూ, తన వయసు అప్పటికి – రావణుడు యతి రూపంలో ఆమెను ఎత్తుకుపోవటానికి వచ్చినప్పటికి పద్దెనిమిదేళ్లు అయినట్టూ చెబుతుంది. రావణుడు లేడుగాని ఉంటే ఈ సీతకూడా అదే విధంగా ఏళ్ల లెక్క ఇచ్చి ఉండవచ్చు.)

ఇది రామాయణ పాత్రలను అపహాస్యం చెయ్యటానికి – రాముడికి సీతచెల్లెలనీ, వారివివాహం వావివరసల భిన్నమైనదనీ వెటకారం చెయ్యటానికి – చెప్పినది కాదు ఎందుచేతంటే భిక్కు బృందానికి ఈ కథ చెప్పిన బుద్ధుడు, శుద్ధోదన మహారాజే దశరథుడనీ, ఆయన మొదటి పట్టపుదేవి మాయాదేవి అనీ, భరత కుమారుడు ఆనందుడనీ, లక్ష్మణకుమారుడు సారిపుత్రుడనీ, సీతాదేవి రాహులుడి తల్లి (యశోధర)అనీ, తాను రామపండితుణ్ణనీ చెబుతాడు. ఈ రామాయణం ఒక బోధిసత్వుడి కథ; అతిపవిత్రమైనది.

ఈ రామాయణాన్ని పుక్కిటిపురాణం కిందతప్ప మనం పరిగణించ నవసరం లేదు. కాని వీటిని పెంచి, మార్చి, ఏసామాజిక ప్రయోజనం కోసమో వాల్మీకి రామాయణం రచించాడు అందులో ప్రక్షిప్తాలు చేసి రామాయణం సైజు రెండింతలు చెయ్యటమే గాక, వాల్మీకి లెక్క ప్రకారమే పూర్తి అయిన కథకు ఉత్తర రామాయణం ఒకటి కృత్రిమంగా చేర్చారు. వాల్మీకి రామాయణం ఈనాడు మనకు ఎందుకూ పనికి రాదు. దాన్ని పవిత్ర గ్రంథంగా మనం ఆరాధించటం మన ఆటవిక మనస్తత్వానికి ప్రత్యక్ష చిహ్నం.

ఈ వాల్మీకి రామాయణాన్ని పవిత్రంగా పూజించే వారికి కూడా అందులో ఉన్న అనేక విషయాలు తెలియవు. రావణుడు సీతను తన ఒళ్లో కూర్చోబెట్టుకుని తీసుకుపోయాడంటే మూర్ఛపోయిన వారున్నారు. సీత హనుమంతుడితో ''నేను పరపురుషుణ్ణి తాకను. రావణాసురుణ్ని తాకలేదా అంటావా? నేను అప్పుడు అసహాయురాలిని'' (యదీహం గాత్ర సంస్పర్శనం రావణస్య బలాద్గతా అనీ శాకింకరిష్యామి వినాధావివశాసతీ) అన్నదంటే సీతను గురించి తమ అభిప్రాయాన్ని పూర్తిగా మార్చుకునే వారున్నారు.

ఈ బౌద్ధరామాయణంలో రెండు చోట్ల వచ్చే 16000 సంఖ్యా, పాదుకలు తీర్పులు చెప్పడానికి సహాయపడటమూ తప్పిస్తే ఇందులో అవిశ్వసనీయమైనది ఏదీ లేదు. దీనితో పోలిస్తే వాల్మీకి రామయణం ( ఇప్పుడు చలామణీ అవుతున్నది) చాలాచోట్ల జుగుప్సాకరంగా ఉంటుంది – ఉదాహరణకు, హనుమంతుడు రాముడి మర్మాంగాలను వర్ణించటమూ, రాముడి విరహమూ మొదలైనవి ) అనేకచోట్ల అవిశ్వాసనీయంగా ఉంటుంది – ఉదాహరణకు లంకలో ఉండే కొట్లాది రాక్షసుల సంఖ్యా, కోతులు కొండ శిఖరాలు విరిచి వాటితో యుద్ధం చేయటమూ, హనుమంతుడు సముద్రం దాటిన విధమూ, (అది ఎగరటంలాగా కనబడుతుంది గాని, దూకటం లాగా కనబడదు.) అతను కొండను ఎత్తుకు రావటమూ, సాహిత్య పరంగా చూస్తే

రామాయణం చచ్చురచన అనటానికి సందేహం ఏమీలేదు. దాన్ని కొందరు పవిత్ర గ్రంథం ానుకోకపోతేనూ, అసంఖ్యాకులు దాన్ని మార్చి రాయక పోతేనూ రాముడి పేరు నామరూపాలు లేకుండా పోయుండేదేమో.

*ఆంధ్రసంఘం, కలకత్తా, సావనీరు 1973.*

# మరొక రామాయణం

(రామాయణ విషవృక్షం - రచన: రంగనాయకమ్మ; ప్రచురణ: స్వీట్‌హోమ్ పబ్లికేషన్స్.)

సామాజిక చైతన్యంగల రచయితలు తమ రచనలను సమాజ పురోభివృద్ధికి తోడ్పడేటందుకు అనేకవిధాల కృషి చేస్తారు. సమాజంలోని లోపాలను యధాతథంగా చూపటమూ, వాటికి వ్యతిరేకంగా తీవ్రమైన ప్రచారం చెయ్యటమూ, సమాజాన్ని బహుముఖాల సంస్కరించటానికి తాపత్రయపడటమూ, మార్క్సిస్టు దృక్పథంతో సమాజాన్ని విశ్లేషించటమూ - ఇలా ఉంటాయి మేధావి పరిణామ దశలు. రంగనాయకమ్మ ఈ దశలన్నీ అందుకున్న రచయిత్రి. ఆమె సరికొత్త రచన ''రామాయణ విషవృక్షం'' మార్క్సిస్టు దృక్పథంతో చేసిన రచన అనే అభిప్రాయానికి ఆస్కారం కలిగిస్తున్నది.

నిజానికి ఇది మిశ్రమ ప్రేరణలతో జరిగిన రచన. ఇందులోని పీఠికలో సమాజ పరిణామం గురించిన మార్క్సిస్టు అవగాహన స్థూలంగా వున్నది ఇది పాఠకులకు- సమాజం ఎప్పుడూ ఈనాడు వున్నట్టే ఉన్నదన్న భ్రమగలవారికి కనువిప్పుగా వుంటుంది. దీనిని ప్రత్యేకంగా ఒక గ్రంథంగా ఎంచవచ్చు ఆంత్రొపాలజీ గురించి మరింత స్పష్టంగానూ, వివరంగానూ తెలుసుకోగోరే వారికి ఇది ప్రేరణనిస్తుంది.

అయితే సోషల్ ఆంత్రోపాలజీ అధ్యయనం చెయ్యటానికి రామాయణం (వాల్మీకి పేర ప్రచారంలో ఉన్నది) సరి అయిన గ్రంథం కాదు. అందుకు చాలా కారణాలున్నాయి. ఒకటి: అందులో చాలా ప్రక్షిప్తాలున్నాయి; పండితులు ఒప్పుకునేవేగాక, మామూలు పాఠకులు కూడా పట్టుకునేవి ఎన్నో వున్నాయి.(ఉదాహరణకు: విరాధుణ్ణి రామలక్ష్మణులు సజీవంగా పూడ్చిపెట్టారు. వాడు తుంబురుణ్ణి అనే గంధర్వుణ్ణి అని చెప్పి శరీరాన్ని విడిచి పెట్టి ఎగిరిపోవడం స్పష్టంగా ప్రక్షిప్తం. కళేబరం లేవకుండా రాముడు కంఠం మీద కాలు పెట్టుకుని నుంచుని, లక్ష్మణుడి చేత గుంట తవ్వించ నక్కర్లేదు).

రెండు: ప్రక్షిప్తాల కారణంగా నైతేనేం, మూల రచనలోని అవకతవకల వల్ల నైతేనేం, అనేక సందర్భాలు ఒకదానికొకటి అతకవు. ( ఉదాహరణకు; సీత రావణుడితో

తాను పన్నెండేళ్ళుగా ఇక్ష్వాకుల ఇంట వున్నానని, పదమూడో ఏట తననూ తన భర్తనూ అడవులకు పంపారనీ, తనకిప్పుడు 18 ఏళ్ళనీ తన భర్తకు 25 ఏళ్ళనీ అంటుంది బౌద్ధ రామాయణం ప్రకారం సీత రాముడి అక్కే అయినా, ఆమెకు 23 ఏళ్ళు పైన వుండాలి. ఉన్న రామాయణం ప్రకారం రాముడికి పన్నెండో ఏట పెళ్ళి, పదమూడో ఏట పట్టాభిషేకం జరిగితే అతనికి పాతికేళ్ళు వుండొచ్చు. పెళ్ళి నాటికి సీత అయిదారేళ్ళదా? ఆమె పెళ్ళి ఇంకా అంతకుముందే తలపెట్టారా?) రామాయణంలో వుండే అసందర్భాలనూ, అవకతవకలనూ చాలా వాటిని రచయిత్రే తూర్పారబట్టారు వచ్చే సంపుటంలో ఇంకా చాలా దొరుకుతాయి పోయినకొద్దీ రామాయణం మరింత పైత్యాన పడుతుంది.

పెద్దల ఆగ్రహానికి తల ఒగ్గి నేను రామాయణాన్ని చెత్తపుస్తకం కింద ఏనాడో జమకట్టాను నలభై ఏళ్ళక్రితమే విశ్వనాథవారు రామాయణ కల్పవృక్షం రాసున్నందుకు విమర్శించాను. సాహిత్యంగానే కాదు అది సమాజ శాస్త్ర పరిశీలనకు కూడా పనికిరాని గ్రంథమని నా ఉద్దేశం. అందులో బౌద్ధులను తిట్టటమే కాదు. యుద్ధకాండలో రాళ్లు విసిరే యంత్రాలు గ్రీకులు కనిపెట్టినవి - కూడా వున్నాయి.

మూడు. రామాయణంలో పాత్రపోషణ ఏమీ బాగాలేదు రచయిత్రి చూపినట్టు, రాముడు ఉదాత్తపురుషుడు కాడు. వట్టి ఏడుపుగొట్టు లక్ష్మణుడి చేత అనేకమార్లు మెత్తని చివాట్లుపడతాడు, అతని తర్కం చాలా చిరాకు కలిగిస్తుంది. రాముడిచేత దెబ్బతిన్న వాలి అతన్ని కొన్ని తెలివైన ప్రశ్నలు వేస్తాడు. దానికి రాముడు చెప్పే సమాధానాలలో అహంభావమూ, అమానుషత్వమూ తప్ప ఏమీ లేదు. కొన్ని ఉదాహరణలు ఈ గ్రంథంలోనే వున్నాయి. రామాయణంలో కొన్ని కొన్ని భాగాలు రాముడు వాజ అని చూపటానికి రాశారా అనిపిస్తుంది. విరాధుడు తమని ఎత్తుకు పోయే ఘట్టంలో రాముడు వెలిబుచ్చే నిస్సహాయత ఎలాటిది?

మార్క్సిస్టు దృక్పథంతో విశ్లేషించాలంటే కౌటిల్యుడి అర్థశాస్త్రం వున్నది ధర్మశాస్త్రాలున్నాయి, మహాభారతం, హరివంశం లాంటి పురాణాలున్నాయి. రామాయణం దేనికి? ఈ ప్రశ్న ''రామదాసు' లకే గాక మార్క్సిస్టులకు కూడా కలగవచ్చు. దానికి రచయిత్రి సమాధానం ఈ దేశంలో రామాయణాన్ని అతి పవిత్ర గ్రంథంగా కోట్లాది ప్రజలు పరిగణిస్తున్నారు. రాముడు ఆదర్శపురుషుడుగా భావిస్తున్నారు. రామరాజ్యం అంటే ఆదర్శరాజ్యం అనుకుంటున్నారు.

రామాయణాన్ని తిరిగి రాయటానికీ, దాన్ని మార్క్సిస్టు దృక్పథంతో పరిశీలించటానికీ ఇది సరిఅయిన కారణమని నాకు తోచలేదు. మన వాళ్ళుకొలిచే

కృష్ణుడు జారుడూ, చోరుడూ, హంతకుడూనూ (శిశుపాలవధ). రాముణ్ణి దేవుడుగా మన వాళ్ళు కొలవటానికి తాటకి వధా, వాలివధా, శూర్పణఖ సంఘటనా అడ్డంరాలేదు రాముడు కొండరాళ్లతో సముద్రానికి వారధి కట్టించడమూ, అనేక లక్షల బాణాలు అంబుల పొదినుంచి తియ్యటమూ, కోతుల్నీ, కొండముచ్చుల్నీ, ఎలుగ్గొడ్లనీ సేనగా ఉపయోగించి, కోట్లాది సాయుధ రాక్షసులను జయించటమూ- అన్నీ రామభక్తులు 'దిగమింగారు'.

అసలు సంగతి రామాయణంలో 'నిజంగా' ఏమున్నదీ చాలా మందికి తెలీదు. ఆ మాటకు వస్తే యీ రచయిత్రికీ తెలీదు రేడియోలో ఎవరో హరిదాసుగారు శూర్పణఖ కథ చెప్పారు. కుటుంబరావు గాంధీ దాన్ని విని 'శూర్పణఖ' కథ రాశారు. ఆ మీదట రచయిత్రి ముందుగా శూర్పణఖ ఘట్టమూ, అటు తరువాత రామాయణమూ చదివారు. అందరికీ ఇలాటి ప్రేరణ ఉండదు. రచయిత్రి చెప్పినట్టు (5వ పేజీ) చాలా మంది రామాయణ కథను హరికథగానో, పురాణశ్రవణం ద్వారానో విని తెలుసుకుంటారు ఈ హరిదాసులు ఉన్న కథ ఎన్నడూ చెప్పరు. ''రావణుడు సీతను తాకటమే? భస్మమైపోడూ? ఆవిడ కింద ఇంత మంటిపెళ్ల విరిచి దానితో సహా ఎత్తుకుపోయాడు'' అంటారు. పురాణం చెప్పేవాళ్ళు మాత్రం జగుప్సాకరమైన రాముడి విరహం ఆడవాళ్ళ ముందు ఎలా చెప్పగలరూ? దాటేస్తారు. సీతతో సంభోగం కోసం యమబాధ పడిపోతూ పక్షుల క్రీడల్ని చూసి మరింత విరహబాధపడుతూ, లక్ష్మణుణ్ణి గురించి పొరపాటున కూడా సానుభూతి చూపడు. అతను బ్రహ్మచర్యం ఎలా అనుభవిస్తున్నాడో ఆలోచించడు. ఈ సంగతి హరిదాసులూ, పురాణ పండితులూ ఎందుకు చెబుతారూ? ఇప్పుడున్న సంస్కృత రామాయణాన్ని యథాతథంగా తెలుగుకావ్యం చేసి ఎవరూ రాయరు. రాయలేరు. ప్రారంభించి విడిచి పెట్టేసిన వాళ్ళున్నారు.

''రామాయణ విషవృక్షం'' వాల్మీకి రామాయణానికి తర్జుమా కాదు. దానిమీద విమర్శకూడా కాదు. అది మరొక రామాయణం. చాలా ఆసక్తితోనూ, ఉబలాటంతోనూ రాసినది. శూర్పణఖ కథ పూర్తిగా స్వకపోల కల్పితం. అందుచేత దీనికి మరొక రామాయణం అని పిలుచుకునే యోగ్యత వున్నది. లోగడ రామాయణాలు రాసిన వారందరూ మూలంలోలేని అంశాలను ప్రవేశపెట్టినట్టే ఈ రచయిత్రి కూడా అనేక కొత్త అంశాలు రామాయణ కథలో ప్రవేశపెట్టారు. దశరథుడికి దగ్గు; ఆయన మీసాలకు రంగు వేస్తాడు; మగచీమలు తమ భార్యలలో(?) పాతివ్రత్యం అపేక్షిస్తాయి; పాటకజనం – గుహుడు సైతం – చుట్టలు కాలుస్తారు. రాముడికి ఈతరాదు; పువ్వులు సీతతో

మాట్లాడతాయి; రాముడు అరణ్యవాసం ప్రారంభించిన రోజునుంచి అది పూర్తి కావటానికి ఎన్ని సంవత్సరాల, ఎన్ని నెలల, ఎన్నిరోజులున్నదీ లెక్కిస్తూవుంటాడు. ఆశ్రమాలలో ఉపాదాన బ్రాహ్మ లుంటారు, దశరథుడు రాముణ్ణి అడవికి పంపించినది రంభా సంభోగంకోసం; రామలక్ష్మణులు తమ అంతరాత్మలతో ఘర్షణ పడుతూంటారు.

స్థూలంగా ఈ రచన సాగినది రామాయణాన్ని వాస్తవికంగా రాయటానికి ఇది విజయవంతంగా సాగటానికి వీల్లేదు. ఏ ప్రాచీన రచనలోనూ వాస్తవికత పాటించబడదు రాముడు అరణ్యంలో భరతుణ్ణి కలుసుకున్నప్పుడు రాజధర్మాలను గురించి బోరుకొట్టటం గురించి రంగనాయకమ్మగారు అధిక్షేపించటం వృథా. పురాణాల లాంటివి రాసిన ప్రాచీన కవులు అవకాశం దొరికిన చోటనల్లా తమకు తెలిసిన 'జ్ఞానాన్ని' ఏకరువు పెట్టేస్తారు. మన పాతకాలపు నాటకాలలో పద్యం రాగానే స్టేజి గాయకుడు సంగీత గిరకీలు కొట్టిస్తూ, నాటకాన్నీ ఇతర పాత్రలనూ గాలికి వదిలేసినట్టు. ఆ ఘట్టం నిజంగా జరిగితే రాముణ్ణి గురించి మిగిలిన పాత్రలకు ఎలాంటి వికారాలు కలుగుతాయో వివరంగా రాయటం బొత్తిగా నిరుపయోగం. రామాయణ మూలాన్ని అంత ''లిటరల్''గా తీసుకోవటంలో రచయిత్రి ఆశించినది ఏమిటో అర్థం కాదు

''ఎపిక్'' రచనకు కొన్ని ప్రత్యేక లక్షణాలుంటాయి. కొన్ని పడికట్టు రాళ్ళుంటాయి. అందమైన ఆడది ''వరారోహ'' రాముడు రాజీవలోచనుడు వాల్మీకి ఏడుస్తున్న ఆడదాన్నీ, నిద్రపోతున్న ఆడదాన్నీ వర్ణించేటప్పుడు కూడా ఆమె నవ్వునూ, కోయిల కంఠాన్నీ వర్ణించగలడు. ''అభ్యగచ్ఛత వైదేహీం దుష్టచేతా నిశాచర?'' అని చెప్పి, మరుక్షణమే రావణుడి చేత సీతను ''చారు స్మితే!'' అని సంబోధింప జేస్తాడు. దుష్టచేతగా ఉన్న దానికి చారుస్మితవేమిటి? రావణుడు అంతతోపోక సీతను ఆపాదమస్తకం, స్తనాల దగ్గర నుంచీ, వర్ణిస్తాడు. అంతా విని సీత రావణుడికి పీట వేసి మర్యాదలు చేస్తుంది. ఇటువంటివన్నీ లిటరల్‌గా, వాస్తవిక దృష్టితో చదివితే ఏ ప్రాచీన గ్రంథమూ చదవలేం. ఈ గ్రంథాలను చదవ నిరాకరిస్తే అర్థం చేసుకోవచ్చు పెరియార్‌లాగా వాటిని తగలబెట్టినా అర్థంచేసుకోవచ్చు. కాని ఇలా తిరగరాయటాన్ని అర్థం చేసుకోవటం కష్టం.

ఇంకోటి పట్టిచ్చేది ఏమిటంటే, రామాయణంలో ఉండే ఆచార వ్యవహారాలను ఈ కాలపు సామాజిక విలువలతో అంచనా కట్టటం. అందుకే గదా ఈ రచన అనవచ్చు. కాని అలాటి ప్రయత్నం ఇలా జరగరాదు. ఆర్కియాలజిస్టులు తమ త్రవ్వకాలలో ట్రాన్సిస్టర్లు ఆశించరు మార్క్సిస్టుకు గతి తార్కిక భౌతికవాదం తెలిసి ఉండాలి. రామాయణంలో ఫ్యూడల్ సంస్కృతే ఉంటుంది. బ్రాహ్మణులు తప్పుడప్పు

వాయించుకునే రచనలలో బ్రాహ్మణ ప్రగల్భాలే ఉంటాయి. స్త్రీలను సామాజికంగా వీలయినంత అధఃపాతాళానికి తొక్కిన ఆర్య సంస్కృతిలో స్త్రీలను గౌరవించటం ఉంటుందనుకొనటం మన పొరపాటు రామాయణం నాటికి ఉండిన సామాజిక దురన్యాయాలు ఈనాటికీ ఉంటే – అలాటివి కూడా ఈ రచనలో ప్రస్తావించబడ్డాయి – అది నిజంగా చెప్పుకోవలసిన సంగతే ఆటవిక జాతులలో ఆధునిక నాగరికత లోపించడం ఆశ్చర్యం కాదు; ఆధునిక నాగరికతలో ఆటవిక లక్షణాలు మిగిలి ఉండటం తప్పక తెలుసుకోదగిన సంగతి అవుతుంది.

ఒకనాటి అభ్యుదయకర ఆచారవ్యవహారాలు మరొకపరిణామ దశలో అభ్యుదయ నిరోధకాలవుతాయి. రామాయణ కాలంలో వుండిన ఏ ఆచారాలు ఆనాటి సమాజానికి మేలు చేశాయో అంచనా వెయ్యటం ఒకపద్ధతి. వాటినన్నింటినీ ఈనాటి సామాజిక స్పృహతో దుయ్యబట్టటం వేరొకపద్ధతి. బానిసవిధానం అమిత హేయమైనది. కాని దానిద్వారా సామాజిక అభివృద్ధి ఒకప్పుడు సాధ్యమయిందని స్టాలిన్ గుర్తుచేశాడు. ఈనాడు కులవ్యవస్థ మనకు చాలా కీడు చేస్తున్నది. అయితే దాని ద్వారానే మానవ సమాజాలు గణవ్యవస్థ నుంచి పురోగమించగలిగాయి. వైరుధ్యాంశాలు ఎలా తారుమారవుతాయో గతితార్కిక భౌతికవాదికి ఒకడు చెప్పనవసరం లేదు.

మూలంలో లాగే ఈ రచనలో కూడా పుష్కలంగా ప్రకృతి వర్ణనలున్నాయి. అవి కవిత్వం స్థాయిని అందుకుంటాయి. (దాన్ని ఎవరూ ఫ్యూడల్ కవిత్వం అనకుందురు గాక.) దశరథుడు చచ్చిన తరువాత ఏమయాడో చెప్పే ఆహ్లాదకరమైన ఘట్టం ఒకటి వున్నది. అది రచయిత్రి కల్పనా సామర్థ్యానికి మంచి గీటురాయి. అలాగే రచయిత్రికి సొంతమైన వ్యంగ్యహాస్యం రచన అంతటా కనిపిస్తుంది. కొన్ని ఉదాహరణలు:

'' ఎదుటి వాళ్ళు ఎంత మాత్రమూ కోరని వాటిని ఇచ్చెయ్య గల దాతల్లో దశరథుడు మహాదిట్ట (88వ పేజీ)

'' నేనే రాముడి భార్యనయితే మహారాణి నయ్యేదాన్ని కదా? అని ఎవరికి వారే రాముణ్ణి భర్తగా పొందనందుకు గాక మహారాణి కాలేనందుకు విచారించారు'' (102).

(దశరథుడు) '' అయ్యో, నేను అధర్మపరుణ్ణి అయితే ఎంత బాగుండును? బొత్తిగా ఇంత మాటతప్పని పుణ్యశాలిని అయ్యానే అంటూ తన సద్గుణాలన్నీ తల్చుకుని దుఃఖించాడు''(143)

''లక్ష్మణా! నేనే తల్చుకుంటే వొక్క అయోధ్య ఏమిటి? ఈలోకాన్నే బాణాలు వేసి కొట్టేస్తాను. అబ్బ.. ఏం చీమలు! చంపుతున్నాయి?'' అంటాడు రాముడు. (187) ఇలాంటి విసుర్లు చాలా చోట్ల ఉన్నాయి.

రుషులను గురించి రచయిత్రికి అపోహ ఉన్నట్టు కనబడుతుంది. వాళ్ల సన్యాసులు కారు భార్యలతో నిక్షేపంగా కాపురం చేసేవారు అంతే కాదు. ఋష్యాశ్రమాలు ఫ్రీ లవ్ సొసైటీలు అనుకునేటందుకు ఆస్కారం కలిగించే కథ కనీసం ఒకటి భారతంలో ఉన్నది. ఋషిపత్నుల వ్యభిచారాల కథలకు అంతే లేదు. రాముడిది తాపసి వేషం అయితే కావచ్చుగాని అతను తపస్సు చేసినట్టు ఎక్కడా గుర్తురావటం లేదు.

ఏమైనా ఈ పుస్తకం - ఇది మొదటి భాగం మాత్రమే - చదివి కొందరైనా రాంభజన చెయ్యటమూ, రామాయణం మీద ప్రమాణాలు చెయ్యటమూ మానితే రచయిత్రి శ్రమ వృథా అయినట్టుకాదు

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 27.12.1974.*

# మళ్ళీ రామాయణం

''విషవృక్షం'' మీద నేను చేసిన సమీక్ష మీద రంగనాయకమ్మగారు వెలిబుచ్చిన అభిప్రాయాలునన్ను ఆశ్చర్యపరచలేదు. నేను రామాయణం మీద నా అభిప్రాయాలు ప్రకటించినది ''విషవృక్షం''కు సంబంధించకుండా కాదు. రామాయణం సమాజ పరిణామాన్ని విశ్లేషించటానికి పనికిరాదనే నేను ఇప్పటికీ అభిప్రాయపడుతున్నాను. దానికి కారణాలు (1) అది ఇతర పురాణాల లాగా రచించినది, అంటే అనుశ్రుతంగా వచ్చిన గాథలతో కూడుకున్నది కాదు. అది ఒక కావ్యం, దాన్ని ఆదికావ్యం అన్నారు (2) దాన్ని ఒక వ్యక్తి తన సమకాలిక సంస్కృతి అనుభవంతో పాత కథగా ఊహించి, అభూతకల్పనలే కథకు ఆయువుపట్టుగా పెట్టి రచించాడు (అభూతకల్పనలు అన్ని పురాణాలలోనూ వుంటాయి. సామాజిక విశ్లేషణకు అవి అడ్డురావు.)

రామాయణంలో ఏమున్నదో ఈ రచయిత్రికీ తెలియదు అని నేను అనటం ద్రోహం ఎందుకయిందో నాకు తెలియదు. ఆ సంగతి నాకు విషవృక్షంలోనే తెలిసింది. నాకు దివ్యదృష్టి లేదు మరి.

మార్క్సిస్టు దృక్పథంతో విశ్లేషించాలంటే పనికి వచ్చేవి కొన్ని చెప్పి నేను రామాయణాన్ని మినహాయించడం రంగనాయకమ్మదృష్టిలో– ''వైద్యం చెయ్యాలంటే న్యుమోనియా వుంది, ఉబ్బసం ఉంది, గుండె జబ్బులున్నాయి, పోలియో ఉంది. టైఫాయిడ్ దేనికి?'' అన్నట్టుగా ఉందని రంగనాయకమ్మగారు అంటున్నారు. వైద్యం చేసేవాడు అన్ని రోగాలకూ వేరువేరు చికిత్సలు చేస్తాడు. సోషల్ ఆంత్రొపాలజీలో అనేక రకాలుంటాయని నాకు తెలీదు.

విషవృక్షం పీఠికను గురించి నేను ఏ ఆక్షేపణ చేసినట్టు జ్ఞాపకం లెదు. పోతె సాహిత్య గౌరవం అన్ని రకాల రచనలకూ సమంగా ఉండదన్న విషయం రంగనాయకమ్మగారికి తెలియనిది కాదు. ఏ కాలంలోనైనా రచనలలో చెత్తా చెదారమూ ఉంటూనే ఉన్నది. రచించిన ప్రతి రచనా సాహిత్యం అనిపించుకోవచ్చు అందుచేత అన్నీ ఉత్తమ సాహిత్యం కాదు. వాల్మీకి కవిత్వాన్ని పండితులు ఆకాశాని కెత్తారు కాని సాహిత్యంగా నేను రామాయణాన్ని మెచ్చుకోలేను ఇతరులను మెచ్చుకోవద్దని నేను అననూ లేను! పెద్దల ఆగ్రహానికి వెరిస్తే నేను రామాయణాన్ని చెత్త అని బహిరంగంగా అని ఉండనని రంగనాయకమ్మగారు ఊహించి వుండవలసింది. ''చరిత్ర పరిణామాన్ని భౌతిక దృక్పధంతో చూసే మార్క్సిస్టు ఏ పుస్తకాన్ని కూడా చెత్త పుస్తకంగా భావించడు'' అని రంగనాయకమ్మగారు ఖండితంగా చెప్పేస్తున్నారు నేను భౌతికవాదిగా, మార్క్సిస్టుగా ఏ కోవకు చెందుతానో ఏమోగాని, భౌతిక విశ్లేషణకు పనికిరాని చెత్త రచనలు నేను చాలా చదివాను, సినిమాలు చాలా చూశాను. రామాయణాన్ని ఆరాధించేవారిని ''మూర్ఖులు'' గా కూడా నేను జమకట్టను. వారిని ముందుగా, ''మీరు రామాయణం చదివారా?'' అని అడుగుతాను. ఇలా ఎందరినో అడిగాను. ఒక్కరు కూడా చదివేమని చెప్పలేదు. జన బాహుళ్యం ఆరాధించే రాముడికథ ''విషవృక్షం''కు ప్రేరేపణ ఇచ్చినది కానేకాదని నా దృఢవిశ్వాసం.

నేను ఆర్య సంస్కృతిని ప్రత్యేకంగా తప్పు పట్టడానికి కారణం ఉన్నది. రామాయణం ఆ సంస్కృతి నుంచి వచ్చినదన్నది ఒకటి, రెండోది ఆర్యులు మాతృస్వామ్యం ఎరగరు ఆటవిక దశలో పుట్టిన వాడికి తండ్రి ఎవరో తెలియని దశలో తప్పిస్తే, తరవాత వ్యవసాయం ద్వారా ఆరంభదశలో పురుషుడిపైన స్త్రీ ఆధిక్యత సంపాదించిన దశ ఆర్యులకు రాలేదు. వ్యవసాయం కూడా అభివృద్ధికి వచ్చేసరికి మళ్ళీ పురుషుల ఆధిక్యత వచ్చేసింది. ఆ దశలోనే ఆర్యులు వ్యవసాయాన్ని చేపట్టారు. ఆర్య సమాజంలో ఆడది అధోగతిలో ఉండినమాట నేను సృష్టించలేదు. దాన్ని అనేక మంది ప్రాజ్ఞులు చెప్పారు.

రాముడు ఒకరకం రాజనీ, రావణుడు ఇంకొక రకం రాజనీ నేను పొరపాటున కూడా అభిప్రాయపడలేదు. ఫ్యూడల్ వ్యవస్థలో అలా కాకుండా వుంటే చెప్పుకోవాలి. నేను ఈ విషయాన్ని ''విషవృక్షం'' ద్వారా తెలుసుకున్నట్టు నా సమీక్షలో అనకపోవటం తప్పయితే ఆ తప్పు చేసినట్టు ఒప్పుకుంటాను.

అహల్యవంటి ఋషిపత్నులు చేసిన దాన్ని పౌరాణికులు వ్యభిచారం అన్నారు. వాళ్ళ మొగుళ్ళు వాళ్ళనూ, వాళ్ళ పిల్లలనూ శపించారు. నేను వ్యభిచారం అంటే దానికి

తప్పుపట్టాలా? నీతిలో మార్పు వచ్చిన మాట నిజమే, కాని పౌరాణికులు తమ కాలికుల కోసం దాన్ని వ్యభిచారం అన్నారనుకోవాలి.

పుస్తకాన్ని తగలబెడితే, చరిత్ర తగలబడదు సరేకదా మిగిలిన కాపీలూ తగలబడవు. అది తెలివైన పనికాదు - కాని అర్థం చేసుకోవచ్చు. రంగనాయకమ్మగారి జవాబును అర్థం చేసుకోలేనా?

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక 31-1-1975*

# మశకాయనం

విక్రమశకం, శాలివాహనశకం, క్రీస్తుశకం - వీటన్నింటి కన్న ప్రాచీనమైనది మశకం. ఐతరేయ బ్రాహ్మణంలో ఆంధ్రులు చెప్పబడి ఉన్నందుకే మనం చంకలు గుద్దుకుని, ''అబ్బో, మనం చాలా పాతకాలం మనుషులం'' అని విర్రవీగుతున్నాం. కాని దోమలు ఋగ్వేదంలోనే చెప్పబడి ఉన్నాయి. (నేను ఋగ్వేదం చూశానని కాదు; చూడటమేమిటి? చదివినా అది నాకు అర్థం కాదు. విమానాల దగ్గిర నుంచి ఉన్న వేదాలలో దోమల ప్రసక్తి లేకపోయిందా అని!) అనార్యమైన శాస్త్రదృష్టితో చూచినా మనిషి అనే కీటకంకన్న ముందు పుట్టినది మశకమనే కీటకం.

అరణ్యవాసాలు చేసిన హరిశ్చంద్రుడూ, నలుడూ, రామలక్ష్మణులూ, పాండవులూ మొదలైన ప్రాచీనులు దుర్భరమైన దోమలబాధ అనుభవించి ఉండాలి. కాని ఈవిషయం ఎవరూ బయటపెట్టలేదు. ఎప్పుడూ అడవుల్లోనే ఉండే మునీశ్వరులు దోమలబాధ పడలేకనే గడ్డాలూ, మీసాలూ పెంచుకున్నారు. ఋష్యాశ్రమాలలో వటువులకు మాత్రమే దోమలబాధ ఉండేది తపోధనంతోపాటు కేశసంపద కూడా అలవర్చుకున్న ఋషిపుంగవులు, దోమలు తమకేసి వచ్చినప్పుడు 'అష్షాష్షా!' అనేవాళ్ళు.

అరణ్యాలలోనే కాక అయోధ్య, హస్తినాపురం, ఇంద్రప్రస్థం, మిథిలా మొదలైన పురాణ నగరాలలో కూడా దోమలున్నాయని నా నమ్మకం. ఈవిషయాన్ని కూడా పురాణాలు రాసినవారు దాచిపెట్టారు. మొత్తానికి నన్నడిగితే, ప్రాచీన కాలపు కవుల కన్న ఋషులే దోమల విషయంలో ఎక్కువ నిజాయితీ కనబరిచారు - ''పిపీలికాది బ్రహ్మపర్యంత!'' అన్నారు. ఋషులు. పిపీలికం అంటే నిఘంటువుల్లో ఏం అర్థం చెబుతున్నారో తెలీదుగాని, అసలైన అర్థం దోమే. మరి కవులేమన్నారూ 'హస్తిమశకాంతరం' అన్నారు. వాళ్ళకి దోమలు కనిపించినప్పుడల్లా ఏనుగులు జ్ఞాపకం వచ్చేవి కాబోలు! 'మహా గజాః పలాయంతే మశకానాంతు కాగతిః' అన్నారు.

ఇలా వాళ్ళకి దోమతో పాటు ఏనుగులు ఎందుకు జ్ఞాపకం వస్తాయా అని

నేను సైకో ఎనలైజ్ చేసి చూస్తే, అందుకు కారణం వారికి దోమలంటే గల భీతేనని తేలిపోయింది. నిజానికి ఆ కవులు దోమలను చిన్నచూపు చూడవలసిన అవసరం ఎంతమాత్రమూ లేదు మానవులు ఏనుగులను మచ్చిక చేశారు వాటిని అదుపులో ఉంచడానికి అంకుశాలు కనిపెట్టారు. వాటిమీద ఎక్కి సవారీ అయారు ఒక్క దోమను మచ్చికచేశారా? దోమలు మనం చెప్పినట్లు వినేందుకు ఒక్క సాధనమైనా కనిపెట్టారా? ఏనుగుమీద సవారీ చెయ్యవచ్చునన్నది మనుఘులు గ్రహించింది దోమల నుంచి కాదా? అవి సృష్ట్యాది నుంచీ ఏనుగుల మీద సవారీ చేస్తూనే ఉన్నాయి! పట్టుమని పది దోమలు తగులుకుని కుట్టడం మొదలుపెడితే ఐరావతం లాంటిది వెర్రెత్తి లోకం మీద పడేది. వెర్రెత్తిన ఏనుగులను శంకరారాగంతో దారికి తేవచ్చు (చూ. తాన్‌సేన్). కాని దోమలను నిగ్రహించడానికి అటు హిందుస్థానీలో గాని, ఇటు కర్ణాటకంలోగాని ఒక్క రాగం కూడా లేదు. ఎందుకుంటుంది? ఉండడానికి వీల్లేదు ఏనుగులంటే వాటికి పురాతన ఓటమి అంటూ ఉన్నది. మనం ఏనుగు ఎదట శంకరారాగం పాడటం ప్రారంభించిన కాస్సేపటికి అది ఆరోహణావరోహణలను అంచనాకట్టి, 'అది శంకరా రాగమా ఏమిటి చెప్మా!' అనుకుంటుంది. అనుకోగానే శంకరుడు జ్ఞాపకం వచ్చేస్తాడు ఆ స్ట్రీమాఫ్ కాన్షస్‌నెస్‌లో శంకరుడు తమ పూర్వీకుణ్ణి చంపేసిన చరిత్ర ఘట్టం గుర్తుకు వస్తుంది. దాంతో అంత పెద్ద ఏనుగు చల్లబడి చలిమిడి ముద్దలా అయిపోయింది.

ఇటువంటిది దోమల విషయంలో ఎంత మాత్రం సాధ్యంకాదు. వేదాల్లో గాని, పురాణేతిహాసాల్లోగాని, ఒక గొప్ప దోమాసురుణ్ణి చంపినవాడెవడూ లేడు జంబూద్వీపంలోనే కాదు, సప్తద్వీపాల్లోనూ లేడు. అదీగాక దోమకు స్వరజ్ఞానమూ అవీ ఉన్నట్టు ఋజువు కాలేదు. హిస్టరీలో కూడా దోమ సున్నా మార్కు తెచ్చుకుందనే మనం అనుకోవచ్చు. హిస్టరీ రాకపోవడం దోమకి మహాబల మిచ్చింది. పురాణాల్లో ఏముందో తెలియక పోవడం సనాతనవాదులకు బలమిచ్చినట్టు దోమలకు చరిత్ర నుంచి నేర్చుకునేదేమీ లేదు వాటికి సృష్టి రహస్యమే తెలుసు. మానవజాతిలో సగం చచ్చిపోతుందన్నా మనం రారెత్తిపోతాం! యుద్ధాలు వద్దు మొర్రో అంటాం. అణు బాంబులు దగ్గర్నుంచీ పెనిసిళ్ళు చెక్కుకునేచాకులు దాకా అన్నింటినీ నిషేధించమంటాం. వాటికి లక్ష్యం లేదు. భూమ్మీద ఉండే దోమలన్నీ చచ్చినా ఫరవాలేదు. ఒక్క ఆడదోమ, ఒక్క మగదోమ మిగిలితే చాలు - కొల్లేటినీ, కోడంబాకాన్నీ; విజయనగరంనీ, విశాఖపట్టణాన్నీ - అవలీలగా తమ జాతితో నింపెయ్యగలవు. ఈ సంగతి ప్రతి పిల్లదోమకి తెలుసు.

బతకడం చాతకాదు. మనం చావుకి భయపడతాం. ' ఏ రష్యాలోనో చచ్చిన

వాళ్ళని కూడా కొందరిని బతికిస్తున్నారట ఫలానా ప్రమాదకరమైన రోగానికి మందు కనిపెట్టారట' అంటూ మనం చంకలు గుద్దుకుంటాం. ఈవిధంగా విజ్ఞానంతో చావునుంచి తప్పించుకుంటున్న ప్రతి ఒక్క ప్రాణికి కనీసం ఓ వెయ్యిమంది కార్లకింద పడి చస్తున్నారు వీటికి విరుగుడు కనిపెట్టలేనందుకు మనకు సిగ్గయినా లేదు. దోమలు మట్టుకు చావును లక్ష్యపెట్టవు. ఒక్క చుక్క రక్తం కోసం అవి ప్రాణాలొడ్డుతాయి వాటికి ఘనంగా బతకడమే ముఖ్యం

నిజంగా అవి ఘనంగానే బతుకుతాయి నేను వాటి జీవితం గురించీ, అద్భుత శక్తులను గురించి, చాలా రకాల పరిశోధనలను చేసి ఉన్నాను. నా పరిశోధనల ఫలితాలను నాస్తికులూ, అనార్యులూ అయిన శాస్త్రజ్ఞులు ఒప్పుకోకపోతే అది నా తప్పుకాదు.

ఇతర ప్రాణులలాగా కాదు. దోమలకు ఆహారం ఉండి తీరాలనే నిర్బంధం ఏమీ లేదు. మనం ఓ వారం రోజులపాటు ఇల్లు తాళం పెట్టిపోతే దోమలు ఖాతరు చెయ్యవు. అవి మన రక్తం తాగటం అవసరం కొద్దీ కాదు; సగం మనమీద వాటి ఆధిక్యత నిరూపించటానికీ, సగం నిషా కోసమూనూ, మాదక ద్రవ్యం మనకు ఆనందం చేకూర్చేది మెదడును మొద్దుబార్చి – ఈ సంగతి అందరికీ తెలుసు. దోమలు స్వతహాగా మనకన్నా తెలివితేటలు కలవి. అందుచేత, మన రక్తం తాగటం చేత, వాటికి తాత్కాలికంగా మెదడు మొద్దుబారుతుంది. అప్పుడు వాటికి నిషా వస్తుంది. రక్తం బాగా తాగి, కైపెక్కి తూలుతూ నృత్యాలూ చేస్తూ, ఎగిరేటప్పుడు పల్టీలు కొట్టే దోమలను నేను కళ్లారా చూశాను.

వాటి తెలివితేటలను గురించి శంకించేవాళ్ళు పరమనాస్తికులని నాదృఢ విశ్వాసం. మనం ఎప్పుడు బొత్తిగా అసహాయస్థితిలో ఉంటామో వాటికి తెలుసు. మననీ, మన అలవాట్లను, మన అశక్తతనూ అవి కాచి వడగట్టాయంటే వాటికి అతిశయోక్తి ఏమీ లేదు. మన రెండు చేతులూ పనిమీద ఉన్న సమయం చూసి, అవి యథేచ్ఛగా మనని కుడతాయి రాసుకునేటప్పుడు కలం పట్టుకున్నా చేతిమీద దోమవాలి నన్ను వెక్కిరించ డం అనేకసార్లు జరిగింది. నేను చల్లగా కలం జారవిడిచే సమయానికి దోమ లేచిపోయింది నాబోటి చతుర్నేత్రుల సంగతి దోమకి తెలుసు. అది కళ్ళజోడు బద్దీకి, కణతకూ మధ్య చేరి నిశ్చింతగా రక్తపానం చేస్తుంది. దాన్ని కొట్టాలంటే కళ్ళజోడుకు ప్రమాదం మళ్ళీ మనం నలభైరూపాయలు పోసి కళ్ళజోడు కొనుక్కోలేమని దానికి తెలుసు.

దోమ మన ఛాయలకు వచ్చినప్పుడల్లా కుట్టడానికే వచ్చిందనుకోనవసరం లేదు మనకు వాటిపై శతృత్వం ఉంది. అవి కనిపిస్తేనే తిక్కరేగే మనస్తత్వం ఉన్నప్పుడు, మన పనిపాడు చెయ్యడానికీ, మనని పీడించడానికీ అవి మనముందు ఆడతాయి. మనం

వాటిని కొట్టడానికి యత్నిస్తే ఏదో గట్టి వస్తువు చాటుకు పోతాయి– మన చేతికి చచ్చేదెబ్బ తగులుతుంది. దోమలను కొట్టడానికి యత్నించే వాళ్ళు సిరాబుడ్లూ, సిగరెట్టుపీకలు వేసే ఏష్ట్రేలూ పడగొట్టడం జగద్విదితం. దోమలు నిజమైన దివ్యదృష్టితో మనం చేసే పనులన్నీ గమనించి అర్థం చేసుకోవడమే కాక, చేయబోయే పనులు కూడా సరిగ్గా ఊహిస్తాయి.

ఏ కారణం చేతనో ఇంకా నేను పరిశోధించలేదు. ఈ రహస్యం కనుక్కున్నాక పద్మశ్రీ బిరుదుకు అర్జీ పెట్టుకుందామనుకుంటున్నాను. దోమలకు మగవారి మీద ఎక్కువ పగ. అవి ఆడవాళ్ళ నెత్తిమీద సుమారు రెండుమూడు అంగుళాల ఎత్తున ఎగురుతూ ఉంటాయి. కానీ కుట్టవు. వాళ్లతలలోంచి వచ్చే సువాసన వాటికి నిషా ఇస్తుందా? లేక వాళ్ల మొగుళ్లను కవ్వించడానికి అవి అలా చేస్తాయా? ఇంకా తెలియలేదు. తెలియగానే అంతర్జాతీయ శాస్త్ర సమ్మేళనానికి పంపించేస్తాను.

మనిషికి లేని మహత్తర శక్తులన్నీ దోమలకు ఉన్నట్టు నేను రుజావుచేసు కున్నాను. ప్రాచీన మహర్షులలాగా అవి వాయుభక్షణ చేస్తాయి. యోగాభ్యాసాలు చేసేవారు ఎన్నెన్ని ఆసనాలు వేస్తారో అంతకి రెట్టింపు అవీచేస్తాయి. అందుచేత వాటికి గరిమ, లఘిమ వగైరా అష్టసిద్ధులూ ఉన్నాయని నామ్మకం. అవి తేలుకుట్టినంత బాధ కలిగించగలవు. ఎప్పుడు మన రక్తం తాగినదీ తెలియరాకుండా, దద్దురెక్కిన తర్వాత మాత్రమే తెలిసేలాగా కూడా కుట్టగలవు. ఎగురుతూ ఎగురుతూ అకస్మాత్తుగా 90 డిగ్రీలు 180 డిగ్రీలూ కూడా మళ్ళగలవు మన విమానాలలో ఈ ఫీటు చెయ్యగలవి ఉన్నాయా అని నేను అడుగుతున్నాను. ఇంతకంటే గొప్ప విశేషమేమంటే అలవోగ్గా ఎగిరిపోయే దోమ, నేను దాన్ని గమనిస్తున్నానని తెలిసి, అదృశ్యం కావటం నేను లక్షసార్లు చూశాను. ( ఒకటిరెండు తక్కువ సార్లే చూసి ఉంటానులెండి నిక్కచ్చిగా చెప్పాలంటే) అదే విధంగా చేతిలో చిక్కి అదృశ్యమైన దోమలు కూడా ఉన్నాయి.

దోమలు మనకు చిక్కవే చిక్కవనీ, మనం వాటిని చంపలేమనీ నేననను. కాని అవి చావదలుచుకున్నప్పుడే మనకి చిక్కుతాయేమో అని నా అనుమానం. ఒకరోజు నేను రాసుకుంటుంటే ఒక దోమ వచ్చి కాగితాల మీద వాలింది. ఆలోచన పాడుచేసు కోవడం ఇష్టంలేక తోసేసాను. పోయి మళ్ళీ వచ్చింది. మళ్ళీ వచ్చింది. మళ్ళీ తోలాను. 'నన్ను చంపవాబాబు!' అన్నట్టు అయిదారుసార్లు వచ్చి అక్కడే వాలింది. ఆఖరుకి చంపి దాని కోరిక తీర్చాను. ఉత్తమ లోకాలకే వెళ్ళి ఉంటుంది. భగవద్గీతలో శ్రీ కృష్ణపరమాత్మ స్థితప్రజ్ఞుడ్ని గురించి ఏమన్నాడు.'మనం నిద్రపోయేటప్పుడు వాడు మేలు కుంటాట్ట. మనం మేలుకున్నప్పుడు వాడు నిద్రపోతాట్ట.' దోమలకున్న స్థిత ప్రజ్ఞత్వం గురించి

ఇంకా మనకు సందేహమెందుకూ?

దోమలని నిర్మూలించడానికి మందులు కనిపెడుతున్నారు. కనిపెట్టామని కూడా అంటున్నారు. అజ్ఞానం! కల్తీలేని అజ్ఞానం ! డి డి టి తీసుకోకండి. (నిజంగా తీసుకోకండి. చెడ్డవిషం. దాన్ని అరవభాషలో టి టి. టి అని రాసి టి. డి డి అని చదవాలి నేషనల్ ఇంటిగ్రేషన్ దృష్టిలో పెట్టుకుని ఆమాట రాశానుగాని, అరవభాషకీ, దోమల ప్రసక్తికీ సంబంధం ఉందని కాదు). ఈ డి డి టి (లేక టి. టి. డి) కొట్టితే కొన్ని దోమలు చచ్చేమాట నిజమే అయితే, వెనకటికో రాక్షసుడి రక్తబిందువు పడ్డచోటల్లా రాక్షసులు పుట్టుకొచ్చేవారట! ఆ విధంగా టి. టి. టి. (లేక టి. డి డి) కొట్టినప్పుడు ఇంట్లో రెట్టింపు దోమలుంటాయి. అంచేత ఈ టి. డి. డి (లేకపోతే డీ. డీ. డీ) యుద్ధవార్తల్లో లాగా, ఇంత మంది శత్రువులను చంపామని చెప్పడానికి పనికొస్తుందే గానీ అంతిమ విజయం చేకూర్చే సాధనం మటుకు కాదు.

పోతే దోమతెరలున్నాయి. ఇవి కృతయుగం నుండీ మనకున్నాయి. (చూడుము పౌరాణిక చిత్రాలు) దోమతెరలు కట్టుకున్నంత మాత్రంచేత దోమలు కుట్టకుండా పోతాయనుకోవడం భ్రమ. అరవంలో హిట్టయిన చిత్రాలు తెలుగులో డబ్‌చేస్తే హిట్టవుతాయనుకోవడంలాంటిది కడుపుతో వున్నమ్మ కనక మానదన్నట్టు దోమతెరలో దూరిన వాడు బయటకు రాకుండా ఉండడు అప్పుడు దోమలు వాడి చేత భరతం పట్టిస్తాయి. దోమలు ఉంటే నిద్ర బొత్తిగా పట్టని వాళ్ళకి దోమతెర నిద్ర మాత్రల్లే ఉపయోగించవచ్చు. కానీ అందులోనూ ఒక పేచీ ఉంది. చాలా మందికి దోమతెరలో పడుకోవడం చేతకాదు. చెయ్యిగాని, కాలుగాని చెంపగాని, చివరకు అరికాలైనా సరే దోమతెరకు ఆనిందో, అలాంటి అవకాశం కోసం చూస్తున్న దోమలు రాజకీయ భేతాళకథలు చదివినట్లుగా విరగబడి నవ్వితుగిడీలు తుగిడీలుగా వచ్చి రక్తపానం చేస్తాయి.

న్యాయం చెప్పాలంటే దోమలకు కూడా ఒకప్పుడు ప్రమాదమే. అది ఒక్కసారి దోమలకు బోనులాగా అయిపోతుంది. మనం దోమతెరని ఎంత జాగ్రత్తగా పక్క కిందికి దోపేసినా, ఏరాత్రివేళో నిద్రలో పొర్లి దోమతెర అంచు లేపేస్తాం. వెంటనే దోమలు లోపలికి రావడానికి సందు ఏర్పడుతుంది. అందులోనుంచి దోమల మందలు శ్రీశ్రీ గేయం పాడుకుంటూ తోసుకుని లోపలికొస్తాయి. లోపల వాటికి మహా వెచ్చగా, సౌకర్యంగా ఉంటుంది. తాగటానికి అమృతభాండంలా మనిషి ఉంటాడు. ఒళ్ళుపై తెలియకుండా అన్నీ తాగేస్తాయి. వాటికికైపెక్కి తల తిరిగిపోతుంది. వచ్చిన దారి మరిచిపోతాయి. ఇంతలో ఒళ్ళంతా బరుక్కుంటూ అమృతభాండం లేచి కూర్చుంటుంది. పాపం దోమలు పారిపోలేక, దోమతెరలో చిక్కుకుపోయి వీరమరణం పాలవుతాయి. ఒకనాడు రాత్రి

నేను నా దోమతెరలో రెండువేల చిల్లర దోమలను చంపాను అంత భారీగా జీవహింస చేసే అవకాశం నాకు మళ్ళీ లభించలేదు. అది నా జన్మకు అన్ని విధాల శివరాత్రి ఆ లేచిన లేవటం తెల్లవారిన దాకా జాగారం చేశాను.

నా కింకొక అనువమానం కూడా ఉంది దోమలు విధియొక్క ఏజంట్లనీ, మానవపాపులను హింసించడానికీ, మతులు పోగొట్టడానికీ, తప్పుడురాతలు రాసేవాళ్లకు అంతరాయాలని కలిగించడానికీ, రోగాలు తెప్పించడానికీ బ్రహ్మదేవుడు వీటినీ సృష్టించి పంపిస్తాడేమో. మిగిలిన ఏ విషయంలోనైనా నేను నాస్తికత్వం ఒప్పుకుంటాను కాని, దోమల విషయంలో నేను ఏ మూఢ విశ్వాసమైనా అవలంబించడానికీ, ప్రచారం చెయ్యడానికీ సిద్ధంగా ఉన్నాను.

*జ్యోతి, సచిత్రమాసపత్రిక, మార్చి1963.*

# అవతార పురుషుడు

అయిదేళ్ళవాణ్ణి. అమ్మలక్కలు చేరి దశమస్కంధం చదివి రసం గ్రోలుతుంటే, సినిమాలో ముసలిమొగుడు తన పడుచుపెళ్ళాం గాని, ఆవిణ్ణి గురించి ఇతరులుగాని అనుకునే మాటల్లో తన అనుమానాన్ని ధృవపరిచే భాగాలు మాత్రమే విన్నట్టుగా మధ్య మధ్య కృష్ణుడి అభావ చేష్టలను గురించి వింటూండేవాణ్ణి. పెద్దవాళ్ళలాగా చిన్నపిల్లలు ఒకే విషయాన్ని గురించి బుర్రలు సానపెట్టాల్సిన కర్మేవిటి? ఉన్నట్టుండి గోరింటపూల చిరుచేదు సువాసన జ్ఞాపకం వస్తుంది అంతలోనే కిటికీలోంచి ఆవుదూడ తలకాయ గల మబ్బు కనిపిస్తుంది. మిగిలిన దూడ ఆకారంకోసం వెతుక్కుంటూండగానే తలకాయ ఇంత పొడుగ్గా సాగి ఏ ఆకారమూ లేకుండా పోతుంది. ఆ మబ్బును చూస్తుంటే ఆనాటి అర్ధరాత్రి ఇళ్ళు తగలబడటమూ, పెటా పెటా బొంగులు పగిలే చప్పుడూ జ్ఞాపకం వస్తుంది. ఆ చప్పుడుపోయి మంత్రపుష్పం వినిపిస్తుంది. పారిజాతపూల వాసన ముక్కుకు తగిలినంత పనీ అవుతుంది.

... ఓయమ్మ నీకుమారుడు..మా ఇండ్లను పాలుపెరుగు మననీడమ్మా .. పాలూ, వెన్నా వాసన తగిలితే చాలు నాకు వాంతి అయేది. అసలు నాకూ, కృష్ణుడికీ అక్కడే బెడిసింది. అస్తమానమూ పాలుతాగి వెన్న తినేవాణ్ణి నేనని ఊహించుకోనుకూడా లేను. అందులోనూ దొంగిలించి తినటం!

దశమస్కంధంలో కృష్ణుణ్ణి గురించిన అసభ్యపు వార్తలు రోజూ వినడం చేతనేమో వాడు ఒట్టి బ్రూట్ అని నామనస్సులో అభిప్రాయం ఏర్పడింది. నేను పాలూ, వెన్నా అరగించలేను. అదలా ఉంచండి. దొంగతనం చెయ్యగలుగుదునా? ఇంటికోడలి మూతికి

వెన్న రాయగలుగుదునా? ఆడాళ్ళ జడలు ముడెయ్య గలుగుదునా? ఆడాళ్ళు స్నానం చేసే చోటికి పోగలుగుదునా? చేతులెత్తి నమస్కారం చేయించడం మాట అటుంచండి.

ఇటువంటి పనులు చెయ్యటానికి పెద్ద తెలివీ, బలమూ కావాలని కాదు. ఇందులో సహస్రాంశం చేసినా పెద్దవాళ్ళు మక్కెలు విరుగదంతారే! మాట పడటానికే నాకు ఎంతో బిడియం కదా – తన్నులు తినే పనులు ఎక్కడ చెయ్యను? ఒక వేళ చేస్తే మాత్రం అందులో ఏమానందం ఉంది?

దశమస్కంధంలో కొన్ని భాగాలు – అంతా వినడానికి ఓపిక ఎక్కడుంది? విన్నంతవరకు కృష్ణుడు వొట్టి వెకిలివెధవనీ, వాడికి జీవితంలో ఆనందం తెలియదనీ, తిట్లు, తన్నులూ తినడానికి అభ్యంతరం లేదని తేల్చేసుకున్నాను. ఇంతలోనే నాకు పెద్ద షాక్ తగిలింది వాడు దేవుట్ట! అదంతా అల్లరికాదుట. లీలలుట! తమ పిల్లలు తినడానికి బెల్లంముక్క అడిగితేనే సిసింద్రీ వెలిగించినంత హంగామా చేసే ఈ అమ్మలక్కలు కృష్ణుడు చేసిన లీలలన్నీ మళ్ళీ మళ్ళీ చదివి ఆనందించే వాళ్ళంటే దానిక్కారణమేమైవుంటుదో నాకు చచ్చినా అర్థం కాలేదు.. కృష్ణుడి గొడవ మరచి పోయాను.

కొంతకాలమయాక కృష్ణుడు నాకు మళ్ళీతగిలాడు. అది మొదలు అడపా దడపా తగులుతూనే ఉన్నాడనుకోండి. కాని ఈసారి కృష్ణుడు కూడా నాతో పాటు పెరిగాడు. నాకప్పుడు కొత్త అనుమానాలు పుట్టుకొచ్చాయి.

నల్లటివాడు ఆడవాళ్లలో ఇంత పాపులర్ కావడానికి కారణమేమిటి? ఒక గోపికకి తెలీకుండా వేరొక గోపిక అతగాడికి డేట్ ఎలా ఇచ్చింది? గోపికలంతా అందగత్తెలేనా? లేక కృష్ణుడికి అందచందాలతో ప్రసక్తి లేదా? ఆడదైతే చాలు ననుకునే జాతివాడా? నింఫోమేనియాకా? ఫ్రీలవ్ తియరీ వాడా? ఫ్రీ లవ్ తియరీ వాడైతే ఒంటరిగా ఆపరేట్ చెయ్యడే! (చిన్న కుశంక – దశమస్కంధం కళ్ల కద్దుకునే వాళ్ళు చలం పుస్తకాలెందుకు తగలెయ్యటం?)

కృష్ణుడు గోపికలను కొంతవరకు ఫూల్ చేశాడంటే నాకాశ్చర్యం కలగలేదు. భారీ ఎత్తున ఫూల్ చేయకుండా అంతమంది గోపికల్ని మేనేజ్‌చెయ్యటం మాటలు కాదు. (చూడుము – బ్లిట్జ్‌లో ఆధునిక కృష్ణావతార సన్యాసిలీలలు) కాని గోపికలు చివరల్లా ఫూల్ కావడం ఆశ్చర్యం. అలాంటి అమాయికలు మరి పుట్టరు కదా! రోడ్‌సైడ్ రోమియోల మీద హైహీల్డ్‌షూజ్ ఎత్తేరకం ఆడవాళ్లు జాస్తికావటానే ఇది కలియుగమై కూర్చుందేమో! కృష్ణుడు సరియైన యుగమూ, సరియైనస్థలమూ చూసి పుట్టాడని ఒప్పుకోక తప్పదు.

తరువాత మనం కృష్ణుణ్ణి రాజుగా చూస్తాం రాజుకు శౌర్యపరాక్రమాలు ప్రధానం. కృష్ణుడిలో అవి ఉండే ఉంటాయి కాని చాలా గోప్యంగా ఉండడం చేత మనకు కనిపించవు. పసితనంలోనే కృష్ణుడు అనేకమంది రాక్షసులను చంపాడన్నారు కాని వాళ్ళు సులువుగా చావడానికి కాబోలు రాక్షసరూపంలో రాక జంతువులు గానూ, ప్రాణంలేని చక్రాలు మొదలైనవిగానూ వచ్చారు దోమల రూపంలోనూ, నల్లుల రూపంలోనూ, ఈగలరూపంలోనూ, తేళ్ళూ, జెర్రులూ, పాములూ మొదలైన రూపాలల్లో వచ్చిన మహా భయంకర రాక్షసులను నేను కూడా చాలా మందిని చంపాను. వీళ్ళు నిజరూపంలో వచ్చి ఉంటే చంపలేక పోదునని చెప్పడానికి నాకేమీ బిడియం లేదు.

తనతో యుద్ధం చెయ్యనివారిని ఆకస్మికంగా చక్రప్రయోగం చేసి కృష్ణుడు కొందరిని చంపాడు. ఇవి న్యాయంగా మర్డర్స్ జాబితాలోకి వస్తాయి. కంసుడూ, శిశుపాలుడూ, కృష్ణుడిచేతిలో మర్డరయినవాళ్లు. జరాసంధుడి చావులో గూఢచారి తనం కూడా చేరి ఉంది. ఇవన్నీ పొలిటికల్ ఎసాసినేషన్‌లే!

నిజంగా జరాసంధుడి వంటివాడు తనమీద దండెత్తి వచ్చినప్పుడల్లా కృష్ణుడు పారిపోయి దాక్కున్నాడు. వినిపించే గీతాల కన్నా వినపడని గీతాలు మరింత శ్రావ్యమైనవట! కృష్ణుడి పరాక్రమం అప్రదర్శితం కావడం చేతనేమో అందరి పరాక్రమం కన్నా హెచ్చుకీర్తి సంపాదించుకున్నది!

కృష్ణుడి రాజకీయాలెటువంటివి? భారతం నాటి రాజకీయ చక్రాన్ని తానే తిప్పినట్టు కృష్ణుడు అక్కడక్కడా కోతలు కోసి ఉండడం చేత భారతయుద్ధం వరకూ జరిగిన కర్మకాండ కృష్ణుడి అంచనాల ప్రకారమే జరిగిందనుకోవచ్చు. అలా అయితే కృష్ణుడి రాజకీయాలేమిటో నాకు తెలియదు. కౌరవ పాండవవంశాల పతనమే కృష్ణుడు కోరి ఉండాలి. అది కోరినవాడు అచ్చమైన రాజకీయ 'మఫ్' అనుకోవాలి. లేక పార్టిజాన్‌గా పాండవుల విజయమే కోరినవాడైతే అస్త్రంపట్టి యుద్ధం చెయ్యక రథం తోలినందుకు పిరికివాడనుకోవాలి ఏవిధంగా చూసినా కృష్ణుడి రాజకీయ పాత్ర ఏమంత ఘనంగా లేదు.

'' ఈ కృష్ణుణ్ణి అవతార పురుషుడు చేసిన దెవరు? ఎందుకు చేశారు?'' అని ఒకప్పు డాశ్చర్యపడేవాణ్ణి. కాని ప్రపంచం పోకడ చూస్తున్నకొద్దీ అటువంటివాడే అవతార పురుషుడనిపించుకుంటాడని తోస్తుంది. మామూలు మనుషులు పాటించే నీతి నియమాలకు అతీతుడుగా ఉండడం, తన శక్తులకూ, ఆదర్శాలకూ నిజమైన పరీక్ష వచ్చినప్పుడల్లా ఎక్కడోపోయి దాక్కోవడం, యాదవవంశం తప్పతాగి ఆత్మహత్య చేసుకుంటున్న క్షణంలో ముసలి కృష్ణుడు దూరంగా వెళ్ళి ఎక్కడో దాక్కోవడం

గమనించాను రాజకీయ హత్యలు చెయ్యటం, చేయించటం, మంచి జరిగినా, చెడు జరిగినా తన నిర్ణయ ప్రకారమే జరుగుతున్నట్టు పదిమందినీ నమ్మించడం - ఇవన్నీ సూపర్‌మాన్ లక్షణాలే! సూపర్‌మాన్ అంటే అవతార పురుషుడే!

హిట్లర్ చచ్చి ఇరవై ఏళ్ళు దాటుతున్నా అతడి భక్తులింకా అనేక దేశాలలో ఆర్భాటాలు చేస్తూనే ఉన్నారు. దక్షిణాఫ్రికాలో కొందరు 'హైల్‌హిట్లర్' అనటానికి బిడియపడి'88' అని ఒకరినొకరు ఎకాస్ట్ చేసుకు న్నారట. ఇంగ్లీషులో 8వ అక్షరం 'హెచ్'. 'హైల్' లోనూ 'హిట్లర్'లోనూ అది మొదట అక్షరం. హిట్లర్ ప్రభావం ఇంకా నిలబడి ఉన్నందుకు అమాయకులు ఆశ్చర్యపడతారు. కృష్ణుడి పేరు ఇన్ని (?)వేల ఏళ్ళు నిలబడి ఉన్నందుకు ఎవరూ ఆశ్చర్యపడరు. అదే ఆశ్చర్యం!

*జ్యోతి, సచిత్రమాసపత్రిక, ఆగస్టు1963.*

# మానవ సమాజం - దాని భవిష్యత్తు

సృష్టి ఆరంభమైనది లగాయతు మానవులున్నారన్నది మూఢవిశ్వాసం కింద కొట్టివేసినా, మానవుల కింద జమకట్టదగిన వాళ్లు కనీసం అయిదు లక్షల ఏళ్ళుగా భూమిమీద నివసిస్తున్నారు. ఈ అయిదు లక్షల ఏళ్ల కాలంలోనూ వారు నిప్పును స్వాధీనం చేసుకోవడంతో మొదలుపెట్టి చంద్రుని మీద నడిచే దాకా అభివృద్ధి చెందారు. ఈ మధ్యకాలంలో వారు తమ జీవితాలకు ఆధారంగా పరికరాలు - రాతివీ, ఎముకవీ, రానురాను లోహపువీ ఉపయోగించటం నేర్చుకున్నారు భాషను సృష్టించారు. ఆహారం ఏరుకుతిన్నారు. విల్లు బాణాలతో వేటాడటం నేర్చారు; వ్యవసాయంతోనూ, పశుపోషణతోనూ స్థిరావాసాలు ఏర్పాటు చేసుకోగలిగారు. జ్ఞానం పెంపొందించారు! సాహిత్యం సృష్టించారు; ధనాన్ని సృష్టించారు; ఆస్తులు కల్పించారు. రాజ్యపాలన ఏర్పాటు చేశారు; శాస్త్రజ్ఞానాన్ని పెంపొందించారు. విద్యుచ్ఛక్తి, యానాలూ, యంత్రాలూ, నాగరికతా సృష్టించారు

ఈ పరిణామాలన్నీ ఒక్క సారిగా సాధ్యమైనవి కావు. క్రమంగా వచ్చాయి. రాతి పరికరాలతో ప్రారంభమైన మానవ సంస్కృతి అణుశక్తి స్వాధీనం చేసుకునే దాకా రావటంలో మానవ సమాజం అనేక మార్పులకు లోనుకావటం తప్పనిసరి అయింది. ఈనాడు కూడా మనకు ఆటవిక సమాజాలున్నాయి నాగరీకుల మనుకునే మన పూర్వీకులు ఆటవిక దశలో ఉన్నప్పుడు ఇంచుమించు ఈనాటి ఆటవికులలాగే జీవించారనుకోవటం మహాపచారం ఏమీ కాదు. మన దేశంలో అత్యంత ప్రాచీనమైన దేవుడని చెప్పదగిన శివుడు చర్మాలు ధరించాడు, పుర్రెలమాలలు అలంకరించుకున్నాడు.

మన పురాణాలలో చర్మాలను ధరించిన ఋషులు చాలా మంది కనిపిస్తారు

ఆటవిక లక్షణాలకోసం మనం వెనుకటి కాలాలనూ, పాత పురాణాలను తవ్వనవసరం లేదు. మన జీవితంలోనే ఆటవిక లక్షణాలు అనేకంగా ఉన్నాయి. అనాగరిక లక్షణాలు ఇంకా ఎక్కువగా ఉన్నాయి మన జీవితంలో భౌతిక దృష్టి ఎంతవరకైతే లోపించిందో అంతవరకూ మనం అనాగరికులమే నిత్యజీవితంలో కలిగే సమస్యల పరిష్కారానికి మానవుడు పైనగాక దేవుడిపైన ఆధారపడే ఏజాతి అయినా అనాగరిక జాతే. పాతకాలపు అనాగరిక జాతులకు అనాగరికంగా ఉండటం తప్పనిసరి అయింది కాని మనం అనాగరికంగా ఉండటం జ్ఞానం లేకపోవటం చేతా, జ్ఞానంమీద విశ్వాసం లేకపోవటం చేతా, మన అసమర్థతను గురించి మనం సిగ్గుపడటం కూడా ఎరగకపోవటం చేతానూ.

మనతో పోల్చితే రాతియుగం మనుషులు చాలా సమర్థులు. 3, 4 లక్షల ఏళ్ల క్రితం జీవించిన నియండర్తాల్ మనుషులు ఎనిమిదేసి అడుగుల ఎత్తుగల అతిభయంకరమైన ఎలుగుబంట్లను వేటాడి చంపారు. నిడువు దంతాలు గల ఏనుగులను వేలసంఖ్యలో వేటాడారు. అది కూడా రాతి ఆయుధాలతో! అంతకన్నా కూడా చిత్రమేమంటే వేటజీవితం గడిపిన వాళ్ళు చిన్న చిన్న జట్లతో జీవించేవారు. ఒక జట్టులో పదినుంచి ముప్ఫైదాకా ఉండేవారట. ఎన్నిజట్లు ఏకమై సహకార విధానం అవలంబిస్తే పదివేల అడవి గుర్రాలను ఒకే స్థలంలో చంపడం సాధ్యమై ఉండాలి!

ఒకటి రెండు డజన్ల మంది, ముఠాగా ఉంటూ సంచార జీవితం గడిపే రోజులుపోయి, అనేక లక్షల మంది కొన్ని తరాలబాటు ఒకేచోట జీవించడం సాధ్యమయిన నాగరికత వచ్చింది. కాని మనుషుల మధ్య సహకారం ఏమయింది? ఒకప్పుడు ధర్మం నాలుగు పాదాలా నడిచేదనీ, ఈనాడు ఒకపాదం మీదే నడుస్తున్నదనీ సనాతనులు అంటే మనకు ఒళ్లు మండిపోతుంది. కాని అందులో కొంతనిజం లేదా? ప్రాచీన గణాల్లో వ్యక్తులందరూ సమంగా ఉండి, ఒకేధర్మానికి కట్టుబడి, వ్యక్తి జీవితానికీ, సమష్టి జీవితానికీ తేడా లేకుండా జీవించారు. మనుధర్మ శాస్త్రం పుట్టేనాటికే అదంతా పోయింది. ఈనాడు యుద్ధంలో పట్టుబడిన శత్రు సైనికులకు చూపేపాటి ఆదరంకూడా మునుపు శూద్రుల పట్ల చూపలేదు. వర్ణవ్యవస్థ పాక్షిక ధర్మ వ్యవస్థతో కూడిన సమాజాన్ని చిత్రించింది.

ప్రొఫెసర్ కుల్డేన్ చెప్పినట్టు, పదివేల ఏళ్ళ క్రితం మానవులు ఆస్తి హక్కు లెరగరు; మరికొంత కాలానికి అవి లేకుండా పోవచ్చు. కాని ధర్మం యొక్క పాదాలను విరగగొట్టింది ఆస్తి హక్కులేనని ఎవరూ సంశయించనక్కర లేదు.

కులవ్యవస్థ (Clan Organisation) అవలంబించిన ధర్మాలు ఏకులానికి చెందిన ఆస్తి ఆ కులంలోనే ఉండేటట్టుగా ఏర్పాటయినవి. వారసత్వం స్త్రీ పరంపరలో ఉండినప్పుడూ, పురుష పరంపరకు మారినప్పుడు కూడా ఆస్తి ఏ కులానిది ఆ కులంలో ఉండేటందుకు తగిన ఏర్పాట్లు జరిగాయి. సామాన్యంగా ఒకకులం స్త్రీ అదే కులంలో వివాహం చేసుకోవటం నిషిద్ధమైనప్పటికీ, స్త్రీ ఆస్తిపరురాలైనప్పుడు అదే కులంవాణ్ణి చేసుకోవటానికి కుల నిబంధనలు సడలించడం జరిగింది.

అదేవిధంగా మనుస్మృతిలో సపిండ వివాహాలు నిషిద్ధమైనప్పటికీ దాక్షిణాత్యుల విషయంలో, మేనరికాల విషయంలో వివాహ నియమాలను సడలించారు. (మేనరికాలు స్త్రీ వారసత్వాన్ని పురుష వారసత్వం కింద మార్పుచేయటానికి వచ్చినవి. స్త్రీ వారసత్వంలో పురుషుడి ఆర్జన తన బిడ్డలకు కాక, తన మేనల్లుళ్ళకూ, మేనగోడళ్ళకు పోతుంది. మేనరికం పెళ్ళిళ్ళ ద్వారా ఆ ఆస్తి బిడ్డలకే చెందేటట్టు చేయవచ్చు) ఇలాంటి చిక్కులు లేకుండా చెయ్యటానికి స్త్రీలకు ఆస్తి హక్కులు లేకుండా చేశారు!

ఏమైనా కులజీవితంలో కులం ఆస్తి సమిష్టిగానే ఉండేది. ఆస్తులు వ్యక్తులవిగా పరిణమించినాక కులవ్యవస్థ యొక్క స్వరూపం పూర్తిగా పోయింది. ఇది జరగటానికి కూడా సమాజంలో కలిగిన పరిణామమే కారణం.

సమాజం అనేది అనేక కుటుంబాల సముదాయం. సమాజానికి 'యూనిట్' కుటుంబం. గణ జీవితంలో ఒక గణంలో అనేక కులాలు ఉండేవి. కులమంతా ఒకే కుటుంబం ఒక తరం వాళ్లంతా, తరువాత తరం వాళ్ళకు తండ్రూలూ, తల్లులూనూ. ఎవడయినా తన కులంవాణ్ణి చంపాడంటే అంతకు మించిన కులద్రోహం ఉండేది కాదు. అలాంటి పని చేసినవాడు మరణశిక్షకు అర్హుడు. ( భారత యుద్ధం అయినాక చార్వాకుడు ధర్మరాజును తన కులం వారిని చంపినందుకే తిడతాడు. బ్రాహ్మలంతా చేరి చార్వాకుణ్ణి చంపినప్పుడు కులాచారం కూడా చార్వాకుడితోనే చచ్చింది.)

రాజతరంగిణిలోనూ, భారతీయ చరిత్రలోనూ, ఇతర చరిత్రలోనూ సింహాసనాల కోసం తండ్రులనూ, అన్నలనూ చంపినవాళ్ళే ఉన్నారు. ఈ పితృహంతకులూ, భాతృహంతకులూ సమాజం యొక్క శిక్షకు గురికాకపోగా, నిశ్చింతగా రాజ్యాలు ఏలారు. సమాజ ధర్మం చార్వాకుడిని దాటి ఎంతదూరం వచ్చిందో!

ఒక భార్యా, భర్తా వాళ్ళ పిల్లలూ ఒక కుటుంబం. ఈనాడు నాగరిక సమాజంలో ఒక భార్యకు ఒకభర్తా, ఒకభర్తకు ఒకభార్యా ఉండటం ఆచారంగా ఉన్నాది. వ్యక్తుల కష్టసుఖాల దృష్ట్యా విడాకులు కొన్ని సమాజాలలో ఉన్నది, ఒకేసారి ఒక స్త్రీ బహు భర్తలను గాని, ఒకే పురుషుడు బహు భార్యలనుగాని కలిగి ఉండటం ఆధునిక సంస్కృతికి

విరుద్ధం. కాని ఈ ఏర్పాటు అనాదిగా ఉన్నది కాదు భారత కథకు నాయిక అయిన ద్రౌపది అయిదుగురు పాండవులకు భార్య. దశరథుడు మొదలైన వారు అనేక మంది భార్యలను చేసుకున్నారు ద్రౌపది అయిదుగురిని పెళ్లాడే నాటికి ఆ పెళ్లి విడ్డూరమే అనుకుందాం; కాని అంతకు పూర్వం జటిలుడనే ఋషి కూతురు ఏడుగురు ఋషులకు భార్య అయిందట. దాక్షాయణి అనే మునికన్య పది మంది ప్రచేతసులకు భార్య అయిందట. (అందరూ ఒకే పేరు గల వారు కావటం చూస్తే ఒకే కులంవారని తోస్తుంది).

ఋష్యాశ్రమాలలో ఒకప్పుడు 'ఫ్రీ సెక్స్' ఉండేదనుకునేటందుకు అవకాశం ఉంది. ఒక రాజు ఆడదిగా మారి ఋష్యాశ్రమాలలో ఉంటూ పెళ్ళీ పెటాకులూ లేకుండా పిల్లలను కని, తిరిగి పురుషుడి వవుతావా అని అడిగితే, '' నాకు ఇప్పుడే కామ సంతృప్తి జాస్తిగా ఉన్నది '' అంటాడు!

స్త్రీ పురుష సంబంధమయిన ''నీతి'' కూడా ఆస్తిహక్కును పురస్కరించుకునే వచ్చిందనటానికి సందేహం లేదు. ''పుత్'' అనే నరకం శుద్ధ కల్పన. ఈనాడు జన సంఖ్యను అదుపులో పెట్టటానికి ''త్రికోణం'' ఉద్యమం వచ్చినట్టు, జనసంఖ్య పెంచటానికి పున్నరకాన్ని సృష్టించి ఉంటారు. పోతే వొకప్పుడు సెక్స్‌నీతి చాలా సరళంగా ఉండేదనటానికి పురాణాలలో ఎంతైనా ఆధారం ఉన్నది. బృహస్పతి ''దేవర న్యాయంగా'' మమత అనే దానితో సంభోగించబోతే, ఆమె గర్భంలో అది వరకే ఉన్నకొడుకు ఇది ధర్మవిరుద్ధమన్నాడట. ఆ మాట అన్నందుకు బృహస్పతి వాణ్ని పుట్టుగ్రుడ్డిగా పుట్టమని శపించాడుట! వాడే దీర్ఘతాయుడు, అతన్ని అతని పెళ్లాం తన కొడుకుల చేత చేతులూ, కాళ్లూ కట్టించి గంగలో తోయించింది!

ఇలాంటి సెక్స్ నీతి ఈనాటి సమాజం సహించదు. దీన్ని బట్టి సమాజం ఎలా మారిందీ స్పష్టమవుతుంది.

ఇక కుటుంబంలో కొడుకులు. పాండవులు కుంతికీ, మాద్రికీ ఎలా పుట్టినదీ, ధృతరాష్ట్ర, పాండులు వాళ్ల తల్లులకు ఎలా పుట్టినదీ అందరూ ఎరిగినదే. ఒకప్పుడు యెనిమిది రకాల కొడుకులను ''చట్టం'' ఆమోదించేది. ఆనాడు సొంత కొడుకు కావాలి, లేదా పెంపుడు కావాలి. ''దేవర భావుక'' ధర్మాలను అనుసరించి పిల్లలను కనేవారు ఇప్పటికీ ఉన్నారని వినికిడి. కాని అది నాగరిక సమాజం ఆమోదించేది కాదు.

ఇంకొక విషయం. ఋతుస్నాత అయిన స్త్రీ సంగమం కోరితే నిరాకరించిన పురుషుడికి వొకప్పుడు నరకమని నమ్మేవాళ్ళు. శర్మిష్ఠ ఆ ధర్మాన్ని అనుసరించే యయాతికి పిల్లలను కన్నది. కాని ఆ ధర్మం ఈనాడు చెల్లదు

పురుష వారసత్వంలో తండ్రి ఆస్తి పిల్లలకు సంక్రమించాలంటే ఈ పిల్లల తండ్రి ఫలానావాడు అని ధృవీకరించటం తప్పనిసరి అయింది. దానికిగాను వివాహవిధికి చాలా ప్రాముఖ్యం వచ్చింది. జాబాల కొడుకు సత్యకాముడికి ఆస్తి సమస్య లేదు గనక, తండ్రి ఎవరో తెలియకపోయినా, ఉపనయనం చేసుకుని, విద్య నేర్చుకుని యజ్ఞాలు చేయించి, తన పొట్ట తాను పోసుకున్నాడు.

సత్యకాముడి కాలానికే క్షత్రియులకు వివాహ విధి ఏర్పడినట్టు కనిపిస్తుంది. వాళ్లు యజ్ఞాలు చేయించిన వారిని పోషించగలిగారు ముందు ఆస్తి హక్కులు అమలు చేసిన క్షత్రియులే ముందుగా పెళ్ళిళ్ళు కూడా చేసుకున్నట్టున్నది. ఎందుకంటే, తన తండ్రి ఎవరో తన తల్లికి కూడా తెలియదని సత్యకాముడు అన్నప్పుడు ''అలా అయితే, వీడు బ్రాహ్మడే అయి ఉండాలి'' అని మిగతా బ్రాహ్మలు తేల్చారు.

సత్యకాముడి కాలానికి ఇన్ని కులాలు (వర్ణాలు) ఉన్నట్టు లేవు. అందుచేత జాబాల తాను కొడుకును ఎవరికి కన్నదీ ఎరగకపోయినా వర్ణ సాంకర్యానికి అవకాశం లేకపోయింది. కాని భగవద్గీత అవతరించిన నాటికి వర్ణసాంకర్యం భయం వొకటి కూడా అవతరించింది. ''స్త్రీషు దుష్టాసు, వార్ష్ణేయ, జాయతే వర్ణసంకరః'' అన్నాడు. స్త్రీ రంకుపోతే ఆపాపం ముట్టుతో పోతుందని భారతంలో ఎక్కడో ఉన్నట్టు జ్ఞాపకం. ఇది కూడా వర్ణ సాంకర్యాన్ని బట్టి ఏర్పడ్డ ధర్మమే అయిండాలి

స్త్రీలకు సమాజంలో ఉండిన స్థానం గురించి అస్పష్టంగానైనా కొంత తెలుస్తున్నది. వేదకాలపు ఆర్యులలో స్త్రీలకు ఉన్నతస్థానం ఉండేదని కొందరు చెబుతున్నారు అది పురాతన సమాజాలలో స్థూలంగా స్త్రీని మరీహీనంగా చూడటం జరగలేదు గనక వేదకాలపు స్త్రీలు మధ్యకాలంలో వారికంటె కొంచెం హెచ్చుగౌరవం పొందారేమోగాని, వారికి పురుషులతో సమత్వం ఉన్నట్టు కనబడదు.

దర్మశాస్త్రాలు పుట్టేనాటికి వాళ్లు హీనంగానే ఉన్నారు.

స్త్రీలకు వర్ణాధికృత లేదు. ఏవర్ణం స్త్రీ అయినా శూద్రులతో సమానమే. స్త్రీకి వేదపఠనం చేసే అధికారం లేదు. ఏ వర్ణంవాడైనా తన వర్ణానికి చెందిన స్త్రీనీ, అంతకు తక్కువ వర్ణాలకు చెందిన స్త్రీలనూ పెళ్లాడవచ్చు. ఆడది పిల్లల్ని కనే యంత్రం, భర్తనీడ, భర్తచస్తే భర్తతోపాటు చితిలో కాలిపోతుంది. లేదా, గుండుచేయించుకుని, వొంటి పూట తిండి తింటూ, నగలూ, రంగుబట్టలూ మాని, వెట్టిచాకిరి చేస్తుంది. ఆడదానిపైన మొదట తండ్రి, తరువాత మొగుడూ, తరువాత కొడుకూ అధికారం చలాయిస్తారు. శూద్రులంటే ఆరంభంలో సేవకులూ, బానిసలూనూ సంఘపురోభివృద్ధికి బ్రాహ్మణులూ, క్షత్రియులూ, వైశ్యులూ, శూద్రులూ దోహదం చేసే కాలం గడచి,

పంచములు కూడా చరిత్రను నిర్మించే కాలం వచ్చినా స్త్రీ బానిసత్వంలో పెద్ద మార్పు రాలేదు.

కుటుంబం అనేది ఎన్ని మార్పులు చెందినా దాని వలన లాభాలు ఉంటూ వచ్చాయి. వృత్తివిద్యలు పెరిగి, ఒక్కొక్క వ్యక్తికీ ఒక్కొక్క కులం ఏర్పాటయినప్పుడు, తండ్రి నుంచి కొడుకు కులవిద్య నేర్చుకోవడం వీలుగా ఉండేది. ఆ స్థితి నింపాదిగా పోయింది. జనాభా పెరగడం చేతనైతేనేం, కొత్తవ్యాపకాలు రావడం చేత నైతేనేం ప్రతీవాడూ కులవృత్తికి అంటిపెట్టుకోవడం సాధ్యంకాలేదు. దీనికి తోడు నాగరికతా ప్రభావం వలన వృత్తులలో కులప్రాముఖ్యం పోయింది. ఎవరు ఏ ఉద్యోగానికైనా అర్హత పొందవచ్చు. ఒక బడిపంతులూ, ఒకప్లీడరూ, ఒక డాక్టరూ, ఒక ఇంజనీరూ ఏకులం వాళ్లయినా కావచ్చు. '' ఇంగ్లీషు చదువులు'' వచ్చి అంతా ఏకం చేసేశాయి.

అయినా కుటుంబం అవసరమన్నారు. పిల్లలు తల్లిదండ్రుల ప్రభావంతో పెరగాలి. తల్లిదండ్రుల ప్రేమ పెరుగుదలకు చాలా అవసరం. ఆదర్శదృష్టితో చూస్తే ఇదినిజం కావచ్చు. కాని వాస్తవ జీవితంలో మనం చూస్తున్నదేమిటి?

నూటికి తొంభైతొమ్మిది మందికి పిల్లల పెంపకం గురించి బొత్తిగా తెలీదు. నాగరిక మానవుడు instinctతో బతకగలవాడు కాడు. వాడికి అడుగడుగునా విజ్ఞానం కావాలి. సెక్సు దగ్గర్నుంచీ పుస్తకాలు చదివి నేర్చుకోవాలి. అలాంటప్పుడు పిల్లల్ని పెంచటం తల్లిదండ్రులయినంత మాత్రాన సహజంగా అబ్బుతుందా? అబ్బదు; అబ్బటం లేదు. ఒక చివర పిల్లలనుపెరగనిచ్చేవారూ, మరొక చివర పిల్లల క్షేమం గురించి అతిగా భయపడి పిల్లలను ఎందుకూ పనికిరాని వాళ్ళుగా చేసేవారూ ఉంటే, మధ్యలో పిల్లలను పెంచటం గురించి తెలిసీ తెలియని వాళ్ళూ, సాంప్రదాయ సిద్ధంగా ఉన్నచర్యలు తీసుకునే వాళ్ళూ, పిల్లలకు తగిన పోషణలు తెలిసికూడా డబ్బులేక చేయులేని వాళ్ళూ, డబ్బూ, జ్ఞానమూ ఉండి పిల్లలను సరిగా పెంచగల అత్యల్ప సంఖ్యాకులూ ఉన్నారు.

''ప్రేమ'' మాటకు వస్తే అది లోపించిన చోట పిల్లలకు జరిగే హానికన్న అతిగా ఉన్నచోట పిల్లలకు జరిగే హానే చాలా ఎక్కువ. ''గారాబం'' తో పాడయిపోయినవాళ్ల మామూలు మనుషులు కావటానికి యెంతోకాలం రకరకాల మానసిక చర్యలు అనుభవించ వలసివస్తుంది.

ఇప్పటి పరిస్థితి చూస్తే శాస్త్రీయంగా నడిచే నర్సరీలూ, పాఠశాలలూ పిల్లలకు ఇంటికన్న మంచి వాతావరణాన్ని కలిగించి, వాళ్ళు మానసికంగానూ, దైహికంగానూ పెరగటానికి హెచ్చుగా తోడ్పడతాయి. అలాంటి నర్సరీలూ, పాఠశాలలూ మనకు లేవన్నది వేరేమాట. వాటిని ఏర్పాటు చేసుకునే అవకాశం ఈనాడు ప్రతిదేశానికీ ఉన్నది.

ఈనాటి సమాజంలో వివాహం చాలా ప్రాముఖ్యం వహిస్తుంది. కారణం కుటుంబానికి కుదురు వివాహమే ఈనాడు జరిగే పెళ్లిళ్ల చాలా వరకు గాడిద పెళ్ళిళ్ళు. దాన్ని అంటిపెట్టుకుని కులమూ, శాఖలూ, వరుడి ధనార్జనాశక్తీ, దానికి అనుగుణంగా కట్నాలూ మొదలయినవి ఉన్నాయి మనం చేసే పెళ్లిళ్ళు అనాగరికమైనవి. ఈమాట అందరికీ తెలుసు. కాని ఈ పరిస్థితిని మార్చే శక్తి యెవరికీ లేదు.

ఈనాటి సంస్కృతి ''ప్రేమ వివాహాలు'' అంటుంది. ప్రేమవివాహా లనేవి కులగోత్రాలనూ, మతపు అడ్డుగోడలనూ సెక్సనీతిని సైతం తృణీకరిస్తాయి. అందుకే వాటికి అనుకూలమయిన వాతావరణం యేర్పడటం కష్టం ప్రేమ వివాహాలు చెయ్య సాహసించిన వారిని సామాజిక శక్తులు ఆర్థికంగా నిర్మూలించగలవు. ఆర్థిక స్వాతంత్ర్యం ప్రేమ వివాహాలకు దారితీయగలదు.

వివాహబంధం పవిత్రమయినదనీ, పెళ్ళి నూరేళ్ళ పంట అనీ చెప్పేవి జోకు మాటలు కొన్ని వివాహబంధాలు చూస్తే అంతకన్నా ప్రపంచంలో అపవిత్రమయినవి ఉండవనిపిస్తుంది. దుర్భరమయిన వివాహబంధాలను తెంపటానికే నాగరిక దేశాలలో విడాకుల పద్ధతి ఉండేది. మధ్యకాలంలో మనం మానవత్వం కోల్పోయి విడాకులంటే మహాపాపమని నమ్మాం.

ప్రేమ వివాహాలు జరగాలంటే స్త్రీ పురుషులను ప్రేమించే శక్తీ, సంస్కారమూ ఉండాలి. ప్రేమించే శక్తి అందరికీ ఉండదు. చాలా మంది స్త్రీలు దాదాపు ఏ భర్తతోనైనా జీవించే మనస్తత్వం కలిగి ఉంటారు. వాళ్ల సంఖ్య తగ్గిన కొద్దీ సమాజంలో దాంపత్యాలు వీధినపడటం జాస్తి అవుతుంది. దాదాపు యే స్త్రీతోనైనా ఒకేవిధంగా జీవించే మగవాళ్ళుకూడా ఉన్నారు.

ఈనాడు మనం యుగసంధిలో ఉన్నాం కనీసం రెండువేల యేళ్ళుగా అమలులో ఉండిన మానవ సమాజ స్వరూపంలో మౌలికమయిన మార్పులు రానున్నాయి. రాజకీయంగానూ, మానసికంగానూ, ఆర్థికంగానూ, నైతికంగానూ, ధార్మికంగానూ విప్లవకరమయిన మార్పులు జరిగితేనే తప్ప మానవ సమాజం దక్కదు. విధ్వంసక శక్తులూ, అధికారాలూ, ధనమూ సమాజంలో అల్పసంఖ్యాకుల చేతులలోనే ఉండిపోవడం సమాజ క్షేమానికి చాలా హానికరం కాలక్రమాన సమాజానికి కుటుంబం ''యూనిట్'' గా ఉండే పద్ధతి పోవాలి. ''కమ్యూన్''లు యేర్పాటు కావాలి. ఆస్తి హక్కులు పోవాలి. తాను విశాల జీవితంలో సామాజికుడుగా జీవిస్తున్నాననే భావం పిల్లలకు పసితనం నుంచీ ఏర్పడాలి. అలాటి వ్యక్తుల సాంఘిక చైతన్యం ఇప్పుడున్న దానికి భిన్నంగా ఉంటుంది. అలా పెరిగిన వాళ్ళేభావి మానవులు. అలా పెరిగిన వాళ్లే భావి మానవులు. జీవితం

విశాలం కావటానికి గతంలో యేర్పడిన అడ్డుగోడలన్నీ పడిపోవాలి. వాటికి భావి సమాజంలో స్థానంలేదు.

ఇప్పుడున్న సమాజం శిథిల మవుతున్నదనటానికి ప్రపంచ మంతటా జరుగుతున్న ప్రజల తిరుగుబాట్లేకాదు, సాంఘిక నియమాల మీదా, నీతి నియమాల మీదా జరుగుతున్న తిరుగుబాట్లు కూడా నిదర్శనమే ఇందులో కొన్ని విప్లవం తెచ్చేవి కావు. తల్లిదండ్రులను ధిక్కరించి వర్ణాంతర వివాహం చేసుకుంటున్న యువకుడు విప్లవం తీసుకురాడు కాని అమలులో ఉన్న సాంఘికనియమాలను సవాలు చేస్తున్నాడు కుటుంబ పోషణకు తన భార్య చేత వ్యభిచారం చేయించేవాడు వివాహవ్యవస్థకూ, ఆర్థికావసరాలకూ ఏర్పడిన వైరుధ్యాన్ని పరిష్కరిస్తున్నాడు.

అందరికీ, కూడూ, గుడ్డా అమర్చలేని సమాజం కుటుంబ భారాన్ని కుటుంబ పెద్ద మీద వెయ్యటంలో అర్థం లేదు. ఆడపిల్లలకు తిండీ, బట్టా కూడా సరిగా ఇవ్వలేని వాళ్ళ సమాజంలో అసంఖ్యాకు లుండగా కట్నాల ఆచారాన్ని అమలు కానిచ్చే వారంతా సంఘద్రోహులే కదా! శరీరం అమ్మకు బతకటం తప్ప అనేక మంది స్త్రీలకు మరొక బతుకుతెరువు లేకుండా పోయిన సామాజిక వ్యవస్థలో సెక్స్‌కి విలువ ఏముంటుంది? పిల్లలకు తిండి పెట్టలేక వాళ్లను నూతిలోకి తోసి తానుకూడా దూకిన స్త్రీ సినిమాలలో మాత్రమే జనం దృష్టిని ఆకర్షించటం ఏమిటి? ఆదిమ సమాజాలు అలాంటి సంఘటనలకు అవకాశం ఇచ్చాయా? ఒకే పాలన కింద, న్యాయచట్టం కింద ఉన్న సమాజంలో వొక వర్గంవాళ్ళు ఇంకో వర్గం వాళ్ళని చిత్రహింసలూ, సజీవ దహనాలూ జరిపినప్పుడు విచారణ కూడా లేకపోతే అది నిజంగా ఏకసమాజమా?

ఒక్క ముక్కలో చెప్పాలంటే మనం ఉంటున్నది ఏకసమాజం కాదు. అది ఏక సమాజం అయ్యే విధానమే భావి సమాజానికి బాట.

MEDICO 1970-71

# మనపూర్వులు

మన సినిమాలలోనూ, నాటకాలలోనూ పురాణ కాలపు పాత్రలను చాలా గొప్పగా, అత్యంత నాగరికంగా చూపుతారు. ఇంద్రుడికి మణిమయ కిరీటమూ, రత్నాభరణాలూ, పట్టుబట్టలూ కట్టబెడతారు గడ్డమూ, మీసాలూనున్నగాగొరిగి ఉంటాయి. జుట్టు చక్కని విగ్గులాగుంటుంది.

ఇంద్రుడే కాదు, విష్ణువూ, శివుడూ, దిక్పాలకులూ, మానవ లోకానికి సంబంధించిన రాజులూ, మహారాజులూ, వారి భార్యలూ కూడా చాలా నాగరికంగా

చూపబడతారు. మనం అభ్యంతరం చెప్పం

ఒక్క ముక్కలో చెప్పాలంటే మనం యీ పురాణ వ్యక్తులను గురించి వాస్తవిక దృష్టిగాని, విమర్శనాదృష్టిగాని ఉపయోగించం.

ఇంద్రుడి కాలంలో మంగలి కత్తులున్నాయా? ఇంద్రుడి కాలం ఏదో మనకు కొంచెంగా నన్నాతెలిస్తే అతనికి క్షౌరసాధనాలుండే అవకాశం లేదని ఒప్పుకోవాలనిపిస్తుంది ఇంద్రుడి కున్న ఉత్తమోత్తమ ఆయుధం దధీచి వెన్నెముక అనీ అగ్నికుండాలలో కాల్చిన హవిస్సులు దేవతల ఆహారమనీ మనకు తెలుసు. అలాంటి ఆయుధాలను ఉపయోగించేవారు, అలా ఆహారాన్ని తినే వాళ్ళూ చాలా వెనుకబడిన జాతుల వాళ్ళని మనకు తెలుసును. కాని ఈ రెండూ మనసులో మనకు కలగవు.

అలాగే శివుడు గజచర్మం బట్టగా కట్టుకున్నాడన్నా, ద్రౌపదీ స్వయంవరం సమయంలో కృష్ణద్వైపాయనుడు నల్లజింకచర్మం ధరించి వచ్చాడన్నా, మరొకరు పులితోలు ధరించారన్నా వాళ్ళు చాలా అనాగరిక స్థితిలో ఉన్నారేమోనని మనకు తట్టదు

మన సామాన్య ప్రజలు ఈ విషయాలను గురించి ఎంత విమర్శనారహితంగా ఉన్నారంటే, అరణ్యంలో రామలక్ష్మణులు అడవిపందులను కొట్టుకుతిన్నారన్నా, రావణుడు సీతను తన ఒడిలో పెట్టుకుని తీసుకుపోయాడన్నా, సీత గంగకు కల్లుపోస్తానని మొక్కుకున్నదన్నా, కుంతీదేవి తన కొడుకులను యముడికీ, వాయుదేవుడికీ, ఇంద్రుడికీ కన్నదన్నా, ఇవన్నీ నిరీశ్వర వాదుల అభూతకల్పనలు అనే దశలో ఉన్నారు. మన ప్రాచీన ఋషులు మాంసభక్షకులనీ, వాళ్ళు ఆవులను సైతం కోసుకుతిన్నారనీ, నరభక్షకుల ఉదాహరణలు పురాణాలలోఉన్నాయనీ, వేదకాలంలో ఈనాటి వివాహ వ్యవస్థ లేదనీ, ఆశ్రమాలలో స్త్రీ పురుషులు విచక్షణా రహితంగా కామసుఖాలు అనుభవించేవాళ్లనీ చెబితే మనని చంపినంతపని చేసే వాళ్లున్నారు.

గతించిన యుగాలను గురించి వాస్తవిక దృష్టితో ఆలోచించలేకపోవటం మనకు అనాదిగా వస్తున్నది. మనకే కాదు, ప్రపంచంలో ఉన్న ప్రతిజాతికూడా తమ ఆది పురుషులను దేవతలు అంటారని చెప్పవచ్చును. మన ఆర్యబ్రాహ్మణులందరూ బ్రహ్మనుంచే పుట్టారు ఆదిక్షత్రియులు సూర్యుడి నుంచీ, చంద్రుడి నుంచీ పుట్టారు. ఈజిప్ట్‌వారు ''రా'' (సూర్యుడి) నుంచీ పుట్టారు. చీనావాళ్ళు, జపాను వాళ్లకూడా భూమికి దిగివచ్చిన దేవతల సంతతివాళ్లే.

ఇంతేకాదు, యుగాలు గడుస్తున్న కొద్దీ మనకోజాతీ, ధర్మమూ, శక్తియుక్తులూ క్షీణదశకు వస్తున్నాయనే ఉద్దేశం చాలా జాతులలో ప్రబలిపోయింది. ''గతకాలముమేలు వచ్చుకాలము కంటెన్'' అనేది ఒక మత విశ్వాసంగా వ్యాప్తి చెందింది.

ఈ విశ్వాసానికి ఆధారం కనబడదు. ఉన్న ఆధారాలు ఏమాత్రమూ విశ్వసనీయమైనవి కావు. దశరధుడు 64 వేల ఏళ్ళు బ్రతికాట్ట రాముడు ఒక్క బాణం

వేయబోతే సముద్రం దారి ఇచ్చిందట! అర్జునుడు పాశుపతాస్త్రం ప్రయోగిస్తే అది హైడ్రోజన్ బాంబు తాతగా విధ్వంసం చేసిందట. కుబేరుడు పుష్పకవిమానంలో తిరిగేవాడట. మన మునులు శపిస్తే శాపం సూటిగా తగిలేదట. ఇటువంటి కల్పనలను నమ్మటం వల్ల ఈనాడు మనిషి సాధించిన దానికన్నాగొప్పవి '' ఆనాడే'' మన పూర్వులు సాధించారన్న భ్రమ మనకు కలుగుతుంది దీనికి సగం కారణం మన జనసామాన్యానికి శాస్త్రీయ దృక్పథం ఏమీ లేకపోవటం. రామలక్ష్మణుల కన్నా వానరులు వెనుకబడినవారని చూపటానికి వాల్మీకి వారిచేత చెట్లతోనూ, రాళ్ళతోనూ ముష్టితోనూ యుద్ధం చేయించాడు. కాని రాముడు ఉపయోగించినవేమిటి ? విల్లు, బాణాలే ఈనాడు వాటిని అనాగరికులు తప్ప ఎవరూ ఉపయోగించరు. రాముడు కొన్ని అస్త్రాలు కూడా ఉపయోగించాడన్నారు. కాని ఈ అస్త్రాలేమిటి? అస్త్రాలు తెలిసినవాడు వాటితోనే యుద్ధం చెయ్యక, మామూలు బాణాలు ఎందుకు ప్రయోగించాడు?

మన పురాణాలలో యుద్ధ వర్ణనల కన్న అభూత కల్పనలు మనం ఊహించలేం కృష్ణుడు నరకాసురుడితో యుద్ధంచేసి, మూర్ఛపోయి, కొంతసేపు సత్యభామను యుద్ధం చెయ్యనిచ్చి చివరకు చక్రం ప్రయోగించి నరకుడు తల నరికేస్తాడు. ముందే చక్రం ఉపయోగించటానికి అభ్యంతరం ఏమిటి? మామూలు యుద్ధం చేసి కృష్ణుడు చచ్చి బతకినంతపని ఎందుకు జరిగినట్టు? భారతయుద్ధం నిండా ఇలాంటి అవకతవకలున్నాయి.

వీటిని నమ్మటం వల్ల మనకు ఏ కించిత్తు ప్రయోజనం ఉన్నా పోనీ నమ్ముదామను కుందాము. కాని ఏ ప్రయోజనమూ లేదు. మన పూర్వీకులు, ఆటవికులూ, బర్బరులూ క్రమంగా నాగరితను అలవరచుకున్న వారు అన్నది తెలుసుకోలేని కారణం చేత మనకి ఒక విధమైన జాతీయ ఆత్మవిశ్వాసం పట్టుకున్నది. దాని నుంచి బయటపడాలంటే మన పూర్వీకులను గురించి శాస్త్రీయంగా ఆలోచించటమూ నిజం తెలుసుకొనటమూ అవసరం.

ఇందువల్ల కలిగే ప్రధాన లాభం ఏమిటంటే సమాజంతోబాటు సమాజధర్మం ఎలా మార్పుచెందుతూ వచ్చిందో పాతకాలపు ధర్మాలు మనకు ఎందుకు పనికిరావో తెలుస్తుంది. పురోగమనం పేర మనని ఎవరన్నా వెనక్కు మళ్లించాలని చూస్తే మనం మోసపోము.

ఇలాంటి మోసాలు పూర్వ కాలంలోనే జరిగినట్లు ఆధారాలున్నాయి. పాండవులు అయిదుగురు ద్రౌపదిని పెళ్లిచేసుకునే నాటికి ఒక పురుషుడు చాలా మంది స్త్రీలను చేసుకునే ఆచారం అమలులో ఉన్నది గాని, ఒక స్త్రీ అనేక భర్తలను పెళ్లాడే ఆచారం పోయింది. అందుచేత ధర్మరాజు తామందరమూ ద్రౌపదినే చేసుకుంటామంటే ద్రుపదుడు విభ్రాంతుడయ్యాడు. కాని ధర్మరాజు, వ్యాసుడు కూడా ఆయనకు గత

కాలపు దృష్టాంతరాలు చెప్పి అలాంటి వివాహానికి ఒప్పించారు.

అదే విధంగా అంబికా, అంబాలికా వ్యాసుడికి ధృతరాష్ట్రుణ్ణీ, పాండురాజునూ కని చచ్చిపోయిన తమ భర్త వంశాన్ని నిలబెట్టటం ఆనాటికీ అక్రమమే. కాని స్త్రీ పారంపర్యం (మేట్రియార్కీ) అమలులో ఉన్నకాలంలో పిల్లలకు తల్లి వంశమే తప్ప తండ్రి వంశం అంటూ లేదు. ఈ దశ పురాణ కాలంలోనే కనిపిస్తుంది. కశ్యపుడంటూ ఒక వ్యక్తి ఉన్నాడన్నది కల్పన. కశ్యప ప్రజాపతి అన్నది ఒక గణం, తాబేలు ( కచ్ఛప ) గణం. అందులో ఉండే స్త్రీలు పిల్లలను కన్నారు. ఆ పిల్లలు తమ తల్లి పేర్లనే తమ పేర్లుగా పెట్టుకున్నారు. ఉదాహరణకు దితి సంతతి దైత్యులు, అదితి సంతతి ఆదిత్యులు, కద్రువ సంతతి కాద్రవేయులు, వినత సంతతి వైనతేయులు. భారతంలో చాలాగణాలున్నాయి. కీచకుడు అన్నది వ్యక్తి నామం కాదు. అతని గణంలో వారంతా కీచకులే. భారత యుద్ధంలో అర్జునుడు చాలా గణాలను సంహరించాడు వాటిపేర్లు యుద్ధపంచకంలో కనబడతాయి. భారతం నాటికి స్త్రీ పారంపర్యం పోయినా, భారతంలో ఆంబికేయుడు,కౌంతేయులు, గాంధారేయులు అన్న పదాల లాటివి విరివిగా ఉపయోగపడ్డాయి. చాణక్యుడు సహాయం చేయగా నందులను – అదీ ఒక గణమే – జయించిన చంద్రగుప్తుడిది మురపేర మౌర్య సంతతి అయింది. చంద్రగుప్తుడు కూడా గణ జీవితం నుంచి వచ్చిన వాడే ననటానికి సందేహం లేదు.

వేదకాలంనాడు అసంఖ్యాకమైన గణ సంకేతాలుండేవి. శౌనకులు కుక్క సంకేతంగలవారు. భారతం ఆరంభంలోనే ఒక 'కుక్క' యజ్ఞశాలలో ప్రవేశించిందని కొడతారు. ఆ 'కుక్క' వెళ్ళి తన తల్లితో మొరపెట్టుకుంటే ఆ 'కుక్క' తల్లి వచ్చి తన కొడుకును కొట్టిన వాళ్ళని నాలుగు ఝాడించడమే కాకుండా, శాపం లాంటిది కూడా పెడుతుంది. ఇక్కడ కుక్క అన్నది తోక ఆడించే కుక్క కావటం అసంభవం వాడొకశౌనకుడు; అయితే గణ జీవితంలో దిగబడిపోయినవారికి భారతకాలంనాటి యజ్ఞశాలలో ప్రవేశం లేకుండా పోయింది.

మాతంగులూ, ఇభ్యులూ ఏనుగు సంకేతం గల గణజీవులు భరద్వాజాల చిహ్నం అదేదో పక్షి. కౌశికులు దర్భజాతి. ఇలాగే అనేక 'క్షుద్ర' సంకేతాలు గల గణాలలో మన వేదకాలపు ఋషులు జీవించారు వాల్మీకి పుట్టజాతివాడు. మన గోత్రాలలో ఈ సంకేతాలు ఇంకా దిగబడి వున్నాయి. పిచ్చిక గుంటలవాళ్ళ శూద్రకుటుంబాలకు హీనమైన గోత్రాలు ఆపాదించారని అనుకునేవాళ్ళు. సద్బ్రాహ్మణ గోత్రాలు వాటికి ఏ విధంగానూ తీసిపోవు

మాతంగులు అన్నది అస్పృశ్యమైన జాతి అని ఈ మధ్య పెద్ద రాద్ధాంతం చేశారు. మొదట్లో గౌతములూ, కాశ్యపులూ, శౌనకులూ కూడా మాతంగుల వంటివాళ్ళే. వాళ్లకు కులాలంటూ లేవు. పార్వతి మాతంగ కన్య. కాని, సమాజం మార్పులు చెంది, కొత్త

ధర్మాలు అలవరచుకుని ముందుకు పోయిన మీదట, పాతకాలపు ఆటవిక బర్బర దశలో ఉండిపోయినవారు అస్పృశ్యులుగా మిగిలి పోయారు. కులాలన్నీ ఒక్కసారిగా రాలేదు ఒకేదశలో రాలేదు. ముందుకుపోయిన సమాజంలోకి ఆఖరున చేరినవారు 'వర్ణో నాస్తితు పంచమః' అన్న వారి చేతనే పంచములనిపించుకున్నారు మాతంగులు మొదటినుండి ఆర్యులకు అస్పృశ్యులన్నది శుద్ధ అబద్ధం

కాలక్రమాన ప్రాచీన సమాజాలు ఆధునిక సమాజాలుగా పరిణమించటానికి ఎలాంటి మార్పులు జరిగాయో ఊహించటానికి ఈనాడు ఆధారాలున్నాయి. వాటిని గురించి ముందు సంగ్రహంగా తెలుసుకుందాం.

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 10 4.1970*

# మానవ సమాజ పరిణామం

ప్రాచీన మానవులు తమ సమాజాన్ని ఎలా నిర్మించుకున్నారో, ఎలా జీవించారో మనకు ఏం తెలుసు? అది చరిత్రకు ముందుండిన స్థితి. ఆ స్థితిని గురించి మనకు రికార్డులు లేవు. మనకువేదాలూ, ఉపనిషత్తులూ, పురాణాలూ ఉన్నాయి. కాని అవి ఎంతవరకు నమ్మదగినవో మనకు తెలీదు. వాటి ఆధారం మీద మనకు నిజం తెలియకపోవచ్చు. వాటిని పూర్తిగా తోసివెయ్యలేకపోయినా, విశ్వసనీయమైన ఇతర ఆధారాలుంటేగాని మనం వాటిని నమ్మలేం.

వాటిలో ఒకటి ఆర్కియాలజీ – పురాతత్వపరిశోధన. దీన్నిగురించి మనకీనాడు బాగా తెలుసు. చరిత్రకు అందని అత్యంత ప్రాచీనమైన విషయాలు భూగర్భంలో దొరికాయి. నిక్షేపాల కోసమూ, ఖనిజాల కోసమూ భూమిని తవ్విన మానవులు అనేక రహస్యాలను తెలుసుకున్నారు. ఈనాడు ప్రపంచంలో ఎక్కడాలేని రకాల చెట్లుమండి నేలబొగ్గు ఏర్పడిందన్న విషయం బయటపడింది. అనేక వేల అడుగుల మంచు శాశ్వతంగా ఉంటున్నట్టు కనపడే దక్షిణ ధృవప్రాంతంలో ఒకప్పుడు ఇలాంటి చెట్లు ఉండినట్టు స్పష్టమయింది.

తవ్వకాలలో భూమి గతచరిత్ర బయటపడినట్లే, ప్రాచీన మానవుల అస్థిపంజరాలూ, వారి నివాసాలూ, పరికరాలూ మొదలైనవి బయటపడ్డాయి. మానవత్వం పూర్తిగా అలవడని నరవానరుల అస్థికలు దొరికాయి.

ఈ తవ్వకాల ద్వారా మానవచరిత్రను డేనిష్ ఆర్కియాజిస్టులు శిలాయుగం, కాంస్యయుగం, లోహయుగం అనే దశల కింద విభజించారు. అతి ప్రాచీన మానవులు తమ పనిముట్లనూ, ఆయుధాలనూ రాళ్ళతో తయారు చేసుకున్నారు. వారి జ్ఞానం

అభివృద్ధి చెందిన కొద్దీ రాయి స్థానాన్ని కంచు ఆక్రమించింది అటు తరువాత ఇనుము వారికి అధీనమయింది.

మానవ సమాజాల అజ్ఞాత చరిత్రను కొంతవరకు అవగాహన చేసుకోవటానికి మరొక పద్ధతికూడా ఉన్నది. అది చాలా క్లిష్టమైనది కాని, ఉపయుక్తమైనది.

ఈ యుగాన్ని మనం నాగరిక యుగమంటున్నాం లక్షల సంఖ్యలోనూ, దశ లక్షల సంఖ్యలోనూ జనం నివసించే నగరాలు ఈనాడున్నాయి. ఇలాంటి నగరాలు గత శతాబ్దాలలో ఉండటం సాధ్యం కాదు. ఈనాటి నాగరికతకు రైళ్లూ, విమానాలూ, రేడియో, విద్యుచ్ఛక్తి, అణుశక్తి, టెలివిజన్ మొదలైనవి సంకేతాలు; ఇతర గ్రహాలను ఫోటోలు తియ్యటమే గాక చంద్రుడి పైకి మానవులు దిగి, తిరిగి రావడం పరాకాష్ట.

అయితే ఈనాగరికతలో ప్రపంచ మానవులంతా జీవించడం లేదు. చెట్లకిందా, చెట్ల మీదా జీవించేవాళ్లూ, సంచార జీవితం గడిపేవాళ్లూ, కర్ర నాగళ్ళతో భూమిని గీరి విత్తులు చల్లే వాళ్లూ, విల్లు అంబులతో వేటాడి పొట్టపోసుకొనే వాళ్లూ, లిపిలేనివాళ్లూ, లిఖితసాహిత్యం లేనివాళ్లు, ప్రకృతిని పూజించేవారు, రైళ్లూ, విద్యుచ్ఛక్తి, రేడియో తెలియని వాళ్లూ ప్రపంచంలో అనేక ప్రాంతాలలో ఉన్నారు. అరణ్యాలలో నివసించే అటవిజాతులూ, కొండలలో నివసించే కొండజాతులూ, తండాలుగా నివసించే జాతులూ ఈనాడు కూడా అసంఖ్యాకంగా ఉన్నాయి. అనాగరికత వివిధ దశలలో నివసించే వారందరూ మన దేశంలోనే మనకు కనిపిస్తారు.

ఒకప్పుడు మానవులంతా నాగరికులేననీ, అనాగరికత భ్రష్టమైపోగా కొన్ని ప్రాంతాలవారు అనాగరిక, ఆటవిక జీవితాలు గడిపే స్థితికి దిగజారిపోయారని ఒక సిద్ధాంతం వున్నది. దీనికి సూది మొనపాటి ఆధారంకూడా లేదు.

తవ్వకాలు చేసేటప్పుడు భూమి పొరలలో ప్రాచీన మానవుల సంస్కృతీ శైధిల్యాలు దొరుకుతాయి. ఏ పొర ఎంతకాలం క్రితానిదో అంచనా కట్టటానికి తగిన శాస్త్రవిజ్ఞానం ఈనాడు మనకున్నది శిలాపరికరాలు దొరికే పొరలే ఎప్పుడూ అత్యంత ప్రాచీనంగా వుంటున్నాయి. అలాంటి పొరల దిగువన ట్రాన్సిస్టర్ రేడియో సెట్లు దొరకటం ఏనాడూ జరగలేదు, జరగదు. అలాగే నేల బొగ్గు పొరల మధ్యను మానవుడి అస్థికలు దొరకవు. దొరికే అవకాశంలేదు. - ఏమంటే భూమి మీద మానవుడు అవతరించకపూర్వమే ఆ పొరలు ఏర్పడ్డాయి.

ప్రపంచమంతటా కూడా మానవుడు ఆటవిక దశనుంచి నాగరికతకేసి ప్రయాణం చేసినట్టు కచ్చితంగా చెప్పవచ్చు. అయితే ఈ ప్రయాణం సర్వత్రా విజయవంతం కాలేదు. వాతావరణం అనుకూలించకనో, పరిస్థితులు వ్యతిరేకించో కొన్ని జాతులు ఏదో ఒక

అనాగరిక దశలో అలాగే నిలిచిపోయాయి. వీటిని పరిశీలించినట్టయితే పరిణత మానవ సమాజాల ప్రాచీన దశలు చాలా వరకు అర్థమవుతాయి

మానవ జాతులకు సంబంధించిన విజ్ఞాన శాస్త్రాన్ని 'ఎథ్నాలజి' అంటారు

కిందటి శతాబ్దిలో ఎథ్నాలజిస్టులు మానవజాతుల పరిణామాలలో మూడు దశలున్నట్టు నిర్ణయించారు. 1 ఆటవికదశ (Savegery) 2. అనాగరిక దశ (బర్బర) (Barbarism) 3. నాగరిక దశ (Civilisation)

మానవులు ఆటవిక దశ నుంచి నాగరిక దశకు రావడ మనేది గొప్ప సంఘర్షణతో కూడుకుని ఉండినది. ఈ పరిణామం సమాజంలోని వివాహ వ్యవస్థలోనూ, కుటుంబ స్వరూపంలోనూ, మతాచారాలలోనూ, ఆస్తి హక్కుల లోనూ కలిగిన మార్పుల ద్వారా వ్యక్తమవుతూ వచ్చింది.

ఈదశను గురించీ, వాటిలో కలిగిన మార్పులను గురించీ జగత్ప్రసిద్ధంగా పరిశోధనలు చేసినవాడు ఎల్.హెచ్.మోర్గన్. ఆయన దాదాపు నూరేళ్ళ క్రితం Ancient Society (ప్రాచీన సమాజం) అనే పుస్తకం వ్రాసి, మానవ సమాజ పరిణామ దశలను గురించి విపులంగా చర్చించాడు. ఆయన చెప్పిన విషయాల ఆధారంతో ఈనాటి మానవ జాతులు ఏపరిణామ దశలో వున్నవో తెలుసుకొనటమే కాకుండా, మన ప్రాచీనులను గురించి మనకు తెలిసినమట్టుకు వారు ఎప్పుడెప్పుడు ఏయే దశలు గడిచినదీ చాలా వరకు అంచనా కట్టవచ్చు.

మోర్గన్ మానవజాతుల ఆటవిక దశనూ, అనాగరిక దశనూ మూడేసి విదశలుగా విభజించాడు. ఈ ఆరు విదశలూ గడిచాక నాగరికత ఆరంభమయింది.

1. ఆటవిక దశ తొలి విదశలో మానవులు తావుండిన ప్రాంతాలకు కట్టుబడి,పప్పులూ, కాయలూ ఏరుకుతింటూ, భాషను రూపొందించుకున్నారు. ఇది మానవుడి బాల్యదశ. ఈ స్థితిలో వున్న మానవజాతులేవీ ఈనాడు ప్రపంచంలో లేవు.

2. చేపలు పట్టటమూ, నిప్పు చెయ్యటమూ స్వాధీనం కావటంతో ఈ విదశ ముగిసింది. తరువాత ప్రారంభమయిన విదశలో ఆటవిక జాతులకు చలనం వచ్చింది. అవి తమ స్వస్థలాలు విడిచి సంచారం ప్రారంభించాయి ఈ చలనం ప్రపంచంలోని అనేక ప్రాంతాలకు సాగింది. తొలిగా నాగరికుల కళ్ళబడినప్పుడే ఆస్ట్రేలియా ఆదిమజాతుల వారూ, ఫొనీషియను జాతులలో అధిక సంఖ్యాకులూ ఈ విదశలో వున్నారట.

3. విల్లూ, బాణాలు సృష్టించుకోవడంతో ఆటవిక దశ ఆఖరు విదశ ఆరంభమయింది హడ్సన్‌బే తీరంలోనూ, కొలంబియా లోయలోనూ, ఉత్తర దక్షిణ

అమెరికా తీరాలలోనూ ఈదశలో వున్న జాతులు మొదట కనుకొనబడ్డాయి. మట్టి పాత్రల సృష్టితో ఆటవిక దశ ముగిసింది.

4 అటు తరువాత అనాగరిక దశ ఆరంభమయింది కుండలు చెయ్యటం ఆటవిక దశ ముగిసిందనటానికి పెద్ద కొండగుర్తు అనీ, కుండలు చేయటం చేతకాని జాతులన్నీ ఆటవిక దశనుంచి బయటపడవచ్చుననీ మోర్గన్ చెబుతాడు. ఏజాతి గాని తనంతట తానే కుండలు చెయ్యటం కనిపెట్టిందా లేక అభివృద్ది చెందిన జాతుల నుంచి నేర్చుకున్నదా అన్నది అంత ముఖ్యంకాదు. ఎందుచేతనంటే, కుండలు గ్రామీణ జీవితానికి చిహ్నం. అంతేగాక, దానిని బట్టి చిల్లర పరికరాల నిర్మాణంలో చాలా అభివృద్ధి కూడా కలిగిందన్న మాట. రాతి పనిముట్లు గల నేల పొరలలో కుండ పెంకులు దొరకకపోవటం సర్వసాధారణం ఆటవికదశలో ఉండిన మానవులకు ఆ విద్య రాలేదన్న మాట. కుండలు చెయ్యటం నేర్వక ముందే అనాగరికులు గ్రామాలలో జీవించటమూ, ఆహారాన్ని అదుపులోకి తెచ్చుకోవటమూ, కొయ్యపాత్రలూ, బుట్టలూ తయారు చేయటమూ, చెట్టు బెండు నారనుంచి దారం తయారు చెయ్యటమూ, విల్లంబులు ఉపయోగించటమూ నేర్చారు. అమెరికాలోని రెడిండియన్ తెగలా (Iroguois, Choctas, Cherhus) ఈ దశలో ఉండేవారు.

5. అనాగరిక దశ తాలూకు రెండవ (మధ్య) విదశ పశువుల పెంపకంతో ప్రారంభమయింది. న్యూమెక్సికో, మధ్య అమెరికా, పెరూ ప్రాంతాలలో నివసించిన ఇండియన్ గ్రామవాస జాతులు (Village Indians) అజ్టెక్‌లూ, జూనియన్‌లూ, చొలులాన్ లూ ఈ దశకు చెందిన వారు. వీరు తయారు చేసిన పాత్రల వైవిధ్యమూ, అందమూ ఈనాటి నాగరికులను కూడా ఆశ్చర్యచకితులను చేస్తున్నది.

6 అనాగరికత అత్యున్నత దశలో ఇనుము కనిపెట్టటంతో ఆరంభమయింది. హోమరు పురాణాలలో చిత్రించిన నాటి గ్రీకు తెగలూ, రోమ్ నగర నిర్మాణానికి కాస్త ముందుండిన ఇటాలియన్ జాతులూ, సీజరునాడు ఉండిన జర్మను తెగలూ ఈ దశకు చెందిన వాళ్లు అక్షర లిపి, సాహిత్య రచనా ఆరంభం కావటంతో అనాగరిక దశ ముగిసి నాగరికత ఆరంభమయింది.

ఈ లెక్క ప్రకారం వేదయుగం అనాగరిక యుగపు విదశలలోనే చేరుతుంది. వేదాలు లిఖితం కావు.

కుండలు ఆటవిక దశ అంతమైనట్లు కొండగుర్తు అయినట్లే, లిపి లేఖనాలు అనాగరిక దశ అంతమైనట్టు కొండగుర్తని మోర్గన్ ఉద్దేశం.

మానవ సమాజం పరిణతి చెందటానికి దోహదం చేసిన వాటిలో ఆహారోత్పత్తి

విధానం ముఖ్యమయినది ఆదిమ మానవులు ఇతర జంతువులలాగే దొరికిన ఆహారం తిన్నారు. కాని ఆహారోత్పత్తి సాధనాలను పూర్తిగా హస్తగతం చేసుకోవటం ద్వారానే మానవజాతి సంఖ్య అపారంగా పెరగటం సాధ్యమయింది

ఆహారం ఏరుకునే దశలో మానవులు ఉష్ణ సమశీతోష్ణ మండలాలనే అంటి పెట్టుకున్నారు. ఎందుకంటే అక్కడ ప్రకృతి సిద్ధమైన ఆహారం ఉన్నది. చేపలను ఆహారంగా ఉపయోగించటంలో ఆటవిక మానవులు ఒక మెట్టు పైకి వచ్చారు చేపలు సరస్సులలోనూ, నదులలోనూ, సముద్రంలోనూ విరివిగా దొరుకుతాయి. చేపలను ఆహారంగా ఉపయోగించాలంటే నిప్పు తప్పనిసరి. ఈ ఆహారం కోసం మానవులు నదుల వెంట, సరస్తీరాల, సముద్రతీరాల వెంబడి సంచారం ప్రారంభించారు వీరి రాతి ఉపకరణాలు అన్ని ఖండాలలోనూ విరివిగా దొరకడమే వారి సంచారానికీ వ్యాప్తికీ నిదర్శనం.

ఈ దశలో మానవజాతి చాలా దీర్ఘకాలం ఉండినట్లు కనిపిస్తుంది విల్లు బాణాలు సృష్టి అయేదాకా వేటాడి ఆహారం సంపాదించుకోవటమన్నది మానవులకు ఏమంత ప్రయోజనకారిగా లేదు. విల్లు బాణాలతో మానవులు ఆటవిక దశ ఆఖరు దశను చేరుకున్నారు. ఇది ఒక గొప్ప పరిణామం.

చేపల ఆహారం లభ్యంకాని ప్రాంతాలలో నరభక్షణ విరివిగా సాగింది. అనేక ప్రాచీన జాతులు నరభక్షణ చేశాయి. అలా చేసిన జాతులను మనం రాక్షసగణాల కింత జమకడతాం కాని, ఎప్పుడో ఒకప్పుడు అన్ని జాతుల పూర్వీకులూ నరభక్షణ చేసినట్లే కనబడుతుంది. వాతాపి, ఇల్వలుల కథలలో నరభక్షణ గోప్యంగా ఉన్నది. కథా సరిత్సాగరం కథలలో శ్మశానాలలో 'మహామాంసం' అని నరమాంసం అమ్మినట్లు చెప్పి ఉన్నది. జాతకకథలలో కూడా నరభక్షణ చెప్పి ఉన్నది. ఈనాడు కూడా ప్రపంచంలో నరభక్షకులున్నారు. వ్యవసాయంలో అపారమైన అభివృద్ధి సాధించినవారికి నరభక్షణ అన్నది మహాదారుణమైన ఆటవిక స్థితిని సూచిస్తుంది. అలాటి స్థితి కొన్ని జాతులకు ఒకప్పుడు ఉండేది. ఆహారోత్పత్తితో ఎంతో పురోగ మనం సాధించిన మీదట ఆ దశ తొలగిపోవటం జరిగింది.

వ్యవసాయం ప్రపంచంలోని అన్ని జాతులకు ఒకేసారి రానట్టు కనబడుతోంది. అమెరికాలోని ఆదిమజాతులు ఆటవిక దశనుండి బయట పడగానే ఆహార ధాన్యాదికాలను పెంచటం నేర్చారు. కాని పూర్వార్ధగోళంలో మానవజాతులు అనాగరికదశ మధ్యని దశ పూర్తికాబోతుండగా మాత్రమే వ్యవసాయం అలవరచు కున్నారు.

ఆర్యజాతులవారు పశువుల పెంపకం ముందు నేర్చి అటు తరువాత వ్యవసాయం నేర్చినట్టు తెలుస్తుంది. సంస్కృతం, గ్రీకు, లాటిన్ భాషలలో కొన్ని పశువుల పేర్లు ఒకదాన్ని ఒకటి పోలి ఉన్నాయి. కాని ధాన్యాల పేర్లలో పోలికలు లేవు. వేదాలలో పశువుకుండే ప్రాముఖ్యం ధాన్యాలకు లేదట.

పురాణయుగంలో కూడా గోధనం చాలా ప్రాముఖ్యాన్ని వహించింది. గోవులే ముఖ్య సంపద గోవుల కోసం యుద్ధాలు జరిగాయి. ఈనాడు డబ్బుతో చెయ్యగల పనులు ఆనాడు గోవులతో చేశారు. పశువుల పెంపకంతో కొత్త జీవిత విధానం ఏర్పడింది. గోవుల మందలుండటానికి కొత్తరకం క్షేత్రాలు ఆక్రమించటం జరిగింది. ఆ విధంగా వ్రాతాలు, వ్రాత్య జీవితాలు ఏర్పడ్డాయి.

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 17-4-1970*

# వేదాలలో ఏమున్నది - I

''దాచి పెట్టిన జ్ఞానం నిరుపయోగం కావటమే గాక ప్రజలను పీడించటానికి సాధనమవుతుంది'' అని తెలిసిన వాళ్లు చెబుతారు.

వేదాల విషయంలో ఇదే జరిగినట్లు కనబడుతుంది. వేదాలను బ్రాహ్మణులు గుత్తకు తీసుకొని వేదాధ్యయనానికి నిషేధాలు కల్పించి, అందులో ఏమున్నదీ ఎవరికీ తెలియకుండా చేశారు ఈ పరిస్థితిని ఆధారం చేసుకుని కొందరు ముందుకు పోవటమంటే భయమూ, అసహ్యమూ కలవాళ్లు, వేదాల్లో లేనిది లేదని ప్రజలను నమ్మించజూశారు.

వేదాల్లో ఏమున్నది అన్న విషయం గురించి మనకు తెలియజెప్పినవాళ్లు చాలావరకు పాశ్చాత్యులు. వాళ్లు సంస్కృతం చదువుకుని వేదాలు పఠించి, అందులో ఏమున్నదీ మనకు తెలియపరచవలసిన దుస్థితి కలిగింది.

ఇక్కడ ఋగ్వేదం గురించీ, ఆ కాలపు ఆర్యులను గురించీ చెప్పే విషయాలు Stuart Piggot అనే ఆయన తెలిపినవి.

## ఇండో యూరోపియన్ భాషలు - తెగలు

ఋగ్వేదంలోని సంస్కృత భాషకు లాటిన్ గ్రీక్ భాషలతో దగ్గిర సంబంధం ఉన్న సంగతీ పదజాలంలోనూ, వ్యాకరణంలోనూ ఈ మూడు భాషలకూ పోలికలున్న సంగతి ఈనాడు అందరికీ తెలిసినదే. ఈ మూడు భాషలకూ మూలమైన మృతభాష ఏదో ఉండి ఉంటుందనీ, వీటిని ఇండో యూరోపియన్ భాషలనాలనీ పండితులు ఏనాడో నిర్ణయించారు.

ఇండో - యూరోపియన్ తెగలు తమ స్వస్థలం నుంచి అనేక దిక్కులకు

వలసపోయాయి. కాని వాటికి ఒకప్పుడు ఉమ్మడిగా వుండిన లక్షణాలు కొన్ని ఈనాటికీ కానవస్తాయి. ఉదాహరణకు మన ప్రాచీన గ్రంధాలలో చెప్పిన అశ్వమేధం లాంటిది అల్టాయ్ తుర్కులు ఈనాడు కూడా ఆచరిస్తున్నారు. ఈ అశ్వమేధం క్రీస్తు శకం 12 వ శతాబ్దం దాకా ఐర్లాండులో ఆచారంగా వుండేది

ఇంతేకాదు, మన ప్రాచీన సంస్కృత గ్రంధాలలో చిత్రించిన భారతీయ జీవిత విధానమూ, యుద్ధాలు చేసేతీరు ఐరిష్ వీరగాథలలో కానవస్తాయి

వేదకాలపు అర్యులు మన దేశానికి వలస వచ్చారన్న విషయంలో వివాదం లేదు గాని, వారు ( లేక వారి పూర్వులు) మొదట ఎక్కడి వారన్న దాన్ని గురించి భిన్నమైన అభిప్రాయాలున్నాయి. వారు మొదట ఉత్తర యూరపు మైదాన భూములనుంచి వచ్చారని ఒక సిద్ధాంతం క్రీస్తుపూర్వం 6 వేల ఏళ్ళ క్రితం, అంటే ఇప్పటికి 3 వేల ఏళ్ళ క్రితం తొలి ఆర్యులు ఉత్తరధృవ ప్రాంతంలో వుండేవారని మరొక సిద్ధాంతం ( తిలక్ వాదం). అయితే భాషావేత్తలూ, పురాతత్త్వవేత్తలూ చెప్పేదేమంటే, ఆర్యుల తొలి జన్మభూమి డాన్యూబ్ నదికీ ఓక్సస్ నదికీ మధ్యప్రాంతంలో ఎక్కడో వుండేదని, అందులోనూ కొందరు డాన్యూబ్‌కు దగ్గిరలో హంగరీ మైదాన ప్రాంతాన్ని చెబుతారు మరికొందరు మధ్య ఆసియాలో ఓక్సస్ ప్రాంతాన్ని చెబుతారు. ఇండో యూరపియన్ భాషలు పరిణతి చెందినది దక్షిణ రష్యా మైదానాలలో ఆదిగా వ్యవసాయం సాగించిన వారిద్వారా అన్నది విశ్వసనీయంగా కనబడుతుంది. ఈ ప్రాంతం కాస్పియన్ సముద్రానికి తూర్పుగా వుండేది.

క్రీస్తుపూర్వం 2000 నాటికి, దక్షిణ రష్యాకు తుర్కిస్తాన్‌కూ మధ్య నివసించిన తెగలు సాంస్కృతిక సంబంధాలు కలిగి, ఒక విధమైన సమాఖ్యగా తయారయినట్టు కనిపిస్తుంది. వారి భాషలు ఇండో యూరోపియన్ భాషలే. క్రీస్తు పూర్వం 14,15 శతాబ్దాలలో మతాన్నీ పాలకుల పేర్లు తరచుగా ఇండో యూరోపియన్ పేర్లుగా ఉండేవి. వారు ఈజిప్ట్‌తోనూ, ఆసియా మైనర్ లోని హిటైట్ రాజ్యంతోనూ జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలలో ఇవి కానవస్తాయి.

## హిటైట్ రాజ్యం

ఈ రాజకీయ లేఖనాలలో ముఖ్యమైనది క్రీస్తుపూర్వం 1380 ప్రాంతంలో దుప్రత్త అనే మతాన్నీ రాజు కొడుకు మత్తివజ అనేవాడు హిటైట్ రాజయిన సుబిటిలియుమూ అనే వాడు చేసుకున్న సంధి పత్రంలో తన దేవతలయిన ఇంద్ర, మిత్ర, వరుణ, నాసత్యుల మీద ప్రమాణాలు చేశాడు. ఇంచుమించు ఇదే కాలంలో కిక్కులి అనే మతాన్నీ, వాడు రథచోదకం మీద రాసిన ఒక గ్రంథంలో '' ఐక వర్తన్న, తెరవర్తన్న, పంజవర్తన్న, మత్తవర్తన్న,' అనే మాటలు వాడాడు. ఇవి ఏకవర్తనం, త్రివర్తనం, పంచవర్తనం, సప్తవర్తనం అనే సంస్కృత పదాలకు సమపదాలు. క్రీస్తుపూర్వం 14 శతాబ్దాల క్రితం

మతానికీ, భాషకూ, సంస్కృతానికీ పెద్ద వ్యత్యాసాలు ఏర్పడినట్టు కనపడదు.

## అవేస్తా

మతాన్ని దాటి వస్తే పర్షియాలో 'అవెస్తా', మన దేశంలో ఋగ్వేదమూ ఈ కాలానికి చెందినవిగా కనబడతాయి అయితే ఇది నిర్ణయించటానికి బాహ్యమైన ఆధారాలు లేవు ఋగ్వేదం లోపల కనిపించే భౌతిక జీవితాల లక్షణాలను పురాతత్వ శాస్త్ర పరిశోధనలతో సరిచూసినట్లయితే, అది క్రీస్తుపూర్వం సహస్రాబ్ది మధ్య ప్రాంతానికి చెందినదని స్పష్టమవుతుంది.

హారప్పా నాగరికత అంతరించిన తరువాత తిరిగి క్రీస్తుపూర్వం మూడో శతాబ్ది మధ్య దాకా శిలాలేఖనాలు గాని, గ్రంథాలు గాని లేవు. గురుశిష్య పరంపరగా ముఖస్థమై వుంటూవచ్చిన సాహిత్యం మాత్రమే ఉన్నది. ఇలా ముఖస్థమై తరతరాలుగా నిలిచివున్న హిందూ మత గ్రంథాలు ఇంకా అనేకం ఉన్నప్పటికీ అదే ఆది దాని తరువాత క్రమంగా వచ్చినవి సామవేదమూ, యజుర్వేదమూ, బ్రాహ్మణాలూ, ఉపనిషత్తులూ, సూత్రాలూ వగైరా

బుద్ధుడు ప్రవచించిన ధర్మం చాలా వరకు ఉపనిషత్తుల తాత్విక చింతన మీద ఆధారపడినదే గనకనూ, బుద్ధ నిర్యాణం క్రీస్తు పూర్వం సుమారు 500 సంవత్సరాల క్రితం ఆమోదించబడుతున్నది గనుకనూ, క్రీస్తుపూర్వం ఆరవ శతాబ్దికి ఉపనిషత్తులున్న వనుకోవాలి.

## ఋగ్వేదం నేటికీ నిర్దుష్టం

ఋగ్వేద రచన క్రీ.పూ. 1500 – 1400 ప్రాంతంలో జరిగినదన్న అంచనాను పురాతత్వ శాస్త్రం బలపరుస్తున్నది ఋగ్వేద రచన చేసిన వారి భౌతిక సంస్కృతిక పురాతత్వ పరిశోధనల ద్వారా ఆనాటి ఆసియా నగర పరిసర సంస్కృతికీ వైరుధ్యం ఏమీలేదు. ఆ ప్రాంతాలలోనే తిలి ఇండో - యూరోపియనుల వలసలు ఏర్పడినవి.పురాతత్వ పరిశోధనలు మరొక విషయాన్ని కూడా స్పష్టం చేస్తున్నాయి ఋగ్వేదం విశ్వసనీయమైన రచన. అధ్యయనం చేసినవారు దానిలో ఒక్క పొల్లు వచ్చినా మహాపాపమని నమ్మిన కారణంచేత, అది ఇన్ని శతాబ్దాలూ నిర్దుష్టంగా కాపాడబడింది. రామాయణ భారతాలకు పట్టిన దుర్గతి వేదాలకు పట్టలేదు.

ఋగ్వేదంలో 10,500 పైచిలుకు ఋక్కులున్నాయి కొన్ని కొన్ని ఋక్కులను కలిపి ఒక సూక్తం అన్నారు. సూక్తాలు 1000కి పైగా ఉన్నాయి శౌనకుడు ఋగ్వేదాన్ని 10 మండలాలుగా విభజించాడు.

ఋక్కులలో సూక్తాలలో కొన్ని స్తోత్రాలు కొన్ని ప్రార్థనలు. కొన్ని మంత్రాలు, కొన్ని ఉత్త పాటలు, '' ఒకప్పుడు వాస్తవమూ, విశ్వసనీయమూ, అద్భుతమూ అయినవి కాని తరచు చపలంగానూ, పామరంగానూ, దురవహంగానూ కూడానూ ఉంటాయి''

అన్నాడు మాక్స్‌ముల్లర్.

ఋగ్వేదంలోని భాష ఆడంబరంగానూ, పాండిత్య ప్రకర్షతో కూడినది గానూ ఉండి తరచు చాలా క్లిష్టంగా కూడా ఉంటుంది. ఋగ్వేద ఋషులు సుమారు 2000 మంది ఉండేవారట. వారు ఎంతో శ్రద్ధగా ఋగ్వేద రచనచేశారు. వారు తాము ఆర్యులమనీ, కొత్త ప్రదేశాలను జయించామని చెప్పుకున్నారు. ఋగ్వేద రచన నాటికి వారి సంస్కృతి పరిణతి చెంది ఉన్నది. ఋగ్వేద భాష త్వరలోనే చాలా మారి పోవడం చేత మధ్యయుగాల నాటికి విస్తృతమైన భాష్యాలు తయారు చేయవలసిన పరిస్థితి ఏర్పడింది.

## ఆర్యులే బర్బరులు

వేద వ్యాఖ్యాతలు ఆర్యులు ఈ దేశంలోకి దండువచ్చి జయించినది కిరాతక దశలో ఉన్న అనాగరికులనని, వారి విశ్వాసాలు వేద తత్త్వంలో బహు స్వల్పంగా ప్రతిబింబించాయనీ భావించారు. ఈ వ్యాఖ్యాతల కాలానికి హరప్పా నాగరికత బయటపడలేదు కాని పంజాబ్ ప్రాంతానికి వచ్చే నాటికి ఆర్యులే బర్బరులనీ, వారు వచ్చిన ప్రదేశంలో ఒక ఉన్నత నాగరికతా, ఒక సామ్రాజ్యమూ చిరస్థాయిగా ఉన్నట్లు పురాతత్వ పరిశోధనలు స్పష్టం చేశాయి. ఋగ్వేదంలో సహజంగా ఆర్యుల దృక్పథమే వ్యక్తమయింది శత్రువులు తృణీకార భావంతో చూడబడ్డారు. మిగిలిన రచనల కన్న ఋగ్వేదం తొలి ఆర్యుల వాస్తవ పరిస్థితిని నిష్కల్మషంగా చూపుతుంది. అటు తరువాత ఆర్య సంస్కృతి మీద హరప్పా నాగరికత ప్రభావం హెచ్చింది.

కాని ఋగ్వేదంనుంచి ఆర్యుల భౌతిక సంస్కృతిని తెలుసుకొనటం తేలిక కాదు. వేద వర్ణనలలో వాస్తవిక చిత్రణ అకస్మాత్తుగా అలంకారికమైపోతుంది. ఆర్య యోధుడి రథం అంతలోనే మధ్యందిన సూర్యుడుగా మారుతుంది; గోవుల సంగ్రహణానికి బయలుదేరిన వాళ్లు అంతలోనే నాలుగు మారుతాలయిపోతారు.

అంతేగాక భౌతికమైన అర్థాలనిచ్చే మాటలకు కాలక్రమాన మతపరమైన అలౌకికార్థాలు వచ్చాయి. (దీనికి ఎన్ని ఉదాహరణలైనా దొరుకుతాయి. నైఘంటికంలో ''బ్రహ్మ'' అనే మాటకు ఈనాడున్న అర్థం లేదు. నిరుక్తం ఇంద్రుణ్ణి దేవతగా చెప్పదు) రథాలు ఎంత వివరంగా వర్ణించబడ్డాయంటే ఈనాడు నేర్పరియైన వడ్రంగి ఇంద్రుని రథం నమూనాను తయారుచేయవచ్చు. కాని ఆర్యులు ఎలాటి ఇళ్లలో నివసించారన్నది కొంచెం కూడా తెలియరాదు. ఇలాంటి వాటికి పురాతత్వ పరిశోధనలే ఆధారం.

ఆర్యులు పంజాబులో అంబాలా ప్రాంతంలో స్థిరపడినకాలంలో ఋగ్వేద రచన జరిగిందని కొందరు పండితుల అభిప్రాయం. అందులో మంచుకొండల (హిమాలయాల) వర్ణనలూ గొప్పనదులుగల ప్రదేశాల వర్ణనలూ ఉన్నాయి.

లక్నోకు పశ్చిమంగా ఉన్న ప్రాంతం గోధుమ పంటలకూ, తూర్పుగా ఉన్న

ప్రాంతం వరి పంటలకూ ప్రసిద్ధిగా ఉండేది ఋగ్వేదంలో వరిధాన్య ప్రసక్తి, పెద్దపులుల ప్రసక్తీ లేదు ( ఈ రెండూ అథర్వణ వేదంలో ఉన్నాయి.) కాని హరప్పా ముద్రల మీద పులిబొమ్మ కద్దు

## వేదసమాజంలో వృత్తి విభజన

ఇండో యూరోపియను సమాజాలన్నింటిలోనూ ఉన్నట్టే ఋగ్వేద సమాజంలో కూడా యోద్ధలూ, మంత్రవేత్తలూ, వృత్తుల వాళ్ళూ అని మూడు విభజనలుండేవి. అయితే దరిమిలా వచ్చిన వాఙ్మయంలో కనిపించే వర్ణ విభజన లాంటిది ఋగ్వేదంలో లేదు.

ఋగ్వేదంలోని స్తోత్రాలు ప్రధానంగా నరరూప దేవతలను గురించినవి. సోమరసాన్ని కూడా ఒక దేవతగా ఆరాధించారు అనేక మంది దేవతలు ఆర్యులకు ప్రతిరూపంగా కనబడతారు. ఋగ్వేద దేవతలో అగ్రగణ్యుడు ఇంద్రుడు. అతన్ని స్తుతించే సూక్తులు 250 ఉన్నాయి. ( అగ్నికి 200 సూర్యుడికి 100). అతను భుజబలమూ, ఎత్తయిన విగ్రహమూ, కపిలవర్ణం గల గడ్డమూ, తెగతాగటం చేత ఏర్పడిన బానకడుపూ గలవాడు. మరీ దేవాంశ హెచ్చినప్పుడు పిడుగును చేతపట్టినా, మామూలు సమయాలలో అందరి యోధులలాగే రథంమీద ఎక్కి ధనుర్బాణాలతో యుద్ధం చేస్తాడు. అతను పశువుల కోసం యుద్ధాలు చేసేవాడు. శత్రువుల దుర్గాలను ఛేదించేవాడు ( ఇంద్రుడు ధ్వంసం చేసినట్టు చెప్పబడిన హరియూపియ మనం ఈనాడు హరప్పా అనేదేనని కొందరి ఉద్దేశం. హరియూపియ అనేది అమరానగరం అనీ, అసురఘ్నుడైన ఇంద్రుడు దానిని నాశనం చేశాడనీ ఋగ్వేదం ఆరవ మండలంలో ఉన్నది.)

## హరప్పా ప్రజలే అసురులు, దస్యులు

ఇంద్రుడి చేత నిర్మూలించబడిన అసురులు దస్యులుగా చెప్పబడ్డారు వారి శరీరాలు నల్లగా ఉండేవి వాళ్లకు ముక్కులుండేవి కావు( అవాసులు) వాళ్ల భాష అర్థంకాదు. వారికి కర్మకాండ లేదు. యజ్ఞ యాగాదులు చెయ్యరు. దేవతలను పూజించరు. బహుశా లింగపూజ చేస్తారు. కాని వారు ధనవంతులు. విశేషంగా బంగారం కలవారు. వాళ్లకు రాజ్యాలున్నాయి. వాళ్ళు దుర్జయములైన కోటలు కట్టుకున్నారు. ఈ వర్ణన హరప్పా నాగరికులకు సరిపోయింది. వారి కోటలను ధ్వంసం చేసిన ఇంద్రుడు 'పురంధరుడు'. ఇంద్రుడు నాశనం చేసిన పురాలవర్ణన కూడా హరప్పా సామ్రాజ్యంలోని నగరాలను చక్కగా అతుకుతున్నది.

వేదకాలపు ఆర్యులు నగరాలు ఎరుగరు. ఋగ్వేదంలో చెప్పబడినవారి జీవితం నాగరిక జీవితం కాదు. కర్షక జీవితం నడిపే సంఘాలకు చెందినది. హోమరు చిత్రించిన జీవితం కన్న అనాగరికమైనది. యూరపు, ఆసియా ఖండాలలో అలాంటి సమాజాలు

రోమ్ సామ్రాజ్యం నాటికీ తదనంతరమూ కూడా ఉండేవి. వారి ఆర్థిక వ్యవస్థ ధాన్యాలు పండించటం మీద ఆధారపడినప్పటికీ ఆవులనూ, గొర్రెలనూ, మేకలను పెంచటం అతిముఖ్యమైనది ఇండో యూరోపియనుల సంప్రదాయంలో సంపద అంటే పశువులే (లాటిన్ భాషలో Pecus అంటే పశువు; Pecunia అంటే ధనం ధనం, సొమ్ములు అనే మాటలు పశువులకూ వాడటం మనలోనూ వున్నది) గవిక అంటే గోకాంక్ష, యుద్ధమూ కూడాను.

## ఆర్యులు పశుపోషకులు

పశుపోషకుల భాషలో పశువులకు సంబంధించిన పదజాలం విస్తృతంగా ఉండటం సహజం. ఆర్యులకు ఇలాంటి పదజాలం అపారంగా ఉండేది. ఆర్యుల ఆహారంలో పాలు ముఖ్యంగా ఉండేది. ఆవులను రోజుకు మూడుసార్లు పాలు పితికేవారు ఎద్దులకు వట్టకొట్టడం వుండేది. గోమాంసం ప్రధాన మాంసాహారం, అతిథుల కోసం ఆవును కొయ్యటం ఘనమైన అతిథి సత్కారంగా భావించబడేది ఇంద్రుడు గోమాంస భక్షణలో సిద్ధహస్తుడు. అహింసా సిద్ధాంతమూ, మాంస భక్షణకు వ్యతిరేకతా బ్రాహ్మణాల అనంతరం వచ్చిన పరకాయప్రవేశ విశ్వాసం మూలంగా అమలులోకి వచ్చాయి అవి తొలి ఆర్యుల విశ్వాసాలు కావు. తోళ్లనూ, వడిసెలనూ, విలుతాళ్ళనూ, రథాల పగ్గాలనూ, కొరడాలను ఉపయోగించేవారు.

## ఆర్యుల జీవితం

ఆర్యులు యవ ధాన్యాన్ని వంట చేసి ఉంటారు. ఎద్దులకు నాగళ్ళు కట్టి పొలాలు దున్నేవారు. కాని పొలాలు దున్నే ఎద్దులకు కాడి ఉన్నట్టు ఋగ్వేదంలో ఎక్కడా లేదు ఈ సందర్భంలో గమనించదగిన దేమంటే, క్రీస్తు పూర్వం సుమారు 3000 ఏళ్ల క్రితం సుమేర్‌లోనూ, మూడవ రాజవంశం హయాంలో ఈజిప్టులోనూ కాడిలేని ఎద్దులను దున్నటానికి ఉపయోగించేవారు; నాగలిపగ్గాలను ఎద్దుకొమ్ములకు కట్టేవారు మెసొపొటామియాలో కస్సీ పరిపాలనా కాలంలో కూడా ఇదే చిత్రించ బడింది; ఆ ఎద్దులు మన ఎద్దుల లాగే మూపురాలు గలవి.

పండిన ధాన్యాన్ని కత్తులతోనో, కొడవళ్లతోనో కోసి, కట్టలు కట్టి, కళ్లంలో పరిచి, తరువాత నూర్చి తూర్పారబట్టి, ధాన్యాన్ని ఊర్గరలలో నింపేవారు. నీటి కోసం బావులు తవ్వేవారని తోస్తుంది. ఇళ్లకు కాపలా కాయటానికీ, వేటకూ కుక్కలను ఉపయోగించేవారు. వాటిని యజ్ఞశాలల నుండి వెళ్ళగొట్టేవారు. పశువులను కాయటానికి కుక్కలను ఉపయోగించినట్టు కనబడదు. గొర్రెలూ, మేకలూ ఆహారంగా ఉపయోగపడగా, వాటి బొచ్చు నేతకు ఉపయోగించేవారు. పడుగూ, పేకా కండెలాటి వాటి మాటలుండేవి.

ఋగ్వేదకాలపు ఆర్యులు పెంచిన జంతువులలో గుర్రాలకు విశేషమైన ప్రాముఖ్యం

ఉండేది వాటి రంగుల వర్ణనలు ఋగ్వేదంలో ఉన్నాయి వాటి కాళ్ళు కట్టి మేతకు వదిలేవాళ్ళు – ఇప్పుడు గాడిదలను కట్టినట్టు రథాలకు సాధారణంగా ఆడగుర్రాలను పూన్చేవాళ్లు. గుర్రాలమీద సవారీ అయి యుద్ధాలు చేసే విధానం ఉండేది కాదు – జీనులూ రికాబులూ సృష్టికాని కారణం చేతనేమో రథాల పందెపు పోటీలు జాస్తిగా ఆదరించబడేవి. తేలికగా ఉండే రెండు చక్రాల రథాలకే గుర్రాలను పూన్చేవారు. నాలుగు చక్రాలవారి బళ్లకు ఎద్దులను పూన్చేవారు

ఆర్యుల నివాసాలను గురించి గాని, పల్లెలను గురించి గాని మనకు ఏమీ తెలియదు వాళ్ళ ఇల్లు కర్రలతో చేసి కప్పు కలిగి ఉండినట్టు కనపడుతుంది. ఇళ్లలో గదులు లేక విభాగాలు ఉండేవి. ఇంటి మధ్య అగ్నిహోత్రం ఉండే చోటు గృహ జీవితానికి కేంద్రం. నూరటానికి కల్వాలు, దంచటానికి రోళ్ళూ, రోకళ్ళూ ఉండేవి ఋగ్వేదంలో కల్వాల మాట ఏమైనా రోళ్ళూరోకళ్ళూ స్పష్టంగా చెప్పి ఉన్నాయి. కుండలు చెప్పబడ్డాయి. భోజనాలప్పుడు మధువు తాగేవారు నిషా చేసే సుర కూడా తాగేవారు. దాన్ని బహుశా ధాన్యం నుంచి బట్టీపట్టేవారు సోమలత అనేది ఏదో ఈనాడు మనకి తెలియదు దానినుంచి తీసిన సోమరసాన్ని పూజలప్పుడే ఉపయోగించేవారు. అది ఎలా తయారు చేసేవారో ఎప్పుడు తాగేవారో విపులంగా వివరించి ఉన్నది

వైదికార్యుల వస్త్రధారణ గురించి కూడా వివరంగా తెలియదు. కాని వారు హెచ్చుగా ఉన్ని బట్టలే కట్టేవారు. స్త్రీ పురుషులు ఉత్తరీయాలు(పై బట్టలు) ధరించేవారు. తలపాగాల ప్రసక్తి బ్రాహ్మణాల దాకా లేదు. ఇది హరప్పా సంపర్కం వల్ల వచ్చిన ఆచారమై ఉండాలి. ఋగ్వేదంలో పురుషులు చెవులకు ఆభరణాలు ధరించినట్టు చెప్పి ఉన్నది. స్త్రీలు తలకు ఆభరణాలు పెట్టుకునేవారు అది శృంగాకారం కలిగి ఉండవచ్చు! పాదాలకు పెట్టుకునే ఆభరణాలు, ఉంగరాలూ, మెడకు పెట్టుకునేవి, స్తనాలంకారాలు బంగారపువి. ఆ కాలంలో క్షౌరం ఉండేది గడ్డాలు, మీసాలు ప్రస్తావించబడ్డాయి.

ఆ ఆర్యసమాజంలో లోహకారులుండేవారు పాత్రలూ, పనిముట్లు, కవచాలు చేసేవారు. కుమ్మరివాళ్ల ప్రస్తావన కనబడదు గాని, వడ్రంగులుండేవారు గొడ్డళ్ళూ, బాడిసలూ ఉపయోగించేవారు. బహుశా బరమాలతో బెజ్జాలు చేసేవారేమో. ఎందుకంటే అగ్నిహోత్రం చెయ్యటానికి బరమాలాటి సాధనం ఒకటి ఉండేది కంచు ప్రధానంగా వాడుకలో ఉన్నట్టు కనబడుతుంది కంచు ఉంటే రాగి కూడా ఉండే ఉండాలి అయితే కంచు తయారు చేయటానికి ఉపయోగించే రాగీ, తగరమూ ఋగ్వేదం అనంతరమే ప్రస్తావించబడ్డాయి.

## సభలూ - సమావేశాలు

అడపా దడపా సభాభవనంలో సమావేశాలు జరిగేవి. వీటిలో స్త్రీలు పాల్గొనే వారు కారు. ఈ సమావేశాలలో ఉమ్మడి (గణ) వ్యవహారాలు చర్చకు వచ్చేవి. కబుర్లూ

కాకరకాయలూ కూడా ఉండేవి. ఇక్కడే జూదాలాట కూడా జరిగేది అందుకు గింజలు ఉపయోగించేవారు. హరప్పాలో ఉండిన పాచికల ఆట లాటిది ఉండినట్టు కనబడదు గింజలను ఒక గుంట చేసో, పల్లంలోకో విసిరి పందాలు కాసేవాళ్లు. ఈ జూదం వ్యసనంతో భార్యను పోగొట్టుకుని లబోమని ఒకడు ఏడవటం ఒక ఋక్కులో ఉన్నది (10వ మండలం).

ఆ కాలపు ఆర్యుల సంగీతం గురించి కూడా కొంత తెలుస్తున్నది నృత్యాలు చేసేటప్పుడు తాళాలు వాయించేవాళ్ళు. డోళ్ళూ, పిల్లనగ్రోవులూ, కిన్నెరలాటి తంత్రీవాద్యమూ ఉండేవి. సప్తస్వరాలు వారికి తెలుసును.

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక,15-1-1971.*

# వేదాలలో ఏమున్నది? - II

## ఆర్యుల యుద్ధ జీవితం

ఋగ్వేదంలోని ప్రధాన ఇతివృత్తం యుద్ధం. క్షత్రియవీరులు నాయకులు. దేవతలు సైతం వారి ప్రతిరూపాలే. యోధులకు రక్షక దైవం ఇంద్రుడు. ఇంద్రుడి యుద్ధ తంత్రం అనాగరిక జాతుల నాయకుల యుద్ధతంత్రాన్ని పోలి ఉంటుంది. యుద్ధాలలో బాహాబాహీ పోరాడే సాధారణ సైనికుల చర్యలేవీ వర్ణించబడవు. రథం ఎక్కిన వీరుడి చర్యలే వర్ణింపబడతాయి (పురాణాలలోనూ అంతే). ఋగ్వేదంలో రథాల వర్ణన చాలా వివరంగా ఉన్నది. క్రీస్తు పూర్వం రెండవ సహస్రాబ్దిలో ఆర్యులు అలాటి రథాల మీద మనదేశం మీద దాడి చేశారు. హరప్పా నాగరికులు బళ్ళు బాగా ఎరుగుదురుగాని, వాటిని యుద్ధాలలో వాడినట్లు కనబడదు. ఆర్యుల రథాలు మన గడ్డమీద ఉత్పత్తి అయినవి కావు. అవి పడమర నుంచి దిగాయి. ఆకులు గల చక్రాలు కలిగి, గుర్రాలను పూన్చిన రథాలు క్రీస్తుపూర్వం సుమారు రెండు వేల ఏళ్ళ క్రితం ఆసియా మైనరులోనూ, క్రీపూ 1550 ప్రాంతంలో ఈజిప్టులోనూ, అటు తర్వాత బాబిలోనియా అసిరియాలలోనూ ఉండేవి.

రథంలో యోధుడూ, సారథీ ఎక్కేవారు ఎడమప్రక్క యోధుడుండేవాడు. అతను విశ్రాంతికోసం కూర్చోవటానికి ఆసనం ఉండేది. సారథి కూర్చునేటందుకు ఆసనం లేదు. అతను స్థాత్ర - నిలబడేవాడు. సారథి కూడా ప్రతిష్ఠ కలవాడుగానే ఉండేవాడు. యోధుడికి సన్నిహిత బంధువు కావచ్చు (అర్జునుడికి కృష్ణుడులాగా).

యోధుడి ప్రధాన ఆయుధం విల్లు. ఋగ్వేద ప్రకారం విల్లును ఉపయోగించనప్పుడు దాని నారిని తగిలించే వాళ్ళు కారు. నారి గోవు చర్మంతో చేయబడేది. హోమరు

వర్ణించిన గ్రీకు యోధుల లాగా బాణాన్ని రొమ్ముకేసి లాగక, ఆర్యయోధులు చెవికేసి లాగేవాళ్ల బాణం వదలిన తర్వాత నారి దెబ్బ తగలకుండా ఎడమ మణికట్టుకు కవచం ఉండేది

## ఆర్యుల దేవతలు - వారి కర్మకాండ

ఋగ్వేదంలో మిత్ర, వరుణులు అంత ప్రాముఖ్య గల దేవతలుకారు సూర్యుడు, ఉషస్సూ, అగ్ని, సోమం లాటి దేవతలు ప్రకృతి తత్వాలు. యజ్ఞాలు సరిగా జరిగినంత కాలమూ దేవతలు తమ కోర్కెలు తీర్చక తప్పదన్న మనస్తత్వం ఆనాటి ఆర్యులలో ఉన్నట్లు కనబడుతుంది. వాళ్ల కర్మకాండ ప్రధానంగా గార్హస్థ్యంగా ఉండేది. భూమి దున్నటానికీ, పశువులను తోలటానికీ, తోలుకురావటానికీ, పెళ్ళిళ్ళకూ, అపరకర్మకూ మంత్రాలుండేవి. దేవాలయం నిర్మాణం జరిగినట్టు సూచన ఏమీ లేదు. మేలిమి అరుగును మించి దేవుడి పీట ఏమీ ఉండేది కాదు. అది కూడా గడ్డితో కూడిన మట్టి పెళ్ళలతో వేసేవాళ్ళు కాని యజ్ఞపశువును కట్టేసే యూపస్తంభానికి ఎంతో ప్రాముఖ్యం ఉండేది.

పవిత్ర స్తంభాలను పోల్సుగానూ, వలయంగానూ అమర్చే ఆచారం కాంస్య యుగానికి చెందిన యూరపు ఖండంలో, దక్షిణ రష్యా మైదానాలలో నివసించిన వారిలో ఉండేది. ఆ ఆచారానికి దీనికి అజ్ఞాత సంబంధం ఏదైనా ఉండవచ్చు.

## ఆర్య, హరప్పా సంస్కృతుల సమన్వయం

తమ చేత ఓడిపోయిన వారి సంస్కృతి ప్రభావం ఆర్య సంస్కృతి మీద ఉండి తీరింది ఋగ్వేదంలో పురోహితులకు ప్రాధాన్యం ఉన్నప్పటికీ, వారు సమాజంలో అగ్రస్థానం వహించలేదు పురోహితులు 'అగ్రవర్ణులుగా' ఉండినది హరప్పా నాగరికతలో. ఆర్యులు పంజాబు ప్రాంతం దాటి తూర్పుగా వచ్చినకొద్దీ, క్షత్రియులపై బ్రాహ్మణుల ఆధిక్యత హెచ్చింది. ఆర్య సంస్కృతికీ, హరప్పా సంస్కృతికీ కొంత సమన్వయం కుదిరింది క్రీ.పూ 300 ప్రాంతంలో మెగస్తనీస్ అనే గ్రీకు యాత్రికుడు చంద్రగుప్తుడి (మౌర్యుడి) దర్బారుకు వచ్చి తాను పాటలీ పుత్ర నగరంలో చూసిన రాజకీయ, వాణిజ్య, సైనిక ఏర్పాట్లను వర్ణించాడు. అతని వర్ణన హరప్పా నగర వర్ణనను స్ఫురింపజేస్తుంది గాని, ఋగ్వేదంలోని ఆర్యుల జీవితాన్ని కాదు.

## వేదకాలంలో వివాహాలు

ఆంధ్ర విజ్ఞాన సర్వస్వంలో ఋగ్వేదకాలంలో వివాహాలను గురించి ఇలా చెప్పి ఉన్నది (దశమ మండలంలో).

''ప్రౌఢలై వర సమాగమమును అభిలషించు వధువులు మాత్రమే వివాహ మొనరింప

దగినవారు  వరుని మిత్రులు వధువు తండ్రి వద్దకు వచ్చి కన్యనిమ్మని అర్థింతురు. వివాహము కన్య యింటగాని, వరుని యింట గాని జరిగేది. కన్యా దాత రెండెడ్లను పూన్చిన రథము మీద కన్యను కూర్చుండబెట్టి, వరుని గృహమునకు పంపును  వివాహ సూచకముగా వరుడు వధువు హస్తము పట్టుకొనును (పాణి గ్రహణం)  పెద్దలందరు వధూవరులను ఆశీర్వదింతురు.''

రజస్వలా పూర్వ వివాహాలు లేవు తాళిబొట్లు లేవు. నిజానికి ఈనాడు మనవాళ్ల మంత్రోక్తంగా చేసే పెళ్ళిళ్ళలో నూరింట తొంభై వంతులు అనార్య సంప్రదాయాలు నించే వచ్చి చేరాయి

ఋగ్వేదంలో  స్వయంవర ప్రసక్తి ఒకే చోట ఉన్నది. (''భద్రా వధూర్భవతి యత్సుపేశాః స్వయం సామిత్రం వనుతే కనేచిత్'')

ఆ కాలంలో అనులోమ వివాహాలే(వరుడి కన్న వధువు హీనస్థితిలో ఉండేటట్లు) జరిగేవి. విలోమ వివాహాలు – క్షత్రియుడైన యయాతి బ్రాహ్మణ కన్య అయిన దేవయాని లాటి దాన్ని చేసుకోవటం – వేద బాహ్యమైనవి.

## వైదిక వాఙ్మయంలోని జంతువులు

ఋగ్వేదం ఒక సమయంలోగాని, ఒక స్థలంలోగాని సృష్టి అయినది కాదన్నది అందరూ ఒప్పుకున్నారు. వైదిక వాఙ్మయంలో విరివిగా గల జంతువుల పేర్లులాంటివి ఆర్యసమాజం ఆనాడు ఎలాటి పరిణామదశలో ఉండేది తెలయజేస్తాయి. ఉదాహరణలు.

శాకల ( ఒక రకం పాము), మండూకీయ (కప్ప సంబంధమైన), శార్దూలీయ (పులి సంబంధమైన), శ్వేతశ్వతర (తెల్లకంచర గాడిద), కౌషీతకి (గుడ్లగూబ), అజ (మేక), మత్స్య (చేప), తైత్తిరీయ (తిత్తిరిపిట్ట), కశ్యప (తాబేలు), కౌశిక (గుడ్లగూబ), గోతమ ( ఎద్దు), వత్స (దూడ), శునక (కుక్క) – ఇలాటి పేర్లుతో వేదశాఖలూ, ఉపనిషత్తులూ, ఋషులుకూడా ఉన్నారు.

ఋగ్వేదంలోనూ, అథర్వ వేదంలోనూ కూడా వ్రేతం, వ్రేత్యులు అనే వాటికి చాలా గౌరవం ఉన్నది. అటుతరవాత వచ్చిన వాఙ్మయంలోనే వ్రేత్యులు హీనులుగా పరిగణించబడటం జరిగింది.

పురాణాలలో రాక్షసుడుగా చెప్పబడిన వృత్రుడు ఋగ్వేదంలో రాక్షసుడు కాడు. ఒక సందర్భంలో వృత్రుడు మేఘమని, ఇంద్రుడు మెరుపులనీ స్ఫురిస్తుంది. అలాగే అసుర శబ్దం కూడా ఋగ్వేదంలో గౌరవవాచకంగా ఉపయోగించబడింది. ఆర్య సమాజంలో కలిగిన పరిణామాల ఫలితంగా ఒకనాడు గౌరవింపబడినవి క్రమంగా

అగౌరవానికి గురిఅయాయి.

## వేదాలు నాలుగా, మూడా?

వేదాలు నాలుగంటారుగాని కొందరు మూడు వేదాలనే గుర్తిస్తారు నన్నయభట్టు భారతం ప్రారంభిస్తూ వేదత్రయ మూర్తయః త్రిపురుషాః అన్నాడు ఋగ్వేదంపోతే మిగిలిన వేదాలు సామవేదం, యజుర్వేదం, అధర్వవేదం కాని వీటికి కూడా మూలం ఋగ్వేదమేలాగా కనిపిస్తుంది.

సామవేదంలోని మంత్రాలలో 75 తప్ప మిగిలినవన్నీ ఋగ్వేదంలోవే. ఇందులో 1791 ఋక్కులలో 261 సినిమా సంభాషణలాగా పునరుక్తులుట. అందుచేత ఋక్కుల సంఖ్య 1530 అనుకోవాలి. ఇందులో నుంచే గానశాస్త్రం పుట్టినట్లు చెప్పబడుతున్నది. దీనికి చారిత్రక ప్రాముఖ్యం ఏమీ లేదు.

యజుర్వేదంలో మొదట 27 శాఖలుండేవి. అందులో 12 కృష్ణ యజుర్వేదాలూ, 15 శుక్ల యజుర్వేదాలూనూ ఈ రెంటిమధ్యా వైషమ్యం ఏర్పడిందిట. ఇందు గురించి చెప్పే కట్టుకథలు కొన్ని ఉన్నాయి శుక్లయజుశ్శాఖా ప్రవర్తనుడు యాజ్ఞవల్క్యుడు, వాజసని కొడుకు. అందుచేత దాన్ని వాజసేమ సంహిత అన్నారు. కృష్ణ యజుశ్శాఖా ప్రవర్తనుడు తిత్తిరిమహర్షి. అందుచేత అది తైత్తిరీయ సంహిత అయింది.

అన్నిటికన్న ఆఖరుకు పుట్టిన వేదం అధర్వ వేదం. అందులో 20 కాండలు, అయిదారు వేల ఋక్కులు 731 సూక్తాలు ఇందులోనూ రెండు శాఖలు శౌనకమూ, పైప్పలాదకమూనూ. పైప్పలాదకం నశించిందిట ఋగ్వేదంలో యజ్ఞకర్మకు సంబంధించని ఋష్యుక్తాలను తెచ్చి 20 వ కాండ చేశారట. ఇది బొత్తిగా ఐహిక సుఖ సాధన కోసం పనికివచ్చే వేదం. అందుచేత ఒకప్పుడు రాజులు అధర్వం తెలిసిన వారినే పురోహితులగా పెట్టుకునే వారుట. వైద్యశాస్త్రానికీ, జ్యోతిశ్శాస్త్రానికీ ఇదే కుదురు. ఆ కాలపు సమాజాన్ని అర్థం చేసుకోవటానికి ఈ వేదం ఉపకరిస్తుంది.

## అసలీ గొడవంతా దేనికి?

వేదాలను గురించీ, ఆకాలపు మనుషులను గురించీ, తెలుసుకొనటం మన కీనాడు ఎంతైనా అవసరం. ఎందుకంటే అప్పటికీ, ఇప్పటికీ జీవితంలోనూ, సమాజ స్వరూపంలోనూ, ఊహించరాని మార్పులెన్నో వచ్చినా, మన సంస్కృతి అంతా ఆ వేదాల మీదనే ఆధారపడి పెరిగింది. ఈ 20 వ శతాబ్దంలో ఈ సంస్కృతిలో మౌలికమైన మార్పులు రాకపోతే మనం ప్రపంచ సంస్కృతికి వెనుకబడి ఉండటం తప్పనిసరి అవుతుంది. అందుచేత తెలిసినవాళ్లు వేదాలను గురించీ, వేదకాలపు జీవితం గురించీ

సాధ్యమైనన్ని వాస్తవ విషయాలను ప్రజలకు తెలియజెప్పాలి ఈ సందర్భంలో తప్పుడు భావాలు ప్రచారంలో ఉండటం అంత మంచిది కాదు. ఈ పనిని సమర్థులూ విజ్ఞులూ చేస్తారని నమ్ముతున్నాను.

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 22-1-1971*

# ఒక అనార్య గాథ

కథాసరిత్సాగరంలో అనేక వింత కథలున్నాయి. వాటిలో మరింత వింత కథ సూర్యప్రభుడి కథ. ఇది ఒక అనార్యపురాణం. మనం చదివేపురాణాలన్నీ సాధారణంగా దేవతలకు అనుకూలంగా రాసినవి. ఈ దేవదానవులు ఏనాటి వాళ్ళోగాని మన జాతి ఈనాటికీ వారి మధ్య తటస్థ భావాన్ని తెచ్చుకోలేదు. మనం దేవతల పక్షమే ! ఇందుకు కారణం మనకు తెలిసిన పురాణాలన్నీ దేవతల పక్షం అయి ఉండటమే కాని ఈ సూర్యప్రభుడి కథ దానవుల పక్షాన రాసినది.

మనం దేవతల పక్షంమాని దానవుల పక్షం కావాలన్న ఉద్దేశంతో ఈ వ్యాసం రాయటం లేదు మామూలు పురాణాలలో ఉండే అభూతకల్పనలు కొన్ని ఈ పురాణంలో కూడా వున్నాయి అందుచేత ఆ పురాణాలను నమ్మటం మానేసి దీన్నే నమ్ముదాం అన్న ప్రశ్న లేనేలేదు. మరి ఈ కథ మనకెందుకు ? చెబుతాను.

మనకు మానవ చరిత్ర అవగాహనలేని కాలంలో రెండురకాల వైఖరిమాత్రమే అవలంబించాం - వాటిని గుడ్డిగా నమ్మటమూ, లేదా, వాటిని పూర్తిగా కొట్టిపారెయ్యటమూనూ. కాని శాస్త్రవేత్తలు ఈ ప్రాచీన రచనల నుంచి ఆదికాలపు మానవ చరిత్రను కొంతలోకొంత వెలికి తీయసాగారు. ఆర్కియాలజీ ఇందుకు ఎంతగానో తోడ్పడింది. ఉదాహరణకు ఋగ్వేదంలో రెండే నగరాలు చెప్పి ఉన్నాయట. ఒకటి హరియూపియ. ఇది ఐరావతీ నదీతీరాన ఉండేది. రెండవది నార్మిణి. ఇది పరశురామ ప్రీతి అయినట్టు చెప్పబడింది. తవ్వకాలలో బయటపడిన హరప్పా నగరం హరియూపియ కావటనికి సందేహం లేదు. నార్మిణి మొహెంజోదారో అయి ఉండటానికి అవకాశం ఉన్నది.

అలాగే దృష్టాంతాలను బట్టి మన పూర్వపు ఋషుల పేర్లు ఆదిమ జాతులను సూచిస్తున్నాయని తెలుసుకోగలుగుతున్నాం. ఆ పేర్లు కుక్కలకూ, ఎద్దులకూ, చిలకలకూ, తాబేళ్లకూ, ఏనుగులకూ, పుట్టలకూ, పక్షులకూ సంకేతాలు.

అదేవిధంగా, మన ప్రాచీన సాహిత్యాన్ని ఎలా చదవాలో కూడా మనం ఊహించగలుగుతున్నాం. ఆదిమజాతుల వాళ్ల అరణ్యమృగాలను జడల ఏనుగులూ,

ఎనుములూ మొదలైన వాటిని వేటాడి వాటి తోళ్ళు కట్టుకున్నట్టు మనకు తెలుసు. ఇవన్నీ మన ప్రాచీన సాహిత్యంలో రాక్షసులయాయి. గజాసురుడూ, మహిషాసురుడూ వగైరా. శివుడు గజ చర్మాంబరధారి. ఇంతకన్న విచిత్ర మేమిటంటే ఇంద్రుడు నిర్మూలించిన వృత్రాసురుడు, వీడు నది మీద ఆనకట్ట! ఆర్యులు రావటానికి పూర్వం సింధులోయలో నివసించిన వాళ్ళు నదులకు ఆనకట్టలకు కట్టి, ఎడారిలో వరదలు తెప్పించి, వరద తీశాక అక్కడ పైర్లు పండించారు. ఇంద్రుడు తన వజ్రాయుధం (దధీచి వెన్నెముక) తో ఆ ఆనకట్టలను ఛేదించి నీటిని విడుదల చేశాడు.

ఇలాంటి విషయాలు మన ప్రాచీన సాహిత్యం నుంచి వేలసంఖ్యలో బయటపడుతున్నాయి. అందుచేత మనం ఈనాడు ఈ ప్రాచీన సాహిత్యాన్ని చెత్తకుప్పలో పారెయ్యనూ అక్కర్లేదు, దేవుడి పెట్టెలో పెట్టి పూజించనూ అక్కర్లేదు. (నిజానికి రెండూ ఒకటే).

ఇంతకూ, ఈ సూర్యప్రభుడి కథలో నాకు కొన్ని ఆసక్తిదాయకమైన విషయాలు కనిపించాయి. వాటిని చెప్పటానికే ఈ వ్యాసం. నా కన్నా శాస్త్ర పరిజ్ఞానం గల వారికి ఈ కథలో ఇంకా అనేక విషయాలు కనిపించవచ్చు. అది పరిశోధకులు చూసుకోవాలి.

స్థూలంగా మానవ పరిణామం ఎలా జరిగిందంటే, వారి ఆర్థిక జీవనం రెండు రకాలుగా చీలింది. ఆహారం ఏరుకొనటమూ, మృగాలను వేటాడటమూ అన్న దశను దాటగానే కొన్ని జాతుల వారు పశువులను మచ్చిక చేసి, పశుసంపద ఆధారంగా జీవించారు. మరికొన్ని జాతులవాళ్లు వ్యవసాయం ప్రధానంగా జీవించారు. ఇది రెండురకాల సామాజిక వ్యవస్థలకు దారితీసింది.

అయినా రెండురకాల వ్యవస్థలూ భౌతికవాదాన్నే అవలంబించాయి. అయితే వర్గ విభజన ఏర్పడి మార్క్సిస్టులు చెప్పేసామాజిక దోపిడి ఆరంభం కాగానే ఆధ్యాత్మిక దృక్పథం ఒకటి తల ఎత్తింది. మతాలు విజృంభించాయి.

మనదేశంలో లోకాయతనమూ, వేదాయతనమూ అన్నవి వ్యాప్తిచెందాయి. ఒకటి భౌతికవాదంతోను, రెండోది ఆధ్యాత్మిక వాదంతోను కూడినయి. లోకాయతనంలో చేరేవి ప్రధాన (ప్రకృతి) వాదమూ, స్వభావ(పరిణామ) వాదమూ, సాంఖ్యమూ, యోగమూ వగైరా వగైరా. ఆధ్యాత్మికవాదులు లోకాయతనాన్ని నాస్తిక వాదమన్నారు. ఒక వంక సాంఖ్యంలోకి యోగంలోకి పరమాత్మను దొడ్డిదారిన ప్రవేశపెట్టుతూనే వాటిని తీవ్రంగా ఖండించారు. భౌతికవాదులను చార్వాకులనీ, తాంత్రికవాదాన్ని వామాచారమనీ గర్హించారు.

ఆధ్యాత్మికవాదులచేత ఎన్ని తిట్లు తిన్నా, ఆ ఆధ్యాత్మిక వాదులు ఈశ్వరసత్యం,

జగన్మిథ్యా అంటూంటే, ప్రకృతి పరిణామవాదులైన భౌతికవాదులు మన ప్రాచీన శాస్త్రాలకు పునాదులు వేశారు. వైద్య, గణిత రసాయనశాస్త్రాలు ఈ వాదం నుంచే పుట్టాయి. అందుచేత ఈనాటి శాస్త్రవేత్తలకు నిజమైన పూర్వులు ఈ భౌతికవాదులే సూర్యప్రభుడి కథ అటువంటి భౌతిక వాదావలంబకులైన దానవులకు చెందినది. ఇందులో వారి విశ్వాసాలూ, దృక్పథమూ గురించి కొంత మనకు తెలుస్తుంది

మద్ర దేశంలో శాకలపురానికి అంగారప్రభుడు రాజుగా ఉండేవాడు అతడి కొడుకు చంద్రప్రభుడు. ఆ చంద్రప్రభుడికి సూర్యప్రభుడనే కొడుకు కలిగాడు. వారంతా శివారాధకులు. సూర్యప్రభుడు విద్యాధర చక్రవర్తి అవుతాడని శివుడు ఆశీర్వదించి, కావాలని ఆదేశించాడు.

సూర్యప్రభుడికి పదహారేళ్ళు నిండి యువరాజు అభిషేకం పొందగా, మయుడువచ్చి, విద్యాధర చక్రవర్తికి అవసరమైన విద్యలు నేర్పుతానని తీసుకు పోయాడు. (విద్యలూ, విద్యాధరులూఅనే మాటలు అనార్యులకే వర్తిస్తాయనుకుంటున్నాను). సూర్యప్రభుడు మయుడి నుంచి విమానాలు తయారు చేయటం మొదలుకుని అనేక విద్యలు నేర్చుకున్నాడు. అతను 'భూతాసనం' అనే విమానాన్ని తయారు చేసుకుని, దాని మీద ఎక్కడికిబడితే అక్కడికి పోతూ, తనను వలచిన అనేక మంది రాజకుమార్తెలను ఎత్తుకువచ్చి, దరిమిలా వారిని పెళ్లాడాడు. వారిలో తామ్రలిప్త, పశ్చిమదేశమూ, కంచీ, చీనా, శ్రీ కంఠదేశమూ, కౌశాంబి మొదలైన చోట్లకు చెందిన రాజకుమార్తెలు ఉన్నారు.

ఒకనాడు మయుడు చంద్రప్రభుడి సభకు వచ్చి శ్రుతశర్మతో యుద్ధానికి బయలుదేరే తరుణం వచ్చిందన్నాడు. శ్రుతశర్మ అనేవాడు విద్యాధర చక్రవర్తిగా ఉంటున్నవాడు.

మయుడు అక్కడ ఉండగానే నారదుడు ఇంద్రుడి వద్ద నుంచి చంద్రప్రభుడికి సందేశం తెచ్చాడు అది ఇలా ఉన్నది:

"మీరు శివుడు ఆదేశంపై మయుడి సహాయంతో ఒక మర్త్యుణ్ణి విద్యాధర చక్రవర్తి చెయ్యాలని చూస్తున్న సంగతి నేనెరుగుదును. మీరు ఈ పని చేయరాదు. నేనా పదవిని శ్రుతశర్మకు ఇచ్చాను. అతను విద్యాధరుడు. అంతేగాక ఆ పదవికి వారసుడు. రుద్రయజ్ఞం చేసే ముందు అశ్వమేధం చెయ్యవలసిందిగా నేను నీకు సలహా ఇచ్చాను. కాని నా సలహాను నువ్వుపాటించలేదు. దేవతలను తృణీకరించి రుద్రుణ్ణి నమ్ముకోవటం నీకు క్షేమం కాదు"

[ రుద్రుడు (శివుడు) అనార్యుల ఆరాధ్యదైవమని ఈ సందేశం స్పష్టం చేస్తుంది. జీవితంలో ఎన్నో మార్పులు జరిగాకనే శివుణ్ణి త్రిమూర్తులలో ఒకణ్ణిచేసి, అప్పటికీ

అతణ్ణి లయకారుణ్ణి చేసి శివభక్తులను అతడే నిర్మూలించినట్టు కూడా పురాణాలు సృష్టించారు.]

ఇంద్రుడి సందేశానికి మయుడు ఇలా సమాధానమిచ్చాడు.

'' ఇంద్రుడు పొరబడ్డాడు సూర్యప్రభుడు మర్త్యుడని ఆయన అంటున్నాడు. అందువల్ల లోటేమిటి? అన్ని సిద్ధులూ మానవులకే ఉన్నాయి. వారు సత్త్వవంతులు. (తంత్ర శాస్త్రం ఇదే చెబుతుంది) శ్రుతశర్మకు తాను విద్యాధర చక్రవర్తి పదవి ఇచ్చాననటం కూడా సబబు కాదు. మహేశ్వరుడు దాత అయి ఉన్న చోట ఇతరు లెవరికీ ఇచ్చే అధికారం లేదు. హిరణ్యాక్షుడికి ఇంద్రపదవి రావలసి ఉండెను. కాని అతన్ని తోసి పుచ్చారు. ( ఈమాట ఆర్యపురాణాలలో ఎక్కడా లేదు.) ఇంద్రుడు మాది అధర్మం అనటం సరికాదు. మేము శ త్రువులను జయించబోతున్నామే గాని ఒక మునిపత్నిని కాజేయబోవటం లేదు. బ్రాహ్మణ్ణి హత్య చేయబోవటం లేదు. ( ఇంద్రుడి పైన విసురు). మా అధర్మం ఎందులో ఉంది? రుద్రయజ్ఞం చేసినాక మరే యజ్ఞమూ చేయనవసరం లేదు. (అశ్వమేధం ఆర్యులకు ప్రధానమైనది). మహేశ్వరుణ్ణి పూజించినాక ఇతర దేవతలను గురించి మేమెందుకు చింతించాలి? దయచేసి ఈ మాటలు ఇంద్రుడికి చెప్పు. మేమూ మా ప్రయత్నం మానేది లేదు. ఇంద్రుడు తనకు చేతనైనది చేసుకోనీ.''

నారదుడు వెళ్లిపోయాడు. మయుడు చంద్రప్రభుడితో,'' ఇంద్రుడి విషయమై దిగులు వద్దు. అతను తన బలాలను శ్రుతశర్మ బలాలతో కలుపుతాడు. అంత మాత్రాన ప్రహ్లాదుడి నాయకత్వం గల మనకు భయం లేదు. దైతులూ, దానవులు యావన్మందీ మన పక్షానపోరాడతారు. ఈశ్వరుడు మన పక్షాన ఉండగా మూడు లోకాలూ ఏకమైనా మనని ఏమీ చేయలేరు. యుద్ధయత్నాలు చెయ్యి'' అన్నాడు.

ఆ రాత్రి చంద్రప్రభుడు శివుడికి మహాబలి ఇచ్చాడు. నంది శివుని వద్ద నుంచి ఇలా సందేశం తెచ్చాడు. ''నూరు వంది ఇంద్రులకు కూడా వెరవ పనిలేదు. సూర్యప్రభుడు విద్యాధర చక్రవర్తి అయితీరుతాడు''.

( ఈ కథలో వచ్చే ప్రహ్లాదుడు భాగవతంలో ఉన్న ప్రహ్లాదుడు కాడు. ఇతను సిసలైన దానవుడు. దేవతలకు విరోధి. ప్రహ్లాదుడు హరి భక్తుడుగా చిత్రించటానికి ఆధారమేదీ ఉన్నట్టు కనబడదు. భాగవతంలోని ప్రహ్లాదుడితో బాటు అతని తండ్రి హిరణ్యకశిపుడు కూడా అభూత కల్పనలాగే కనపడుతుంది. ఈ కథలో హిరణ్యాక్షుడి ప్రస్తావన ఉన్నది గాని, హిరణ్యకశిపుడి ఊసు లేదు. లీలావతి ఉన్నది గాని ఆమె హిరణ్యకశిపుడు భార్యకాదు – మయుడి భార్య)

మర్నాడు ఉదయం మయుడు చంద్రప్రభుడికి ఒక రహస్యం చెప్పాడు.

'కిందటి జన్మలో నువ్వు నాకొడుకువు. సునాధుడు అనేవాడివి. మహాశక్తి మంతుడివి. నాతమ్ముడు సుముండీకుడు ఇప్పుడు నీ కొడుకు సూర్యప్రభుడు. మీరిద్దరూ దేవతలతో యుద్ధం చేస్తూ మరణించి, ఇక్కడ తండ్రీ కొడుకులుగా పుట్టారు శాస్త్రాన్నీ, యోగాన్నీ అనుసరించి మేము నీ కళేబరాన్ని తైలంలో జాగ్రత్తచేసి ఉంచాం. నువ్వు ఇప్పుడు పాతాళానికి వచ్చి యుక్తి చేత నీపాత శరీరంలోకి ప్రవేశించవచ్చు నేను చెబుతున్నా. ఆ శరీరంతో నువ్వు బలతేజస్సులు తిరిగి పొంది దేవతలతో యుద్ధం చేయగలవు. కాని సూర్యప్రభుడు మటుకు ఇప్పుడున్న శరీరంతోనే విద్యాధర చక్రవర్తి అవుతాడు.''

(పై మాటలలో అనేక విషయాలు కనిపిస్తాయి. శాస్త్రానికీ, యోగానికీ గల సంబంధం ఒకటి స్పష్టంగా కనిపిస్తుంది. ఒక మనిషి 'యుక్తి' చేత మరొక శరీరంలో ప్రవేశించవచ్చునంటాడు మయుడు. ఇది ఒక తాంత్రిక – యోగిక ప్రక్రియ అనుకోవాలి. పరకాయప్రవేశ విద్య అనేది కథలలో మనం చదువుతామే గాని అది సాధ్యమని తాంత్రికులూ, యోగులూ నమ్మి ఉండాలి. ఇలాంటి విద్యలు (మాయలు) రాక్షసులకే ఎక్కువగా తెలిసినట్టు అనుకోవడానికి పురాణాలు కూడా అవకాశం కలిగిస్తున్నాయి. మృతసంజీవనీ విద్య దానవులకు గురువైన శుక్రాచార్యులకే తెలుసుననీ, దానిని నేర్చుకు రమ్మని కచుణ్ణి దేవతలు పంపారనీ పురాణాలలో ఉన్నది. రాక్షస మాయలను గురించి మనం ప్రతి పురాణ కథలోనూ చదువుతాం. ప్రముఖుల శవాలను చెడిపోకుండా దాచి ఉంచటమన్నది ఈజిప్టులో వుండిన సంగతి మనకు తెలుసు. మరి ప్రాచీన ఈజిప్షియనులకు పునర్జన్మలోనూ, పరకాయ ప్రవేశంలోనూ నమ్మకం ఉండేదో లేదో నాకు తెలీదు. కాని ఈ చచ్చిన వాళ్ళు మళ్ళీ ఎలాగో పునర్జీవితులవుతారని నమ్మినందుచేతనే వాళ్లు ఆ శవాలను భద్రపరచి ఉండవచ్చు. ఈ కథలోనైనా సునాధుడి శవాన్నే భద్రపరచి, అతను తిరిగి బతకటానికి దానవులు అవకాశం కలిగించారు గాని, అతని తమ్ముడైన సుముండీకుడి శవాన్ని గాని, ఇతర రాక్షసుల శవాలనుగాని దాచటం జరగలేదు. అందుకే సూర్యప్రభుడికి తన పూర్వ శరీరంలో ప్రవేశించే అవకాశం లేదు.)

చంద్రప్రభుడు తన పూర్వదానవ శరీరంలో ప్రవేశించాలని మయుడు సూచించే సరికి, చంద్రప్రభుడి అనుచరులు అభ్యంతరం చెప్పి, ''మా ప్రభువు మరొక శరీరంలో ప్రవేశిస్తే ఆయన చచ్చిపోయిన వాడికిందనే లెక్క. ఆయనకు మేము జ్ఞాపకం ఉండము. అందువల్ల మాకేమి లాభం'' అన్నారు.

దానికి మయుడు ఇలా సమాధానం చెప్పాడు.''బుద్ధిపూర్వకంగానూ, యోగం ద్వారానూ పరకాయ ప్రవేశం చేసినవాడు ఏదీ మరవడు. మరణ వేదనపడి చనిపోయి

మరొక గర్భంలో జన్మించిన వారికే విస్మృతి. ఒక ఇంటి నుంచి మరొక ఇంట ప్రవేశించే వాడిలాగా యోగి అయినవాడు ఎన్ని శరీరాలలోనైనా ప్రవేశించగలడు. మీరంతా కూడా పూర్వజన్మలో దానవులే. రసాతలానికి వచ్చి, అమృతంతాగి రుగ్మతలనుంచి విముక్తులుకండి.''

(యోగికి పరకాయ ప్రవేశం చేసినా విస్మృతి ఉండదన్న విశ్వాసం యోగ సిద్ధాంతానికి సంబంధించినది అయి ఉండాలి. కాని ఈ విశ్వాసం నిజమైనదైతే స్మృతి అన్నది కేవలమూ మెదడుకు సంబంధించినది కాదా అన్న సమస్య వస్తుంది. ఇది చాలా లోతైన సమస్య. ఒక శరీరం నుంచి ఇంకొక శరీరంలోకి ప్రవేశించేది ఏమిటి అన్న సమస్య కూడా వస్తుంది ఇదికూడా లోతు సమస్య. పోతే అమృతం రాక్షసుల అధీనంలో ఉన్నదనేది ఆర్య పురాణాలలో కానరాదు. అది ఈ కథలో మాత్రమే ఉన్నది).

మర్నాడు మయుడి వెంట చంద్రప్రభుడు సపరివారంగా ఇరావతి, చంద్రభాగలు కలిసే చోటికి వెళ్లాడు ( ఇరావతి అంటే రవీనది, ఈ పేరుతో బర్మాలో ఉండేనదికి ఎప్పుడో మారింది. చంద్రభాగ అంటే ఈనాటి చీనాబ్ నది. ఈ రెండు నదులూ కలిసేచోటు అంటే సింధులోయ నాగరికత వెలిసిన ప్రాంతం. మయుడు వీరందరినీ హరప్పా నగర ప్రాంతానికి చేర్చటం గమనించదగినది.)

అక్కడ మయుడు వారికి నీటిలో ఒక బిలం చూపాడు. అందరూ ఆ బిలంలో ప్రవేశించి చాలా దూరంనడిచి, ఒక గొప్ప ఆలయాన్ని చేరుకుని అందులో ప్రవేశించారు.( ప్రాచీన ఆర్యులు ఆలయా లెరుగరు.)

ఆ ఆలయం లోపల మయుడు చంద్రప్రభుడికి పరకాయ ప్రవేశం చెయ్యటానికి అవసరమైన యోగరహస్యాలూ, సాంఖ్య రహస్యాలూ చెప్పాడు. (రెంటికీ గల సంబంధాన్ని నిరూపించటానికి మన పరిశోధకులు పేజీలకు పేజీలురాశారు. కాని ఇక్కడ యోగమూ, సాంఖ్యమూ జోడించి చెప్పి ఉన్నాయి.) తరవాత మయుడు ''అష్టసిద్ధులకూ విమోచనానికీ మూలమైన రహస్యం ఇదే'' అన్నాడు. (విమోచనం, స్వేచ్ఛ, లేక మోక్షం శరీరానికి మాత్రమే సంబంధించి ఉంటుందని యోగం చెబుతుంది. బ్రహ్మం, మాయా, మోక్షమూ, పురుషుడూ లాంటి పదజాలానికి వేదాంతులు కొత్త అర్థాలు కల్పించి, ఆధ్యాత్మిక వాదంలో చేర్చుకున్నారన్నది రుజువైన సత్యం).

ఈ సందర్భంలో మయుడు మరికొన్ని విషయాలు స్పష్టం చేశాడు. మహనీయులు ఈ సిద్ధుల కోసమే, ఈ విమోచనం కోసమే జపంచేస్తారు. వాళ్లు స్వర్గాన్నీ, మోక్షాన్నీ కోరరు. ఈ సందర్భంలో మయుడు ఒక కథ కూడా చెప్పాడు.

పుష్కరద్వీపంలో ఒక బ్రాహ్మణుడు రెండు వందల ఏళ్లు జపం చేశాడట. అతని

శిరస్సు నుంచి గొప్ప జ్వాల వెలువడిందట బ్రహ్మమొదలుగా గల దేవతలు వరాలిస్తామని అతని వద్దకు వచ్చారట. జపం తప్ప తనకు మరే కోరికా లేదని ఆ బ్రాహ్మణుడు అన్నాడట. అప్పుడతన్ని హిమాలయాలకు ఉత్తరంగా వెళ్లి జపం చేసుకోమన్నారట. అక్కడికి పోయి అతను జపం చేసుకుంటూ ఉంటే దుర్భరమైన వేడి పుట్టుకొచ్చిందట అతని జపం మాన్పించటానికి ఇంద్రుడు అతని వద్దకు అప్సరసను పంపాడట. కాని ఆ ప్రయత్నం విఫలమయిందట. అప్పుడు దేవతలు అతని వద్దకు మృత్యువును పంపారట. మృత్యువు అతని వద్దకు వచ్చి ''మర్త్యుడెవడూ ఇంతకాలం జీవించి ఉండరాదు. నావెంటరా'' అన్నాడట. అప్పుడ ఆ బ్రాహ్మణుడు ''నేనై ప్రాణత్యాగం చెయ్యను. నా ఆయుర్దాయం ముగిస్తే నీవే నన్ను ఎందుకు తీసుకుపోవు?'' అన్నాడట. మృత్యువు జడిసి వెళ్ళిపోయాడట. కాని అతను స్వర్గంలోకూడా జపం మానాడుకాడట. ప్రాణం విసిగి ఇంద్రుడు అతన్ని మళ్ళీ భూమికి తెచ్చి విడచిపెట్టాడట. కథ ఇలా సాగిపోతుంది.

( ఈ కథలో వాస్తవికత ఏమీ లేకపోయినా దేవదానవ జీవితాల మధ్య వ్యత్యాసం బాగా కనపడుతుంది. సాధారణంగా భౌతికవాదం కోరికలతో కూడుకున్నదనీ, ఆధ్యాత్మికవాదం బ్రహ్మపదార్థాన్ని చూపేదనీ, మన ' బ్రాహ్మణ సాహిత్యం' చెబుతుంది. ఇక్కడ మనకు కనిపించేది పూర్తిగా విరుద్ధం. బ్రహ్మ కోరికలు తీర్చుతానంటాడు. ఇంద్రుడు అప్సరసలను పంపుతాడు – అతడికి అటువంటి తార్పుడు పరిపాటే. అంతటితో ఊరుకోక స్వర్గసుఖాలనే ఎదట పెడతాడు. వాటికీ వేటికీ చలించనీ బ్రాహ్మడు జీవితానికి జలగలాగా అంటుకుని కూడా జపం చేసాడు. అతనికి కావలసినవి సిద్ధులు! )

దేవాలయంనుంచి మయుడు వారినందరినీ రెండో పాతాళానికి తీసుకు పోయాడు. అక్కడ చంద్రప్రభుడు కిందటి జన్మలో తన శవాన్ని చూచాడు. అదే సునాథుడి శవం. సునాథుడు భయంకరాకారుడు. అతని శవం చుట్టూ కొందరు స్త్రీలు నిలబడి ఉన్నారు. వారంతా సునాథుడి భార్యలు. మయుడు చంద్రప్రభుణ్ణి ఆ శవంలోకి ప్రవేశించమన్నాడు. చంద్రప్రభుడు అలాగే చేసేసరికి, సునాథుడు తిరిగి బతికి, ఆవలించి, కళ్ళు తెరచి, లేచి కూర్చున్నాడు.

''మన భర్త తిరిగి బతికాడు?'' అని దైత్యస్త్రీలు హర్షించారు.

చంద్రప్రభుడి పరివారంలో వాళ్ళు తమ రాజు శరీరం నిర్జీవంగా ఉండటం చూసి ఏడ్చారు. వారితోపాటు సూర్యప్రభుడు కూడా ఏడ్చాడు.

సునాథుడు తన తండ్రి అయిన మయుణ్ణి గుర్తించి, అతని పాదాలకు నమస్కారం చేశాడు.

''నీకు రెండు జన్మలూ జ్ఞాపకం ఉన్నాయా?'' అని మయుడు అడిగితే

సునాధుడు జ్ఞాపకం ఉన్నాయన్నాడు. సునాధుడు తమ్మందర్నీ గుర్తించిన మీదట సూర్యప్రభుడు మొదలైనవాళ్ళు సంతోషించారు.

మయుడు చంద్రప్రభుడి శరీరాన్ని తైలాదులలో భద్రపరిచాడు.

తరువాత మయుడు అందరినీ సువర్ణమయమూ, రత్నఖచితమూ అయిన భవనానికి తీసుకుపోయాడు. అక్కడ ఒక గుంటలో పానీయం(అమృతం) ఉన్నది. అందరూ దాని చుట్టూ కూర్చొని అందులో నుంచి తాగారు. అందరికీ వెంటనే కొత్తవికాసం వచ్చి, నిద్రావస్థనుంచి జాగృతి పొందినవారిలాగా అయారు.

మయుడు సునాధుణ్ణి వెంటబెట్టుకుని నాలుగో పాతాళానికి వెళ్ళాడు. అక్కడ సునాధుడి తల్లి లీలావతి ఉన్నది. ఆమె అందం అప్సరసలను మించినదిగా చెప్పబడింది. నాలుగో పాతాళం అత్యంత మనోహరమైనదిగా వర్ణింపబడింది. ఆమె సునాధుణ్ణి ఆలింగనం చేసుకుని, తన రెండో కుమారుడు తిరిగి మరోజన్మ ఎత్తిన సూర్యప్రభుడిగా పరిచయం చేసుకున్నది.

తరువాత మయుడు తన కూతురైన మండోదరినీ, విభీషణుణ్ణి స్మరించేసరికి, వారిద్దరూ వచ్చారు. ( ఈకదలో రావణ కుంభకర్ణుల ప్రసక్తి లేదు. మండోదరి విభీషణుడి భార్యలాగా కనబడుతుంది).

విభీషణుడు మయుడితో ''ఇప్పుడు దానవులలో నువ్వే ప్రముఖుడివి. దేవతలతో వైరం పెట్టుకోకు. అది మీ నాశన హేతువవుతుంది. లాభించదు. దేవదానవ యుద్ధాలలో ఎప్పుడూ దానవులకే నాశనం కలిగింది. దేవతలకు కాదు'' అన్నాడు.

(విభీషణుడు రామాయణంలో కూడా తన వారితో కలవడు. ఈ కథలో కూడా అతను దేవతల పక్షపాతం వహించటమే గాక, దానవుల నాశనం తనది కాదన్నట్టు మాట్లాడతాడు.)

విభీషణుడన్న ఈమాటకు మయుడు, ''మేమై దేవతలతో తగాదా పెట్టుకోవడం లేదు. కాని ఇంద్రుడు మూర్ఖిస్తే ఏంచెయ్యగలం? ప్రమత్తులైన అసురులు మాత్రమే దేవతల చేతిలో చచ్చారు. బలిలాటి అప్రమత్తులు చావలేదు'' అన్నాడు.

విభీషణుడు మండోదరితో సహా తిరిగి వెళ్ళిపోయాడు.

తరువాత అందరూ మూడో పాతాళంలో ఉన్న బలిని చూడబోయారు. బలిది మహాగొప్ప వైభవం. ఆయిన చుట్టూ దైత్యదానవులు పరివేష్టించి ఉన్నారు. అందరూ బలికి వరదానం చేసిన మీదట మయుడు బలికి పరిస్థితి అంతా వివరించి చెప్పాడు. బలి ప్రహ్లాదుణ్ణీ, ఇతర దానవ ప్రముఖులనూ పిలిపించి, సునాధుడు చంద్రప్రభుడుగా జన్మించాడనీ, అతని కొడుకు సూర్యప్రభుడు విద్యాధర చక్రవర్తి కానున్నాడని తెలిపాడు.

''ధర్మమూ, సత్యమూ ఆచరించినంత కాలం అభ్యుదయం జరిగి తీరుతుంది'' అని శుక్రాచార్యుడు అన్నాడు. ( ఈరెంటిలోనూ దేవతలకు విశ్వాసం లేదని ఆయన అభిప్రాయంగా కనబడుతుంది అందుకు నిదర్శనాలు ఈ కథలోనే ఉన్నాయి.)

బలి ఉన్నచోటికి సప్త పాతాళాల పాలకులూ వచ్చి ఉన్నారు. బలి సూచించిన మీదట సునాధుడు పునరుజ్జీవితుడయినందున వారు వేడుక చేసుకున్నారు

ఇంతలో నారదుడు వచ్చి, అతిధి సత్కారాలు పొంది ఇలా అన్నాడు.

'' ఇంద్రుడు నన్ను పంపాడు. సునాధుడు తిరిగి బతికినందుకు ఆయన చాలా సంతోషంగా ఉన్నాడు. ఆయన మిమ్మల్ని తగాదా పెట్టుకోవద్దని, తన రక్షణలో ఉన్న శ్రుతశర్మను ద్వేషించవద్దనీ చెప్పమన్నాడు.''

ప్రహ్లాదుడు దానికి సమాధానంగా ఇలా అన్నాడు.

''సునాధుడు తిరిగి బతికినందుకు ఇంద్రుడు ఎందుకు సంతోషించ కూడదు? మేమెప్పుడూ గిల్లి కజ్జాలు పెట్టుకోము. ఇందులోనూ తప్పు ఏమున్నది? సూర్యప్రభుడు విద్యాధర చక్రవర్తి కావాలని ఈశ్వరుడు అనుగ్రహించాడు. తనకు బలవంతుడి అండ ఉన్నది గదా అని శ్రుతశర్మే మాతో తగాదా పెట్టుకున్నాడు. ఈశ్వరాజ్ఞకు వ్యతిరేకంగా వెళ్ళడానికి మేము ఎవరం? ఇంద్రుడు చెప్పిన మాట అసందర్భంగా ఉన్నది''.

నారదుడు ప్రహ్లాదుడి మాటకు సమ్మతించి, ఇంద్రుణ్ణి తిట్టి వెళ్ళిపోయాడు.

శక్రుడు దానవరాజులతో '' ఈ విషయంలో ఇంద్రుడు మనకు బద్ధశత్రువు. మనకు మహేశ్వరుడు అనుకూలుడై ఉండగా ఇంద్రుడు ఏం చెయ్యగలడు? అతని విష్ణుభక్తి ఏం చెయ్యగలదు'' అన్నాడు.

తరవాత రెండవ పాతాళంలో పాలించే జయశీలుడనే వాడి కూతురు అర్ధరాత్రి వేళ సూర్యప్రభుడి కోసం వెతుక్కుంటూ వచ్చి, గాంధర్వ విధిలో ఆ రాత్రి అతనికి భార్య అయింది.

మర్నాడు ప్రహ్లాదుడు సునాధుడి గౌరవార్థం విందుచేసి, బలిమొదలుగా గల రాజుల నందరినీ ఆహ్వానించాడు. ఆ సందర్భంలో ప్రహ్లాదుడి కుమార్తె మహల్లిక నృత్యం చేసింది. మహల్లికకు పన్నెండు మంది చెలికత్తెలున్నారు. ప్రహ్లాదుడి అన్న వారిని స్వర్గం నుంచి బందీలుగాతెచ్చాడట. మహల్లికకూడా తాను పన్నెండు మంది సఖులతోసహా సూర్యప్రభుణ్ణి పెళ్ళాడింది. ( దానవ కన్యలందరిని 'చండి' అనే పిలిచే ఆచారం ఉన్నట్టు కనబడుతుంది.)

భూదాసకవి మాటమీద అందరూ కశ్యపుడి ఆశ్రమానికి వెళ్ళారు. అక్కడ కశ్యపుడి వెంట ఆయన భార్యలైన దితీ, దానువూ ఉన్నారు. ( వీళ్ళేదైత్య దానవుల తల్లులు.)

ఆ సమయంలో కశ్యపుడు పేర్కొన్న ప్రముఖ దానవులు : శంబరుడూ, త్రిశిరుడూ, వాతాపీ, ఉలూకుడూ, కాలుడూ, వృషపర్వుడూ, ప్రబలుడూ, ప్రభుడూ, సుందోపసుందులూ, హయగ్రీవుడూ, వికటాక్షుడునూ, వీరంతా చని పోయి మానవజన్మలెత్తి సూర్యప్రభుడి పరివారంలో ఉన్నట్టు కశ్యపుడు అన్నాడు

దానవులు కశ్యపుడి వద్ద ఉండగానే ఆయన దర్శనం చేసుకోవటానికి ఇంద్రుడు వచ్చాడు. అతను సూర్యప్రభుణ్ణి చూసి, '' ఈ మనిషి విద్యాధర చక్రవర్తిత్వం కోరుతున్నాడు ఇంద్రత్వమే ఎందుకు కోరడు?'' అన్నాడు.

'' నువ్వు ఇంద్రుడివి కావాలని పరమేశ్వరుడు నిర్ణయించినట్టే తను విద్యాధర చక్రవర్తి కావాలని నిర్ణయించాడు'' అన్నాడు మయుడు.

'' ఇతని అందం విద్యాధర చక్రవర్తిత్వానికి మించి ఉన్నది'' అన్నాడు ఇంద్రుడు.

''నిజమే శ్రుతశర్మ అందం విద్యాధర చక్రవర్తిత్వానికి తగినదైతే ఈ కుర్రవాడి అందం ఇంద్రత్వానికి తగినదే'' అన్నాడు మయుడు.

ఇంద్రుడు మండిపడి సూర్యప్రభుణ్ణి చంపబోయాడు. కాని కశ్యపుడి ముఖం రౌద్రం కావటం చూసి ఆ ప్రయత్నం మానుకుని తాను విద్యాధర చక్రవర్తిగా నిర్ణయించిన శ్రుతశర్మ స్థానాన్ని కాజేయ చూస్తున్నందుకు సూర్యప్రభుణ్ణీ, అందుకు తోడ్పడుతున్న మయుణ్ణీ ఆక్షేపించాడు.

''మయుణ్ణి ఎందుకు తప్పుపడతావు? అతను శివుడి ఆదేశాన్ని నెరవేర్చు తున్నాడు,'' అన్నాడు కశ్యపుడు.

ఈ విధంగా కథ సాగిపోతుంది. దానవ శ్రేష్ఠుడైన నోముచి ఇంద్రుణ్ణి అనేక మార్లు ఓడించి తరిమి కొట్టాడట. పాలసముద్రాన్ని మథించే ముందు కశ్యపుడే దేవ దానవులకు సఖ్యం చేశాడట., అందులో పుట్టిన ఉచ్చైశ్రవం అనే గుర్రం నోముచి వంతు వచ్చిందట. దేవతలు అమృతాన్ని కాజేసేసరికి దేవదానవుల మధ్య తిరిగి ఘర్షణ సాగింది. ఆ ఘర్షణలో చనిపోయిన దానవులను ఉచ్చైశ్రవం వాసన చూపి బతికిస్తూ వచ్చిందట. దానవులను ఓడించటం దేవతకు అసాధ్యమయింది. అప్పుడు బృహస్పతి ఇంద్రుడితో, నోముచి యాచకులు ఏది అడిగినా నిరాకరించడనీ ఇంద్రుడు వెళ్ళి ఉచ్చైశ్రవాన్ని అడగాలనీ అన్నాడట. ఆ సలహా పాటించి ఇంద్రుడు నోముచిని అడిగి గుర్రాన్ని తీసుకుని నోముచిని హత్య చేశాడు. అలా చనిపోయిన నోముచి దానవు కడుపున ప్రబలుడై పుట్టి, దేవతలు యజ్ఞపశువుగా రమ్మని వేడితే ఒప్పుకుని మళ్ళీ చనిపోయి, ప్రభానుడుగా పుట్టాడట. ప్రభానుడు ఈ జన్మలో సూర్య ప్రభుడికి అత్యంత సన్నిహితుడు.

ఇలాగే వంచన పొందిన మరొక దానవుడు బలి.

మొత్తం మీద ఈ కథ ఒక సంగతి స్పష్టం చేస్తుంది. దానవులు నియమబద్ధులు, దేవతలు వంచకులు. వారికి నియమాలు లేవు

చివరకు యుద్ధం జరుగుతుంది. సూర్యప్రభుడు జయించి విద్యాధర చక్రవర్తిత్వం సంపాదిస్తాడు. అంతా అయాక దేవదానవుల మధ్య సామరస్యం ఏర్పడుతుంది

మొత్తం మీద చూస్తే ఈ కథ మన పురాణ కథల కన్నా కొంత పాతదేమో ననిపిస్తుంది. ఇంద్రుడి రాజకీయాలు ఈనాటి అగ్రరాజ్యాలను జ్ఞాపకం చేస్తాయి పురాణాలలో ప్రముఖంగా చెప్పబడిన రాక్షసులు ఇందులో నామమాత్రంగానైనా ప్రస్తావించబడలేదు. భౌతికవాదానికీ, ఆధ్యాత్మికవాదానికీ మధ్య ఘర్షణ జరగటం, చరిత్ర యుగాల్లో కూడా మనకు తెలుసు. శంకరాచార్యులవారు వేదాంతానికి ప్రాణప్రతిష్ఠ చెయ్యటమే గాక, సాంఖ్యులనూ ఇతర నాస్తికులనూ ఖండించటానికీ వారి సిద్ధాంతాలు పూర్వపక్షం చెయ్యటానికీ చాలా కృషిచేశాడు. ఇది దేవదానవ సంఘర్షణలనాడే ఉన్నట్టు ఒక ప్రాచీనగాథ ఉండటం చిత్రం. తొలి భౌతికవాదులు దానవులనీ, వారు సాంఖ్య, యోగాలను విశ్వసించారనీ సాక్ష్యం ఉండటం మరీ చిత్రం. 'అసురా' అనే సంబోధన ఋగ్వేదంలోనే ఒకప్పుడు గౌరవ ప్రదంగా ఉండేదన్నది చూస్తే, ముందు అంతా అసురులేనని రానురాను ఆ మాట ' ఆర్యులం' అని చెప్పుకునే వారికి గర్హ్యమయిందనీ, అంతా ఒక కుదుటివాళ్ళేననీ కశ్యపుడి ఉదంతాన్ని బట్టి మనం అనుకోవచ్చు.

ముందేచెప్పినట్టు శాస్త్రజ్ఞులకు ఈ కథలో ఇంకా అనేక విషయాలు కనబడవచ్చు వారిని ఈ కథను, వీలైతే సంస్కృతంలో పరిశోధించమని కోరతాను. నేను ఈ వ్యాసానికి ఆధారంగా తెలుగులో వున్న కథనే తీసుకున్నాను. తెలుగులో దైత్య, దానవ, అసుర, రాక్షస శబ్దాలు సమానార్థకాలుగా ఉపయోగించబడి ఉండవచ్చు.

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 24.3.1972*

# జీవితాలు - దేవుడి పాత్ర

దేవుడు మనిషిని చేశాడన్న దానికి రుజువు ఏమీ లేదుగాని మనిషి దేవుణ్ణి చేశాడనటానికి చాలా ఆధారాలున్నాయి. ఒకప్పుడు మానవ సమాజం దేవుడు లేకుండానే జరుపుకున్నది. ఈనాడు కూడా ఆటవిక సమాజాలవాళ్ళు దేవుడు లేకుండానే జరుపుకుంటున్నారు.

మనం మన పూర్వీకులనుకునే తొలికాలపు ఆర్యులు విశ్వవ్యాప్తిగా మన అవాఙ్మానసన గోచరుణ్ణి ఆరాధించలేదు. ప్రకృతిని ఆరాధించారు. తమ అభ్యుదయానికి దోహదం చేసిన మనుషులను స్తోత్రం చేశారు. వారి ప్రార్థనలు కోరికల రూపంలో ఉండేవి.

శుభం భవతు, దీర్ఘాయుష్మమస్తు, ఐశ్వర్య ప్రాప్తిరస్తు – ''శ్రీ వెంకటేశ్వర స్వామీ నా రోగం నయం చెయ్యి, ఓ దేవుడా, నాకు ఉద్యోగం ఇప్పించు'' ఇలా ఉండేవి కావు.

వర్గ రహితమైన ఆర్య సమాజం 'బ్రహ్మ' అన్న మాటను ఆహారం అన్న అర్థంలో వాడింది. ఉపనిషత్తులలో 'బ్రహ్మ' అంటే తెలుసుకోవలసినవాడు, తెలుసుకోరానివాడూ కూడా అయ్యాడు. బ్రహ్మజ్ఞానానికి, అజ్ఞానానికి తేడా ఏమిటో చచ్చినా అంతు చిక్కని సంస్కృతి ఉపనిషత్తుల కాలంలో వెలిసిందనుకోవాలి.

మనుషులు గణాలలో, గణ నియమాలకు లోబడి జీవించినంత కాలమూ వారికి మతంతోగాని దేవుడితోగాని అవసరం కలగలేదు. ఎందుకంటే వారి కష్టసుఖాలు సమంగా ఉండేవి. ఒకడి శ్రమను మరొకడు దోచుకొని, 'నీ కన్న నేను గొప్ప జన్మగల వాణ్ణి' అనే అవసరం గాని, అవకాశం గాని ఆ సమాజంలో లేకపోయింది. అది సమసమాజం. కాని అది పరిణత సమాజం కాదు.

సామాజిక పరిణామం కోసం గణ జీవితాన్ని నిర్మూలించవలసిన అవసరం ఏర్పడింది. అలాంటి అవసరం ఏర్పడటానికి కారణం ఉత్పత్తి శక్తుల పెరుగుదల. ఎవడి శ్రమతో వాడి పొట్టనిండని దశపోయి, ఒకడి శ్రమమీద నలుగురు బతకదగిన ఉత్పత్తి శక్తులు మానవుడి అధీనంలోకి వచ్చాయి. దానితో వర్గ సమాజం ఏర్పడింది. దోచుకునేవాళ్ళూ, దోచుకోబడేవాళ్ళూ, ఒకే సమాజంలో అవతరించారు. అలాంటి వర్గ విభజన గణ జీవితానికి పూర్తిగా విరుద్ధం.

వర్గ జీవితంలో వివిధ జాతులకు స్థానం ఉన్నది. కాని అన్ని జాతులకు సమాన ప్రతిపత్తి లేదు. దోచుకోబడేవాళ్లు తక్కువ, దోచుకునేవాళ్లు ఎక్కువా. దురన్యాయంతో కూడినదే అయినా, ఈ మిశ్రమ (వర్గ) సమాజ జీవితం గణ జీవితం కన్న పురోగమించింది. ఫ్యూడల్ వ్యవస్థలో జీవించే వాళ్ళకు బూర్జువా వ్యవస్థ ఆకర్షవంతంగా కనబడినట్టు, వర్గ వ్యవస్థ గణవ్యవస్థలో చిక్కుకు పోయినవారిని బలంగా ఆకర్షించింది. అందులో హీనవర్గంగా ఉండటానికైనా సిద్ధపడి వారు ఆ వ్యవస్థలోకి అడుగు పెట్టారు. గణజీవులు ఏనాడూ ఎరగనంత విస్తృత సమాజాలు వర్గవ్యవస్థలో ఏర్పడటానికి, రాజ్యాలు, సామ్రాజ్యాలూ పుట్టుకు రావటానికి అవకాశం ఏర్పడింది.

దీనికీ దేవుడికీ ఏమిటి సంబంధం అని అడగవచ్చు. సంబంధం చాలా ఉన్నది. సాంఘిక దోపిడిని కొన్ని వర్గాలవాళ్లు శాశ్వతంగా ఎందుకు సహిస్తారు? పీడిత వర్గాలకు మత్తు మందుపెట్టి వాళ్ళ మనస్సులను శాశ్వతంగా జోకొట్టాలి. అందుకు గాను వర్గసమాజం మనుషులు చేసినది కాదనీ దేవుడు చేసినదని సిద్ధాంతీకరించాలి. ('చాతుర్వర్ణం మయా సృష్టం' అని దేవుడి చేత చెప్పించారు!)

నిజానికి వర్ణాలన్నవి మొదట పుట్టినప్పుడు అవి వర్గాలే. అందులోనూ మొదటి రెండు (బ్రాహ్మణ, క్షత్రియ) వర్గాలవారు పీడకులు. మిగతా (వైశ్య, శూద్ర) వర్గాలవారు పీడితులు. వర్తకం సమాజాభివృద్ధికి ముఖ్యమైన తరువాత వైశ్యులు గోపాలనా, వ్యవసాయమూ విడిచిపెట్టి అగ్రవర్ణులలో చేరిపోయారు.

ఇలా విస్తరించిన సమాజంలో జీవితంలో హెచ్చు తగ్గులు ఏర్పడ్డాయి ఇది సమసమాజం కాదు. బాధలు ఒకరివీ, భోగాలు ఒకరివీ. దీనికి పీడితులు రాజీపడటానికి పూర్వజన్మ, కర్మ, పుణ్యపాపాలూ స్వర్గ నరకాలూ కల్పించవలసి వచ్చింది ఒకే సమాజంలో కొందరు కడుపులు పగిలేటట్టు తినగలగటమూ, కొందరికి శాశ్వతంగా అర్ధాకలీ ఎందుకు ఉండాలి? వాళ్ళ వాళ్ళ క్రిందటి జన్మలో చేసుకున్న పుణ్యపాపాల ఫలితం!

పుణ్యపాపాలను నిర్ణయించేది ఎట్లా? అందుకని ధర్మాలు ఏర్పాటు చేశారు. దేవుడిలాగే ఇవి కూడా మనిషిసృష్టే. అంతకన్న ముఖ్యమేమంటే ఈ ధర్మాలు సంఘస్వరూపంతోబాటు మారుతూ వస్తున్నాయి. ఇవాళ బ్రాహ్మణులమనీ, వైశ్యులమనీ చెప్పుకునేవారున్నారుగాని, ధర్మశాస్త్రాలలో చెప్పినట్టువారు జీవించటం లేదు. ధర్మశాస్త్రాలే మార్పులు చెందాయి. దీనినిబట్టి ధర్మం అన్నది దేవుడు ఏర్పాటు చెయ్యలేదనీ, పుణ్యపాపాలకు దేవుడి బాధ్యత ఏమీలేదని స్పష్టమవుతుంది.

ఇంతకన్నా కూడా చిత్రమేమంటే, సమాజానికి అనుగుణంగా దేవుడే మారాడు! ఉపనిషత్తులలో ఉండే బ్రహ్మపదార్థం ఈనాడు ఎక్కడా కనబడదు. పురాణకాలానికి ఆయన చాలా పతనమైనాడు. రాక్షసులకు వరాలు ఇస్తూ ఉండటమూ, దేవతలకు పితలాటకాలు తెచ్చిపెడుతూ ఉండటమూ ఆయన పని. రాను రాను ఆయన ''మతి తప్పిన మొదటి వేల్పు'' అయిపోయాడు.

వేదకాలంలో చిల్లర దేవుడుగా ఉండిన విష్ణువు పురాణకాలానికి నాలుగు చేతులతో శంఖుచక్రగదా పద్మాలు ధరించి, వర్గ సమాజానికి ఆరాధ్య దేవత అయిన లక్ష్మికి మొగుడై, పాలసముద్రంలో (లేదా, వైకుంఠంలో) చేరాడు.

వేదకాలానికి అనార్యుడైన కృష్ణుడు ఆ విష్ణువు అవతారమై పెద్ద దేవుడుగా పరిణమించాడు. అనార్యగణాలకు నాయకుడైన రుద్రుడు శివుడుగా పేరు మార్చుకుని త్రిమూర్తులలో ఒకడుగా ఆమోదించబడ్డాడు. చిల్లర దేవతలలో చేరిన యముడూ, కుబేరుడూ, మొదలైనవాళ్ళూ ఆర్యులు కాకపోయినా వారికి పురాణాలలో ఘనమైన స్థానం దొరికింది.

ఇదంతా రాజీ విధానాన్ని సూచిస్తుంది. అవును. సమాజంలో అలాంటి రాజీ

జరిగింది. గణ జీవితంలో ఒకనాడు జీవించిన ఆర్యులు రాజీపడకుండా వర్ణవ్యవస్థను ఎలా ఆమోదిస్తారు? ఆర్యులూ, ఆనార్యులూ ఏకమై వర్గసమాజాన్ని ఏర్పాటు చేసి, తద్వారా సాంఘిక పరిణామాన్ని సాధించినప్పుడు, అనార్య నాయకులను కూడా ఆకాశంలోకి పంపి, అందరు దేవతలకూ సమన్వయం కుదర్చవలసి వచ్చింది.

ఈ సామాజిక విస్తరణలో ఆర్య లక్షణాలు ఏనాడో అంతరించాయి ఏ ప్రదేశాలలో ఉన్నవారు ఆ ప్రదేశాలలో ఆనాదిగాగల జీవితాన్ని అనుసరించారు. విస్తరించినదల్లా బ్రాహ్మణ మతం. ఇది భౌతిక దృక్పథంతో కూడినది కాదు. ఆధ్యాత్మిక మూఢవిశ్వాసాలను ప్రచారం చేసేది. తన మనుగడ కోసం అది ఆటవిక ఆచారాలతో సహితం రాజీపడింది. దీనికి ఒక్క ఉదాహరణ చాలు. మన వ్రతాలు అనేవి ఏవీ వైదిక మతానికి సంబంధించినవి కావు. కాని ప్రతి వ్రతానికి బ్రాహ్మడు వచ్చి, మంత్రాలు చదివి, దక్షిణ తాంబూలాలు పుచ్చుకుపోతాడు. మన సమాజంలో బ్రాహ్మడు అగ్రస్థానం సంపాదించినది ఇలాటి రాజీ విధానంతోనేననీ, అనేక రకాల పరిణామ దశలలో ఉన్న సమాజాలను ఒక సంఘం చెయ్యటానికి బ్రాహ్మణుడు చేసిన కృషి గణనీయమని ఒప్పుకోవచ్చు. కాని ఆధ్యాత్మిక దుష్ప్రచారంతో సాంఘిక దోపిడిని శాశ్వతం చేసిన మహాపాపం బ్రాహ్మడు ఒడిగట్టుకున్నాడు. ఇందుకోసం బ్రాహ్మడు సృష్టించిన వాఙ్మయం అంతులేనిది.

భౌతికవాద దృష్టితో చూస్తే మన మతసంస్కృతికి కించిత్తయినా ఆధారం లేదని అతి సులువుగా తెలిసిపోతుంది. కుల వ్యవస్థా, వర్ణాశ్రమ ధర్మాలూ, విధీ, పుణ్యపాపాలూ, స్వర్గనరకాలూ (నీతిని వేదకాలపు ఆర్యులు ఎరుగురు) అన్నిటికీ కారకుడై ఉండి, నిర్గుణుడు అనిపించుకోదగిన దేవుడూ, అమలులో ఉండటానికి వీలులేని ధర్మశాస్త్రాలూ వీటన్నిటినీ కలగాపులగం చేసి, ఇది మన సంస్కృతి అని చెప్పుకోవలసిన దుస్థితి మరేజాతికి పట్టదు. ఆటవిక దశనుంచి అధునాతన దశ దాకా అన్ని రకాల ఆచార విశ్వాసాలను హేతువాద రహితంగా అమలు చేసి ఆమోదించే మన పరిస్థితి మహాక్షుద్రమైనది సామాజిక పరిమితికి దోహదం చేసేది హేతువాదమూ, శాస్త్రజ్ఞానమూ అయితే మనం నాగరిక సమాజంగా పరిణమించటం ఈ పరిస్థితిలో సాధ్యం కాదు.

మిగిలిన వాటి దాకా పోనవసరం లేదు. మనం మన జీవితాలకు ఆధారమనుకునే విధీ, కర్మ సిద్ధాంతమూ, దేవుడూ ఒక దానితో ఒకటి సమన్వయం కావు. ఇందులో ఏ ఒకటి నిజమైనా మిగిలినవి అనవసరం.

ఎప్పుడేది జరిగేది విధి నిర్ణయిస్తుంది. పాపాలు చెయ్యవలసినవాడు పాపాలు

చేస్తాడు. పుణ్యకార్యాలు చేయవలసినవాడు పుణ్యకార్యాలు చేస్తాడు శిక్షాస్మృతులు దేనికి? మనుషుల చేతలను గురించి తర్జనభర్జనలూ, విమర్శలూ దేనికి? అనవసరం.

కర్మ సిద్ధాంతం : జరిగే ప్రతిదానికి కారణం ఉంటుంది. కార్యకారణ సంబంధం విడగొట్టరానిది. ఇది మొదలు చివర లేని వలయం ఒకడు చెడ్డ పనులు చేశాడంటె దానికి ఏదో కారణం ఉండే ఉంటుంది.

దేవుడు : నిజంగా దేవుడు నిర్వహించే పాత్ర ఏమిటో ఎవరు స్పష్టంగా చెప్పలేరు. విధిని వంచిస్తాడా ? ఒక కర్మకు మరొక ఫలితం ఇస్తాడా? జరిగే దానిలో మనిషి దేనికి బాధ్యుడు, దేవుడు దేనికి బాధ్యుడు? వీళ్ళ బాధ్యతల పరిమితులు ఎవరు నిర్ణయిస్తారు ? మనిషే నిర్ణయించాలి. ఇది మరీ విచిత్రం.

ఈ మూడు కూడా అకర్మణ్యత్వానికి దారితీసేవేననేది గమనించాలి. మనం అకర్మణ్యులం కాకుండా జీవిస్తున్నామంటే వాటిలో మనకు నిజంగా విశ్వాసం లేకనే.

భౌతిక దృష్టిగలవాడికి మానవజీవితంలో కలిగే ప్రతీదానికీ భౌతిక కారణం కనిపిస్తూనే ఉంటుంది. ధనికులున్నచోట దరిద్రులున్నారు. పీడకులున్నచోట పీడితులుంటున్నారు. అజ్ఞానం ఏలుతున్నచోట మభ్యపెట్టేవాళ్ళు ఉంటున్నారు. మందులూ, ఆహారమూ, బట్టలు పంచటమూ, అత్యవసరమైన దేశంలో మూఢవిశ్వాసాలూ, భక్తి పంచుతున్నారు. దిక్కులేని వారికి దేవుడే దిక్కు అన్నది పచ్చి అబద్ధం. దేవుడు దిక్కు అవుతున్నది దిక్కున్నవారికే. వాళ్ళే దేవుణ్ణి పాపాల భైరవుడు చేసి, తాము సమాజంలో తెచ్చే సంక్షోభాలన్నిటికి కారణంగా వాణ్ని చూపిస్తున్నారు. ఈ వంచన ఇంకా ఈ దేశంలో పారుతూ ఉండటానికి కారణం మనం దేవుడికి అంటగట్టిన క్షుద్ర మనస్తత్వం.

వాడు లంచాలు పుచ్చుకొని మేలుచేస్తాడు. తన పేరు స్మరించిన పాపాత్ముల పాపాలన్నీ పోగొడతాడు. కాని అనాథలకు ఒక మెతుకు ఇవ్వలేడు. ఉన్న వ్యవస్థను కాపాడటానికి వాడు అంగరక్షకుడు! ఈ వ్యవస్థ మార్చగోరేవాళ్లు ముందు అంగరక్షకుణ్ని తొలగించాలన్నది స్పష్టం.

*ప్రభంజనం, పక్షపత్రిక, 16-11-1972.*

# మాయదారి దేవుడు - I

## 1. ఆస్తికులూ, నాస్తికులూ

కమ్యూనిస్టుల మీద శ్రోత్రియుల ఆక్షేపణ ఏమిటంటే, వాళ్ళు నాస్తికులు నాస్తికుడు అనే మాటకు నిర్వచనం రకరకాలుగా ఉండి. ఆ మాట ఉపయోగించేవాణ్ణి బట్టి మారుతుంది. దేవుడున్నాడని నమ్మని వాళ్ళంతా నాస్తికులేనని అనేకమంది అభిప్రాయం కాని ఇది ప్రామాణికమైన నిర్వచనం కాదు; శతకోటి నిర్వచనాలలో అది ఒకటి మాత్రమే.

దేవుడిలో విశ్వాసం ఉన్నప్పటికీ, ముసల్మానులూ, క్రైస్తవులూ హిందువుల దృష్టిలో నాస్తికులే. వాళ్ళ దృష్టిలో వీళ్ళూ నాస్తికులే.

వేదప్రమాణాన్ని ఆమోదించనివాళ్ళు ఒకప్పుడు నాస్తికులుగా భావించబడేవాళ్ళు. బౌద్ధులూ, జైనులూ రెట్టింపు నాస్తికులు కావాలి, కాని వాళ్ళు సాదా నాస్తికులే. ఎందుచేత? వేదప్రమాణాన్ని ఆమోదించలేదు గనక! మీమాంసకులు దేవుడు లేడు పొమ్మన్నప్పటికి వాళ్ళునాస్తికులుకారు. అదెందుచేతా? వాళ్ళు వేద ప్రమాణాన్ని పూర్తిగా ఆమోదించారు గనుక! ఈలెక్క ప్రకారం నాస్తికత్వానికీ, ఆస్తికత్వానికీ గీటురాయి వేదాలలో నమ్మకంలాగా కనబడుతుంది.

అయితే ఇది కూడా నిజం కాదు. వేదప్రమాణాలు ఏనాడో పోయాయి. అన్నిటికీ వేదాలే ప్రమాణం అన్న శంకరాచార్యులగారి తత్వాన్ని 'ప్రచ్ఛన్న బౌద్ధం' అనేశారు. అంటే నాస్తికత్వమే గదా?

వేదాలతో నిమిత్తం లేకుండా అనేక ధర్మశాస్త్రాలు వచ్చాయి. వాటిని ఉల్లంఘించిన వాళ్ళు నాస్తికులు.

పిలకకత్తిరించి క్రాఫ్ పెట్టుకున్న కొడుకును తండ్రి '' ఓరి, నాస్తికపు వెధవా!'' అనటం జరిగింది. జాతీయ మత సంస్కృతుల కంతకూ గుత్తాధికారం సంపాదించిన బ్రాహ్మలు 'నాస్తికుడు' అనే మాటను స్వేచ్ఛానుసారం ఉపయోగించే అధికారాన్ని కూడా పుచ్చుకున్నారు.

స్థూలంగా భౌతికవాదులమని చెప్పుకునే వారు నాస్తికులు. సామాజిక పరిస్థితులను మార్చాలన్న వారందరూ నాస్తికులు. ఈశ్వరుడిలో విశ్వాసం ఉన్నప్పటికీ, వీరేశలింగం గారు విధవా వివాహాలు చేస్తామనీ, అవినీతిని తూర్పారబట్టుతామనీ అన్నందుకు ఆయనను స్వాములవార్లు నాస్తికుణ్ణి చేసి, చావగొట్టించడానికి

ప్రయత్నించారు. ( ఆస్తికత్వంలో అవినీతికి కూడా చోటు ఉంటుందా? అని ఎవరూ ఆశ్చర్యపడ నవసరం లేదు. వేదకాలపు జీవితంలో ఆవులను కోసుకు తినటం ఆనవాయితీగా ఉండినట్టు స్వాములవార్ల సంస్కృతిలో వారి రాసక్రీడలకు కూడా చోటు ఉంటుంది. అలా ఉండరాదన్న వాళ్ళ్ల తిరుగుబాటు చేసి 'నాస్తికులు' అని పిలిపించుకుంటారు అందులో విడ్డూరం ఏమీలేదు )

ఎన్ని మతాలూ, ఆచారాలూ, సంస్కృతులూ నిష్క్రమించినా, నాస్తికత్వం మాత్రం చిరంజీవిగా ఉంటున్నది.

శ్రీవినోబాభావేగారు ఒకచోట ఆతిథ్యం స్వీకరించటం నామిత్రులొకరు స్వయంగా చూశారు. ఆయన 'ఫలహారం' కింద 28 రూపాయలు ఖర్చు అయిందిట. అందులో ఒక అయిటం 12 రూపాయల ఆపిల్ పళ్ళరసం ! నామిత్రులు ఇదంతా చూసి ఆచార్యగారిని ''అయ్యా, తమరు ప్రజలకోసం జీవిస్తూ ఆహారం కింద ఇలా ఖర్చు చేస్తున్నారే! మామూలు ప్రజలు ఒక్క ఆపిల్ పండు కూడా కొనలేరు. గదా! మీలాగా శేర్లకు శేర్లు వాళ్ళు ఎలా తాగగలరు. .'' అని వినయంగానే అడిగారట.

ఆచార్యభావేగారు ఆయనకేసి కోపంగాచూసి, ''తుమ్‌నాస్తిక్‌హో! '' అన్నారట. తాను ఆపిల్ పళ్ళరసం తాగినదీ, పెరుగు పిడత లే లెక్కన తిన్నదీ అబద్ధం కాదు గనక, ఆచార్యజీ నామిత్రుణ్ణి 'నాస్తిక్' అనటానికి కారణం ఆయన ప్రజలను వెనకేసుకురావటం అయి ఉంటుంది.

ప్రజలను వెనకేసుకు వచ్చిన వాళ్ళు నాస్తికు లనటానికి సందేహం లేదు. కమ్యూనిస్టులూ, విప్లవకారులూ, మామూలు సంస్కరణవాదులూ, పార్లమెంటులో ప్రభుత్వ పక్షానికి ప్రజలను గురించి అడపా దడపా జ్ఞాపకం చేసే వాళ్ళూ ఏదో ఒక శాతంలో నాస్తికులే. అందుకే వారిని దుమ్మెత్తి పొయ్యటం మొదలుకుని, మారణాయుధాలతో దుమ్ముచెయ్యటం దాకా మనం ఈనాడు చూస్తున్నాం.

## 2. ఏదేవుడు?

***''సర్వం సర్వం సహావ్యాపి, సర్వజీవ***
***జీవనాధారుడగు నొక్క దేవుడెవడో***
***కలడనగ విందు గాని నిక్కం బెరుంగ!***
***వాడదృశ్యుండు, మాకేల వానిగోల!''***

వేదకాలపు దేవతల సంఖ్య 3339 అని ఋగ్వేదం (3–9–3) లో ఉన్నదట. సాయణాచార్యులుగారు ఈ సంఖ్యను 33 కు కుదించారు. మిగిలిన 3306 మందికీ

'కాబినెట్ రాంక్' లేకపోయి ఉండొచ్చు)

ఈ వేదకాలపు దేవతలంతా ఒక జాతివాళ్లు కారు. వీళ్ళలో కొందరు మనుషులే! చచ్చి దేవతలుగా రూపొందారు ఈ మాట సాయణభాష్యంలోనే తరచుగా కనిపిస్తున్నదట. మరికొందరు దేవతలు ప్రకృతి శక్తులు – సవిత్ళ (సూర్యుడు) అగ్ని, వాయువూ, ఉషస్సూ వగైరాలు. ఇంకా కొన్ని కేవలము వస్తువులు – స్రుక్స్రువాలూ, ఆయుధాలు, పాచికలూ లాటివి. దక్షిణ దేశంలో సూట్లు వేసుకున్న వాళ్ల కూడా ప్రతిరాయి దగ్గరా ఆగి చెప్పులు విడిచి, చెంపలు వేసుకుని, చెవులు పట్టుకుని గుంజిళ్ళు తీసినట్టుగా, వేదకాలపు ఆర్యులు ప్రతి వస్తువుకూ దణ్ణాలు పెట్టేవాళ్ళేమో మరి. కాని వాళ్ళ ఘరానా దేవుళ్ళు కూడా మనుషులు చేసే పనులు – యుద్ధాలు చెయ్యటమూ, గోవులను ఎత్తుకు రావటమూ, తాగటమూ, గప్పాలు కొట్టటమూ చేశారు. వేదకాలపు ఉత్కృష్ట దేవుడైన ఇంద్రుడు ఇవన్నీ చేశాడు వరుణుడూ, మిత్రుడూ (విడరాని జంట) ఇవన్నీ చేశారో లేదో గాని, వాళ్ళు నాయకులుగా ఉండిన కాలంలో మామూలు మనుషులను అదరగొట్టేశారు. '' ఎక్కడ ఏ ఇద్దరు ఏం మాట్లాడుకున్నా వరుణుడికి తెలుస్తుంది'' అన్న టెర్రర్ వేదంలో కనబడుతుంది. హిట్లరు కూడా ఇంత భయోత్పాతం కలిగించి ఉండడు. పైపెచ్చు ఈ వరుణుడు 'అసురుడు'.

ఉపనిషత్తులు వచ్చేసరికి ఈ దేవుళ్ళందరూ ఎగిరిపోయి 'బ్రహ్మ' వచ్చాడు. వేదకాలపు తొలి ఆర్యులు 'బ్రహ్మ' అంటే కేవలమూ ఆహారమూ, గోసంపదా (రెండూ ఒకటే) అనుకునేవారు. అది నిజం కాదని ఉపనిషత్తులు సూచనగా అన్నాయి. బ్రహ్మ అసలైన దేవుడు. వాడు నిరాకారుడు. అవాఙ్మానస గోచరుడు. వాణ్ణి తెలుసుకునే మార్గం లేదు. తెలుసుకోకపోతే ముక్తిలేదు. ''నోనవేదేతి వేదచ!'' ( ఎవనికి బ్రహ్మము ఎరుంగబడలేడో వానికి అది యెరుంగబడనిది) సంపూర్ణ అజ్ఞానాన్ని చేరుకున్న ఈ సంపూర్ణ జ్ఞానం లేనివాడు చాలా నష్టపోతాడని కేనోపనిషత్తు భయపెట్టుతున్నది.

ఇలాటి దేవుడు ఉన్నాడన్నది ఎంత సత్యమో, లేడన్నదీ అంత సత్యమే. ఈ దేవుణ్ణే శంకరాచార్యులవారు పరమాత్మగా పేర్కొని నాస్తికత్వం కన్న కూడా పనికి మాలిన అధి ఆస్తికత్వాన్ని ప్రవచించారు. నాస్తికత్వం కన్నా కూడా యిది పనికి మాలినదని ఎందుకన్నానంటే, నాస్తికులు భౌతికవాదులు. శాస్త్రజ్ఞానం లోనూ, ఇంద్రియజ్ఞానంలోనూ సంపూర్ణ విశ్వాసం గలవారు. కాని శంకరాచార్యులు గారు ఈ అంతుచిక్కని పరమాత్మ నిజమనీ, కంటికి కనబడే ప్రపంచమంతా మిధ్య అనీ చెప్పేశారు. లౌకికదృష్టిలో శంకరమతం కన్న పచ్చి నిరీశ్వరవాదం ఉండదు. ఇప్పుడు మనం నాస్తికత్వం వదిలిపెట్టి ఈశ్వరవాదం, నిరీశ్వరవాదం గురించి చెప్పుకోవచ్చు.

నాస్తికత్వానికి మళ్ళీవస్తాం)

''పరమాత్మ అనేది ఉన్నది. అదే ఈ జగత్తును సృష్టించి, పోషించి లయం చేస్తుంది. ఈశ్వరుడి ఆజ్ఞలేనిదే ఈగైనా వాలదు మన ఆత్మలు మోక్షం పొందినప్పుడు ఆ పరమాత్మలోనే లీనమౌతాయి.'' అని ఎవరన్నా మనని నమ్మమంటే, అవసరమని తోస్తే నమ్ముతాం లేకపోతే మానేసి, ఏ ఇందిరాగాంధీనో, జయప్రకాశ్ నారాయణ్‌నో, మావోసెటుంగ్‌నో నమ్ముతాం కాని ఒక దశలో కొందరు ప్రబుద్ధులు ఈ పరమాత్మను తర్కంతో నిరూపించటానికి ప్రయత్నించి, బౌద్ధుల చేతా, జైనుల చేతా, మీమాంసకుల చేతా మాడుబొచ్చు రాలగొట్టించుకున్నారు.

ఇటువంటి పొరపాటు ఇస్లాముగాని, క్రైస్తవంగాని చెయ్యలేదు వాళ్ళు దేవుడితో పాటు సైతానును కూడా సృష్టించి, సృష్టిలో గల వైరుధ్యాలన్నీ ఆ ఇద్దరి మధ్య సంఘర్షణగా చిత్రించారు. తన సృష్టిలోని అవకతవకలకూ, కుళ్ళుకూ దేవుడు జవాబుదారు కావలసిన అగత్యం తప్పింది. మన పరమాత్మకు అది తప్పలేదు అందుచేతేనేమో కష్టసుఖాలు మిథ్య అనుకుని రెంటికీ అతీతంగా ఉండమని మతబోధకులు చెప్పారు. రెండింటికీ అతీతంగా ఉండదలిస్తే జీవించటం దేనికీ?

పర్యవసానం ఏమిటంటే, ఈ ఉపనిషద్బ్రహ్మ సోదిలోకి రాకుండా వెళ్ళి పోయాడు. అతగాణ్ణి తలచుకునేవాళ్ళు లేరు. తిరిగి మన దేశంలో వేదకాలపు దేవుళ్ళలాటి దేవుళ్ళనూ, నాస్తికత్వాన్ని కూడా పునఃప్రతిష్ట చేసుకున్నాం. అదే గమనించదగిన అసలు విశేషం

## 3. భౌతికవాదం

దేవుడు అన్న భావం మధ్యలో వచ్చినది తన కనీసావసరాలకు ప్రకృతితో ఘర్షణ పడే మానవుడు దేవుణ్ణి గురించి తత్వచింతనలోకి దిగలేడు కాని ఆ దశలో మానవుడికి భౌతికవాదాన్ని పెంపొందించుకునే సామర్థ్యంకూడా ఉండదు. అందుచేత తన అనుభంలోకి వచ్చే ప్రకృతి శక్తులన్నీ అద్భుతంగానే ఉంటాయి. మబ్బులూ, మెరుపులూ, పిడుగులూ, దానంతట అదే పుట్టుకొచ్చే కార్చిచ్చూ, వర్షాలూ, వరదలూ, నదులూ, కొండలూ, అరణ్యాలూ, సుడిగాలులూ, మారే ఋతువులూ సమస్తమూ ఆదిమానవుణ్ణి అద్భుతపరుస్తాయి. వీటిని గురించి పరిజ్ఞానం పెరిగిన కొద్దీ ప్రకృతి స్వభావాలు మనిషికి అర్థం కావటంతో బాటు వాటిని తన మనుగడకు ఉపయోగించే సామర్థ్యం లభిస్తుంది. ఋతువులకు ఒక క్రమం వున్నది. వాటిని ముందుగా తెలుసుకుంటే వానాకాలం గడపటానికి తగిన నివాసమూ, ఎండాకాలం గడపటానికి తగిన నివాసమూ ఏర్పాటు చేసుకోవచ్చు. ఏ కాలంలో ఏ ఆహారం ఎక్కడ దొరికేదీ తెలుసుకోవచ్చు. ఆదిమానవుడికి

అధ్యయనం చెయ్యటానికి ప్రకృతి తప్ప వేరేదీ లేదు. అదే వాడి పాఠ్యపుస్తకం. జ్ఞానం సామూహికం గనక పది రకాల అనుభవాలు కలబోసుకుని . జ్ఞానపు గుట్టను పెంచుకుని, సమష్టిగా వినియోగించ వచ్చు. ప్రకృతికి సంబంధించిన జ్ఞానం ఎంత విలువైనదో అంత లోపభూయిష్టం అయినప్పటికీ దాన్ని ఎంత ఆదరంతో చూడాలో ఆదిమానవుడికి తెలిసినట్టుగా విజ్ఞాన సర్వస్వాలు గల ఆధునిక మానవుడికి తెలియక పోవచ్చు.

ఇలా ప్రకృతి స్వభావాన్ని - వేద పరిభాషలో ఋతాన్ని - ఆరాధిస్తూవస్తున్న మానవుడికి ప్రకృతికి అవతల ఒక సృష్టికర్త ఉండి ఉంటాడని తట్టవలసిన అగత్యం ఏమీ లేదు. ఎందుకంటే పదార్థం ఎలా రూపాలు మారుతున్నదీ స్పష్టంగా కనబడు తున్నది. ఆహారం పుష్టినిస్తున్నది. గడ్డిని బాగా తిన్న ఆవులు పాలు బాగా ఇస్తున్నాయి. వానలు తక్కువైనప్పుడు మొక్కలు ఏపుగా పెరగవు. నిప్పు చలిని పారదోలుతుంది. ఉన్ని వెచ్చదనాన్ని ఇస్తుంది. పగలు పోయి రాత్రి వస్తుంది. తిరిగి సూర్యుడు మళ్ళీ పొడుస్తాడు. ప్రాణంలేని వాటికి పుట్టటమూ, పెరగటమూ, చావటమూ ఉండదు గాని, ప్రాణులకు ఇవన్నీ ఉంటాయి. రాళ్ళను చెక్కి పరికరాలూ, ఆయుధాలూ చేసుకోవచ్చు ఆయుధం భుజబలాన్ని పెంచుతుంది. ఎ

వేటాడటానికి వలలూ, ఉచ్చులు పన్నటానికీ, పళ్లూ దుంపలూ తెచ్చుకోవటానికి, నిప్పును ఉపయోగించుకోవటానికీ, సూర్యచంద్రుల గమనాలను వీలయినంత బాగా అంచనా కట్టటానికి ఈశ్వరుడి సహాయం ఏమీ అవసరం లేదు. అయినా ఆదిమానవుడి జ్ఞానానికి అతీతంగా ఉండిపోయిన ప్రకృతి శక్తులూ, వాడి జీవనానికి అత్యవసరంగా కావలసిన వస్తువులూ వాడికి ఆరాధ్యాలయాయి. వాడికి వాటి పట్ల గల భావాల్ని ఆధునికుల పరిభాషలో చెప్పటం సాధ్యం కాదు. అందులో భయమూ, గారాబమూ, ప్రేమలాటి భావాలెన్నో ఇమిడి ఉంటాయి. జ్యోతిశ్శాస్త్రంతో బాటు సమస్తశాస్త్రాలకూ పునాది ప్రకృతి అధ్యయనం నుంచే లభ్యమయింది. దీనికీ, 'నోనవేదేతి వేదచ' అనే స్థితికీ ఎక్కడా లంగరు అందదు.

జాతి పెరుగుదలకుగాను స్త్రీ నిర్వహిస్తున్న పాత్రను అర్థం చేసుకుని, తల్లినే తప్ప తండ్రిని ఎరగని దశలో మానవుని మాతృత్వాన్ని మహామాత రూపంలో భావన చేసినా, ప్రకృతినే ఒక మహాతల్లిగా తలపోసినా ఆశ్చర్యపడనవసరం లేదు. ఆ మహామాతకు ప్రతీకలుగా గ్రామదేవతలు పుట్టుకొచ్చారు. ఈ ఆడదేవతలు నిర్వికారులు కారు. ఒక్క అంతులేని శక్తి విషయంలో తప్పిస్తేవాళ్ళూ మనుషులే. వాళ్ళకూ ఆకలి ఉంటుంది. మనుషుల్లాగే జంతువులను తింటారు. వాళ్ళకూ ఆగ్రహానుగ్రహాలు వస్తాయి. మనుషులను దండిస్తారు, చంపేస్తారు. అంటువ్యాధులలో వైరస్‌వల్ల వచ్చే వ్యాధులన్నిటినీ

భారతీయ సామాజిక వ్యవస్థ అనాదిగా వర్ణవ్యవస్థేనన్న నమ్మకమూ, అది ఆధ్యాత్మిక విలువలపైనే ఆధారపడి ఉండేదన్న నమ్మకమూ కూడా పచ్చి మూఢనమ్మకాలు! ఒక కృతయుగం ఉండేదనీ, అప్పుడు ధర్మం నాలుగుపాదాల నడిచి జీవితం నిర్దుష్టంగానూ ఆదర్శవంతంగానూ ఉండేదన్న నమ్మకం కూడా అలాంటిదే

ఆర్యులనేవారు ఒక జాతికి చెందిన వారనీ, అనార్యులు ఆర్యజాతికి భిన్నమైన వారనీ అనుకోవటం కూడా పొరపాటని శాస్త్రపరిశోధకులు చెబుతున్నారు ఆరంభదశలో ఆర్యుల భౌతిక వర్ణన ఒకటి ఉండినమాట నిజమేగాని త్వరలోనే ఆర్య శబ్దం ఒక భాషకూ, ఒక విధమైన సామాజిక వ్యవస్థకూ ప్రతీక అయ్యింది ఆర్యుల భాష రానివారూ, ఆర్యుల వర్ణాశ్రమ ధర్మాలు పాటించనివారూ మాత్రమే అనార్యులు అనిపించుకున్నారు ఆర్య సంస్కృతికి భిన్నమైనది అనార్య సంస్కృతి. ఆర్యులు ఒక ప్రత్యేక జాతి కావటం మానేశారు.

ఆర్యుల నివాస భూమి ఆర్యావర్తం. అది విస్తరించుతూ వచ్చింది. ఒకప్పుడు గంగా యమునా ప్రాంతమే ఆర్యవర్తం. మనువు నాటికి వింధ్య పర్వతాలకు ఉత్తరాన వున్న దేశం దాదాపు అంతా ఆర్యవర్తమయింది. అందులో చేరిన మగధ, అంగ దేశాలు ఒకప్పుడు మ్లేచ్ఛ దేశాలుగా పరిగణించబడేవి. అసలు జాతి అనే భావం ఆధునిక కాలంలో యూరపులో ఆవిర్భవించింది. ప్రాచీనకాలంలో జాతి విచక్షణకు ఆస్కారం లేదు.

ఆధ్యాత్మిక విలువల మాటకువస్తే అతిప్రాచీన గ్రంథాలలో ఆదర్శజీవితమంటే ధర్మ, అర్థ, కామాల సమన్వయంగా నిర్వచించబడింది. ఇది పూర్తిగా భౌతిక దృష్టి. ప్రాచీనులు జీవితాన్ని మార్పు లేనిదిగా చిత్రించలేదు. నాలుగు యుగాలలోనూ క్రమంగా ధర్మక్షయం కలుగుతుందని చెప్పారు.

స్వచ్ఛమైన ఆర్యరక్తం బ్రాహ్మణులలోనే ఉన్నదన్న నమ్మకం ఒకటి వున్నది. దీనికి ఆధారం ఏమీ లేదని ముందు ముందు తెలుస్తుంది. సవర్ణహిందువు లందరూ ఆర్యులేనని మరొక నమ్మకం ఉన్నది. దీనికి కూడా ఆధారం లేదు.

అనార్యులని చెప్పబడినవారు ద్రావిడులూ, వేరువేరు తెగల వాళ్ళూ, హీన కులజులూనూ. కాని ఈనాడు ద్రావిడులలోనే బ్రాహ్మణులూ, ఇతర వర్ణాలవాళ్ళూ, కులాలవాళ్ళూ ఉండటం మనకు తెలుసు. సిద్ధాంతం ప్రకారం ద్రావిడులు కూడా ఆర్యజాతే కావలసి వుంటుంది. అలాగే ఆంధ్రులు ఒకప్పుడు అనార్యులు. ఈనాడు ఆంధ్రులలో 'చాతుర్వర్ణం' మాత్రమేగాక, అస్పృశ్యులు కూడా వున్నారు. కొందరు ఆంధ్రులు చిత్రంగా ఆర్యజాతి వారైపోయారనుకోవాలి.

(ఆర్యజాతి సిద్ధాంతాన్ని మన జాతీయవాదులు అవలంబించటం, దాని ద్వారా ఆధునిక పాశ్చాత్య జాతులు మనకు జ్ఞాతులవుతారన్న తృప్తి కోసమేనని డాక్టర్ రొమిలా

థాపర్ చెబుతున్నారు. ఆర్య జాత్యహంకారం మీద రాజకీయాలు నడిపిన హిట్లరు ఆర్యజాతికి చెందిన భారతీయులకు ఏదో ఒరగబెడతాడని లొట్టలు వేసిన వారిని నేను ఎరుగుదును )

వర్ణవ్యవస్థ లేక కులవ్యవస్థ ఏదో రూపంలో హరప్పానాటి నగరాలలో వుండేది. అక్కడి సమాజంలో కనీసం మూడు మధ్యతరగతులుండేవి.

కులవ్యవస్థలో వివిధ వృత్తులు వంశ పరంపరగా చేస్తూ వచ్చేవారు వివాహ సంబంధాలు కారణంగా వర్గాలుగా అవుతారు. వాటిలో హెచ్చుతగ్గులు ఏర్పడతాయి. అగ్రస్థానం పురోహితుడిది. అధమస్థానం పాకీవాడిది. మధ్య ఉండే వర్గాలు పైకీ కిందకీ అప్పుటప్పుటా జరుగుతూ వుంటాయి. ఈ పంపిణీ మీద నిర్మితమైన సమాజం కుల వ్యవస్థ అవుతుంది ఇందులో ద్రావిడ జాతి, ఆర్యజాతి, అన్న ప్రసక్తిలేదు. ఇందులో ప్రసక్తి ఉన్నదల్లా సమాజంలో స్థాయికీ, ఆర్థికకస్థితికీ, అధికారానికీ సమాజ స్వరూపాన్ని నిర్ణయించేది ఈవర్గాల మధ్యగల సంబంధాలే. వీటికి ''జాతులు'' అనేపేరు కూడా వున్నది.

వర్ణవ్యవస్థలో చెప్పబడిన వర్గాలుకూడా ప్రముఖమైన చారిత్రిక పరిణామాలు కారణంగా తమ హోదాలలో మార్పులు చేశాయి. వేద సంబంధమైన సాహిత్యంలో బ్రాహ్మణుడు మతతంత్రాంగాన్ని నడిపించటమేగాక రాజకీయ తంత్రంలో కూడా పాల్గొన్నాడు. కాని ఈ హోదా బ్రాహ్మణుల కందరికీ లేదు. కురుపాంచాల బ్రాహ్మణులు మగధకు చెందినవారిని బ్రాహ్మణ బ్రువులన్నారు. తక్కువ జాతి బ్రాహ్మణులు కొందరు ఉత్తర దేశంలో కొందరు రాజులకు పౌరోహిత్యం చేసి ఉన్నతికి వచ్చారు.

తరువాత వచ్చిన సాహిత్యంలో 'ఆభీర బ్రాహ్మణులు' పేర్కొనబడ్డారు. 'ఆభీరులు' మ్లేచ్ఛ జాతివాళ్లు; దక్షిణదేశంలోని 7వ శతాబ్దికి చెందిన ఒక శాసనంలో ''బోయ బ్రాహ్మణుల'' ప్రస్తావన వున్నది. బోయలు శూద్ర తెగలకు చెందినవారు. అటవిక తెగలు కుల వ్యవస్థను అనుసరించి నప్పుడు వారి పురోహితులకు బ్రాహ్మణత్వం లభించినట్టు కనిపిస్తుంది. మొత్తం మీద ప్రజాపాలిత సమాజాలలోని బ్రాహ్మణులకన్నా, రాజపాలిత సమాజాలలోని బ్రాహ్మణులు చాలా పైకి వచ్చారు.

మొదట చెప్పినట్టు బ్రాహ్మణులు పౌరోహిత్యం మాత్రమే చెయ్యలేదు. వడ్రంగంలాటి ఇతర వృత్తులు కూడా చేశారు. కాస్తస్థాయిగలవాళ్లు రాజోద్యోగాలూ, మంత్రి పదవులూ నిర్వహించారు.

గుప్తరాజుల అనంతరకాలంలో బౌద్ధం వెనుకబడిన మీదట బ్రాహ్మణుల బావుటా ఎగిరింది. ఆర్థిక వ్యవస్థకు బ్రాహ్మణుల మతాధికారం అవసరమయింది. ఈ కాలంలో భూదానాలు విస్తారంగా జరిగాయి. అధికారాన్ని శాస్త్రసమ్మతం చేసే శక్తి

బ్రాహ్మణులకు ఉండేది బ్రాహ్మణులు అధికారులుగా నియోగించబడ్డారు. కొందరు బ్రాహ్మణులకు వ్యష్టిగానూ, సమష్టిగానూ అగ్రహారాలూ, బ్రహ్మదేయాలు లభించాయి. అలాటి బ్రాహ్మణులు గొప్ప శాస్త్ర విశారదులో, మత సంబంధమైన సేవ చేసినవారో, రాజుకు వంశవృక్షాలు తయారు చేసినవారో అయి ఉండేవారు

బ్రాహ్మణుల పలుకుబడిలో దేవాలయాలు మంచి పట్టుకొమ్మలు తొలికాలపు హిందూ దేవాలయాలు చిన్న చిన్నగుడులు కాని క్రీ.శ. 500 తరువాత అవి మహత్తరమైన సంస్థలుగా తయారయాయి. వాటికి విస్తృతమైన మాన్యాలూ, దాతలు ఇచ్చిన అంతులేని ధనమూ ఏర్పడ్డాయి. అవి ఉన్నత బ్రాహ్మణ విద్యా కేంద్రాలు కూడానూ. ఈ కాలంలో కాన్వెంటు చదువులలాగా, ఆ కాలంలో ఈ ఉన్నతవిద్య పై తరగతులకు మాత్రమే లభ్యమయేది. గుప్తరాజులకు పూర్వం ఎలాగైతే బౌద్ధ విహారాలనుంచి ''విజ్ఞానం'' వ్యాప్తిచెందిందో, ఇప్పుడు అదే విధంగా దేవాలయాలనుంచి, మఠాలనుంచీ వ్యాప్తి అవుతూ వచ్చింది.

బౌద్ధసారస్వతంలో బ్రాహ్మణులకన్నా క్షత్రియులు మిన్నగా ఉండేవారు. భూస్వాములు వారే, గణనాయకత్వం వారిదే. అయితే గుప్త రాజులకు పూర్వం క్షత్రియులు కావటం చాలా అరుదు. నందరాజులు శూద్రులు, మౌర్యులు హీన జన్ములుగా పరిగణించడినవారు. తొలికాలపు దక్షిణ ప్రాంత చేది, చోళ, చేర, పాండ్య, ఆంధ్రరాజులు తాము క్షత్రియులమని చెప్పుకోలేదు. పైపెచ్చు వారు అనార్యగణాలకు చెందివారు. యవనులూ (గ్రీకులు), శకులూ, కుషానులు లాటి విజాతీయులను ప్రాత్యులుగా (హీన క్షత్రియులుగా) పరిగణించారు. పాణినీ, మనువూ వారిని శూద్రుల కింద లెక్క కట్టారు. (నా చిన్నతనంలో బ్రాహ్మణులు తెల్లవాళ్లందరినీ మాల వాళ్ళన్నట్టు) పురాణాలలో కొన్ని రాజవంశాలు క్షత్రియులవి కావు. రాజ్యాలు ఏలటానికి కులం అడ్డం రాలేదు.

క్రీ.శ. అయిదో శతాబ్ది అనంతరం సమాజంలో పెద్ద మార్పులు కలిగాయి. కొత్త పరిపాలనా విధానాలూ, భూమికి సంబంధించిన ఏర్పాట్లూ అమలులోకి వచ్చాయి. తక్కువ పుటకపుట్టినవాళ్ళూ, ఎవరో తెలియనివాళ్ళూ, విజాతీయులూ అనేకమంది రాజ్యాధికారం సంపాదించి, చిన్నచిన్న స్వతంత్ర రాజ్యాలను ఏలారు. మేవాడ్‌ను పాలించిన గుహిలులు భిల్లులతో సంబంధం ఉన్నవాళ్లు. కొందరు రాజులకు గోండులతో సంబంధం వుండేది. రాజపుత్రులలో ఎక్కువమంది పూర్వులు కులాలకు చెందినవారు కాదు, ఆటవిక తెగకు చెందినవారు. అయితే బ్రాహ్మణులు వారిని సూర్యవంశపు రాజులుగానో, చంద్రవంశపు రాజులుగానో చేసి, క్షత్రియులుగా మార్చేశారు. అందుకు తగిన విధులు జరపాలంటే సంస్కృతం తెలియాలి. ఎందుకంటే అమలులో ఉన్నది

సంస్కృత సంస్కృతి. దానికి హక్కుదార్లు బ్రాహ్మణులు.

కొందరు రాజులు తమది బ్రాహ్మణ వంశమేనన్నారు. ఉదాహరణకు, బుందేల్ ఖండ్‌కు చెందిన పరివ్రాజక రాజవంశంవాళ్ళు మైత్రతవంశానికి చెందిన భట్టార్కుడు గుప్త రాజుల కింద సౌరాష్ట్ర రాజప్రతినిధి (గవర్నరు)గా వుంటూ సేనాపతి బిరుదు తగిలించుకున్నాడు. కాని భట్టార్కుడి మనవుడూ, అతని సంతానంవాళ్ళూ, మహారాజు బిరుదాలు తగిలించుకున్నారు. 6 వ శతాబ్దిలో వాళ్ళు వల్లభిని రాజధానిగా పెట్టుకుని రాజ్యపాలన చేశారు. అధికారులుగా వుంటూ సామంతులై రాజకీయపు కుమ్ములాటలలో పాల్గొని, అరాజక పరిస్థితులను ఆసరా చేసుకుని స్వతంత్ర రాజులయిన వారు వీళ్ళు. వారు ఆరంభంలో యెవరో తెలియదు తరువాత కాలంలో క్షత్రియవంశాలు విపరీతంగా పెరగటం యీ విధంగానే జరిగింది.

బ్రాహ్మణ సాహిత్యంలో వైశ్యుల ప్రస్తావన కనపడదు కాని బౌద్ధ రచనలలో వైశ్యులుగా పరిగణించదగిన ధనిక వర్తకులకు ఎంతో ప్రాముఖ్యం ఉన్నది.

బ్రాహ్మణులు నిర్దేశించిన వర్ణధర్మం అమలులో లేనట్టు 5వ శతాబ్దంనాటి శాసనాన్ని బట్టి తెలుస్తుంది. గుజరాతులోని లాట దేశంనుంచి పశ్చిమ మాల్వాలోని దశపురానికి పట్టునేతగాళ్ళ శ్రేణి వలసవెళ్ళి పుష్కలంగా ధనం సంపాదించి సూర్యుడికి ఆలయం కట్టించారు. ఆ శ్రేణిలో విలుకాళ్ళూ, కథకులూ, జ్యోతిష్కులూ, యోధులూ మొదలైన వారున్నారుట. అందరూ పట్టునేసేవాళ్ళే!

కొత్త కొత్త జాతులు విడవకుండా యేర్పడుతూ వచ్చాయి. వేరు వేరు వృత్తులవాళ్ళు జాతులుగా మారారు 9వ శతాబ్దం నుంచి సమాజంలో చేరిపోయిన తెగలన్నీ జాతులయ్యాయి. కొత్తగా వెలిసిన ఉద్యోగుల ముఠాలూ, వర్తక బృందాలూ కొత్త కులాలుగా రూపొందాయి. ఆభీరులనే ఆటవిక తెగవాళ్ళూ ఒక జాతిగా పరిగణించబడి, శూద్రుల స్థాయి సంపాదించుకున్నారు. నాకు తెలిసిన ఒక బ్రిటిష్ ఇంజనీరు భారతీయ పౌరుడై, ఒక గ్రామంలో ఆస్తి సంపాదించుకుని, తనకు గ్రామ సమాజంలో ఏ స్థాయి ఇస్తారని అడిగితే, గ్రామస్థులు సభజేసి, అతనికి పటేల్ జాతి స్థాయి ఇచ్చారు ఇది యే 40 ఏళ్ళ క్రితమో జరిగిన సంఘటన. వ్యక్తికే ఆధునిక కాలంలో కులంహోదా లభించినప్పుడు, పాతకాలంలో, అందులోనూ కులవ్యవస్థ విస్తరించే కాలంలో శ్రేణులకూ, తెగలకూ కులం హోదా లభించటం ఆశ్చర్యం కాదు. బ్రాహ్మణుల ప్రమేయం లేకుండా కులాలుగా మారిన తెగలకు శూద్రత్వం మాత్రమే లభించింది క్షత్రియ తెగలుగా వుండిన కిరాతులూ, పుండ్రులూ, మాగధులూ, ఓఢ్రులూ శూద్రకులాలవాళ్ళుగా దిగజారిపోయారు.

వర్ణ వ్యవస్థలో చేరిపోయిన ఆటవిక తెగలవాళ్ళకు జాతి హోదా,

అవసరమైనప్పుడు గోత్రాలూ కూడా లభించాయి. శూద్రకులాలు విస్తరించాయి ధర్మశాస్త్రాలకు బద్ధులైనది పై కులాలవారు మాత్రమే కొత్తకులాలవాళ్ళు తమ పాత ఆటవిక ఆచార వ్యవహారాలనూ, శాసనాలనూ మార్చుకోలేదు గ్రామసీమలంతటా ఒకేవిధమైన ధర్మం అమలు జరగలేదు. కొత్త కులాలతోపాటు కొత్త విశ్వాసాలూ, కొత్త కర్మకాండా వచ్చాయి. ఈ కులాల పురోహితులు బ్రాహ్మణ వర్ణపుహోదా సంపాదించారు అలా వచ్చినవారే ఆభీర బ్రాహ్మణులు.

కొత్త మత సంబంధమైన ఉద్యమాలలోకూడా కొత్త కులాలూ, వర్గాలూ ఏర్పడ్డాయి. జైనులూ, బౌద్ధులూ, సిక్కులూ అలాంటివారే మన విశ్వబ్రాహ్మణులూ, జంగాలూ మొదలయినవారు కూడా అలాంటివారే. వారు ఆదిలో కులవ్యవస్థను ధిక్కరించి నెగ్గలేకపోయారు. తగినంత పెద్దవర్గం ఉన్నచోట వారు ప్రత్యేక కులం అయి సమాజంలో ఇమిడిపోయారు ఈ మతోద్యమాలు సమాజంలో తిరుగుబాటుదార్లనూ అతిహీన కులాలవారినీ ఆకర్షించాయి. బౌద్ధ భిక్షులలో యజమానుల నుంచి పారిపోయిన బానిసలూ, అస్పృశ్యులూ ఉండినట్టు తెలుసు. డాక్టర్ అంబేద్కర్ అస్పృశ్యులను బౌద్ధులు కమ్మన్నాడు. క్రైస్తవ మతంలో అస్పృశ్యులు చేరడం మనకు తెలుసు.

ఆదిమ ఆర్యులు అయిదు తెగలకు చెందినవాళ్ళు – పంచజనాః. వారికి ఒక ప్రత్యేక సంస్కృతి అంటూ లేదు. వారు తమకు సంపర్కం కలిగిన వారినుంచి తమకు కావలిసినది స్వేచ్ఛగా స్వీకరించారు. ఇతర తెగలతో వివాహాలు చేసుకున్నారు. ఉత్తర వేదకాలంలో ఆర్య, అనార్య తెగలు కలిసిపోయాయి. దివోదాసు, సుదాసు లాంటి పేర్లు గల ఆర్యులు, దాస శబ్దాన్ని బట్టి ఆర్యులతో కలిసిన అనార్యులని తెలుస్తుంది. ఈ కాలంలో జరిగిన ''దశరాజ యుద్ధం''లో ఓడించబడినవారి పేర్లు తెగలను సూచిస్తాయి. వారిలో కొందరు హరప్పానాటి ముద్రలమీద కనిపిస్తారు.

ఆర్యులు దాసజనులను సేవకు నియోగించుకున్నారు. వారి ''పశుగణాల''లో చతుష్పాత్తులతోబాటు ద్విపాత్తులు కూడా వున్నారు. అయితే నల్లని వారందరూ సేవకులు కారు. ఇంద్రుడితో యుద్ధం చేసిన కృష్ణుడు కాలక్రమాన ఒక వేద ఋషి అయి, తరువాత ఇంద్రుడికి మిత్రుడైన విష్ణ్వవతారమైనాడు.

ఆదికాలంలో బ్రాహ్మణుల సహాయం లేకుండా యజ్ఞాలు జరిగాయి. ఇంద్ర వరుణాదులు ఆవాహన చేయబడ్డారు. ఆ కాలంలో యజ్ఞాలు చేయించినవారు అధర్వులూ, హోతలూ మొదలైనవారు. ఆర్య తెగలలో వర్గ విభజన జరిగిన మీదనే బ్రాహ్మణులు వచ్చారు.

యజుర్వేద కాలానికి చాతుర్వర్ణ్యం సుప్రతిష్ఠితమయింది. రాజైన క్షత్రియుడు బ్రాహ్మణుడి సహాయంతో వైశ్య వ్యవసాయకులనూ, శూద్రసేవకులనూ దోపిడీ చేశాడు.

రైతులైన మరుత్తుల సమూహానికీ, ఇంద్రుడికీ జరిగిన సంఘర్షణ ఇదే సూచిస్తుంది రాజు రైతులను కబళించినట్టు ఇంద్రుడు మరుత్తులను తిన్నాడని ఋగ్వేదం చెబుతున్నది. వైశ్యుణ్ణి యథేచ్ఛగా ఏడిపించవచ్చుననీ, శూద్రులను ఖతం చెయ్యవచ్చుననీ ఐతరేయ బ్రాహ్మణం చెబుతున్నది. ఇలాటి గ్రంథాలను నెత్తిన పెట్టుకుని హిందూ వైశ్య శూద్రులు పూజించాలని సనాతనవాదుల అభిప్రాయం.

ఈనాటి దాకా నిలిచిన బ్రాహ్మణ సారసత్వం బ్రాహ్మణుల అధీనంలోనే వున్నది. బ్రాహ్మణులు, జైన, బౌద్ధ వాఙ్మయాలలో కూడా చొచ్చుకుపోయారు.

''తొలి బ్రాహ్మణులు ఆర్య ఋత్విజులకూ, కర్మకాండలో వారికన్నా నిష్ణాతులైన హరప్పా పురోహితులకూ మధ్య సంపర్కం ద్వారా ఏర్పడ్డారను కునేటందుకు అవకాశం వున్నది.'' (కోసాంబీ)

''గోత్రం'' అంటే ఆవుల గోష్ఠం (ఋగ్వేదంలో) అసంఖ్యాకంగా గోత్రాలు పుట్టుకు రావడానికి కారణం శాఖలు పెరగటం. ఒక గోత్రానికి చెందిన గోవులన్నీ ఆ గోత్రశాఖవారికి సమష్టిగా వుండేవి. వాటికి ప్రత్యేకముద్ర వేసేవారు. గోత్ర ఋషులు ఏడుగురే అంటారు గాని, ఈ సప్తర్షుల జాబితాలు రెండున్నాయి. అందులో మొదటి దానికి ఈనాటి బ్రాహ్మణ శాఖలతో సంబంధం లేదు.

అనార్య బ్రాహ్మణులు తమ తల్లి పేరు చెప్పుకున్నారు. (ఆర్యులకు ఋగ్వేద కాలంలో కూడా తండ్రులున్నారు) దీర్ఘతముడు 'మమతా' అనేదాసికి పుట్టినవాడు. బ్రాహ్మణవంశాల పేర్లు కొన్ని ఆటవిక జాతులను సూచిస్తాయి. రెండు ఆటవిక జాతుల పేర్లు కలిపితే ''పురుకుత్స'' అయింది. పురుకుత్సుడనే పేరుగల రాజాను ఋగ్వేదంలో భరద్వాజుడు ప్రశంసించాడు. కాని భరద్వాజ వంశంలో పురుకుత్స గోత్రం ఉన్నది. కాశ్యపులూ, కణ్వులూ ఒకప్పుడు యజ్ఞ పారితోషికానికి అనర్హులని ఎంచబడ్డారు. కణ్వుడనే రాక్షసుణ్ణి ఉచ్చాటన చెయ్యటానికి అథర్వణ వేదంలో మంత్రం ఉన్నది. వాలశిఖ గోత్రం వున్నది, వాలశిఖులన్నా, వారశిఖులన్నా ఒకటే. హరీయూపియ (హరప్పా) వద్ద ఇంద్రుడు వారశిఖులను నాశనం చేశాడ

రెండేసి గోత్రాలున్నవారు కూడా వున్నారు. కొందరు పగలు వాశిష్ఠులు, రాత్రి కాశ్యపులు! మాతృస్వామ్యంగల వాళ్ళు పితృస్వామ్యులకు ఓడి వారికి అనుగుణంగా మారటం వల్ల ఇలాంటి పరిస్థితి ఏర్పడినట్టు ఊహిస్తున్నారు.

మేధాతిథి, వత్సుడూ కూడా కణ్వుడి కొడుకులే. కాని, వత్సుడు దాసీపుత్రుడని మేధాతిథి ఆరోపణ చేసాడు. ఇద్దరూ వేదకాలపు ఋషులే (ఇలాంటి కథలు కల్పించటం అసంభావ్యం).

ఋగ్వేద కాలంనాటి బ్రాహ్మణులలో కొందరు కటిక దరిద్రులు, వారు ఏ

కులానికీ చెందినవారై ఉండరు అలాంటి బ్రాహ్మణులతోనే వర్ణవ్యవస్థ ఆరంభ మయిందట

బ్రాహ్మణ వంశాలకు వేరు వేరు శిఖలుండేవి భృగులు గుండు కొట్టించేవారు గౌతములూ, భరద్వాజులూ పంచశిఖలు పెట్టుకునేవారు ఆత్రేయులకు మూడు పిలకలు, వశిష్టులకు కుడిపక్కన పిలక, (ఇలాంటి పిలకగల బొమ్మ ఈజిప్టులో ఏనాడో చెక్కి వున్నది).

ఏ ఆదిమ జాతిలోనైనా తేలికగా ప్రవేశించగలగటం బ్రాహ్మణత్వానికి చాలా ఉపయోగపడుతూ వచ్చింది కశ్యపులు ఆదిమవాసులను తమ శాఖలో కలుపుకుని, వంశనామాలులేని వారందరికి తమ గోత్రం ఇచ్చారు.

జాతులలో వర్ణవ్యవస్థ విస్తరించిన కొద్దీ బ్రాహ్మణత్వం పెరిగింది. శతపద బ్రాహ్మణం నాటికి వేదకాలపు వంశవృక్షాలు పూర్తిగా అంతరించిపోయాయి. అంతరించని వాటిని కొత్త బ్రాహ్మణులు హీనంగా పరిగణించారు. కాశ్యపులూ, భృగులూ పెట్టిన ఒరవడిలో ఇతర బ్రాహ్మణులు కూడా ఇతరులను తమలో చేర్చుకోసాగారు. ఈ కొత్త బ్రాహ్మణులు బ్రాహ్మణ విధులు నేర్చుకొనటానికి తక్షశిలకు వెళ్లి చదువుకొనేవారు కొందరు బ్రాహ్మణులు ''యజ్ఞం'' ఏమిటో ''బ్రహ్మ'' ఏమిటో క్షత్రియులనుంచి తెలుసుకున్నారు.

వైదిక కర్మకాండ చాలా గిట్టుబాటుగా వుండేది. యజ్ఞాలు చేయించిన వారికి ఊళ్లకు ఊళ్ళే దానంగా ముట్టేవి; ఆర్య, అనార్య తెగలనుంచి వచ్చిన ఈ కొత్త పురోహితులు నూతన సమాజాన్ని నిర్మించారు. ఈ నవ సమాజ నిర్మాణానికి పాత జాతి బంధాలను పటాపంచలు చెయ్యవలసి వచ్చింది. వేద శిక్షణ ద్వారా బ్రాహ్మణులకు అలాటి పని సాధించే బలం లభించింది.

కాని బ్రాహ్మణుల సంఖ్య చాలా పెద్దది అయింది. వారందరూ యజ్ఞాలు చేయించి బతకటం సాధ్యంకాదు వాళ్ళు ఆస్తిపైన నిలబడే సమాజాన్ని సృష్టించటానికి దోహదం చేశారు. సమాజానికి కొత్త పునాది భూస్వామ్యం. ఆదిమ జాతులవారు భూస్వామ్యం ఎరగరు. భూమి వారికి సమష్టి సొత్తు. వారి సంపద కూడా సమష్టి శ్రమ ఫలితమే. బ్రాహ్మణుల వల్ల కలిగిన మేలేమిటంటే , వారు గిరి గీసుకుని కూర్చోకపోవటం చేత ఆటే హింస జరగకుండా జాతి వ్యవస్థను వర్ణ వ్యవస్థగా మార్చగలిగారు.

అప్పటికే బ్రాహ్మణులలో మిశ్రమం జరిగింది! పతంజలి నల్ల బ్రాహ్మణులను ఆమోదించలేదు కాని , బ్రాహ్మణ దంపతులకు నల్లతోలూ, ఎర్రకళ్ళూ గలవాళ్ళు పుట్టవచ్చునని బృహదారణ్యకోపనిషత్తు చెప్పింది. మహాభారతంలో వ్యాసుడు ఇంచుమించు రాక్షసుడిలాగా వర్ణించబడ్డాడు. తాను ఎలా వుంటాడో తెలిసి, అంబికకూ,

అంబాలికకకూ కడుపు చెయ్యటానికి సంకోచిస్తాడు ఆయన రూపం చూడటానికి భయపడి అంబిక కళ్ళు మూసుకుని గుడ్డి ధృతరాష్ట్రుణ్ణి కన్నది

గంగా యమునల ప్రాంతంలో వర్ణవ్యవస్థ ఏర్పాటు చేసిన బ్రాహ్మణులు సాంకర్యం పొందినవాళ్ళే వాళ్ళు నిర్మించిన వర్ణవ్యవస్థనుంచే కులవ్యవస్థ వచ్చింది.

అథర్వ వేదం ప్రకారం గోమాంసం అందరూ తినేవారు గొడ్డుమోతు ఆవులను పేదబ్రాహ్మణులకు దానం యియ్యవచ్చునని చెప్పబడింది. గొడ్డుమోతు ఆవులు కోసుకు తినటానికి తప్ప ఎందుకూ పనికిరావు

బ్రాహ్మణుడికి బ్రాహ్మణులతోనే తప్ప ఏ జాతి వాళ్ళతోనూ సంబంధం లేదు. బ్రాహ్మణుడు ఒక కొత్త తరహా భూస్వామ్యం సృష్టించాడు. ఒక బ్రాహ్మణ బృందానికి సమష్టిగా భూమి ఉన్నప్పటికీ అది జాతికి చెందిన సమష్టి క్షేత్రంలాటిది కాదు.

క్రీస్తు పూర్వం 6,7, శతాబ్దులునాటికి దేశంలో 16 మహా జనపదాలుండేవి. అయితే త్వరలోనే ''జన'' జీవితం ధ్వంసమై, రాజ్యాలు వెలయటం ప్రారంభమైంది. మహావీరుడూ, బుద్ధుడూ కూడా గణ జీవితం నుంచి వచ్చినవాళ్ళే. కొత్త ఆస్తి హక్కులూ, వర్తకమూ వచ్చి గణ నియమాలను నాశనం చేశాయి. గణాల విధ్వంసానికి బ్రాహ్మణులు చాలా కృషి చేశారు. (యుద్ధంలో గణాలను ఓడించటం సాధ్యం కాదు). బ్రాహ్మణుడు గణ జీవితంలోకి తేలికగా ప్రవేశించి అనేక రకాల కుట్రలూ, ఘాతుకాలు చేసి, గణ వ్యవస్థను మట్టుబెట్టాడు. (గణ జీవితాన్ని బ్రాహ్మణుడు ఎన్ని విధాలు ధ్వంసం చెయ్యగలడో అర్థశాస్త్రంలో చెప్పి ఉన్నది). మల్ల లిచ్ఛవీ జాతులు ధ్వంసం కావటం ద్వారా మగధరాజ్యం వెలిసింది దాని రాజధాని అయిన పాటలీ పుత్రం 700 ఏళ్ళపాటు భారతదేశంలోని ఉత్కృష్ట నగరంగా ఉండింది.

క్షత్రియ జాతులను నాశనం చెయ్యటం ప్రారంభించినవాడు అజాతశత్రువు! ఆ పని పూర్తి చేసినవాడు మహాపద్మనందుడు. ఆ తరువాతి రాజ్యాలేలినవారు శూద్రులు అయితే బ్రాహ్మణులు ఏ కులంవారి వద్దనయినా నిష్పాక్షికంగా దానాలు గ్రహించి, విజయవంతులయినవారి నందరినీ క్షత్రియులన్నారు.

నూతన సమాజానికి వేద కర్మలూ, యజ్ఞాలూ సరిపడలేదు. వేద కాలపు జీవితం గోగణాల జీవితం. వ్యవసాయం వృద్ధిలోకి వచ్చి పశువులు వ్యక్తుల సొంత ఆస్తి అయిన మీదట వాటిని యజ్ఞాలలో బలి పెట్టటం శుద్ధ దండుగ, ఉత్పత్తికి దెబ్బ. ఆ కారణంగా మగధలో పుట్టుకొచ్చిన వివిధ మతాలు వేదకర్మను ఖండించాయి బౌద్ధం బహుళంగా వ్యాప్తి చెందింది. గోపాలన కన్న వ్యవసాయం పదిరెట్ల జనాభాను పోషించగలదన్న సత్యం అహింసావాదంలో ప్రతిబింబించింది. అయితే పశువులే జీవనంగా ఉండిన బ్రాహ్మణులు దెబ్బతిన్నారు. యజ్ఞానికి అధిష్ఠాన దేవతలైన ఇంద్రుడు మొదలయిన దేవతలకు

కాలదోషం పట్టింది ఉత్తర కాలంలో సృష్టి అయిన బ్రాహ్మణ వాఙ్మయంలో ఇంద్రుడికే అన్ని పాపాలూ అంటకట్టారు.

కొత్త మతాలు కారు చౌక. శ్రమణులకు ఉత్పత్తిలో భాగంలేదు. ఇళ్ళూ, వాకిళ్ళూ మొదలయిన సొంత ఆస్తులు లేవు. వాళ్ళు భిక్షం ఎత్తుకుని, సంవత్సరానికి యెనిమిది మాసాలు సంచారం చేస్తూ, తమ మతాలను ప్రచారం చేసేవారు. (వర్షాకాలం నాలుగు నెలలూ యెక్కడయినా తల దాచుకునేవారు) వారు ప్రజల భాష మాట్లాడేవారు. వైదిక సంస్కృతం తెలిసిన బ్రాహ్మణుల కన్నా యీ శ్రమణులు ప్రజలకు సన్నిహితులు.

రాజకీయ దృష్టితో చూస్తే ఈ కొత్త మతం చక్రవర్తిత్వాన్ని ఆహ్వానించేది. అనేక మంది చేసే పీడనకన్న ఒకే పీడకుడుండటం మంచిదని హెచ్చరించేది. చాతుర్వర్ణ్యంలో ఉండే సామాజిక సంఘర్షణ కన్న యీ మతంలో వుండేది చాలా స్వల్పం. మహావిజితుడనే
ఉండే సామాజిక సంఘర్షణ కన్న యీ మతంలో వుండేది చాలా స్వల్పం. మహావిజితుడనే
రాజుకు ఆయన అగ్ని హోత్రి పురోహితుడు యజ్ఞాలు మానమనీ, దేశంలో చోరుల పీడ తొలగించి ప్రజలకు శ్రేయస్సు చేకూర్చమనీ, రైతులకు విత్తనాలు అందించమనీ, వర్తకులకు మదుపు ఇయ్యమనీ, దేశాన్ని సేవించే కోరికగల వారికి ఉద్యోగాలు ఇయ్యమనీ సలహా ఇచ్చాడు. ఇది ఆనాటి నూతన దృక్పథం.

శ్రమణులు కులవ్యవస్థను ఖండించలేదు. కులాలకు అతీతంగా ఉండే వర్ణ సమాజం కోసం ప్రచారం చేశారు. ఆ కాలపు రాజులు రాజకీయ ప్రయోజనాల నిమిత్తం బౌద్ధులనూ, జైనులనూ, తదితరులనూ ఆదరించారేగాని వారు బౌద్ధులు కారు.

మగధ సామ్రాజ్యం విచ్ఛిన్నమయినాక ''అర్థశాస్త్ర'' వ్యవస్థ ఏర్పడింది. గ్రామాలకు ప్రాధాన్యం వచ్చింది. ఆర్థిక వ్యవస్థ కొంత దిగజారింది. గ్రామ జీవితంలో చాతుర్వర్ణం బాగా పాతుకున్నది. బ్రాహ్మణుల ప్రభ వెలగనారంభించింది. దేశమంతటా కొద్దికొద్ది గ్రామాలతో కూడిన రాజ్యాలు వెలిశాయి. ఈ గ్రామ రాజ్యాలకు బౌద్ధమూ అవసరం లేదు, ప్రాచీన వైదికమతమూ అవసరం లేదు. బ్రాహ్మణుడు అహింసనూ, యుద్ధాలనూ కూడా బోధించి వేదాలను అధ్యయనం చేశాడు.వేదకాపు యజ్ఞబలులు పోయి వాటి స్థానంలో లాంఛనప్రాయమైన నైవేద్యాలు అవతరించాయి. వేదకాలపు దేవతలలో విష్ణువు మాత్రమే మిగిలాడు. ఇతర నూతన దేవతలు పుట్టుకొచ్చారు. విష్ణు - నారాయణ - కృష్ణుడు ముఖ్యులు. గణపతి పార్వతులతో సహా శివుడు మరొకడు. (కుషాణ నాణాల మీద ఒక పక్క బుద్ధుడూ, ఒక పక్క శివుడూ ఉండేవారు). ఈ కాలంలో దేవాలయాలు లేవు.

కాలక్రమాన పైవర్గాల అధికారం బలపడటానికి సంస్కృత భాష ఉపకరించింది. సంస్కృతం బోధించటానికీ , వ్యాప్తి చెయ్యటానికీ బ్రాహ్మణుడే ప్రధాన సాధనం. ఉత్తర

దేశంలోని మహాయాన బౌద్ధం మీద బ్రాహ్మణ ప్రభావం ఉన్నది సంస్కృత వాఙ్మయం ప్రబలింది కాని అది జనసామాన్యానికి అంటలేదు (కమ్మరులకూ, కుమ్మరులకూ, వడ్రంగులకూ, సాలెవాళ్లకూ, కర్షకులకూ ఉపయోగపడే సంస్కృతరచన ఏదీ కనపడదు). సంస్కృతంలో అధికంగా వెలువడిన రచనలు కర్మకాండకూ, మతానికీ, తత్వానికీ సంబంధించినవి. (అరబ్బీ భాషలో వైద్య, భౌగోళిక, గణిత, నక్షత్ర శాస్త్రాల మీద రచనలుండి, అనేక దేశాలవారికి ఉపకరించాయి.)

కొత్తగా వచ్చి ధర్మాలు అనాదిగా వున్నవే నన్న భ్రమ కలిగించటానికి సంస్కృతం వినియోగించింది. కొన్ని ఆచారాలు స్థానికమైనవే, ప్రాచీనమైనవే కాని అవి ప్రాచీన గ్రంధాలలో చెప్పినవి కావు. అలాటి వాటికి సంస్కృతం ప్రాచీనతా గౌరవం కలిగించింది. వేదాలను, స్మృతులనూ తాకటానికి లేదు. ఎలా పడితే అలా మార్చటానికీ, ప్రక్షిప్తాలు చెయ్యటానికీ పురాణాలు అనుకూలించాయి. బ్రాహ్మణులు వాటిని బాగా వాడుకున్నారు.

అన్ని పురాణాలూ వ్యాసుడే రాసినట్టు చెబుతారు. వ్యాసుడు అంటే విస్తరింప చేసేవాడు. క్రీ.శ. 200-500 మధ్య స్మృతులు వచ్చాయి దానాలూ, గ్రహశాంతికి బలులూ, బ్రాహ్మణుల మహత్యమూ, తీర్థయాత్రల మహిమలూ పెంపుజేస్తూ 6వ శతాబ్దిలగాయతూ రచనలు వెలువడ్డాయి. ఈ దశలో గ్రామ నిర్మాణం విస్తారంగా జరిగింది.

రాజ్యాధికారానికి, తిరుగుబాటుకూ కూడా మతమే సాధనమయింది. తుకారాం, కబీర్ లాంటి అధిక్షేపకులు మత పరిభాషనే వాడారు. రాజుకు కైంకర్యం చేసే బ్రాహ్మణుడికి మతమే ఉపాధి అయింది శాంతియుతంగా సమాజం పురోగమించటానికి ఒకప్పుడు ఉపకరించిన కులం సంకెళ్ళుగా పురోగమించింది. ఎందుకంటే కులవ్యవస్థ స్తంభించిపోయింది; అందులో ఏ మార్పు కలిగినా యధాస్థితి నుంచి లాభం పొందుతున్నవారు నష్టపోతారు.

ఆ కాలంలో రాజు హిందువుడా, బౌద్ధుడా అన్న ప్రశ్న రాలేదు. హర్షుడు సూర్యారాధకుడు, మహేశ్వరోపాసకుడు, ''నాగానందం'' అనేబౌద్ధ నాటకం రాసి, గౌరికి అంకితం ఇచ్చాడు; అహింసను ఆదరించుతూ, 30 ఏళ్ళపాటు విడవకుండా యుద్ధాలు చేశాడు. చాతుర్వర్ణ్యాన్ని ఆమోదించాడు. ''హిందువు'' అనే మాటకు అర్థం ఏమిటో ఆయనకు తెలిసివుండదు

దక్షిణ దేశంలో మటుకు క్రియకు రెండే కులాలుండేవి.

జాతులవాళ్ళను కులాల కింద మార్చటానికి ఇప్పుడు శ్రమణులకన్న బ్రాహ్మణులే తగినవారయినారు. మత ప్రచారం నిరుపయోగం. మఠాలను నిర్వహించాలంటే సైన్యాన్ని

పోషించినంత ఖర్చు అవుతుంది అదీగాక సంఖ్యలో పెరిగిపోతున్న గ్రామాలకు మరాలు అనవసరం.

అయితే వర్ణధర్మం పూర్తిగా అస్తవ్యస్తమయిపోతుంది. 465-6 లో ఒక బ్రాహ్మణుడు ఒక దేవాలయానికి అఖండ జ్యోతి ఏర్పాటుచేశాడు, ఆ ఆలయం సూర్యుడిది; దాన్ని కట్టించిన వాళ్ళు ఇద్దరు క్షత్రియ వర్తకులు, గౌతమీ పుత్ర శాతకర్ణి తాను అపూర్వ బ్రాహ్మణ్ణని చెప్పుకున్నాడు మరొక శాతకర్ణి రుద్రదామనుడనే విజాతీయుడి కుమార్తెను పెళ్ళాడాడు ఈ రుద్రదామనుడికి వచ్చినంత సంస్కృతం శాతవాహనుల కందరికీ కలిపికూడ రాదట ఇతనే మొట్టమొదటసారిగా సంస్కృతంలో శాసనం వేయించినవాడు ఇది ఇలా ఉండగా, వాసిష్ఠీపుత్ర పుళుమాయి వర్ణసాంకర్యం రద్దు చేశానని ప్రకటించాడు.

ఆటవిక గణాల నాయకులు వర్తకం ద్వారానూ, జీతాలకు యుద్ధాలు చేసీ బోలెడంత సంపద గడించారు అయితే గణ నియమాల ప్రకారం సంపద అంతా గణానికి సమష్టి సొత్తు అవుతుంది. దాన్ని ఆ నాయకులు సొంత ఆస్తి చేసుకోవాలంటే కులధర్మం అవలంబించాలి. ఇది ఎలా సాధ్యం? ఎవరు చేస్తారు? బ్రాహ్మణులు వచ్చి ''హిరణ్యగర్భ'' విధి జరిపేవారు! ఆ నాయకుణ్ణి ఒక బంగారు పాత్రలో కూర్చోబెట్టి మంత్రాలు చదివేవారు - ఆ పాత్ర గర్భం అన్నమాట. వాడు ఆ పాత్రలో నుంచి ఉన్నత కులంవాడుగా పునర్జన్మ ఎత్తేవాడు. ఆ పాత్రను బ్రాహ్మణులు తీసేసుకుని, వాడి పూర్వీకులను ఏ పురాణాంలోనో చూపేవారు, లేదా వాడి పేరు ఏ పాత పురాణంలోనో దూర్చేవారు. కొందరు గణనాయకులు బ్రాహ్మణులు కూడా అయారు. ఇలాటి కూర్పుల వల్ల వ్యక్తులు సంకుచిత గణ జీవితంనుంచి విశాల సమాజంలో అడుగు పెట్టేవారు

ఒక్కొక్కప్పుడు బ్రాహ్మణులు ఇతర ప్రాంతాలకు వలసవెళ్ళి, స్థానిక స్త్రీలను పెళ్ళాడి, కొత్తకులాలను సృష్టించారు. నేపాలుకు చెందిన జైసియాలూ, మలబారుకు చెందిన నాయర్లూ ఇలాటి కులాల వారే. బెంగాలుకు చెందిన లోకనాధుడనే రాజు లాటివారు. కొందరు తమ పూర్వులు బ్రాహ్మణులకు శూద్ర స్త్రీల వల్ల కలిగారని చెప్పుకున్నారు. పరివ్రాజక వంశానికి చెందిన రాజులు హస్తి, సంక్షోభుడు అనే వాళ్ళు (6వ శతాబ్ది) తమ పూర్వీకుడు సుశర్మ అనే సన్యాసి అని చెప్పుకున్నారు. విలువిద్యలో ఘటికుడైన ఒక ఉత్తమ కులానికి చెందిన భారతీయుడు నాగులను లోబరుచుకుని, సోమ అనే నాగ నాయకురాలిని పెళ్ళాడి చంప ( ఇండో) రాజ్యాన్ని స్థాపించాడు. ఆయన సంతతి విజయవంతంగా రాజ్యపాలన చేసింది. గ్రామాలూ, కులాలూ రాకపూర్వం ఆదిమవాసులు తమ వంశాలకు తల్లులను మూలంగా చూపేవారు. గనక ఇలాంటి పరిణామం మరింత సుసాధ్యమయింది.

బ్రాహ్మణులకు విశేషంగా గ్రామాలు దానంగా లభించాయి. ఆ గ్రామాలమీద పన్నులు వసూలుచేసి, రాజుకు అందించటానికి బదులు తామే వుంచుకునే హక్కు మాత్రమే బ్రాహ్మణులకు వుండేది అయినా బ్రాహ్మణులకు గ్రామ దానాలు లాభసాటిగా వుండటం చేత కొందరు దాన పత్రాలను చాటుగా సృష్టించటం జరిగింది. బ్రాహ్మలకు చేసిన భూదానాలు వారి జీవిత పర్యంతమే ఉండటం కద్దు. వాటిని వారు సొంతంగా దున్నుకుని, పన్నులు కట్టేవారు కారు. తరువాత అలాటి దానపు భూములను ఇతరులచేత దున్నించటమూ, పాలకులు వాటి మీద పన్నులు విధించటమూ జరిగింది.

కొందరు బ్రాహ్మణులు వర్తకం చేశారు.

పదవ శతాబ్దం నుంచీ గ్రామదానాలు యుద్ధ సహాయం చేసిన బ్రాహ్మణేతర సామంతులకు కూడా లభించాయి. ఆ కారణం చేత అనేక మంది బ్రాహ్మణులు యుద్ధవిద్యలు నేర్చి, ప్రతిష్ఠ సంపాదించి సామంతులయ్యారు 1720 తరువాత పేష్వాలతో ఈ పద్ధతి పరాకాష్టకు వచ్చింది. పేష్వాలు బ్రాహ్మణ విధులన్నీ నిర్వర్తించేవారు.

  

మనం ఇంకా కులాలను పట్టుకుని వేళ్ళాడుతున్నామేగాని కుల ధర్మాలు మనని ఏనాడో వదిలిపోయాయి. అన్ని వృత్తులలోనూ దాదాపూ అన్ని కులాల వాళ్ళూ కనిపిస్తారు. ముఖ్యంగా ఈ పోటీ ధనార్జనకు ఎక్కువ అవకాశాలు గల వృత్తులలో - డాక్టరూ, ఇంజనీరూ, శాస్త్రవేత్తా, ప్లీడరూ వగైరాలలో కొట్టవచ్చినట్టు కనిపిస్తుంది. హీన వృత్తుల్లో, అనగా సంపాదన తక్కువగా ఉండే వృత్తులలో, పోటీ అంతగా కనపడదు. పాకీ బ్రాహ్మణులూ, చర్మకారీ బ్రాహ్మణులూ, మంగలి బ్రాహ్మణులూ మనకు కనిపించరు. ఒకప్పుడు కులాలు వృత్తులను బట్టి ఏర్పడినా, ఈనాడు కులాలను బట్టి వృత్తులుండడం లేదు. నిజానికి కులాలను బట్టి వృత్తులు ఏనాడూ కచ్చితంగా లేవని చెప్పిన విషయాలు స్పష్టం చేస్తాయి కాని ఆ సంగతి చాలా మందికి తెలియదు. అందుచేతనే వైదికధర్మమనీ, సదాచారమనీ కొట్టుకు పోయేవాళ్ళు, అజ్ఞానులు.

ఈనాడు మనం వదిలించుకోవలసిన మూఢాచారాలలో కుల వ్యవస్థ ఒకటి అది ఒకంతట వదిలేది కాదు. దానికి తోడు పాలకవర్గల ఆసరా, మాటలలో కాకపోతే చేతలలో ఉండటం విచారకరం.

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక, నవంబర్ 2/9/16/23–1973.*

# భారతీయ సంస్కృతిలో వర్గ దృక్పథం

''మన సంస్కృతికి పునాదులు వైదిక సాహిత్యమే గదా !''అని ఎవరో ఏంటే నెహ్రూ, తనకు కొత్త విషయం తెలిసినట్టుగా ఆశ్చర్యపోయి, ''అవును, నిజమే!'' అన్నాడట. ఈ సంగతి నేను డాక్టర్ కేస్కర్ ద్వారా విన్నాను.

ఇంతకూ మన సంస్కృతి – లేదా, భారతీయ సంస్కృతి – అన్నది ఏమిటి? దాని విశిష్ట లక్షణాలేవి? అది భారతీయులందరికీ సమంగా ఉంటుందా? లేక, భారతదేశంలో అనేక సంస్కృతులు ఉన్నాయనుకుంటే అత్యధిక సంఖ్యాకుల సంస్కృతా ? మన జాతీయ సంస్కృతా ? మత సంస్కృతా ? ఒకప్పుడు వుండినదా? లేక ఈనాడున్నదా? మహానగరాలలో కనిపించేదా ? పల్లెపట్టుల్లో కనిపించేదా? అడవుల్లో కనిపించేదా? (ఆటవికులుగా జీవించే భారతీయులు కూడా ఉన్నారు!) దక్షిణ దేశంలో కనిపించేదా? ఉత్తర దేశంలో కనిపించేదా ? ఇలా సవాలక్ష ప్రశ్నలు వెయ్యవచ్చు. అన్నిటికీ వేరు వేరు సమాధానాలు వస్తాయి.

ఏమైనా వేద వాఙ్మయంనుంచే మనకు సంస్కృతి దిగి వచ్చిందని నెహ్రూను నమ్మించినవారు అబద్ధం ఆడారనటానికి సందేహంలేదు. ఆ మాట నిజమనుకోవడం నెహ్రూ అమాయకత్వాన్ని సూచిస్తుంది. ఎందుకంటే ఋగ్వేదకాలానికి పూర్వం సింధూలోయలో ఒక నాగరికత ఉండేది. అది వేదకాలపు ఆర్యులు ఎరిగినదానికన్నా గొప్ప నాగరికత. దాని ప్రభావం వేదకాలపు ఆర్యుల మీద ఉన్నదనటానికి సందేహం లేదు.

ఆర్యులలో వర్గాలున్నాయో లేదో తెలీదు. వేద కాలపు ఆర్యులు పశుపోషణ ప్రధాన వ్యాపకంగా కలవాళ్ళు. గోవులే వాళ్ళ ధనం. వాళ్ళ ఆలోచనలూ, పరిభాషా, సమస్తమూ గోవును చుట్టి వుండేవి. వాళ్ళలో కులాలు గోత్రాలను బట్టి వుండేవి. అవి ఈనాటి కులాలు కావు. ఎందుకంటే ఒకే గోత్రం వాళ్ళ మధ్య వివాహం నిషిద్ధం. గోత్రం అంటే గోవుల కొట్టం. వాళ్ళు గోవుల కోసం యుద్ధాలు చేసేవాళ్ళు. ఆ యుద్ధాలకు గవిష్టి అనే మాట వాడేవారు!. గవిష్టి అంటే గోవుల మీద వాంఛ. గోవులను గురించి మాట్లాడేటప్పుడు వాళ్ళకు కలిగే పారవశ్యం ఇంతా అంతా కాదు. అందుకు నిదర్శనాలు ఋగ్వేదంలోనే ఉన్నాయట. గౌతముడు అనే పేరు వేదకాలపు ఋషులలోనూ, ఉపనిషత్తులలోనూ చాలా తరచుగా కనిపిస్తుంది. అందుచేత వేదకాలపు ఆర్యుల జీవితం పూర్తిగా గోవులమయం. వారిలో వర్గాలూ, దోపిడీ ఉండే అవకాశం లేదు. వాళ్ళు అస్తమానమూ తిండి ధ్యాసతోనే కొట్టుకుపోయారు. తమ ఆహారాన్నీ, ధనాన్నీ (అంటే గో సంపదను) పెంపొందించాలని ఇంద్రుణ్ణీ, అగ్నినీ, వరుణుణ్ణీ, అడ్డమైన వాళ్ళనూ స్తోత్రం చేశారు. అంతేగాక అన్నానికీ, ధనానికీ ఒకటేమాట – బ్రహ్మ – వాడారు. (అప్పట్లో బ్రహ్మ అనే మాటకు మూడో అర్థం లేదు) ఈ దశలో వాళ్లు వర్గ దోపిడీని ఎరిగి ఉండటం అసంభవం.

ఈ ఆర్యులలో కొందరు క్షత్రియులుగా వ్యవహరించబడ్డారు. కొందరు యజ్ఞాలూ అవీ చేశారు. కానీ వాళ్ళు వేరే వేరే వర్గాలనుకోవటానికి ఆధారం లేదు. పురాణాలలో ఈ రెండు రకాల ఆర్యుల మధ్య వివాహాలు జరిగినట్టు సాక్ష్యం ఉన్నది. విశ్వామిత్రుడు క్షత్రియుడన్నారు. విశ్వామిత్రుడనేవాడు వేదకాలపు ఋషి కూడాను.

ఆయన యుద్ధాలు చేసినట్టు సాక్ష్యం లేదు. పురాణాలు ఒక విశ్వామిత్రుణ్ణి రాజర్షి చేశాయి!

వేదకాలపు ఆర్యుల పరిస్థితి ఇలా ఉంటే, మొహంజదారో, హరప్పా నాగరికతలకు కారకులైన వారిలో కనీసం మూడు వర్గాలుండేవని పురాణ తత్వవేత్తలు అంచనా కడుతున్నారు నాగరికత వెంబడి వర్గ విభజన విధిగా ఉంటుందన్నసంగతి అలా ఉంచి, ఆ శిథిల నగరాలలో బయటపడిన ఇళ్ళు అన్నీ ఒకే స్థాయిలో జీవించినవారివి కావు. కులవిభేదాలూ, దోపిడీ అనేవి మనకు ఆర్యుల నుంచి వచ్చాయనుకునేకన్నా, వాటిని వేదకాలపు ఆర్యులు తమకు పూర్వం ఉండిన నాగరికత నుంచి అరువు తెచ్చుకుని, మనకు సంక్రమింప జేశారనుకోవడం సమంజసంగా కనబడుతుంది.

వేదకాలపు ఆర్యులపై అనార్యుల ప్రభావం – ముఖ్యంగా ద్రావిడ సంస్కృతి ప్రభావం ఉండిందనటానికి కొన్ని కారణాలు ఇతరమైనవి కూడా విజ్ఞులు చెబుతున్నారు. ద్రావిడ ధాతువుల నుంచి ఏర్పడిన మాటలు కొన్ని సంస్కృతంలో ప్రవేశించాయి. క్రీస్తు పూర్వం 1000కి 500కూ మధ్యలో ఇది జరిగిందట. ఇది ఉత్తర వేదకాలం. ఈ కాలంలో ద్రావిడపదాలు ఋగ్వేదంలో ప్రవేశించాయి. వీటిలో కొన్ని వ్యవసాయ సంబంధమైనవి. సింధు నాగరికతలో వ్యవసాయం చాలా వృద్ధి చెందింది గనకనూ, ఆర్యులకు వ్యవసాయం ముఖ్యమైనది కాదు గనకనూ, అలాంటి పదాలు అనార్యుల సంపర్కం వల్లనే సంస్కృతంలో ప్రవేశించాయనుకోవాలి.

ఇలాటి కారణాలను బట్టి భారతీయ సంస్కృతి అనేది వేదకాలపు ఆర్యుల సంస్కృతి అనుకునే అవకాశం లేదు. వేదకాలం ముగియక ముందే ఆర్యులు అనార్యుల సంస్కృతికి గురిఅవుతూ వచ్చారు.

ఆ సంకర సంస్కృతి అయినా నిలిచి ఉండలేదు. అది వేదకాలంలోనే – అంటే వేదాల సృష్టి పూర్తి కాకముందే – అనేక రకాల పరిణామాలకి గురి అయింది. అందుకు అనేక భౌతిక కారణాలు. ఋగ్వేద రచన అనేక శతాబ్దాల మీద జరిగింది. అంతకాలమూ ఆర్యుల జీవితం స్తంభించి ఉండలేదు. క్రమంగా వ్యవసాయానికి ప్రాముఖ్యం హెచ్చింది. స్థల చలనం కూడా వాళ్ళను ప్రభావితులను చేసి ఉండాలి. ఋగ్వేద రచన చాలా వరకు సింధునదీ ప్రాంతంలో జరిగినది, కొద్ది భాగం గంగా ప్రాంతంలో కూడా జరిగింది.

వేదకాలపు ఆర్య సమాజంలో కలిగిన మార్పులకు కారణభూతాలైన భౌతిక కారణాలు ఏవైనా, వాటి ఫలితాలు స్పష్టంగా కనిపిస్తాయి ఋగ్వేదంలో ఎక్కడాలేని చాతుర్వర్ణం దాని చివరలో కనిపిస్తుంది. ఆరంభంలో గౌరవవాచకంగా ఉండిన ''అసురా!'' అన్న సంబోధన నిందావాచకంగా పరిణమించింది. అన్నిటికన్న విచిత్రం ఏమిటంటే, వేదకాలపు ఆర్యుల ఇష్టదైవమైన ఇంద్రుడు వేదంలో కొంత భాగాన్ని నాశనం చేశాడు! అంటే ఋగ్వేదంలో కొంత భాగం ఋగ్వేద కాలపు ఆర్యులకే పనికి రాకుండా పోయింది. దీన్ని బట్టి ఆ కాలపు ఆర్యుల జీవితంలో ఎలాంటి పరిణామాలు జరిగాయో

ఊహించవచ్చు.

వేదకాలపు ఆర్యుల జీవితానికి ఒకే ఒక ఆధారం - వాళ్ళ జీవిత విధానం - యజ్ఞం వాళ్ళకు కావలసిన సంపదను సృష్టించటమూ, పెంచడమూ, పంచుకోవడమూ, అనుభవించడమూ మొత్తం అంతా యజ్ఞమే. ఈ యజ్ఞంలో ప్రముఖ పాత్ర నిర్వహించిన వాళ్ళే వాళ్ల దేవతలు - మిత్రుడూ, వరుణుడూ, ఇంద్రుడూ, అగ్నీ, అశ్వినులూ వగైరా వగైరా.

ఈ యజ్ఞం కూడా మారింది. ఆదికాలంలో సమష్టిగా జరిగిన ఈ యజ్ఞం పిదప కాలంలో వ్యష్టిగా జరిగింది. యజమానులు కాస్తా యజమానుడయాడు. 'మనం' పోయి దాని స్థానంలో 'నేను' వచ్చింది. భాగదేయాన్ని అందరితో పాటు పుచ్చుకున్న ఇంద్రుడు తనకు హెచ్చుభాగం రావాలని డిమాండు చేశాడు. ఆదిమ సమ సమాజంలో వర్గ వ్యత్యాసాలు ఆరంభమయాయి. దీన్ని బట్టి వేదకాలపు ఆర్యుల ఉత్పత్తి శక్తులు పెరిగాయనీ, దోచుకునేవాళ్ళూ, దోచుకోబడేవాళ్ళూ వేరువేరుగా విడిపోయారనీ తెలుస్తుంది.

ఈ వర్గ విభజనే వర్గవ్యవస్థకు దారితీసింది. వర్గపీడన అతి దారుణమైన స్వరూపంలో అవతరించింది. వేదకాలపు ఆర్యుల దృష్టిలో అతిహీనంగా పరిగణించబడిన వ్యవసాయమూ, శరీర శ్రమతో కూడిన పశుపోషణా వైశ్యులకు అంటగట్టారు శూద్రులు అగ్రవర్ణాలకు వెట్టిచాకిరీ చేసేటందుకు నియోగించబడ్డారు వాళ్ళు ఆర్య సమాజపు బానిసలు. వైశ్యుణ్ణి సాధ్యమైనంతగా పిండవచ్చుననీ, శూద్రుణ్ణి యిష్టం వచ్చినట్టు హింసించి చంపినా పాపం లేదని బ్రాహ్మణ ధర్మశాస్త్రాలు ప్రవచించాయి.

సంపదను ఉత్పత్తి చేసే ఈ రెండు వర్గాల పట్లా బ్రాహ్మణ క్షత్రియ వర్గాలు ఇంత క్రౌర్యం చూపటానికి కారణం ఏమిటి ? దానికి సమర్థింపు ఏమిటి ? వాళ్ళు శరీరశ్రమ చేసేవాళ్ళు. శరీరశ్రమ హీనమైనదీ, బుద్ధిశ్రమే ఘనమైనదనీ బ్రాహ్మణులు చెప్పారు.

బుద్ధిశ్రమతో బ్రాహ్మణులు సాధించినదేమంటే, ఆధ్యాత్మిక దృక్పథం. ఈ ఆధ్యాత్మిక వాదం వర్గపీడనకు చాలా ఉపకరించింది. స్వర్గమూ, నరకమూ, పుణ్యపాపాలూ, విధీ, కర్మ సిద్ధాంతమూ, మాయావాదమూ, ధర్మాధర్మ నిరూపణా వర్గదోపిడికి బాగా వినియోగించాయి.

వర్గ సామరస్యం అన్న నినాదం ఈనాడు వర్గదోపిడీకి ఏలా ఉపయోగించిందీ మనకు తెలుసు. కాని ఈ కాలంలో బ్రాహ్మణ క్షత్రియ వర్గాలవాళ్ల సామరస్యం ద్వారా మిగిలిన రెండు వర్గాలనూ పీల్చి పిప్పి చెయ్యటమే గాక, ఆనాటి సమాజాన్ని బలమైన గొలుసులతో బంధించి, ఆ దోపిడీని చిరస్థాయిగా ఉంచటానికి అంతులేని కర్మకాండ సృష్టించారు.

అయితే సమాజం మారకుండా ఉండదు ధర్మశాస్త్రాలు సామాజిక పరిణామాన్ని ఆపలేవు సమాజానికంతకూ ఒకే ధర్మం చెబుతున్నట్టు ధర్మశాస్త్రాలు ఏనాడు నటించను కూడా లేదు వర్ణ ధర్మాలు ఆరంభం నుంచీ వేరువేరుగానే ఉండేవి. బ్రహ్మహత్య మహాపాతకం క్షత్రియులను క్షత్రియులు చంపుకుంటే వీరస్వర్గం మిగిలిన కులాలను చంపినా దోషంలేదు వర్ణ వివక్షత రూపంలో వర్గ వివక్షత ధర్మ శాస్త్రాల నిండా వున్నది

ఈ వర్ణ వివక్షత స్త్రీలకు కూడా వర్తిస్తుంది వాళ్ళు దాదాపు శూద్రులే. ఏ వర్ణానికి చెందిన స్త్రీ అయినప్పటికీ శూద్రులలాగే చూడబడింది ఆడది వేదాధ్యయనం చెయ్యరాదు. భర్తతోపాటు చచ్చిపోవాలి లేదా, చచ్చినదానిలా పడి ఉండాలి

కాని ఈ ధర్మ శాస్త్రాలైనా సమాజమంతటా ఒకే రకంగా అమలు జరగలేదు. ప్రాంతీయమైన ఆచార వ్యవహారాలకు ఆదరం లభించింది ఉత్తర దేశంలో మేనరికాలు నిషిద్ధమైతే, దక్షిణాన ధర్మసమ్మతం మనుస్మృతి లాటివి పుట్టేనాటికే ఈ దేశం ఒకే విధమైన జీవిత విధానానికి అతీతమైపోయింది.

వైదిక సంస్కృతి పోయింది వర్ణాశ్రమ ధర్మాలు పోయాయి. బ్రాహ్మణులు వర్తకాలు చేశారు, యుద్ధాలు చేశారు, సేనాపతులూ, మంత్రులూ అయారు. తాము రాజులను చంపి రాజ వంశాలుకూడా స్థాపించారు. పౌరోహిత్యం చేసుకుబతికిన వాళ్లు బహుకొద్దిమంది. బ్రాహ్మణులంతా ఒక వర్గంగా దోపిడీద్వారా సుఖపడిన రోజులు ఉపనిషత్తుల కాలానికే పోయాయి. వారిలో కటిక దరిద్రం అనుభవించిన వారున్నారనటానికి శునశ్శేపుడి కథే ఆధారం. అతన్ని తండ్రి నూరు గోవులకు యజ్ఞపశువుగా హరిశ్చంద్రుడికి అమ్మాడు. మరో నూరు గోవులు పుచ్చుకొని తన కొడుకును యూపస్తంభానికి కట్టాడు మరొక నూరు గోవులిస్తే వాణ్ణి చంపటానికి కూడా సిద్ధపడ్డాడు. ఉపనిషత్తులలో ఉండే ఈ కథలో విశేషమేమంటే ఈ నరమేధం చేయించే హరిశ్చంద్రుడివద్ద వేలకొద్దీ గోవులుండి ఉండాలి. యజమానులు నరపశువును యూపస్తంభానికి కట్టటానికీ నరకటానికీ నిరకరించారు కాని యజ్ఞం చేయించటానికి వెనుకాడలేదు. వాళ్ళు రాజు ఇచ్చే దక్షిణతో తృప్తిపడే మధ్య తరగతి వాళ్లు. తన కొడుకును యజ్ఞపశువుగా అమ్మటానికి సిద్ధపడినవాడు కటిక దరిద్రుడు!

దీన్నిబట్టి ఏం తెలుస్తుంది! ఉపనిషత్తుల కాలానికే – ఇంకా ముందే కూడా, ఎందుకంటే ఇది అప్పటికే పూర్వ కథ – వర్ణవ్యవస్థకు అడ్డంగా వర్గవ్యవస్థ ఏర్పడిపోయింది. వర్ణాలు వర్గాలు కాకుండా పోయాయి. ఆ దశలో వర్ణవ్యవస్థ రద్దుఅయి ఉంటే సమాజంలో ఉండే వర్గాల స్వభావం ప్రస్ఫుటంగా కనబడి ఉండేది. కాని వర్ణ వ్యవస్థ పోలేదు. అది వర్గాలకు అడ్డుతెరగా నిలిచింది.

కనీసం వర్ణ ధర్మాలన్నా నిలబడి ఉంటే వర్ణవ్యవస్థకు కొంత అర్థం ఉండేది చేతనైన బ్రాహ్మణులు రాజులూ, మంత్రులూ, సేనాపతులూ, సామంతులూ కాగా, అడుక్కు

తినేవాళ్ళు అడుక్కుతినగా, యజ్ఞకర్మలతో పొట్ట పోసుకునే పరిస్థితి వెనకబడి, మధ్యతరగతి బ్రాహ్మణులు వందిమాగధులూ, వడ్రంగులూ, విలుకాళ్ళూ, శిల్పులూ, జ్యోతిష్కులూ, వైద్యులూ అయ్యారు ఒకప్పుడు వైదిక వాఙ్మయాన్ని బ్రాహ్మణులు రహస్యంగా ఉంచినట్టే – ఉపనిషత్తులంటే రహస్య జ్ఞానం! ఇప్పుడు బ్రాహ్మణులు తాము సంపాదించిన శాస్త్రజ్ఞానాన్ని రహస్యంగా ఉంచి, బాగు పడటానికి యత్నించారు.

దీనితోబాటు బ్రాహ్మణత్వం ఇంకొక సాంఘిక పాత్ర నిర్వహించింది రాజులు తమ రాజ్యాలను విస్తరించుకునే ప్రయత్నంలో వేరు వేరు జాతుల వాళ్ళను జయించినప్పుడు, ఆ జాతులలో ఏనాడూలేని వర్ణవ్యవస్థను ఏర్పాటు చేసి, వాళ్ల నాయకులను రాజులను చేసి, వారికి క్షత్రియత్వమూ, గోత్రాలూ అంటగట్టి సమష్టి జాతి సంపదను ఆ రాజు యొక్క సొంత ఆస్తిని చేసి, వారికి కర్మకాండను జరపటానికి ఆ జాతివారినే బ్రాహ్మణులుగా తరిఫీదు చెయ్యటం జరిగింది. ఆ విధంగా ఏర్పడిన వారే బోయ బ్రాహ్మణులూ, ఆభీర బ్రాహ్మణులూ మొదలైన వాళ్లు. ఈనాడు విశ్వ బ్రాహ్మణులయికూడా పౌరోహిత్యం చేసే బ్రాహ్మణులు విడిగా ఉన్నారు.

ఇదొక బ్రాహ్మణ మతంగా రూపొంది, దేశమంతటా విస్తరించింది. ఒక ప్రాంతపు బ్రాహ్మణులను మరొక ప్రాంతం వారు తక్కువ చేసి చూశారంటే, ''జన్మనా జాయతేశూద్రః కర్మణాజాయతే బుధః'' అన్నది అక్షరాలా నిజమయింది. అంటే, శూద్రులుగా ఉండవలసినవాళ్లు కర్మకాండ నేర్చుకుని బ్రాహ్మణులుగా వ్యవహరించారు. ఒకడు జన్మతః బ్రాహ్మణుడని చెప్పటానికి లేకుండాపోయింది. ఇది రాజుల అభ్యుదయానికి తోడ్పడిందేమో గాని, వర్ణ ధర్మం నిలబడటానికి తోడ్పడలేదు. జాతుల వాళ్ళను 'ఆర్య' సమాజాలుగా మార్చినప్పుడు, వాళ్లు తమ పాత ఆచారలను, పాత దేవుళ్ళనూ, దేవతలనూ, జాతరలనూ మానుకోలేదు. ఆకారణంచేత విరుద్ధమయిన అనేక ఆచారాలు ''హిందూ సమాజం'' అనే దానిలో ప్రవేశించాయి. అనార్య దేవతలను అర్చించటానికి సంస్కృత మంత్రాలు సృష్టి అయాయి. కొందరు దేవతల పేర కొత్తగా పురాణాలు అవతరించాయి.

బ్రాహ్మణుల స్థితి ఇలా ఉంటే, క్షత్రియ వర్ణం స్థితికూడా ఇలాగే ఉన్నది. వేద కాలంలో క్షత్రియులంటే అందరినీ 'రాజన్' అన్నారో లేదో తెలీదు. బుద్ధుడి కాలంలో శాక్యులూ, లిచ్ఛవులూ మొదలైన జాతుల వాళ్ళు తాము క్షత్రియులమని చెప్పుకోవడమే గాక, క్షత్రియులది అగ్రవర్ణమనీ, బ్రాహ్మణులు తమ తరువాత వర్ణమనీ చెప్పుకున్నారు. వాళ్ళు ప్రధానంగా వ్యవసాయం చేశారు. వర్ణాశ్రమ ధర్మాల ప్రకారం అది వైశ్యుల పని. వాళ్ళది సమష్టి జీవనం. వాళ్ళవి. గణతంత్ర రాజ్యాలు. అలాంటి సమాజాలలో వర్ణ ధర్మాలు – బ్రాహ్మణులు కల్పించినవి – ఉన్నట్టు కనబడదు.

ఏమైనా, నంద వంశం నుంచీ క్షత్రియులు లేరనే నానుడి ఉన్నది. అయినా అటు

తరువాత క్షత్రియ వంశాలు ఎక్కువయాయిగాని, అంతరించిపోలేదు. ఇందుకు కారణం, రాజ్యాలు ఏలినవారందరూ బ్రాహ్మణుల చేత అబద్ధపు వంశ వృక్షాలు తయారు చేయించుకుని, సూర్యవంశానికో, చంద్రవంశానికో చెందినవాళ్ళమని చెప్పుకున్నారు. ఇది బ్రాహ్మణులు 'క్షత్రియ' కులానికి చేసిన నిర్వాకం మన ఎరుకలో, శూద్రుడైన శివాజీ పట్టాభిషేకానికి అర్హుడుకావటానికి ఒక బ్రాహ్మణుడి చేత తమది క్షత్రియ వంశమని కితాబు పొందాడు. ఆ బ్రాహ్మణుడు మహారాష్ట్రుడైనాకాదు, కాశీవాడు

పురాణాలలో చెప్పిన పరశురాముడి కథ నిజమైతే అది వాస్తవమయిన వర్గ కలహం అయి ఉండొచ్చుగాని, చరిత్రకాలంలో మటుకు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులనేవారు వేరువేరు వర్గాలు కారు. బుద్ధుడి కాలంనాటికే వైశ్యులు వర్తక వాణిజ్యాలు చేస్తున్నారు కర్షక గ్రామాలలో శూద్రకుటుంబాలను స్థాపన చేస్తున్నారు రాజ్యాల విస్తరణలో వేల సంఖ్యలో గ్రామాలు వెలిశాయి. వాటిపంపిణీ అంతా పాలకులకు అనుకూలంగా బ్రాహ్మణులు నిర్ణయించింది బ్రాహ్మణుల సంపర్కం లేని జాతులు శూద్రులుగా దిగబడిపోతే, అవే జాతులు బ్రాహ్మణ సంపర్కంతో పై వర్గాలుగా చలామణీ అయాయి అలా శూద్రులైపోయిన వాళ్ళు అభీరులు. ఆదిలో క్షత్రియులైన కిరాతకులకు అదే గతి పట్టింది పుండ్ర, మాగధ, జడ్రులు శూద్రులై పోయారు.

వర్ణవ్యవస్థకు ఎలాటి అర్థమూ, ఎలాటి భౌతికమయిన ఆధారమూ లేకుండా పోయినాక కూడా ఈ వ్యవస్థ కొనసాగింది. వివిధ వృత్తులను బట్టి కులాలు ఏర్పడ్డాయి. సమాజంలో చేరిన కొన్ని జాతులకు కులాల ప్రతిపత్తి లభించింది. గొల్లజాతి అలాటిదే. యాదవుడైన కృష్ణుడు గోవుల మధ్య పెరిగిన కారణంగా గొల్లలు యాదవులమని చెప్పుకుంటున్నారు.

అయితే కుల వృత్తులు తారుమారయాయి. కొన్ని వృత్తులు పోయాయి. కొత్త వృత్తులు వచ్చాయి కులపరంపరగా ఈ వృత్తులు సాగటం మానిన అనంతరం కులవ్యవస్థకు కూడా అర్థం లేకుండా పోయింది. ఆదిలో వర్ణవ్యవస్థకు ఉండిన అర్థం తరువాత కులవ్యవస్థకు లేకుండా పోయింది. అందుకు కారణం కులాలు వర్గాలు కాకపోవడమే.

కులవ్యవస్థకే అర్థం లేకుండా పోయినాకూడా వర్గాల దుర్గంధం పోలేదు. అసంఖ్యాకమైన కులవృత్తులు చేసుకునేవాళ్ళు, అంటే ఉత్పత్తికోసం శ్రమించేవాళ్ళు, శూద్రుల కింద జమ అయిపోయి, దోపిడీకి గురిఅవుతూ వచ్చారు. ఇంకా గురి అవుతున్నారు.

వేదకాలపు ఆర్యులకు ఒక మతం అంటూ ఉన్నా లేకపోయినా, అనంతర కాలంలో మతంగా వ్యాప్తిలోకి వచ్చినది బ్రాహ్మణ మతం. అదే హిందూ మతంగా చలామణి అయింది. దీనికి ఆధారం ఆధ్యాత్మికవాదం. ఆచరణలో బ్రాహ్మణులు

సృష్టించిన ఆచారాలు. అయితే ఇతర మతాలు దీని మీద పోటీగా వచ్చాయి బ్రాహ్మణమతం మీద తీవ్రంగా పోటీ చేసింది బౌద్ధం కొంతవరకు జైనం ఈ రెండు కూడా కుల వ్యవస్థను ఎరగని గణతంత్ర జీవితం నుంచి పుట్టినవే. అయితే, బౌద్ధం వర్ణ వ్యవస్థను ఆమోదించకపోయినా దాన్ని తీవ్రంగా ప్రతిఘటించలేదు. వర్ణవ్యవస్థకు ఆస్కారం లేని కారణంచేతనే బౌద్ధం ఈ దేశంలో కన్న ఇతర దేశాలలో విజయవంతంగా వ్యాప్తి చెందిందంటారు జైనం వర్ణవ్యవస్థను ఆమోదించి కొంత వరకు నిలవగలిగింది.

ఇలాగే, శైవం, వైష్ణవం, సిక్కుమతం తదితర సవాలక్ష మతాలు వర్ణవ్యవస్థను తీవ్రంగా ప్రతిఘటించక, హిందూ సమాజంలో ఇమడ గలిగాయి కొన్ని మతాలవాళ్ళు ఒక ప్రత్యేక సంఘంగా నిలవగలిగితే, మరి కొన్ని చిల్లర మతాలవాళ్ల హిందూ సమాజంలో ప్రత్యేక కులాలుగా చేరిపోయారు. అన్ని రకాల కులాలనూ – వృత్తిని బట్టి ఏర్పడిన వాటినీ, మతాచారాలను బట్టి ఏర్పడిన వాటినీ వర్గం అనేది చీల్చి పారేసింది.

వర్గం అనేది సమాజంలో దోపిడీ విధానంలో మనుషులు నిర్వహించే పాత్రను బట్టి ఏర్పడుతుంది. ఉత్పత్తి చేసేటందుకు శ్రమించేవాళ్ళూ , ఆ ఉత్పత్తిలో హెచ్చు భాగం దోచుకునేవాళ్ళూ ఈ దోపిడీ విధానంలో దోపిడీదార్లకు సహాయకులుగా ఉంటూ దోపిడీలో 'నక్కవాటా' పుచ్చుకునే వాళ్ళూ, సామాజిక దోపిడీకి అనుకూలించే సిద్ధాంత సూత్రాలకు ప్రచారం ఇచ్చేవాళ్ళూ వేరు వేరు వర్గాలుగా ఉంటారు. అన్ని వర్గ సమాజాలలోనూ అల్ప సంఖ్యాకులు అధిక సంఖ్యాకుల శ్రమ శక్తితో జరిగే ఉత్పత్తిని కొల్లగొట్టుతారు. అయితే ఈ దోపిడీ వెనక ఒక సాంస్కృతిక తెర ఉంటే గాని నాటకం సాగదు. దాన్ని రమ్యంగా రంగు రంగులతో తయారు చేసేవాళ్ళు కావాలి. నాటకంలో ఘట్టాలు మారినప్పుడల్లా ఈ తెరలు మారుతూంటాయి. చిన్న పిల్లల కథల వెంట ఉండే బొమ్మలు కథకు జీవం పోసినట్లు, ఈ తెరలు నాటక ఘట్టాలను ఆమోదకరంగా చేస్తుంటాయి

ఉదాహరణకు : ''ఆడది మహా పాపాత్మురాలు. మాయావిని. దాన్ని చెప్పుకింద తేలులా ఉంచాలి. దాన్ని ఎంత మాత్రమూ నమ్మరాదు'' అన్న సాంస్కృతిక భావం తెరగా కట్టి చచ్చిన మొగుడుతో బతికున్న పెళ్ళాన్ని తగలేసి, దానికి ఉత్తమ లోకాలు కలిగాయని జనాన్ని నమ్మించవచ్చు. అదొక సాంస్కృతిక దశ. ఈ సంస్కృతిలో చిన్న అభివృద్ధి వస్తుంది. అప్పుడు మొగుడు చచ్చినదాన్ని తగులబెట్టే 'దురాచారం' పోయి, దానికి గుండు కొట్టించి, అలంకరణలన్నీ తీసేసి ఒంటిపూట తిండి పెట్టి, వెట్టిచాకిరీ చేయించే 'సదాచారం' అమలులోకి వస్తుంది. మానవత పెంపొందుతుంది! దీన్ని క్షుద్రమైన సాంస్కృతిక వికసనం అంటారు. వర్గసమాజంలో జరిగే సాంస్కృతిక వికసనం అంతా ఇలాగే ఉంటుంది. వీటినే సంస్కరణలు అంటారు.

సాధారణంగా ఈ సంస్కరణలు, అవలు జరగటవంటూ ఉంటే, కాలాతీతంగానే అమలు జరుగుతాయి అవసరమైనదానికన్న కొన్ని దశాబ్దాలూ, శతాబ్దాలూ వాయిదాపడి మరీ జరుగుతాయి. కాని, సమాజంలో చలామణిలో ఉండే ఆర్థిక దోపిడీలకు వ్యతిరేకంగా ఉండే పక్షంలో ఈ సంస్కరణలే తీవ్ర ప్రతిఘటనను ఎదుర్కొంటాయి అటువంటి ప్రతిఘటనలను ఎదుర్కొని సంస్కరణ భావాలను ప్రచారం చేసినవాళ్ళు మహాపురుషు లనిపించుకుంటారే గాని, వాళ్ళు సామాజిక దోపిడీని అరికట్టలేరు.

ఈనాడు మనం భారతీయ సంస్కృతి అనేది మిశ్రమ సంస్కృతి. ఇందులో ఆదిమవాసుల ఆచారాలు మొదలుకొని విమానయానాల దాకా సమస్తమూ ఉన్నది. భౌతికవాదంతో ఆధ్యాత్మికవాదాలూ, వర్గతత్వంతో కులతత్వమూ పెనవేసుకుపోయి ఉన్నాయి. ప్రగతి అనేది కేవలము భౌతిక రూపంలో సాధించవలసి ఉండగా, అందు కవసరమైన భావ చైతన్యం లోపించినప్పుడు ప్రగతి సాధ్యం కాదు. మందులతో నయమయే రోగానికి భూతవైద్యం చేయించుకునే వాడు రోగం నయం చేసుకోలేడు. ఈనాడు మన ప్రభుత్వం దవ్యోల్బణాన్ని అరికట్టటానికి చేసే ప్రయత్నాలు ఎంత అసంబద్ధంగా ఉంటున్నాయో, భారతీయ సంస్కృతి అనేది దేశ ప్రగతికి అంత అననుకూలంగా ఉంటున్నది. అందుకే అలెగ్జాండరు దండయాత్రల కాలం నుంచీ కూడా ఎవరు పడితేవాళ్ళు జయించటానికి అనువుగా ఉంటూ వచ్చింది

బలమైన సంస్కృతీ, దానికి అనుగుణమైన సామాజిక జీవితమూ గల జాతి తేలికగా ఇతర సంస్కృతులను అందిపుచ్చుకోదు మ్యూజియం లాంటి మన భారతీయ సంస్కృతిలో అన్ని జాతుల సంస్కృతికీ చోటున్నది. బ్రిటీషు వాళ్ళ కాలంలోనూ, అంతకు ముందు మహమ్మదీయుల కాలంలోనూ, ఇంకా ముందు గ్రీకులనుంచి కూడా మనవాళ్ళు దొరికినదంతా అందిపుచ్చుకున్నారు. అదంతా మనకూ, మన ప్రగతికీ ఏ విధంగా పనికి వస్తుందన్న ఆలోచన లేదు

ఈనాడు కూడా భారతీయ సంస్కృతిలో వైవిధ్యం పట్టణాలకూ పల్లెలకూ మధ్య కనిపించినంతగా వర్గాల మధ్య కనిపించదు. వర్గ సంస్కృతి విషయంలో ఈ దేశం చాలా వెనకబడి ఉన్నది. కులం అన్నది. ధనానికీ, పదవులకూ, పైకి వచ్చే అవకాశాలకూ ఆధారంగా ఉండటం ఈ పాతికేళ్ళలో బాగా విజృంభించిన కారణంగా కులతత్వం పెరిగింది. ఇది వర్గ దృక్పథాన్ని నీరు గార్చుతుంది.

సరిఅయిన వర్గ చైతన్యం దోపిడీ చేయగల వర్గాలకే పరిమితమై ఉన్నది. వాళ్ళు జాతీయ సంస్కృతిని బహూకృతుల ద్వారా కానియ్యండి, ధన సహాయం ద్వారా కానియ్యండి, మేధావుల అరెస్టుల ద్వారా కానియ్యండి, శాసించినంత కాలము, ప్రగతికి పనికి వచ్చే సంస్కృతి ముందుకు రాదు. ఈ పరిస్థితిలో అట్టడుగు నుంచి సంస్కృతి

బయలుదేరి, పోరాడుతూ పైకి రావాలి అలా రావలసినది విప్లవ సంస్కృతి, దేశంలోని అత్యధిక సంఖ్యాకుల సంస్కృతి. విప్లవ సంస్కృతి తెర మీద విప్లవ నాటకం ఆడాలి, దోపిడీ సంస్కృతికి సంబంధించిన తెరలన్నీ చించి పారెయ్యాలి కొంత విధ్వంసం జరగకుండా నూతన సృష్టి సాధ్యం కాదు.

దోపిడీ వర్గాలు తమ మంత్రిత్వ శాఖలద్వారానూ, ప్రయాణ సౌకర్యాల ద్వారానూ, రేడియో వగైరాల ద్వారానూ, మత మౌఢ్యాన్ని అపారంగా పెంచుతున్నాయి ఎన్నికలూ, నిమ్నజాతుల కిచ్చే సౌకర్యాలూ కులవ్యవస్థను పటిష్టం చేస్తున్నాయి. సినిమాలు సైతం ప్రజల మనస్సులను వర్గ సంస్కృతి నుంచి వేరు చేయటానికి శాయశక్తులా కృషి చేస్తున్నాయి. కనీసం మన గతాన్ని గురించి కూడా మనకు నిజం తెలియకుండా అబద్ధాలు చెప్పారు. అది కూడా పైవాళ్ళ చెప్పినదే మనం విన్నాం. మాక్స్‌ముల్లర్ మనది నికరమైన ఆధ్యాత్మిక దృక్పథం అంటే నిజమేననుకుని పొంగిపోయాం. ఒక వంక మనని పాశ్చాత్య దేశాలు దోచుకుంటూ ఉంటే, మనం మన ఆధ్యాత్మిక బలంతో ప్రపంచాన్ని జయిస్తామని వివేకానందుడు కలలుగన్నాడు.

తిరుగుబాటు ఉద్యమాలు వచ్చాయి. బ్రాహ్మణ వ్యతిరేకోద్యమమూ, నాస్తిక ప్రచారాలూ, పురాణాల దహనమూ లాంటివి ప్రోలిటేరియన్ సంస్కృతిలో ఒక భాగంగా కొనసాగలేదు. ఇలాంటి తిరుగుబాట్లు వర్గ దృక్పథంతో కూడినవి కానందున సంస్కరణ యత్నాలుగా ఉండిపోయాయి.

ఇప్పుడు పీడిత వర్గ సంస్కృతి ఎంతైనా అవసరం. దానికి విరుద్ధంగా ఉండే సంస్కృతిని పూర్తిగా నరికి పారెయ్యాలి. అందుకు మార్క్సిజం – లెనినిజం-మావోయిజం తప్ప మరో సాధనం లేదు. ఇది నూరేళ్ళ కాలంలో చక్కగా పదునెక్కింది. ఇది హైడ్రోజన్ బాంబులను మించిన పరికరం. ఇదే ప్రపంచ మంతటా ఒక నూతన యుగాన్ని స్థాపించగలది. భారతీయ సంస్కృతి చలామణి అవుతున్న ఈ కీకారణ్యం పోయి, ప్రోలిటేరియన్ సంస్కృతి అనే నందనవనం రావాలి.

*రచన : అక్టోబరు 1974, ముద్రణ : సృజన, మాసపత్రిక, ఆగస్టు 1977.*

# భారతంలోని సామాజిక వ్యవస్థ ఎలాంటిది ?

భారతం నిజమా అబద్ధమా ? భారత యుద్ధం ఎప్పుడు జరిగింది ? అది ఎక్కడ జరిగింది ? ఇలాంటి ప్రశ్నలు చెరువులో నాచులా పైకి తేలి, రాజకీయ వేత్తలకు శాస్త్రపరిశీలకులకు అతి ముఖ్యమైన సమస్యలుగా తయారయి అంతటితో పోక నిపుణుల

మధ్య వాగ్యుద్ధాలు కూడా తెచ్చిపెట్టాయి.

ఎవరూ పట్టించుకోని ఒక సమస్య నన్ను పట్టుకున్నది. భారతంలోని ప్రధాన వ్యక్తులు ఏ సామాజిక పరిణామదశకు చెందినవాళ్ళు? వాళ్లది భారత వంశమని ఒప్పుకుందాం – వారి కథ భారతం గనక వాళ్ళు క్షత్రియులని కూడా ఒప్పుకుందాం. కాని, ఏ క్షత్రియులు ? గణ క్షత్రియులా ? వర్ణ క్షత్రియులా ? వర్ణ వ్యవస్థ రాక పూర్వమే ఆర్యగణాలలో బ్రాహ్మణ క్షత్రియ వర్గాలుండేవి. శాక్యులు కనీసం బుద్ధుడి కాలానికి వ్యవసాయం ప్రధానంగా గల క్షత్రియులు. వారికి వర్ణవ్యవస్థ లేదు.

గణ వ్యవస్థలో కూడా రాజులు ఉండేవారు, వారు గణాలను పాలించారు. కాని రాజ్యాలను పాలించలేదు. ఆ రాజులు ఎన్నిక అవుతుండేవారు. సభా మర్యాదకు కట్టుబడి గణ నియమాలు పాటించేవారు. ఒక జాతిలో అనేక గణాలున్నప్పుడు వేరువేరు గణాలకు వేరువేరు యువకులు ఉండి అందరిపైన ఒక నాయకుడు ఉండడం కద్దు. ఉదాహరణకు పడమర తీరాన నాలుగు యాదవగణాలు కలిసి ఏర్పరచిన ద్వారవతిలో రాజకీయ నాయకుడు ఉగ్రసేనుడు యుద్ధ నాయకుడు కృష్ణుడు. ఏ నిర్ణయం జరిగినా యాదవగణాల పెద్దలందరూ సభలో చేరి స్వేచ్ఛగా సమస్యలు చర్చించేవారు. గణపాలనలో 'సభ' చాలా ముఖ్యమైనది. భారతంలో కౌరవులకు పాండవులకు కూడా ప్రశస్తమైన సభలున్నాయి. భారత కథకు ఆయువు పట్టులైన సంఘటనలు పాండవ సభలోనూ, కౌరవ సభలోను జరిగాయి.

ఒకటి రెండు తరాలు వెనక్కి పోదాం. ప్రతీపుడు కౌరవరాజు. అతను ఎలాంటి క్షత్రియుడో ఎలాటి రాజ్యాన్ని పాలించాడో మనకు తెలీదు. ముసలివాడు కాక మునుపే అడవిలో తపస్సు చేశాడు. ఒకనాడు ఒక ఆడకూతురు వచ్చి అతని కుడితొడ మీద కూర్చున్నది. తాను గంగను అని చెప్పుకున్నది. ఏ కారణం చేతనైతేనేం ఆమె సంపర్కం ఇష్టంలేక ప్రతీపుడు ''నువ్వు నా భార్యవు కాగోరితే నా ఎడమ తొడపైన కూర్చోవలసింది. నాకు పుట్టబోయే కొడుకును వరించు'' అని ఆ గంగను పంపేశాడు.

గంగ ప్రవర్తన మొత్తమంతా స్వచ్ఛంద ఆటవిక స్త్రీని స్ఫురింపజేస్తుంది. ఆమె గంగా తీరాన ఉండే ఏ ఆటవికజాతి స్త్రీ అయినా కావచ్చు. గంగ అనే జాతి కావచ్చు. గంగా వంశంవాళ్ళు చరిత్రలో వున్నారు. ప్రతీపునికి శంతనుడు పుట్టాడు. ఇతనూ రాజేకాని ఏ రకం రాజో తెలీదు. వేటాడేవాడు. అలాగే అతనికి గంగ తటస్థపడింది. శంతనుడు ఆమెను వలచాడు. తన స్వచ్ఛంద వర్తనకు అతను అభ్యంతరం చెప్పని షరతు మీద ఆమె అతనితో కాపురం చెయ్యటానికి ఒప్పుకున్నది. అతనికి ఏడుగురు కొడుకులను కని వాళ్లను 'గంగ'లో కలిపింది. పసువులూ శాపమూ అనే కట్టుకథలు

అవతల పెడితే గంగ ఆ పిల్లలను తమ జాతిలో చేర్పించిందనుకోవాలి తనకు వారసుడు, తన కొడుకునని చెప్పుకునేవాడు కావాలని శంతనుడి ఏడుపు అయివుండాలి ఎనిమిదో కొడుకుని ఆమెకియ్యి నిరాకరించాడు గంగ చేత విడాకులు పుచ్చుకోవడానికి సిద్ధపడ్డాడు అయినా ఆ కొడుకును గంగ పధ్నాలుగేళ్లు పెంచి, అతనికి ఆటవిక విద్యలలో శిక్షణ ఇయ్యడానికి ఒప్పుకున్నాడు

అయితే భీష్ముడు భరత క్షత్రియ వంశాన్ని వృద్ధి చెయ్యలేకపోయాడు శంతనుడు మరొక అనార్య స్త్రీని మోహించి 'శాస్త్రోక్తంగా' పెళ్ళాడగోరాడు. ఆమె దాశకన్య. అదివరకే కాజువల్‌గా పరాశరుడి కామం తీర్చి, కృష్ణ ద్వైపాయనుడనే ప్రసిద్ధ వ్యాసుణ్ణి కని ఉన్నది. ఒక 'వర్ణ' క్షత్రియుడైన రాజు ఆమెను పెళ్ళాడతాడనగానే ఆమె తండ్రి తనకు పుట్టబోయే మనవడికి రాజ్యం కావాలని షరతు పెట్టాడు. భీష్ముడు ఆజన్మ బ్రహ్మచారి అయ్యాడు.

శంతనుడు సత్యవతికి ఇద్దరు కొడుకులను కన్నాడు. భీష్ముడు క్షత్రియ స్త్రీకి పుట్టకుండానే రాజ్యార్హత పొందాడు. అయినా తన తమ్ములకు వర్ణ క్షత్రియుడి కూతుళ్ళను తెచ్చి పెళ్ళి చేశాడు. అట్లాగూ శంతనుడి వంశం వృద్ధికాలేదు. శంతనుడి కొడుకులిద్దరూ నిస్సంతుగా చచ్చారు. శంతనుడి వంశం వృద్ధికావటానికి వర్ణ నియమాలను ఉల్లంఘించి వ్యాసుడి చేత శంతనుడి కోడళ్ళకి పిల్లలను కనిపించవలసి వచ్చింది. అతనైనా ఒక బ్రాహ్మడికీ ఒక దాసీ స్త్రీకి పుట్టిన బ్రాహ్మడు.

పాండురాజులో గణ క్షత్రియుడి లక్షణాలు హెచ్చు. అతను రాజ్యాన్ని ధృతరాష్ట్రుడికి వదిలేసి ఆటవికుడిలాగా వేటలో కాలం వెళ్ళబుచ్చాడు. అసలు భారతంలో పాండవులు వేటగాళ్ళ్లా, కౌరవులు పశుపోషకులుగా కనిపిస్తారు. పాండురాజులాగే పాండవులు అవసరాన్ని మించి వేటాడి అరణ్యవాసం చేసేటప్పుడు అరణ్యాలకు అరణ్యాలే మృగాలు లేకుండా చేశారు. భీముడు వేటాడుతూ వెళ్ళి వెళ్ళి పాముకు చిక్కినప్పుడు మిగిలిన పాండవులు అతను దారిపొడవునా చంపిన జంతువుల జాడను బట్టి అతన్ని పట్టుకుని పామునుంచి విడిపించారు. వాళ్ళు రాజ్యం చేసినప్పుడు కూడా వాళ్ళ పశువుల మందల ప్రస్తావన కనబడదు 'బార్బరిజం' లో కూడా కౌరవులు పాండవుల కొక్క అడుగు వెనక ఉన్నారనటానికి సందేహంలేదు.

పాండుడు తన వంశం వృద్ధి కావటానికి తన భార్యలు ఎవరికి పిల్లలని కన్నారన్న విషయం ఏమీ పట్టించుకోలేదు. మాతృసామ్యం ప్రకారం ఎవరికి పుట్టినా కుంతి పిల్లలు, కుంతి పిల్లలే. వాళ్ళు పాండురాజు పిల్లలు కాడం ఏ సిద్ధాంతాన్ని బట్టో తెలీదు. క్షేత్రప్రాధాన్యం ఆమోదించబట్టే దాసికి పుట్టిన విదురుడు శూద్రుడయ్యాడు. కాని

ధృతరాష్ట్రుడు, పాండుడు శంతనుడి కొడుకు పిల్లలు ఎలా అయారో తెలీదు. ఇది ఆటవిక ఆచారాల వికృత స్వరూపంగా కనపడుతుంది. పాండుడు తన భార్యలను అలా పిల్లలను కనమని చెప్పేటపుడు ప్రాచీన ఆచారాలను చెబుతాడు. భారతం నాటి ఆచారాలే ఇలా వుంటే ఇంకా ప్రాచీనమైన ఆచారాలు ఎలాటివై ఉండాలి ? ఏ సామాజిక వ్యవస్థకు చెందినవై ఉండాలి ?

పాండవులు అయిదుగురూ ఒక్కతెను సమష్టి భార్యగా స్వీకరించినప్పుడు కూడా అతి ప్రాచీన గణాల ఆచారలను ప్రమాణంగా చెప్పారు. ఇంతకూ ద్రౌపది ద్రుపదుడి లాంటి వర్ణ క్షత్రియుడికి పుట్టినది కాదు. ద్రుపదుడు ఆటవికుల మధ్యకు వెళ్ళి అగ్నిసాక్షిగా ద్రౌపదినీ ధృష్టద్యుమ్నుణ్నీ దత్తు తెచ్చుకున్నాడు. వాళ్ళు ఏ జాతివాళ్ళో తెలీదు.

అలాగే భారతంలో ద్రోణుడు, కృపుడు, అశ్వత్థామలాంటి వర్ణ బ్రాహ్మణులు ఎవరికి పుట్టారో తెలీదు కుండల్లోనూ, కడవల్లోను పుట్టారంటే తల్లుల పేర్లు చెప్పరానివనే అర్థం. ఇంతకూ వాళ్ళు వర్ణ బ్రాహ్మణ ధర్మాలు పాటించలేదు. ద్రోణుడు రాజరికంకూడా సంపాదించాడు !

అలాగే భారత కాలంనాటికి సామాజిక వ్యవస్థ గణ వ్యవస్థకు వర్ణ వ్యవస్థకూ మధ్యగా ఉన్నట్లు కనపడుతుంది. గణ నియమాల ప్రకారం దాయాదులను వధించడం అతి దారుణైన తప్పు. ధర్మరాజు తాను వర్ణ క్షత్రియుడనని తనది క్షత్రియ ధర్మమని అనుకుంటే తన రాజ్యభాగంకోసం అరణ్యవాసమూ, అజ్ఞాతవాసమూ చేసేపనే లేదు. ఏ సేనలు అవసరంలేదు. భీముణ్ణి వదిలితే కౌరవసభలోనే ధృతరాష్ట్రుడి కొడుకుల అంతు చూసేవాడు ఏమైనా మిగులుంటే అర్జునుడు చూసుకునేవాడు. అలాకాక ధర్మరాజు పదమూడేళ్ళు నానా అగచాట్లు పడడమేగాక అయిదు ఊళ్ళకు రాజీకూడ పడ్డాడు.

అదే విధంగా అర్జునుడు తన దాయాదులను చంపవలసి వచ్చేటప్పటికి వణికిపోయి గాండీవం జారవిడిచాడు అప్పుడు కృష్ణుడు అర్జునుడితో 'సుఖిః క్షత్రియ పార్థ లభంతే యుద్ధ మాదృశం..', 'ధర్మార్థి యుద్ధాత్ శ్రేయోన్యత్ క్షత్రియస్య న విద్యతే' లాటి ధర్మ పన్నాలు చెప్పి అతన్ని వర్ణ క్షత్రియుడిగా చెయ్యడానికి ప్రయత్నించడం చిత్రంగా కనిపిస్తుంది.

గణ క్షత్రియుడి అంతరాత్మ చావకపోవడం వల్లనే చార్వాకుడు 'దాయాదులను చంపిన నీవు చావాలి' అనగానే ధర్మరాజు జావగారిపోవడం జరిగింది.

కృష్ణుడు ఒక్కడే నిమిషాల మీద గణ వ్యవస్థను వర్ణవ్యవస్థగా మార్చాడా ?

రెండు తరాలలో కౌరవ పాండవులు ఆటవిక దశనుంచి బయటపడడంతో ప్రారంభించి సామ్రాజ్యం స్థాపించేదాకా ఎదిగారా ?

ఇదే నాకు భారతంలో అన్నింటికన్నా విడ్డూరంగా కనబడేది.

భారత యుద్ధం నాటికి భీష్ముడికి దాదాపు నూరేళ్ళుండాలి. అతను కౌరవ సేనాని పదవి ఎందుకు స్వీకరించాలి అని ఇరావతి కార్వే అడిగారు. కౌరవ గణాలకు భీష్ముడు యుద్ధ నాయకుడుగా మూడు తరాలకు పనిచేశాడు గనక అని నా సమాధానం. కౌరవుల కన్న సామాజిక పరిస్థితిలో ఒక దశ వెనుక ఉన్న పాండవులు సామ్రాజ్యాన్ని స్థాపించారనడం ఆశ్చర్యకరం. వారు అందుకు ప్రయత్నించారే అనుకున్నా అది విడ్డూరమే.

*ఆంధ్రజ్యోతి, దినపత్రిక, 27 - 3 - 1976*

# భారత కాలంనాటి రాజకీయాలు

భారత కథ భృగు వంశ బ్రాహ్మణుల చేతిలోపడి ఖరాబయిందని అందరూ ఒప్పుకుంటారు. అయినా మూలకథను సామాజిక పరిణామ దృష్టితో చూసినట్లయితే అప్పటి రాజకీయ వ్యవస్థ కొంతవరకు అర్థం అవుతుంది.

భారతం నిండా వర్ణ ధర్మాలూ, క్షత్రియధర్మాలూ, రాజ ధర్మాలూ కనిపిస్తాయి. కాని ఇవి భారత కాలపు జీవనానికి ఎంతవరకు వర్తిస్తాయన్నది చూడాలి.

భీష్ముడూ, పాండుడూ, ధర్మరాజూ కూడా మళ్ళీ మళ్ళీ భూమి నాలుగు చెరగులూ జయించి కురు రాజ్యాన్ని పెంపొందించినట్టు చెప్పబడింది. సమస్త భూమండలాన్నీ ఒకటి రెండు తరాల వాళ్ళు పదే పదే జయించడం దేనికో అర్థం కాదు. వాళ్ళు ప్రత్యేకంగా ఏయే రాజ్యాలు జయించారో తెలీదు. భీష్ముడు రాజు కాలేదు. ధృతరాష్ట్రుడు గుడ్డివాడని పాండుణ్ణి రాజు చేశారు. ఆనక ఆయన ఈ గుడ్డివాణ్ణే రాజ్యం చెయ్యనిచ్చి, తాను అడవులు పట్టిపోయాడు. అతని కొడుకులకు న్యాయంగా రాజ్యం రావాలి, రాలేదు. ధర్మరాజుకు ఎవరూ రాజ్యాభిషేకం చెయ్యలేదు సరికదా, దృతరాష్ట్రుడు పాండవులనూ, కుంతినీ ఎక్కడో వారణావతానికి తరలిస్తే ఒక్కరు కూడా ''ఇది క్షత్రియ ధర్మం కాదు'' అనలేదు. రాజ్యార్హత లేనివాడు రాజ్యార్హత గలవాడిని దేశ బహిష్కరణ చెయ్యగలిగాడనుకోవచ్చు.

లక్క యిల్లు తగులబెట్టిన పుణ్యం పాండవులే కట్టుకున్నారు. అయితే, వాళ్ళు ఆ పని చేసే ముందు తీసుకున్న జాగ్రత్తలు చూస్తే వాళ్లకు రాజ్యార్హత లేకపోగా, జీవించే అర్హత కూడా అప్పటి సామాజిక వ్యవస్థలో లేకపోయిందనుకోవాలి. కుంతి ఏదో వ్రతం

నటించి, ఒక ఆడకూతుర్నీ, ఆమె కొడుకులు అయిదుగురినీ లక్కయింట తాగించి పడుకోబెట్టిన మీదట కొంపకు అగ్గి పెట్టి ముందుగా తయారు చేసిన సొరంగంగుండా తప్పించుకుపోయి కుంతీ, పాండవులూ ఆ కొంపలో కాలిపోయినట్టు లోకాన్ని నమ్మించవలసి వచ్చింది.

ఆ తరువాత పాండవులు తాము క్షత్రియులని చెప్పుకునేది సాధ్యంకాక బ్రాహ్మణులమని చెప్పుకుంటూ మొదట అజ్ఞాతవాసం గడిపారు. తిరిగి వాళ్ళు ద్రుపదుడి అల్లుళ్లు అయిన దాకా తాము పాండవులమని చెప్పుకోలేకపోయారు.

అప్పుడు ధృతరాష్ట్రుడు కనికరించి వాళ్ళను చేరతీసి, వాళ్ళు ''ఏలుకొనడానికి'' ఖాండవప్రస్థమనే ఊరూపేరు లేని గ్రామాన్ని ఇచ్చాడు. దాన్ని ఒక నగరంగా పాండవులే నిర్మించుకున్నారు. ఈ 'ఈనాం' ధృతరాష్ట్రుడి రాజ్యంలోదే గనుక పాండవులు ధృతరాష్ట్రుడి ఏలుబడిలోనే వున్నట్టు లెక్క.

ఈ ఘట్టంలో కృష్ణుడు ప్రవేశించి తన 'నవ సమాజ' భావాలకు శంకుస్థాపన చేశాడు. అందులో మొదటి చర్య ఖాండవవన దహనం. అరణ్యాలు తగులబెట్టి సాగుభూములు చెయ్యడం ఒక దశలో సర్వసాధారణంగా జరిగింది. ఇనుము ఉపయోగంలోకి వచ్చినాక అరణ్యాలు కొయ్యడం సులభమయింది. పాండవుల కాలానికి ఇనుము వ్యాప్తిలోకి రాకపోవచ్చు. అందుచేత వాళ్ళు ఖాండవవనాన్ని తగులబెట్టటం జరిగిందనుకుందాం.

అయితే, ఖాండవవనంలో ముఖ్యంగా తక్షక నాగులూ, ఇతర జాతులవాళ్ళూ వుంటున్నారు ఒక బ్రాహ్మణుడు ఎవరో పక్షి పేరుగల జాతి భార్యతోనూ, పిల్లలతోనూ అందులో ఉంటున్నాడు. ఖాండవ వ్యవసాయం విస్తరించేటందుకైతే ఈ జాతుల వాళ్ళ వల్ల ఎంతైనా ప్రయోజనం వుంటుంది. కాని వాళ్ళు ఖాండవ వనంతోపాటు నాశనం కావడానికి కృష్ణార్జునులు విశ్వప్రయత్నం చేశారు. ఆ వనంలో వుంటున్న లక్షలాది ప్రాణులలో తొమ్మిది మంది మాత్రమే ప్రాణాలతో బయట పడ్డారు.

ఖాండవ దహనం పాండవుల రాజరికాన్ని ప్రతిష్ఠించటానికేననేటందుకు సందేహంలేదు. రాజరికానికి పెద్ద అడ్డంకి ఆటవిక జాతులు. అంతేగాక ఖాండవ ప్రస్థం ఎలాంటి చోట వున్నదీ దీన్నిబట్టి మనం అర్థం తెలుసుకోవచ్చు

ఆటవిక జాతుల నిర్మూలనం అయిన తరువాత సభ - మయసభ. ఈ సభ వుంటేనే గాని ధర్మరాజు ఒక రాజుకాడు. అప్పటికీ అతను ధృతరాష్ట్రుడి కింద వున్న రాజే ! ధర్మరాజు స్థాయి ఇంకొక మెట్టు పెంచటానికి రాజసూయం జరిగింది. అది చేసి ధర్మరాజు ఒక స్వతంత్ర రాజ్యానికి కర్త అవుతాడన్నమాట. ఖాండవప్రస్థం

ఇంద్రప్రస్థంగా మారి కాస్త పాతవాసన పోగొట్టుకున్నది.

ధర్మరాజు ఒక స్వతంత్ర రాజు కావడంతో కృష్ణుడు తృప్తిపడలేదు ఆ కాలంలో రాజుల సమాఖ్యలుండేవి. జరాసంధుడు అలాంటి ఒక బలమైన సమాఖ్యకు నాయకుడు. అతను వందల కొద్దీ రాజులను, వారి సైన్యాలను వెంటబెట్టుకుని, మధుర మీద దండయాత్రలు చేశాడు. ఆ రాజులందరూ స్వతంత్రులే. జరాసంధుడు చక్రవర్తికాడు. కాని, ధర్మరాజును చక్రవర్తిని చేయాలని కృష్ణుని యత్నం. అందుకు జరాసంధుడు పెద్ద అడ్డంకి. కృష్ణుడు యుక్తితో భీముని చేత అతన్ని చంపించాడు.

ఆ తరువాత 'రారాజు' బిరుదు దుర్యోధనుడికి వచ్చింది. నిజానికి అతను రాజు కూడా కాడు. రాజు ధృతరాష్ట్రుడే. ధర్మరాజు చక్రవర్తి కావాలంటే దుర్యోధనుడు కూడా చావక తప్పదు. ఈ లోపుగా జరాసంధుణ్ణి చంపించడం అలా వుండగా ఇతిహాసకారులు వాడి మీద పెద్ద అభాండం వేశారు. జరాసంధుడు నూరు మంది రాజులను చెరబట్టి బలి ఇయ్యజూచాడట! ఆ నూరు మందిని జరాసంధుడి నాయకత్వం నుంచి తొలగించి ధర్మరాజుకు గులాములు చెయ్యటం అసలు ఎత్తుకావచ్చు.

ధర్మరాజు రాజుల సమాఖ్యకు నాయకత్వం వహించడానికి యత్నించ లేదనడానికి అతను సామంతుల నుంచి కప్పాలు పుచ్చుకోవడం నిదర్శనంగా కనిపిస్తుంది.

ఇంతకూ ధర్మరాజు చక్రవర్తి కాలేదు. పాండవులు వనవాసం వెళ్ళారు.

అజ్ఞాతవాసం అనంతరం కృష్ణుడు మళ్ళీ ధర్మరాజును చక్రవర్తిని చేసేపనికి పూనుకున్నాడు. తాను రాయబారం వెళ్ళేటప్పుడు భీముడు యుద్ధ విముఖత్వం చూపితే అతన్ని యుద్ధేవా చేసి రెచ్చగొట్టాడు. అర్జునుడు యుద్ధరంగంలో జావ కారిపోతే హింసాధర్మం బోధించాడు.

అయిదు ఊళ్ళతో రాజీకి సిద్ధపడిన ధర్మరాజు ఏ ఉపప్లావ్యం నుంచో రాజరికం వెలిగించలేకపోయాడు. అతని పక్షాన చావడానికి పదకొండు అక్షౌహిణుల సేనతో అనేక మంది రాజులు వచ్చారు. అతను నిలవ నీడలేని పక్షికాదు. ఎన్నో ఆటవిక జాతులవాళ్ళూ, రాక్షసులూ కూడా అతనికోసం పోరాడారు. కాని దుర్యోధనుడు చస్తేగాని పాండవ సామ్రాజ్యానికి సోపానాలు ఏర్పడవు.

భారత కథలో వున్న ట్రాజడీ అంతా సామ్రాజ్య స్థాపన యత్నాల వైఫల్యంగా కనపడుతుంది.

*ఆంధ్రజ్యోతి, దినపత్రిక, 28 – 3– 1976.*

# హీనకులాలు

మేం ఈ కొత్త ఇంటికి వచ్చినాక నాకు ఏర్పడ్డ మొదటి పరిచయం శర్మగారితో అని చెప్పొచ్చు. తమిళ మిత్రులు ముగ్గురు నలుగురున్నారనుకోండి. కాని నన్ను వెతుక్కుంటూ వచ్చి తానే పరిచయం చేసుకున్న తెలుగువాడు శర్మగారు.

మొదటిరోజు మా ఇద్దరి గతాలూ తడివి మా గత జీవితాల మధ్య ఏ విధమైన లింకులూ లేవని తెలుసుకోవడంతో సరిపోయింది ఇది కొంచెం అసాధారణమే. ఎందుకంటే, నేను కలకత్తాలాటి దూర ప్రదేశంలో కూడా తెలుగువాళ్ళను పరిచయం చేసుకున్నప్పుడు మాకు ఉభయత్రా తెలిసినవాళ్ళూ, కలిసినవాళ్ళూ తప్పక ఉంటూ వచ్చారు. కాని శర్మగారూ, నేనూ పూర్తిగా భిన్న ప్రపంచాలనుంచి వచ్చి కలుసు కున్నాం. మాకు గతం లేకపోతే లేకపోయింది. జరిగింది జరిగినట్టు చెప్పటం మంచిది.

మా పరిచయమైన కొత్తలోనే శర్మగారికున్న ఒక సుగుణం అంత హెచ్చుమోతాదులో ఉండకపోతే బాగుండేదేమో ననిపించింది. ఆయనకు కులవ్యవస్థ మీద చాలా పగ. నాక్కూడా కులవ్యవస్థ అంటే గౌరవం లేదని తెలియగానే ఆ మానవుడు విజృంభించి కులవ్యవస్థ మూలంగా సమాజంలో ఉత్పత్తి అవుతున్న కుళ్ళును గురించి అనర్గళంగా, గంటల తరబడి నన్ను ''ఎడ్యుకేట్''చెయ్యసాగాడు

ఆయనతో ఏకీభవించేవాణ్నే గనక ఆయన ప్రసంగం మొదట్లో నన్ను అట్టే బాధించలేదు. కాని రాను రాను విన్న సూక్తులే మళ్ళీ మళ్ళీ వినటం వల్ల విసుగు పుట్టడమే గాక, ఆ మనిషిలో ఏదో అపస్వరం వినిపించినట్టుగా తోచింది.

ఆయన ధోరణికి చిన్న బ్రేక్ వేసే ఉద్దేశంతో ''శర్మగారూ, మనం ఎంత అనుకున్నా కుల వ్యవస్థ వల్ల బాగుపడగలవాళ్ళు లోకంలో వున్నంత కాలమూ కులాలు పోవు. మీకు చెప్పానో లేదో, తక్కువ కులాలుగా చూడబడే వాళ్ళు పై కులాల వాళ్ళను దుమ్మెత్తిపోయడాన్ని నేను సమర్థిస్తాను'' అన్నాను.

శర్మగారు నాకేసి ముందు అయోమయంగానూ, తరువాత ఆశ్చర్యంగానూ చూసి ''అవును గద! ఇదంతా ఎందుకొచ్చింది చెప్పండీ ? మొదటనే కులాల ఏర్పాటు లేకుండా వుంటే ఎంత బాగుండేది ?'' అన్నాడు.

''మా తాత తన ఆస్తి అంతా జూదం ఆడెయ్యకపోతే ఎంతో బాగుండేది. నేను ఈ కాస్త ఉద్యోగం కోసం ఇంత దూరం రాకపోదును'' అన్నాను.

శర్మగారికి నా ధోరణి నచ్చలేదు. ''మీరు దాటేస్తున్నారు. ఆస్తులు కరిగిపోయేవే ఎలాగూ, మూడోతరం కాకపోతే నాలుగో తరం. ఆస్తిని నమ్ముకుంటే ముప్పైత్తక తప్పదు.

ఈ కులాల ఎడం నానాటికీ వృద్ధి అవుతున్నది గదా'' అన్నాడాయన

నేను అప్పటికి నా దస్తరం మూసేశాను

శర్మగారిలో ఒక విచిత్రమైన శక్తి – దాన్ని శక్తే అందాం, ఉన్నది. క్లాసులో మేష్టారులాగా నిన్న ఎక్కడ ఆపాడో అక్కడే సబ్జెక్టు ఎత్తుకుని, ఆ పాయింటు మీది నుంచి ఒక్క అంగుళం ముందుకు పోకుండా ఎంతసేపైనా మాట్లాడగలడు. ''మేష్టారులాగా'' అన్నానే గాని ''మేష్టారుగా'' అనే అనవచ్చు నారం తిరిగే లోపల, ఆయన నన్ను విద్యార్థిగా, తన ప్రియశిష్యుడుగా చూస్తున్నట్టు నాకు రూఢి అనుమానం కలిగింది. (రూఢి అనుమానాలుండవనుకోండి. ఎందుకంటే, ఉంటాయి.)

వినివిని సాహసించి చివరకు శర్మగారికి ఒక చిన్న సలహా ఇచ్చాను.

''వెనుకటికొక రచయిత్రి ఒక దుర్మార్గుడైన రాజు అనేక స్త్రీలను ఎన్నెన్ని రకాల చెరపట్టి, మానభంగం చేశాడో వైనవైనాలుగా వర్ణించిందట. మా పెద్దన్నయ్య చెప్పేవాడు నా ఉద్దేశం ఏమంటే ఒక కుల వ్యవస్థే కాదు. ఇంకో చెడు ఏర్పాటునైనా మార్చగలిగితే మార్చాలిగాని దాన్ని గురించి తెగమాట్లాడి ప్రచారం చెయ్యటం వల్ల ప్రయోజనం వికటిస్తుంది'' అన్నాను.

శర్మగారు నాకేసి క్షణం పాటు చాలా కోపంగా చూసి ''చూడగా మీకు కుల వ్యవస్థ చాలా బాగున్నట్టున్నది'' అన్నాడు.

''మనం అంత తొందరపడి నిర్ణయానికి రాకూడదు. నేను ఏనాడో బ్రాహ్మణాచారాలన్నీ మానేశాను. నాకు ఏ దేవుడూ లేడు. తద్దినాలు పెట్టను. జంధ్యం లేదు. మీ మెళ్ళో జంధ్యం కనిపిస్తున్నది. అంత మాత్రానికి మీ కింకా బ్రాహ్మణత్వం వదలలేదని నేను నిర్ణయిస్తే అది భావ్యంగా ఉంటుందా ?'' అన్నాను.

నేను బ్రహ్మాస్త్రం వేశాననుకుంటే చాలా ఆశాభంగమయింది.

శర్మగారు ''హోప్‌లెస్!'' అన్నట్టుగా తల అడ్డంగా ఆడించి, ''మీరీ సమస్య గురించి ఇంత పెరటి దోవలో వున్నారనుకోలేదు. నేను మనదేశంలో కుల వ్యవస్థ లేనట్టు నటించాలని ప్రయత్నించటం లేదు. మీ కమ్యూనిష్టులు'' అనబోతూంటే నేను అడ్డం తగిలి, ''మా కమ్యూనిష్టులా?'' అన్నాను.

''మీరు కమ్యూనిస్టు అనీ, నాస్తికులనీ నాకు తెలుసులెండి. కమ్యూనిస్టులు పెట్టుబడిదారీ కింద జీవించలేమనుకోవడం ఎంత నిరర్థకమో మీరు కులం లేనట్టు నటించడం అంత నిరర్థకం. నేను తద్దినాలు పెడుతున్నాను. అందరు దేవుళ్ళకూ మొక్కుతున్నాను. కాని ఈ కుల వ్యవస్థను మాత్రం ఒప్పను. ఒక కులంవారు ఇంకో కులంవాడికన్నా తక్కువగా పుట్టాడనుకోవటంకన్న దారుణం ఉంటుందా?'' అన్నాడు

శర్మగారు.

మొత్తం మీద నా మీద దెబ్బ తీసినట్టే ఉన్నాడు. నేను తల వంచదలచక, ''కమ్యూనిస్టు చూస్తూ చూస్తూ పెట్టుబడిదారుగా తయారై కార్మికులను దోచుకోనవసరం లేదనుకుంటాను. నా జీవితంలో కులానికి వీలయినంత తక్కువ స్థానం ఉండేటట్టు చూసుకుంటున్నాను. అది కుల వ్యవస్థను ఆమోదించడం అయితే-'' అని ఆరంభించాను.

''అంటే మీరు కులాన్ని స్మరించటం మానేసి, దానితోబాటు హీనకులాలకు జరిగే అన్యాయం గురించి కూడా ఆలోచించటం మానేశారన్నమాట!''

ఇంత జిడ్డు మనిషి ప్రపంచంలో మరొకడుంటాయని నాకు తోచలేదు.

''అయ్యా, శర్మగారూ! హీనకులాలుగా ఉండటానికి ఆదిలో కొందరు ఇష్టపడి ఉంటారని మీకు తట్టలేదా?'' అన్నాను.

శర్మగారు కళ్ళు పెద్దవి చేసి, ''ఇంకేం? మీరు హీనకులాలను సమర్థిస్తున్నారన్న మాట! ఉన్నమాట అన్నందుకేనా ఉలుక్కున్నారు?'' అని నన్ను యద్దేవా చేశాడు.

''అలా అనకండి, నిమ్న జాతులకు ఆర్థిక సౌకర్యాలు కలిగిస్తామని ప్రభుత్వం ప్రకటించగానే, మమ్మల్ని నిమ్న జాతుల్లో చేర్చండి అంటూ కొన్ని కులాల వాళ్ళు బయలుదేరారు. మనం బ్రాహ్మలం గనక కులవ్యవస్థను గురించి అస్తమానూ జపం చెయ్యటం వల్లా, తక్కువ కులాల పట్ల ఔదార్యం ప్రదర్శించట వల్లా, నష్టం చిన్నమెత్తు కూడా ఉండదు. కొంచెం అన్యాయంగా మాట్లాడదలిస్తే, మా వంటివాళ్ళు చేసే ప్రచారంవల్ల కొన్ని కులాల వాళ్ళు తాము తక్కువ కులం వాళ్లమన్నది మరచిపోవటానికి అవకాశం కూడా వుండవచ్చు'' అన్నాను.

''అంటే మీ ఉద్దేశం ఈ తక్కువ కులాల వాళ్లకు పైకి రమ్మని చెప్పే అవకాశం లేదా ? ఉండరాదా ? మీ ధోరణి నాకు అర్థం కావటం లేదు,'' అన్నాడు శర్మగారు.

''వాళ్ళకు తెలీదుటండీ ? కులవ్యవస్థను నిజంగా నిర్మూలిస్తే వాళ్ళే అందుకు పూనుకుంటారు. మన ఉపన్యాసాలు అవసరం లేదు. తరువాత ఇంకో విషయం మీరు గమనించినట్టు లేదు. కులాల హెచ్చుతగ్గులు ఎప్పుడో ఎవరో ఏర్పరచారనుకుంటున్నట్టున్నారు. అది పొరపాటు. మొట్టమొదట ఏ కులాలు లేనివాళ్ళు కుల వ్యవస్థలోకి వచ్చినప్పుడు అందువల్ల లాభం చూసుకునే వచ్చారు. కాని ఆ దశ మారినా కులవ్యవస్థ పోలేదు. అదే జరిగిన ప్రమాదం. ఆ మాటకువస్తే ఈనాడు ఈ దేశపు అగ్రవర్ణంవాళ్ళు సావరిన్లూ, డాలర్లూ సంపాదించే అవకాశం కోసం పాశ్చాత్య దేశాలలో పాకీపనులు సయితం చేయటానికి పోతున్నారు. అమెరికాలో జాతి విచక్షణలో అయిదారు

తరగతులున్నాయట. భారతీయులు అట్టడుగు తరగతి అవుతారనుకుంటాను వాళ్ళు తెల్లవాళ్ళ రైలుపెట్టెల్లో ఎక్కరాదు. తెల్లవాళ్ళ హోటళ్ళలోకి, క్లబ్బులోకి అడుగు పెట్టరాదు. ఇంగ్లండులో మనవాళ్ళను తెల్లవాళ్ళు వేటాడుతున్నారుట. అయ్యో తగిన లాభం ఉంటే ఎంత హీనకులంగానైనా బతకవచ్చును. మనం చేసుకున్న పాపం డాలర్లు చూడగానే కళ్ళు జిగేల్మనటం! ప్రపంచంలో అతివిహీనమైన తలసరి ఆదాయం ఉండటం. ప్రపంచ దేశాలలోనే మన దేశం హీనకులంలో ఉన్నది. మనం కుల వ్యవస్థ పాటించడం హాస్యాస్పదం. దాన్ని కబుర్లతో సరిచెయ్యటం శోచనీయం -''

నాకు చాలా మాట్లాడాలని ఉన్నది కాని, శర్మగారు తొందరపని ఉన్నవాడిలా లేచి వెళ్ళిపోయాడు. తరువాత ఆయన మా ఇంటికేసి రాలేదు. శర్మగారుండే ఇంటి యజమాని కేశవన్ చెప్పాడు - శర్మగారి కొడుకు అమెరికాలోనూ, ఇంకోడు ఇంగ్లండులోనూ ఉన్నారట. ..

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 27 - 10 - 1978.*

# మన దేవుళ్ల జాతకాలు

మనుషులల్లేనే దేవుళ్ళుకూడా పుడతారు, పెరుగుతారు, మారుతారు, వలసపోతారు. కొంతకాలం వెలుగుతారు, రంగులు మార్చుతారు, విస్మృతి పథంలోకి పోతారు. చచ్చిపోతారు కూడా. కాని సామాన్యంగా మనం ఈ సంగతి గుర్తించక మనం ఈనాడు భావించుకునే దేవుళ్లు ఎల్లప్పుడూ ఇలాగే ఉండేవారనీ, ఎప్పటికీ ఇలాగే ఉంటారనీ అపోహపడతాం.

ఈకాలంలో 'ద్యౌస్' అనే దేవుణ్ణి మనం ఎరుగం కాని వేదకాలపు ఆర్యులు ఆ దేవుణ్ణి ఎరుగుదురు. ఆ దేవుడు ఈ గడ్డమీదివాడు కాడు. అలాగే గ్రీకుల ''జియస్'' ''ద్యౌస్‌పితర్'' కాస్తా ''జ్యూపిటర్'' అయాడు!

ఇంద్రుడూ, మిత్రుడూ, వరుణుడూ మొదట ఇక్కడివాళ్లు మాత్రం కారు. వీళ్ళు ఆర్యులతో బాటు వలస వచ్చారు. విష్ణువు వేదకాలపు దేవతలలో అంత ముఖ్యుడు కాడు; ఇంద్రుడూ, అగ్ని, విశ్వదేవతలూ మొదలైనవారితో పోల్చితే దాదాపు అనామకుడు. కాని పురాణ కాలానికి ఈ విష్ణువే అపారంగా పెరిగిపోయి, వేదకాలంలో అజేయుడుగా వెలిగిన ఇంద్రుడికి పురాణకాలంలో అడుగడుగునా దిక్కు అయాడు.

బ్రహ్మ విషయం మరీ చిత్రం. పురాణాలలో సృష్టికర్తగా భావించబడిన బ్రహ్మ, వేదకాలంలో వేదమూ ఆహారంగా పరిగణించబడేవాడట! ''అన్నం బ్రహ్మ!'' అతడే ఉపనిషత్తులలో అవ్యక్తమైన ఈశ్వరుడుగా ఎవరి ఊహనూ అందకుండాపోయి, మేధావులు బ్రహ్మ జిజ్ఞాసతో తలకాయలు పగులుకొట్టుకోవటం జరిగింది. అయితే

పురాణాలలోకి ఈ బ్రహ్మ నాలుగు ముఖాలతో ప్రవేశించి, చిత్ర విచిత్రమైన పాత్ర నిర్వహిస్తూ వచ్చాడు ఈ పురాణ బ్రహ్మ తన కూతుర్నే భార్యగా చేసుకున్నాడన్న అపవాదు అలా ఉంచి, ఈయనగారు దేవతల పక్షంవాడో, రాక్షసుల పక్షంవాడో తెలీదు.

దేవతలు యజ్ఞం ప్రధానంగా జీవిస్తున్న కాలంలో రాక్షసులందరూ తపస్సు చేశారు. అందరికీ బ్రహ్మ ఇయ్యరాని వరాలిచ్చి దేవతలకు తీరని ఉపద్రవాల పరంపర తెచ్చిపెట్టాడు. మళ్ళీ ఆ దేవతలు ఆపత్కాలంలో ఈ బ్రహ్మనే ముందు ఆశ్ర యించేవారు. ఒక్క సందర్భంలో కూడా బ్రహ్మ వారికి తరుణోపాయం చెప్పలేదు. ఎంతసేపూ విష్ణువును చూపేవాడు. బ్రహ్మ చేసిన వెధవ పనులను సరిదిద్దడానికి విష్ణువుకు చేతినిండా పని.

రాక్షసులకు తీసిపోయామా అని భూలోకంలో ఋషులు కూడా తపస్సు ప్రారంభించాక బ్రహ్మదేవుడు వరాలిచ్చినట్టు కనబడదు

ఏమైనా ఇవాళ బ్రహ్మను ఆరాధించే వాడు ఎవడూ లేడు. అతగాడు అంతరించిన దేవుళ్ళ జాబితాలో వాడే.

వేదకాలానికి ముందునుంచీ ఈనాటిదాకా ఆరాధింపబడుతూ ఉన్న దేవుడు శివుడు ఒక్కడేనేమో! అయితే ఈ శివుడి చరిత్ర, ఎంత సంగ్రహంగా సమీక్షించినా, మితంగానే ఉంటుంది

ఋగ్వేదం సింధునాగరికత అనంతరం రూపొందినదే అయితే, శివుడు పశుపతి రూపంలో సింధునాగరికతకు చెందినవాడే. ఈ పశుపతికి గేదె కొమ్ములున్నాయి. సింధు నాగరికత పోయింది. సింధు ప్రాంతానికే గాక, యావద్భారత దేశానికి పాకి వచ్చిన ఆర్యనాగరికతలో శివుడికి ఈ గేదె కొమ్ములు ఒకంతట వదలలేదు. మహిషాసురుడి రూపంలో ఆదిశక్తి ఈ శివుణ్ణి నిర్మూలించింది.

మహిషాసురుడు శివుడు ఎలా అవుతాడని అనవచ్చు. పాతకాలపు విగ్రహాలలో ఒక దానిలో ఆదిశక్తి కాలికింద దున్నపోతు రాక్షసుడికి బదులు ఏకంగా శివుడే ఉన్నాడు! మహారాష్ట్ర దేశంలో ''ఖ్మసోబా'' అనే దేవుడు శివుడేనని తేల్చారు.

కథలలో ఆదిశక్తి శివుణ్ణి మహిషాసురుడి రూపంలో చూసినట్టు రాసిన జాతకరీత్యా శివుడికి చావులేని కారణం చేత, అతగాడు ఆ ఆదిశక్తికే కొడుకయాడు. జగన్మాత అంబా, అంబికా, అంబాలికా అనే పేర్లతో శివుణ్ణి తన కొడుకు చేసుకున్నది. అందుచేత శివుడు త్ర్యయంబకుడు - ముగ్గురు తల్లుల బిడ్డ అయాడు. దరిమిలా ఆ జగదంబే పార్వతి అయి శివుడికి భార్య కూడా అయింది.

మహారాష్ట్ర దేశంలో ఖ్మసోబాతోపాటు భేతాళుడూ, హనుమంతుడూ ఆరాధించబడతారు. ముగ్గురూ మృత్యుకారకులే ఈ ముగ్గురి మధ్యా పైకి కనబడే తేడాలతో బాటు పైకి కనిపించని పోలికలు కూడా వున్నాయి. భేతాళుడు భూతనాథుడు, శివుడు (ఖ్మసోబా) కూడా అంతే. ఇద్దరూ ప్రేతభూములలో ఉంటారు. బేతాళుడిదీ,

హనుమంతుడిదీ ఒకే బర్త్‌డే – చైత్రపౌర్ణమి హనుమంతుడికి కూడా పిశాచాలను అదుపులో ఉంచే హక్కున్నది

వేదకాలంలో శివుడు రుద్రుడి పేరుతో వ్యవహరించబడ్డాడు. అతను గణాలకు అధిపతి. అంటే జన జీవితం గణజీవితంగా మారిన నాటికి శివుడు మహా గొప్ప దేవుడుగా ఉన్నాడన్నమాట. అయినప్పటికీ సామాజిక పరిణామంలో ఈ బూడిద పూసుకుని, కపాలాలు ధరించే దేవుడు ధనికుల దేవుడై, సాక్షాత్తూ లక్ష్మికి భర్త అయిన విష్ణువు పేదల దేవుడు కావటం జరిగింది. ఇద్దరికీ కొంతకాలం బద్ధ శత్రుత్వం ఉండేది. వారి భక్తులు ఒకరి తలలు ఒకరు పగులగొట్టుకున్నారు. ఉభయ పక్షాలకూ సంధి చేద్దామని హరిహరనాథుణ్ణి సృష్టించారు. సంధ్యావందనంలో ''శివాయ విష్ణు రూపాయ, శివరూపాయ విష్ణవే, తధాంతర న పశ్యామి'' అని కూడా చేర్చారు. అయినా హరిహరనాథుడు దక్కలేదు. తిక్కన సోమయాజీగారు హరిహరనాథుడి పేర ఆంధ్ర మహాభారత రచన ప్రారంభించే నాటికి ఒకటి, రెండు శతాబ్దాలు ముందరే ''హరిహరనాథుడి'' అర్చనకు ఉద్వాసన అయింది.

త్రిమూర్తులలో భూలోకంలో ఎడ్రస్ కలవాడు శివుడు ఒక్కడే. ఈనాటికీ అతడి మూర్తి తోళ్ళు బట్టలుగా కట్టుకున్నవాళ్ళకూ, పాములను పూజించిన వారికీ, తీర్థాలను సేవించినవారికీ, కులవ్యవస్థను ధ్వంసం చేసిన వారికీ ప్రతినిధిగాను నిలచి ఉన్నది. అతని కొడుకు వినాయకుడు – కనీసం పార్వతి కొడుకు మతంగం (ఏనుగు) తల గలవాడు. పార్వతి అంటరాని 'మాతంగ కన్య'. గుప్తరాజుల కాలంలో కాబోలు విఘ్ననివారకుడైన దేవుడుగా పరివర్తన చెందిన వినాయకుడు అసలు ఆదిలో విఘ్నకారకుడు. అతడి ముఖం చూస్తే అన్ని రకాల అరిష్టాలూ కలుగుతాయి. వినాయకుణ్ణి దేవుడుగా పూజించిన రోజు రాత్రే ఆ వినాయకుడి ప్రతీక అయిన చవితి చంద్రుణ్ణి చూడటానికి భయపడతాం! అంటే వినాయకుడి జాతకం ఇంకా పూర్తిగా మారలేదన్నమాట!

శివుడు తనను నమ్మినవారిని కాపాడలేకపోయాడు. తనను కొలిచిన పాశుపతులూ, కాపాలికులూ సోదిలోకి లేకుండాపోగా, తాను ఆరాధ్యుడుగా నిలవగలిగాడు. శివుడు కిరాతుడిరూపంలో అర్జునుడితో పోట్లాడటం లాంటి పనులు చేసినట్టు పురాణాలలో ఉన్నది. కాని ఒక దశలో శివుడు కిరాతుడేనన్న సంగతి పురాణాలు చెప్పవు.

నిజానికి రాజకీయవాదుల విషయంలోలాగే, దేవుళ్ళ విషయంలో వారి గతం గణనలోకి రాదు. వర్తమానమే ప్రధానంగా ఉంటుంది. శివుడు ఆసేతు హిమాచలమూ ఏలినదేవుడు. అందరు దేవతలకన్నా దీర్ఘాయువు. (అతని పేరు వైష్ణవులు చెరపటానికి చేసిన ప్రయత్నాలు ఉదారమైనవి కావు. ఉదాహరణకు, హరద్వారాన్ని హరిద్వారం అంటున్నారు. అది తప్పు).

మిగిలిన దేవుళ్లు ఈనాటి భారతీయులకు చేయగల మహోపకారం ఏదీ లేదు గాని, శివుడు చెయ్యగలిగినది ఒకటి ఉన్నది - కులవ్యవస్థ నిర్మూలించటం !

యువ, మాసపత్రిక, మార్చి 1980.

# జన్మస్థానాన్ని చేరుకుంటున్న భారతీయ సంస్కృతి

భారతీయ రాజకీయ, సాంఘిక సాంస్కృతిక రంగాలలో కాలచక్రాన్ని వెనక్కు తిప్పాలనే ప్రయత్నం వెయ్యి రూపాలలో ఈనాడు తాండవిస్తున్నది.

వెనక్కంటే ఎక్కడికని అడక్కండి. గడచిన పదిహేను లేక యిరవై లక్షల సంవత్సరాల కాలం సామాజిక మానవుడు అనేక పరిణామ దశలు దాటి వచ్చాడు. ఈనాడు మనలో ఉండే కొందరు ఘరానా మనుష్యులకు కొన్ని కొన్ని దశలు ఆకర్షవంతంగా కనిపిస్తున్నాయి.

మనదేశంలో సంస్కృతం గుప్త రాజుల కాలానికే అల్పసంఖ్యాకుల వ్యవహార భాష అయిపోయింది. సంస్కృత నాటకాలలో సీత వంటి పాత్రచేత కూడా సంస్కృతం మాట్లాడించటానికి నాటక కర్తలు సాహసించలేదు. అయినా ఇప్పుడిప్పుడు సంస్కృతాన్ని కప్పీల మీద పైకి లాగి, విద్యార్థుల నెత్తిన రుద్దటానికి ప్రయత్నం జరుగుతున్నది. దేశ భాషలలోగాని, ఇంగ్లీషులాటి అంతర్జాతీయ భాషలో గాని లభ్యంగాని గొప్ప విజ్ఞానం సంస్కృతంలో ఏమున్నదో, సంస్కృతాన్ని పునరుద్ధరించటం ద్వారా జాతీయ జీవితం ఎలా బాగుపడుతుందో ఎవరూస్పష్టంగా చెప్పరు.

ఆపాటి వెనక్కు పోవటంతో తృప్తిపడలేనివాళ్ళు విద్యార్థులకు గీతను బోధించాలనీ, వేదాధ్యయనం చేయించాలనీ అంటున్నారు. గీతలో ఏమున్నదో విశ్వనాథ లాటి 'సనాతనుడి' కే అర్థం కాలేదు. (''దిండు కింద పోకచెక్క'' చూడండి) గీతను గురించి డి.డి. కోసాంబిగారు అన్నమాటలు అబద్ధమని ఎవరూ రుజువు చెయ్యలేదు. అయినా మన భారతీయ సంస్కృతికి వచ్చిన పెద్దలోపం అందరూ గీతాధ్యయనమూ, వేదాధ్యయనమూ చేయకపోవటమేనని కొందరు భావిస్తున్నారు.

వేదాధ్యయనం అంటే ఏ వేదం ? మనదేశంలో చరిత్రయుగం ఆరంభమైన నాటి నుంచి వేదుల, ద్వివేదుల, త్రివేదుల, చతుర్వేదుల వారున్నారు. చివరి మూడూ అబద్ధాలు. వేదాధ్యయనం చేసినవారు ఏదో ఒక వేదశాఖ మాత్రమే అధ్యయనం చేశారు. (నేను వేదాధ్యయనం చేసి ఉంటే యజుశ్శాఖాధ్యాయిని! దేవుడి దయవల్ల వేదాధ్యయనం చెయ్యలేదు.) సామవేదం వారున్నారు. వారు బహుశా ఇతర వేదాల కేసి చూసి ఉండరు, క్రమంగా సామవేదాన్ని కూడా అటక ఎక్కించి ఉంటారు!

మనదేశం పరిశ్రమల్లో వెనకబడి ఉన్నదంటున్నారు. కాని దేవుడు పరిశ్రమ

శరవేగంతో అభివృద్ధి అవుతున్నది. ఇది కూడా వెనక్కి పోవటమే. నియోలితిక్ యుగంలో దేవుడు పరిశ్రమ మూడు పూలూ – ఆరుకాయలూగా కొనసాగింది. భూమీ, ధనమూ, బంగారమూ, రత్నాల రూపంలో సంపద రాజుల వద్ద కన్నా దేవుళ్ళ వద్ద ఎక్కువ ఉండేది దేవాలయాలను ఆశ్రయించుకు బతికినవారు ఆ కాలపు ధనిక సోమరులు (ఐడిల్ రిచ్). ఇప్పుడు ఆ జాతి ముందు వస్తున్నది. లక్షలలో ఉంటూ వచ్చిన తిరుపతి దేవుడి ఆదాయం కోట్లలోకి వచ్చింది. తిరుపతి దేవస్థానాన్ని ఆశ్రయించుకుని 'ఉత్పత్తి' చెయ్యని వాళ్ళు ఎన్నివేల మంది బతుకుతున్నారో నాకు తెలీదు. శాసన విరుద్ధమైన అనేక వృత్తులు దేవస్థానం అండన కొనసాగుతున్నాయంటున్నారు వాటిని రాజ్యాంగానికి లాభసాటిగా నడిపించటానికి అధికారులను నియమించి, వేశ్యల సంపాదనలో సగమూ, జూదరుల సంపాదనలో పదో వంతూ – ఇలా పన్నులు వేసుకుంటూ పోతే మనం అర్థశాస్త్రం నాటికి తిరిగిపోయిన వాళ్ళం అవుతాం. అర్థశాస్త్రం మరీ పాతదేమీ కాదు, 1600 ఏళ్ళనాటిది.

చిల్లర కళల దగ్గరికి వచ్చినా వెనక్కుపోయే ఉద్యమం ముందడుగు వేస్తున్నట్లే స్పష్టమవుతుంది. మనము చాలా మంది మొహంజోదారో నర్తకి ప్రతిమ ఫొటో చూసే ఉంటాం. అది అయిదువేల ఏళ్ళ నాటిది కావచ్చు. కాని ఇప్పుడు మన సినిమా హీరోయిన్‌ల దుస్తులు ఆ నర్తకిని చేరటానికి యత్నిస్తున్నాయి. (నర్తకికి దుస్తులు లేవు ఒక ముంజేతికి మాత్రం మోచేతిదాకా కంకణాలు ఉన్నాయి).

మన పూర్వకాలపు శిల్పాలలో కూడా ఆడకూతురు బొమ్మలకు ఒంటినిండా నగలు దిగేసి, ఒంటి మీద ఒక నూలుపోగు లేకుండా చూపేవారు.

పాత్ర పోషణలో కూడా ఈ వెనుక చూపు ఉన్నది. ఫ్యూడల్ యుగపు ప్రబంధ నాయికలు మైథునం తప్ప మరొక దాన్ని గురించి ఆలోచించినట్టు దాఖలాలు లేవు. ఎవణ్ణో చూస్తూనే కామ ప్రకోపం కలగటమూ, విరహబాధా, సంభోగమూ – ప్రబంధనాయిక జీవితంలో ఇవి ముఖ్యఘట్టాలు . ఇటీవల ఒక సినిమాలో హీరోయిన్ హీరోను చూస్తూనే వాడితో పచ్చిక బయళ్ళ మీద డ్యూయెట్లు పాడటానికీ, పొర్లిగింతలు పెట్టానికీ తయారవుతుంది. ఆ మరుక్షణమే వాడితో గదిలో జొరబడటానికి సిద్ధపడుతుంది. దీన్నే 'క్విక్ వర్క్' అంటారు. ఒక హీరోయిన్ తన శరీరం ఎక్కుడున్నా మనసు పందిరి పట్టిమంచం మీదనే ఉన్నట్టు ప్రవర్తిస్తూ, మొగుడు తన పక్కలో నుంచి ఒక రాత్రివేళ లేచిపోకుండా ఉండగలందులకు క్రిమినల్‌గా ప్రవర్తిస్తుంది !వెనక ఒక హీరోయిన్ తన పాతివ్రత్యం దక్కించుకోవటానికి మొగుణ్ణే చంపింది. ఇప్పుడింకో ఆవిడ మొగుణ్ణి పక్కలోనే ఉంచుకోవడానికి అమానుషంగా ప్రవర్తిస్తుంది. ఆమె తప్పు చేసిందా ? అదేమీ లేదు – ఆమె చేసిన పని రైటేనని మొగుడే తరువాత ఒప్పుకుంటాడు!

ప్రజల సంగీతం ''హోయ్! హోయ్ !'' అనేకేకల దశకు వచ్చి, ఏల పాటలకన్న

వెనక్కుపోయింది ఈ సంగీతం త్రవ్వకాలలో దొరికేదైతే క్రీ.పూ. ఏ సహస్రాబ్దంలో ఈ సంగీతం ఉండేదో తెలుసుకోగలవాళ్లమే; కాని అది ఆర్కియాలజీకి అందదు.

నాటకాలు కనీసం 50 ఏళ్ళ నాటివైతే తప్ప జనం చూసి డబ్బు ఇయ్యరుట. ప్రజానాట్యమండలి వాళ్ళ నాటకాల లాటివి ఫాషన్‌లోకి రావటానికి ఇంకో వెయ్యేళ్ళు పట్టవచ్చు. అందాకా వేచి ఉందాం.

అన్నిటికన్న వెనక్కుపోయి ఉన్నది చిత్రకళ పూర్వ శిలాయుగంవాళ్ళు గుహలలోనూ, రాళ్ళ మీదా వేసిన బొమ్మలు తెలుస్తున్నాయి. ఈనాడు ఉత్తమ చిత్రకళ ఎవరికీ అర్థంకారాదు అర్థమయితే అందులో ఏదో 'అకళ' ఉన్నదన్నమాటే. నాబోటివాడు అర్థం కావటం లేదంటే, 'నీకు చీనా భాష వచ్చా ? నేర్చుకో !' అంటారు. చీనాభాష ఎక్కడ నేర్పుతారో తెలుస్తుంది. ఆధునిక చిత్రకళను ఆస్వాదించే విద్య ఎవరు, ఎక్కడ నేర్పుతారో మరి – దాన్ని దేవగుహ్యంగా ఉంచారు!

నలభై, యాభై ఏళ్ళ క్రితం దృశ్య కావ్యాలలో సామాజిక సమస్యలను పరిష్కరించి పారేస్తూండేవారు. ఇది ఇప్పుడు ఫాషన్ కాదు. ఇప్పుడున్నవి వ్యక్తుల సమస్యలు ఒక నిరుద్యోగి సమస్య. ఒక ఇల్లాలి సమస్య. ఒక జంట యొక్క ప్రేమ సమస్య బీదవాళ్ళ సమస్యలూ, రైతుల సమస్యలూ, కట్నాల సమస్యలూ బోర్! ప్రబంధాలలో ఎక్కడైనా సామాజిక సమస్యలున్నాయా ? వర్గాల ప్రసక్తి ఉన్నాదా? అదే సిసలైన కళ!...

మన పూర్వులు, అంటే యజ్ఞయాగాదులు చేసిన ఆర్యులు, తాగారు. దేవతల చేత తాగించారు – సోమ పీథులను చేశారు. ఫలాని అశ్వనీదేవతలకు సోమం ఇయ్యవద్దని గడ్డాలవాళ్ళు నిర్ణయిస్తే అది పెద్దశిక్ష అన్నమాట!

అలాటప్పుడు ఈనాటి మద్యనిషేధోద్యమం ఆధునికమేమో అని కొందరికి అనుమానం కలుగవచ్చు. అదేమీ లేదు. మద్య నిషేధం తొలి దేవదానవ యుద్ధాల నాడే – అమృతానికి ముందే – అమలులోకి వచ్చింది. మద్య నిషేధం శాసించిన వాడు రాక్షసుల గురుడు శుక్రాచార్లు. కథ అందరికీ తెలిసిందే. శుక్రాచార్లు కుండ ఎత్తి 'బాటమ్స్ అప్ !' అనే శక్తిమంతుడు. దాన్ని ఎడ్వాంటేజ్ తీసుకుని, కచుడి బూడిదను లికర్‌లో కలిపి, ''గురూజీ, బీర్!'' అన్నారు. అప్పుడు కచుణ్ణి బతికించిన శుక్రుడు తాను గర్భం ధరించినట్టు తెలుసుకుని 'ప్రొహిబిషన్!' అన్నాడు

మనం దేవతల సంతతి గదా, రాక్షసుల ఆనవాయితీలు పాటించవచ్చునా అని అడక్కండి. వెనక్కుపోవటం ముఖ్యం ఆఫ్టరాల్ శుక్రుడూ బ్రాహ్మడే! వసిష్ఠుడూ, అగస్త్యుడూ, పరాశరుడూ, వ్యాసుడూ – వీళ్ళే బ్రాహ్మలు కానివాళ్లు.

ప్రొహిబిషన్ అనగానే ఇంకో ఎగ్జిబిషన్ గుర్తుకొస్తుంది గోవధ – కమ్ – గోమాంస భక్షణ నిషేధం. ఇది ఆది నుంచీ ఉన్నది కాదు. ఏ శతపథ బ్రాహ్మణం నాడో అమలులోకి వచ్చింది. వస్తేనేం? మద్యనిషేధాన్ని ధిక్కరించి తాగేవాళ్ళు తాగేస్తున్నారు కదా ? అలాగే

గోమాంస భక్షణ స్వేచ్ఛగా సాగింది. మౌర్యుల కాలంలో 'బీఫ్' పబ్లిగ్గా అమ్మేవారు - నరమాంసం గోప్యంగా చీకటి పడ్డాక శ్మశానాలలో అమ్మేవారు. అస్పృశ్యులను మనం నాజూగ్గా హరిజనులంటున్నట్టు, ఆ కాలంలో నరమాంసాన్ని మహామాంసం అనేవారు

మౌర్యుల కాలంలో జరిగినట్టు జరక్కుండా చూడటానికి వినోబాభావేగారు గోవధ నిషేధం కోసం ప్రాయోపవేశం చేసి, ప్రభుత్వాన్ని ఒక ఊపు ఊపి వదిలాడు. గోవధ ప్రత్యేకంగా ఎందుకు కూడదో తెలీదు. మేకలూ, గొర్రెలూ, కోళ్ళూ వగైరాలు ప్రాణులు కావా ? గోవధ ఆ కాలంలో నిషేధించేనాటికి ఆవులను కోసుకుతినటం ఆర్థికంగా నష్టమయింది. ఎద్దులు చాకిరీ చేసేవి. ఆవులు పాలిచ్చేవి. ఎండిపోయిన ఆవులను బ్రాహ్మణులకు దానం చెయ్యాలనీ, అలాంటి ఆవులను కోసుకు తినేవాడు నరకానికి పోతాడనీ అన్నారు. ఎండిపోయి పాలూ ఇయ్యక దూడలనూ వెయ్యని ఆవులను బ్రాహ్మణులు మాత్రం కోసుకు తినక ఏం చేసుకున్నారో మనకు తెలీదు.

అయితే ఒక్క విషయం గుర్తుంచుకోవాలి వెనక్కు తిరిగిపోవటమే ఒక పరమ ప్రయోజనం. అందులో ఇతర ప్రయోజనాలు ఎంచరాదు, హేతువాదం ఉపయోగించరాదు.

మన రాజ్యాంగం ప్రవచించే సర్వ సమత్వమూ, సోషలిజమూ పూర్తిగా వెనక్కు పరిగెత్తటం మీదే ఆధారపడి ఉంది. ఎంత వెనకైతే అంత మంచిది. ఎన్నికల పందాలు ఈ సూత్రం మీదే జరగాలి!

*కళాసాగర్ సప్తమ వార్షికోత్సవ సంచిక, 1979.*

# ఈనాటి కులవ్యవస్థ

## వర్గ విభజన :

ఆదిమ సమాజాలలో వర్గ విభజనలేదు. ఆ సమాజాలలోని వ్యక్తుల మనుగడ తిండి ఏరుకొనడం మీద ఆధారపడి ఉండేది. జంతువులను వేటాడటమూ, దుంపలు త్రవ్వుకోవడమూ, కాయలూ అవీ కోసుకోవటమూ లాంటి పనుల మీద ఆర్థిక వ్యవస్థ ఆధారపడి ఉండేది. వేటాడటం నుంచి పశుపోషణతో మానవుడు ఒక మెట్టుపైకి వచ్చినా, మానవునికి తన ఆహారాన్ని తానే సృష్టించుకునే శక్తి వచ్చిన దాకా ప్రకృతి మీద పూర్తిగా ఆధారపడటమే జరిగింది.

ఆహారం ఏరుకోవటం ద్వారా ఒక్క మనిషికి జీవనోపాధి లభించిన జాగాలో పశుపోషణతో ముగ్గురు బతికారనీ, అదే జాగాలో వ్యవసాయం నూరుమందిని పోషించిందనీ శాస్త్రజ్ఞులు అంచనా వేశారు. దీనిని బట్టి వ్యవసాయం పెద్ద సామాజిక విప్లవానికి దోహదం చేసిందనీ, అంతకు పూర్వం ఉండిన ఆటవిక సమాజాలు చాలా

పరిమితంగా ఉండి కొంతలో కొంత సంచార జీవితం గడిపేవనీ మనం ఊహించవచ్చు (భారతంలో వేటాడి జీవిస్తూ, తమను, తమ వెంట ఉన్న వందలాది బ్రాహ్మణులను పోషించిన పాండవులు ఒక అరణ్యంలో జంతువులు ఖాళీ అయితే మరొక అరణ్యానికి మారినట్లు చెప్పి ఉన్నది).

వ్యవసాయం మరింత పెద్ద సమాజాలను పోషించి, స్థిర జీవితం సాధ్యం చెయ్యటమే గాక, ఒక మనిషి పదిమందికి సరిపడే ఆహారం ఉత్పత్తి చెయ్యగలగడంతో తొంభై శాతం సామాజికులు ఆహారోత్పత్తి నుంచి విముక్తులయ్యారు. ఈ తొంభై శాతం నుంచి వివిధ వృత్తులవాళ్ళు రకరకాల వినియోగ వస్తువులను సృష్టించి, సమష్టి జీవితాన్ని ఆర్థికంగా మెరుగుపరచగా, ఇందులో నుంచే జ్ఞాన సముపార్జకులు, పరిపాలకులూ రావటం అవసరమయింది. ఎందుకంటే రెండు డజన్ల మంది గల ఆటవిక దళానికి శాసనాలూ, పరిపాలనా అవసరం లేదు. ఒక నాయకుడు చాలు. కానీ రెండు వందల గ్రామాలు ఒక సమాజం క్రిందకి వచ్చేసరికి, పాలకుడు, అతని సహాయకులు, అతని ప్రతినిధులూ, శాసనాలు, శిక్షాస్మృతి వగైరాలతో కూడిన ''రాజ్యాంగం'' అవసరమయింది వర్గాలు ఏర్పడ్డాయి. దానితోపాటు శ్రమ దోపిడీ కూడా సాగింది.

ఇది వ్యవసాయ విప్లవ ఫలితం. మన దేశంలో ఈ ఫలితాలు వర్గ వ్యవస్థ స్థాపించటం ద్వారా కలిగాయి. దీనికి కారకులు ''బ్రాహ్మణులు''. ఆటవిక జీవితంలో వర్గాలు లేనిమాట నిజమే కాని, అది ఆర్థికంగా స్థంభించిపోయింది. (ఈనాడు కూడా ఉత్పత్తి చెయ్య నిరాకరించే ఆటవిక జాతులు – లంబాడీల లాంటివి– ఉన్నాయి) ఆటవిక దశలో జాతులు, తెగలు ఉండేవి. ఆ జీవితంలో కూడా కొన్ని పరిణామాలు వచ్చాయి. కానీ వాటి వివరాలు మనకిక్కడ అనవసరం.

## వర్ణవ్యవస్థ:

బ్రాహ్మణులు వర్ణవ్యవస్థ స్థాపించడంలో చేసిన పనులు ఏమిటంటే, జాతి జీవనాన్ని బద్దలు కొట్టి విస్తృత సమాజంలోని వేరువేరు జాతులను తెచ్చి వారికి వర్ణస్థాయి కల్పించి వారి ఆచార వ్యవహారాల జోలికి అట్టేవెళ్ళక, అవసరమైతే వాటిని సమర్థించుతూ, 'బ్రాహ్మణ' పురాణాలు సృష్టించుతూ, ఒక్కొక్క తెగ నాయకుణ్ణే రాజును చేసి, ఆ తెగకు చెందిన సమష్టి సంపదను వాడి సొంత ఆస్తి చేసి ఆ తెగలో వర్ణ వ్యవస్థను ఏర్పరచడానికి పురోహితులను తయారుచేసి వారికి 'బ్రహ్మకర్మలు' నేర్పారు.

ఇలా అనేక తెగలు వచ్చి సమాజంలో చేరాయి. సమాజంలో అనేక వృత్తులు– మంగలి, చాకలి, కుమ్మరి, సాలె, కమ్మరి, వడ్రంగి, కంసాలి – వగైరాలు కొనసాగాయి.వేరు వేరు తెగల ఆరాధనలు ఏకీకరణం పొందాయి. పామును, ఎద్దును, శివుణ్ణే పూజించినవారు ఏకం కావటాకి శివుడికి మెళ్ళో పాములూ, ఎద్దు వాహనమూ చేశారు. (ఈనాడు కూడా ఎద్దును పూజించే గంగిరెద్దుల వాళ్ళకు శివుడు దేవుడుగా

కనబడడు. అలాగే నాగులచవితి పూజకు శివుడితో సంబంధం లేదు). అదే విధంగా ఆదిశక్తిని పార్వతి అని శివుడి భార్యగా చేశారు (ఈ ఆదిశక్తి ఒకప్పుడు శివుణ్ణి శివుడి రూపంలోనూ, మహిషాసురుని రూపంలోనూ తన కాలి కింద మట్టగించింది. బొంబాయి ప్రాంతంలో మసోహ్ అనే పేరుగల మహిషాసురుణ్ణి శివుడనే అంటున్నారు. అతడికి భార్య లేదు.)

మనం గమనించవలసిన ముఖ్య విషయమేమంటే వర్ణవ్యవస్థ నిజమైన వర్గవ్యవస్థే. అయితే దాన్ని ఏర్పరచిన పద్ధతిలోనే దాని విధ్వంసానికి బీజాలున్నాయి. వర్ణ ధర్మాలుగా చెప్పబడినవి పురాణ కాలానికే తారుమారయాయి. నందుల కాలానికి క్షత్రియులు లేరని సనాతనులే ఒప్పుకున్నారు. బుద్ధుడి కాలానికి క్షత్రియులంటూ చెప్పుకుంటూ వచ్చిన శాక్యుల లాంటి కొన్ని గణాలు వ్యవసాయం వృత్తిగా జీవించాయి. శాక్యులు యోధులు కారు. లిచ్ఛవీ, మల్లగణాల లాంటివి యుద్ధాలు చేశాయి చాణుక్యుడు లాంటి బ్రాహ్మణులు మంత్రిత్వాలు నిర్వహించారు. గంగా యమునా లోయలో అరణ్యాలు ఛేదించి, వ్యవసాయం కొనసాగించిననాటికే వ్యవసాయం శూద్రుల వృత్తి అయింది. ఏ కులానికీ చెందని ఆటవిక తెగల నాయకులు ''హిరణ్యగర్భ''శరతు ద్వారా పునర్జన్మ ఎత్తి క్షత్రియ వర్ణము, సూర్యచంద్రాది వంశాల వారసత్వమూ సంపాదించుకున్నారు. ఆటవిక జాతులలో కొత్త బ్రాహ్మణులు పుట్టుకు రావటంతో ఒకే జాతి పేరుతో బ్రాహ్మణులు, అంటరాని వాళ్ళ కూడా కనబడే అవకాశం ఏర్పడింది ! ఉదా: బోయ బ్రాహ్మణులు.

బుద్ధుడి నాటికే వైశ్యులు వాణిజ్యంలో కుబేరులైపోయి, వ్యవసాయమును, పశుపోషణా ఏనాడో మానేశారు. అర్థశాస్త్రం నాటికి మినహాయింపులు లేకుండానూ, వర్ణాధిక్యతకు చోటు లేకుండానూ చెప్పబడిన రాజనీతి,మనుస్మృతి వగైరాల నాటికి ప్రాంతీయ స్వభావాలను ప్రదర్శించింది. మేనరికాలు మనుస్మృతి ప్రకారం నిషిద్ధం కాని దక్షిణ దేశపు బ్రాహ్మణులు మనుస్మృతి మీద తిరగబడి మేనరికాలు ఆర్థిక పునాది కలిగినవి – మానం, అన్నారు. అందుచేత మనుస్మృతి ప్రాంతీయాచార వ్యవహారాలకూ, ఆపద్ధర్మానికీ సందు ఇవ్వకతప్పలేదు. వర్ణ ధర్మాలు చెప్పిన బ్రాహ్మడే మిగిలిన వర్ణాలవారి ధర్మాలను అవకాశం దొరికితే అవలంబించి రాజ్యాలు ఏలాడు. యుద్ధాలు చేశాడు. ఆస్తిపాస్తులు సంపాదించి వర్తకము, వ్యవసాయము కూడా చేశాడు. ప్రాచీన సాహిత్యంలోనూ, చరిత్రలోనూ వీటికి పుష్కలంగా ఉదాహరణలు కనిపిస్తాయి.

## వర్ణంనుంచి కులాలు :

వర్ణధర్మం తారుమారు కావటానికి ముఖ్య కారణం సమాజంలో జరిగిన ఆర్థికాభివృద్ధి. వర్ణం నామమాత్రంగా ఉండిపోయి కులాలకు ప్రాముఖ్యం వచ్చింది.

కులాలు ఒకే పంపిణీ మీద ఏర్పడినవి కావు కులాల ఏర్పాటుకు ముఖ్య కారణం వృత్తులు. వేరు వేరు వృత్తులవారు ఐకమత్యం చూపి సమాజంలో సంఘాలుగా వ్యవహరించారు. తమలో తామే వివాహాలు చేసుకొని ఒకే రకం ఆచారాలు పాటించి చాలా వరకు ఒకే రకం దేవతలను పూజించారు సంఘ దోపిడీని తట్టుకునేందుకు ఇది ఉపకరించినమాట నిజమే గాని, సమాజ రూపాన్ని అపరిపక్వదశలో స్తంభింప చెయ్యటానికి ఈ 'కులకట్టు' తోడ్పడి అభివృద్ధి ని^ధకంగా తయారయింది.

అన్ని కులాలూ, వ్యక్తులను బట్టి ఏర్పడినవి ^వు. కొన్ని ఆటవిక తెగలు తమ పాత పద్ధతిలో బతకలేక ఆర్థికంగా తమ జీవితాలను మెరుగుపరచటానికి వర్ణవ్యవస్థ తాలూకు అడుగు పొరలలో ప్రవేశించి, కొన్ని ప్రత్యేక వృత్తులు సొంతం చేసుకున్నాయి. ఆ విధంగా మల్లులు, కుస్తీలు పట్టేవాళ్ళుగానూ, మాగధులు గాథలు పాడేవాళ్ళుగానూ, వైతాళికులుగాను, తయారయ్యారు. నా చిన్నతనంలో దూది ఏకి పరుపులు, దిళ్ళు కుట్టటము, దర్జీపనీ 'సాయిబులు' మాత్రమే చేసేవారు.

కులాలు ఏర్పడటానికి మరో కారణం కులవ్యవస్థ మీద తిరుగుబాటే! మధ్యయుగంలో కులవ్యవస్థ మీద చాలావరకు తిరుగుబాట్లు జరిగాయి. అవి విజయవంతమయినప్పుడు కొత్త మతాలు ప్రచారం అయాయి. సిక్కులు అలాటి మతానికి చెందినవారే. కాని కులవ్యవస్థకు తలఒగ్గి ఉన్న కులాలలో ఒక శాఖగా ఉండిపోయారు. బ్రాహ్మణుల మధ్య ఆరాధ్యులూ, శూద్రుల మధ్య జంగాలూలాంటివారు. అలాగే వైష్ణవులూ, సాతానులూనూ. చాలా కొద్దికాలం క్రితం కులతత్వం మీద ధ్వజమెత్తి , తిరిగి కులవ్యవస్థలో ప్రవేశించినవారు విశ్వబ్రాహ్మణులు. వారు కంసాలి పనీ, వడ్రంగం లాంటివి చేపట్టారు

## కులవ్యవస్థకు అపజయం:

సమాజాన్ని ఒక ఆర్థిక దశలో ఇరకబెట్టి, మార్పులకు అవకాశం లేకుండా చేసిన ఆచారం అపజయం పొందక తప్పదు. మార్పు అనంతరం అమలులోకి వచ్చి గ్రామల ఆర్థిక స్వయం సంపూర్ణతకు కులవ్యవస్థ కొద్దిపాటి సహాయం చేసింది. గ్రామాలలో అన్ని వృత్తుల కుటుంబాలు బతకటానికి తగిన చట్టం ఏర్పాటు చేశారు. కాని ఈ కులాలు పెంపొందినంత వేగంగా ఆర్థిక వ్యవస్థ పెరగలేదు. పళ్ళ బిగువున వృత్తి కులాలను పోషిస్తూ పోయే గ్రామం త్వరలోనే దారిద్ర్యం వాతపడుతుంది.

ఈ స్వయం సంపూర్ణ గ్రామాలు మరొకరకం కులవిభజనకూడా తెచ్చినట్టు కనిపిస్తాయి. ఉత్పత్తి సంబంధాల లాగే సామాజిక సంబంధాలు కూడా కుంచించుకు పోయి ప్రాంతీయతకు పరిమితమయాయి. బ్రాహ్మణులమని చెప్పుకున్న వారు అన్ని రకాల వృత్తులూ ఒకవంక చేపట్టితే ప్రాంతీయశాఖలకే చుట్టరికాలు పరిమితం చేసుకున్నారు. అందువల్లనే తామొక్కరికే వైదీకు వెలనాటి వాళ్ళమనీ, వేగినాటి వాళ్లమనీ,

కృష్ణుడి యాదవకులం గొల్లలకు వర్తించాలని వాదిస్తున్నారు.

వీరందరూ పెట్టుపేర్లు కోరకముందే గాంధీగారు హరిజనులని పేరు పెట్టి వారి కులం పేరుకు గొప్ప శాశ్వతత్వం సాధించాలని చూశాడు !

ఇదంతా కులవ్యవస్థను నిర్మూలించే ప్రయత్నం అంటే వెర్రికుట్టిలు కూడా నమ్మరు

కులాలు సంఘదోపిడీదార్లకు చాలా అవసరం. ఈనాడు మన రాజకీయాలు కులవ్యవస్థను బలపరచకపోతే ఒక్క అడుగు ముందుకు సాగవు. రాజకీయ్వార్థత లేనివాడు రాజకీయ నాయకుడు కావాలంటే కులాభిమానాలు రెచ్చగొట్టి, జనాన్ని మభ్యపెట్టి, వోట్లు తెచ్చుకుని, కుర్చీలు అలంకరించాలి! క్రియకు పాలించేది కొద్ది ధనిక కుటుంబాలే అయినా, వారి ప్రతినిధులు ఇంత పెద్ద దేశంలో అన్ని మూలలా లేరు కానీ కుల బలం కలవాళ్ళు ప్రతి గ్రామంలోనూ ఉన్నారు ఫ్యూడలిజం శకలాలు గ్రామాలన్నిటా ఇంకా చిగురిస్తూనే ఉన్నాయి. అందుచేత ఈ దేశంలో బూర్జువా విప్లవం రాదు, వచ్చే అవకాశం లేదు. బూర్జువా వర్గం ఫ్యూడల్ శకలాలతో రాజీపడి వారి సహాయంతో రాజ్యం ఏలాలి. కులవ్యవస్థపోతే, రాజకీయ యంత్రమూ, దేశమూ ముక్కలైపోతుంది !

కాని ఆ పని కులవ్యవస్థను ఇప్పటిలా బలపర్చినా జరుగుతుందని వాదించదలిచాను.

కులవ్యవస్థకు దశాబ్దాలుగా జాతి జీవితంలో ఎలాంటి సమర్థనా లేదు. పైపెచ్చు అది మన చరిత్రను పురోగమించకుండా అడ్డుపడుతూ వస్తున్నది. ముస్లిములూ, పాశ్చాత్యులూ మనని తేలికగా జయించి పాలించటానికి సమాజంలో కులాల వల్ల ఏర్పడిన ప్రతిష్టంభనే కారణం అనటానికి ఎలాంటి సందేహమూ లేదు

ఈనాడు కులాలు మనిషి జీవించే విధానాన్ని నిర్దేశించవు. వీటిని వదలకపోవటం వల్ల కలిగే పరిణామం ఏమిటి ? కులవ్యవస్థా, వర్ణవ్యవస్థా కూడా ఏర్పడక ముందుండిన ఆటవిక దశకు తిరిగి పోతున్నాం ఒక్కొక్క కులశాఖ ఒక్కొక్క ఆటవిక తెగ. అది తన అభ్యుదయం కోసం ఇతర సవాలక్ష తెగలతోను వైరం తెచ్చుకుంటుంది. తన తెగవాళ్ళ కోసం ఎన్ని అక్రమాలైనా జేస్తుంది. దానికి అనుకూలమైన నియమాలనూ, శాసనాలనూ మాత్రమే అది గౌరవిస్తుంది.

రాజకీయరంగంలో ఇది ప్రత్యక్షంగా మనం చూస్తున్నాం. తమిళనాడులో గద్దెకెక్కిన ఇద్దరు వ్యక్తులు ఒకర్నొకరు ''నువ్వు మళయాళీవి!'' అనీ, ''నువ్వు తెలుగువాడివి '' అనీ తిట్టుకున్నారు. ఇదంతా సహపంక్తి భోజనాల విషయంకాదు. పెళ్ళి సంబంధాల విషయమూ కాదు – రాజకీయ వాగ్వాదాలు. అన్ని రాష్ట్రాలలోనూ రాజకీయాలు ఇలాగే అఘోరించాయి.

ఈ లోపల మేధావులూ, సంఘ సంస్కర్తలూ – ఏటికి ఎదురీదుతూ, సమగ్ర

సామాజిక విప్లవం తప్ప దేశానికి మరో మార్గం లేదన్న వారిని హింసావాదులంటున్నారు కాకపోయినా అస్పృశ్యులకు అస్పృశ్యులున్న దేశంలో కుల వ్యవస్థ దెబ్బతినకుండా వర్గపోరాటం జరిగే అవకాశాలు చాలా తక్కువ. కొద్ది మంది ముస్లిములు ఉన్నత పదవులలో ఉన్నంత మాత్రాన దేశంలో మత సామరస్యం ఏర్పడిందనీ, కొద్దిమంది అస్పృశ్యులు రాజకీయనాయకులు అయిన కారణం చేత అస్పృశ్యు లందరూ ఉద్ధరింపు పొందారనీ అనుకునేవారు ఉన్నంత కాలమూ వర్గపోరాటాలు సక్రమంగా సాగవు. నేషనల్ ఇంటిగ్రేషన్ జరిగిన మర్నాడు ఈ దేశానికి సోషలిస్టు విప్లవం అవసరమవుతుంది.

*అరుణతార, త్రైమాసిక, ఫిబ్రవరి – మే 1979*

# చరిత్రా, పురాణమూ

ఒక జాతి ముందుకు పోవటానికి తోడ్పడేది చరిత్రా, పురాణమా? ఈ ప్రశ్నకు పురాణమే అని సమాధానం ఇచ్చే స్థితిలో ఉన్నవాడు బహుశా భారతీయుడే అయి ఉంటాడు. వాస్తవ చరిత్ర లిఖిత రూపాలలో నిక్షేపించటం ఇతర ప్రాచ్య దేశాలవారికి తెలిసినట్టు భారతీయులకు తెలీదు. అందుచేత ఒక విచిత్రమైన పరిస్థితి ఏర్పడింది. మన తొలి సంస్కృతిని పాశ్చాత్యులు మన వైదిక సాహిత్యంలో చూస్తే, మన సంస్కృతిని మధ్య ఆసియా వాసులు మన గణితంలోనూ, ఖగోళ శాస్త్రంలోనూ, వైద్యశాస్త్రంలోనూ చూస్తే, మనం మటుకు దాన్ని రామాయణంలో చూస్తున్నాం. ప్రపంచానికి చూపించటానికి గర్వపడుతున్నాం.

మన జీవితానికి ఉపకరించే సత్యాలన్నీ రామాయణంలో ఉన్నట్టు ఆధునిక పౌరాణికులు హోరెత్తేటట్టు ప్రచారం చేస్తున్నారు చరిత్ర నుంచి ఫలాని విషయాలు మనం నేర్చుకోవాలని గట్టిగా ప్రచారం చేసేవాళ్ళు లేరు మన భవిష్యత్తంతా రామాయణం మీద ఆధారపడి ఉంటుండగా మళ్ళీ చరిత్ర దేనికీ?

ఇంతకన్న చిత్రం ఏమిటంటే మనం ఆ పురాణాలను ఉన్నవి ఉన్నట్టుగా ఉండనీయటం లేదు. మన సంస్కృతికి పరాకాష్ఠ అయిన రామాయణం కథా, శంబూక వధా అన్ని రామాయణ ప్రక్షిప్తాలలో ఉన్నవే. ప్రక్షిప్తాలుకాని రామాయణ భాగాలను కూడా మన పౌరాణికులూ, ఔత్సాహికులూ మార్చారు. ఆ విధంగా రాముడికి మిత్రుడిగా చెప్పబడ్డ గుహుడు రాముడి భక్తుడయ్యాడు శబరి ఇంకో భక్తురాయింది. అక్కడక్కడా సామాన్యమానవుడి దౌర్బల్యాలు బాహాటంగా ప్రదర్శించే రాముడు ఉన్నట్టుండి దేవుడయి పోతూంటాడు!

పురాణ సంస్కృతి మన సంస్కృతికి పునాది అయినా రాజకీయ కారణాలవల్ల మనకు కొంత వరకు చరిత్రను గురించి కూడా తోడవటం అవసరమవుతుంది. కాని

అందువల్ల కలిగే ఇబ్బందిని దాటటానికి మన పురాణాలకు చేసిన మర్యాదే చరిత్రకు కూడా చేస్తుంటాం - దాన్ని మన పురాణ సంస్కృతికి అనుకూలంగా కూర్చుతూ ఉంటాం అప్పుడు పురాణాలకూ, చరిత్రకూ గల అట్టే తేడా ఉండనవసనంలేదు.

అయితే నాగరిక ప్రపంచంలో చరిత్రలో గల అస్పష్టతను సాధ్యమైనంతగా తగ్గించటానికి అనేక రకాల పరిశోధనలు జరుగుతున్నాయి. అందుకు ఆర్కియాలజీ కొంతవరకు ఉపయోగపడుతున్నది. ఆంత్రోపాలజీకూడా ఉపయోగపడుతున్నది. ఆర్యులు అనే వాళ్ళు ఎవరు? వాళ్ళకూ సింధు నాగరికతకూ గల సంబంధం ఎటువంటిది? ఇలాటి సవాలక్ష ప్రశ్నలకు సమాధానాలు వెతుకుతున్నారు. ఈ పరిశోధనలలో చరిత్ర శాస్త్రవేత్తలకు మన పురాణాలు కూడా ఉపయోగపడటం గమనించ దగినది. ఎందుకంటే పురాణాలు తోచీతోచని వాళ్ళు రాసిన కల్పనలు కావు. అందులో చరిత్రకు సంబంధించిన సత్యాలు దొరికే అవకాశం ఉన్నది. ఆర్కియాలజీ తవ్వకాలు పురాణాలలో ఉండే అంశాలను రుజువు చేస్తే వాటిని చరిత్ర క్రింద ఆమోదించవచ్చు.

ఇది ఇతర దేశాలవాళ్ళ (శాస్త్రీయ) దృక్పథం మన పురాణ దృక్పథం అదికాదు. భీష్ముడు యుద్ధంలో పడిపోయినప్పుడు అంపశయ్య ఎక్కడ ఉన్నదీ నిరూపించిన వారికి లక్ష రూపాయలు! కృష్ణుడు అర్జునుడికి గీత బోధించినది ఎక్కడో రుజువు చేసిన వారికి లక్ష! ఈ లక్షలు భోజరాజులాగా విసిరివేసే వాళ్ళకు భగవద్గీత ప్రక్షిప్తమై ఉండవచ్చునన్న అనుమానం కూడా లేదు. వాళ్ళు గీతను గురించి డి.డి. కోసాంబీ రాసినదీ చదివి ఉండరు - లేక చదివి కోసాంబీ అజ్ఞానానికి విచారించారో! కాని మన దేశంలో శాస్త్రీయ దృక్పథంతో చరిత్రను విశ్లేషించిన ఆద్యుడు కోసాంబీ అని ఈనాటి చరిత్రకారులు, మంత్రాలు తంత్రులూ కాదు! ఒప్పుకొంటున్నారు

రాజకీయాలలో తలలు మార్చగల ఘటికులు కూడా చరిత్ర దగ్గరికి వచ్చేసరికి వెకిలిగా ప్రవర్తిస్తారు. కళాసామర్థ్యం గలవాళ్ల కూడా అదే ధోరణిలో ఉండడం ఆశ్చర్యం లేదు. యధా రాజా తధా ప్రజా.

ఎటునుంటి వస్తున్నామో తెలిస్తే తప్ప ఎటు పోవాలో తెలియదు. దిక్కు తెలియని వాడికి గమ్యం ఉండదు. నిర్దిష్టమైన భవిష్యత్తు కోసం కృషిచేసే వాళ్ళకు గతం తెలియాలి అయితే గతం గురించి పురాణ సంస్కృతి కలిగించే అభిప్రాయాలు ఒక్కొక్కసారి తప్పుదారి పట్టించేవిగా ఉంటాయి పైగా వాటిని మనం మార్చేస్తున్నాం. రామాయణంలో ఏడంతస్థుల మేడలున్నాయి. కాని హరప్పా నాగరికత అంతరించిన తరువాత వెయ్యేళ్ళకు గాని మన దేశంలో నగరం లాటిది లేదు. ఈ ఏడంతస్తుల మేడలు (ప్రక్షిప్తమైన భాగం లోవే అయినా) రామాయణ కాలం నాటి సంస్కృతికి చెందినవా? రామాయణం రాసిన నాటి సంస్కృతికి చెందినవా? ఇవాళ తీసిన సినిమాలలో మన

సీతమ్మవారి చేతనైలాన్ చీరలు కట్టించవచ్చు అంతమాత్రాన ఆ కాలంలో నైలాన్ చీరలున్నాయనలేం కదా!

'' ఎందుకు అనకండి. ఆ కాలములో లేనిదేది ఈకాలంలో లేదు ట్రాక్టర్లూ, అణువు బాంబులూ, ట్రాన్సిస్టరూ, రేడారూ వేదకాలం నాడే ఉన్నాయి'' అని వాదించటం మన పురాణ సంస్కృతి అవలంబించే ధోరణి.

చారిత్రక దృష్టితో మానవజీవితం పురోగమిస్తున్నాది. మూడు నాలుగు శతాబ్దాల నాటి మహారాజులకూ, మహారాణులకూ లేని సౌకర్యాలు ఈనాటి మామూలు మనుషులకున్నాయి. మంచి రహదార్లు, వేగంగా నడిచే వాహనాలు, సినిమాలు, రేడియోలు, టీవీలు –! విక్టోరియా రాణి మొదటిసారి రైలు ఎక్కి రైలు పదిహేను మైళ్ళ వేగంతో పోతే, 'Not so fast, Guard Not so fast' అన్నదిట! నూరేళ్ళు తిరగలేదు; ఆవిడ వారసురాలు ఎలిజబెత్ కావాలంటే పదిహేను వందల మైళ్ళ వేగంతో పోయే విమానంలోప్రయాణించగలదు !

ఆర్థికంగా కూడా ఒక్కొక్కప్పుడు పది చదరపు మైళ్ళకు ఒకడు బతకటం దుర్లభంగా ఉండేది. ఈనాడు చదరపు మైలుకు అనేక వందలు జీవనం గడప గలుగుతున్నారు. సగటు ఆయుర్దాయం పెరుగుతున్నది. కొద్ది దశాబ్దాల క్రితం చికిత్స లేని ప్రమాదకర వ్యాధులకు ఈనాడు నమ్మకమైన మందులున్నాయి. ''క్షయ మామూలు జ్వరం కన్నా ప్రమాదం కాదు'' అని ఈనాటి వైద్యులు అనగలుగు తున్నారు.

'' ఇటీవలి కాలంతో పోల్చి ఏం లాభం? కృతయుగం నాడు జీవితం ఇంతకన్నా కూడా బాగుండేది!'' అంటుంది పురాణ సంస్కృతి. దాని దృష్టిలో మానవుడు రానురాను దిగనాశిల్లిపోతున్నాడు గదా!

నిజమే అనుకుందాం. కాని మనం కిందటి తరానికి పుట్టి, కిందటి తరం నాటి పరిస్థితులతో సంఘర్షణ పడుతున్నాం గాని సప్తర్షి సంతానం కాము గద. మనకు ప్రత్యక్షంగా కనిపిస్తుంది. పురోగమనమూ, దానికి తోడ్పడే పద్ధతులూనూ. ఉన్నదంతా పోగొట్టుకున్నవాడు మళ్ళా గోచిపాతతో ప్రారంభించక తప్పదు. కృతయుగంలో ఏమున్నదో తెలయదు. ఈనాడు ఏ కొత్తది వచ్చినా అది కృతయుగంలో ఉండే ఉంటుందనటం తప్ప, రేపు రాబోయేది ఆనాడే ఉన్నదని ఈనాడు చెప్పగల తాహతు పురాణ సంస్కృతికి లేదు మరి! అందుచేత మనం మన తాతలు తాగిన నేతుల ప్రస్తావన కట్టిపెట్టి, ఏదో ఒక వంట నూనెను అందుబాటులోకి తెచ్చుకునే మార్గం ఏమిటా అని ఆలోచించాలి.

మన దేశంలో చరిత్ర జ్ఞానం ఉన్నవాళ్ళు సాధించిన ఉన్నతిని మన పురాణ సంస్కృతితో పోగొట్టుకున్నాం. మొహంజోదారో, హరప్పా నగరాలు ఉచ్ఛదశలో ఉండగా అలాంటి నగరాలు ప్రపంచంలో ఎక్కడా లేవని తవ్వకాలు రుజావు చేస్తున్నాయి.

పాటలీపుత్రం ఉచ్ఛదశలో ఉండగా అంత వైభవం గల నగరం ప్రపంచంలో ఎక్కడా లేదట. అశోకుడి రాజభవనాన్ని చూసిన యాత్రికులు దాన్ని మనుషులు కట్టలేదు, దేవతలు కట్టారన్నారట! చరిత్ర జ్ఞానం గల మౌర్యులూ, గుప్తరాజులూ మన సంస్కృతిని అత్యున్నత ప్రమాణాలకు తీసుకుపోయారు ఈనాడు మనకు అలాంటిదేమీ లేదు. మనకు పురాణాలలో కూడా పురాణం అనిపించుకునే అర్హత లేని చెత్త రామాయణమూ రాంభజనా మిగిలాయి. మానవజాతి దిగనాశిల్లి పోతున్నట్టు పురాణ సంస్కృతి చెప్పనే చెప్పింది గనక మనం అట్టడుగుకేసి పోవటానికి మానసికంగా తయారయే ఉన్నాం.

*యువ మాసపత్రిక, ఆగస్టు – 1980*

*కళలు – శాస్త్రీయ విజ్ఞానం, విరసం ప్రచురణ, సెప్టెంబరు, 1980*

# చరిత్ర - పురాణాలూ

పురాణాలు ప్రచారం చెయ్యని మూఢవిశ్వాసాలు కూడా ఈనాడు మన సమాజంలో అమల్లో ఉన్నప్పటికీ, '' ఆధునిక'' దృష్టిగల వాళ్ళమనుకునే వాళ్ళు పురాణాలను అభూతకల్పన కింద కొట్టెయ్యడం జరుగుతున్నది రెండో పక్క 'సనాతన' భావాలు గల వాళ్లు శాస్త్రీయమైన చరిత్రకన్న పురాణాలలో కనిపించే అభూత కల్పనలే నిజమని వాదిస్తారు. ఈ సందర్భంలో చెప్పుకోవలసిన సంగతి ఏమంటే, ఈ రెండు రకాల వాళ్లకూ పురాణాలను శాస్త్రీయదృష్టితో చూడాలన్న ఆసక్తి లేదు ఆ మాటకు వస్తే పురాణాలకన్న ప్రాచీనమైన వైదిక సాహిత్యం గురించి కూడా ఏవో 'నమ్మకాలు' తప్ప, వాటిని పరిశీలించాలన్న దుద్ధ చాలామందికి లేదు. చరిత్రనే వాస్తవదృష్టితో చూసే సాంప్రదాయం లేనప్పుడు వైదిక సాహిత్యాన్ని, పురాణాలను, వాస్తవ (శాస్త్రీయ) దృష్టితో చూసే అలవాటు ఎక్కడ్నించి వస్తుంది? ఒక వేళ ఎవరైనా 'నిజం' చెప్పినా మనం 'ఆచారాన్నీ' మధ్య వచ్చిన సాంప్రదాయాన్నీ హెచ్చుగా ఆదరిస్తాం ఉదాహరణకు, ఇంద్రుడు గొప్ప తాగుబోతు అనీ, అతనిది బానకడుపు అనీ, అతనికి కపిల వర్ణంగల గడ్డం వుంటుందనీ, అతడు రౌద్రమైన ఆవేశం గలవాడనీ, యుద్ధంలో అపజయం ఎరగడనీ వేదంలో వర్ణించి ఉన్నదట. కాని ఏ పౌరాణిక సినిమాలు గానీ ఇంద్రుడి పాత్రను ఎవరైనా ఇలా తీర్చిదిద్దడానికి సాహసించగలవా? అనూహ్యం. తెగ తాగి చికిత్స పొందవలసిన గొప్ప వ్యక్తి ఇంద్రుడు తప్ప మన ప్రాచీన సాహిత్యంలో మరొకడున్నట్టు లేడు.

పురాణాల నాటికి ఇంద్రుడి ఈ పాత్ర పూర్తిగా మారిపోయింది. 'పూర్వ గాధాలహరి' లో ఇంద్రుడ్ని గురించి చదివిన వారికి అనేక విషయాలు తెలుస్తాయి. పురాణ ఇంద్రుడు చేయని అవినీతికరమైన పని లేదు. ఇంద్రుడు ప్రతి రాక్షసుడి చేతిలోనూ ఓడిపోయి, ఏ విష్ణుమూర్తి సహాయమో లేకుండా తన పదవిని దక్కించుకోలేడు. ఇది

అపజయం ఎరగని ఇంద్రుడు కాడు, జయం ఎరగని ఇంద్రుడు ఇంద్రుడిలో కలిగిన ఈ మార్పు ఉపనిషత్తులలోనే స్పష్టమవుతుంది. కాషీతకి బ్రాహ్మణోపనిషత్తులో ఇంద్రుడు తాను చేసిన దురాగతాలు చెప్పుకుంటూ, మాతృవధ, పితృవధ, బ్రాహ్మణ హత్య లాంటి పాపాలు మనుషులను అంటకుండా చేయగలనని ప్రగల్భాలు పలుకుతాడు. (అదే ధోరణిలో కృష్ణుడు అర్జునునితో తనను నమ్మినవాడి అన్ని పాపాలూ పోగొట్టగలనంటాడు)

ఇంద్రుడి పరిణామంలో గమనించవలసిన మరి ఒక అంశం కృష్ణుడికి, ఇంద్రుడికి గలవైరం. పురాణాల లెక్కన కృష్ణుడు సాక్షాత్తు విష్ణువు అవతారం. విష్ణువేమో ఇంద్రుడుకి తమ్ముడని ఒక వదంతి. ఇంద్రుడికి రాక్షసుల మీద విజయాలు సాధించి పెట్టేవాడని అనేక వదంతులు పురాణాలలో చూస్తాం. అయినా కృష్ణుడికీ, ఇంద్రుడికీ గల వైరాల జాడలను పురాణాలు పూర్తిగా తుడిచి పెట్టలేదు. పారిజాతాపహరణం కథ, ఇంద్రుడు కృష్ణుడి గోవుల మీద రాళ్లవాన కురిపిస్తే కృష్ణుడు గోవర్ధన పర్వతం ఎత్తిన కథ, ఖాండవదహనం చేస్తున్న కృష్ణార్జునులకు విరుద్ధంగా ఇంద్రుడు వర్షం కురిపించి అగ్నిని ఆర్పజూడటమూ లాంటివి వున్నాయి– అర్జునుడు ఇంద్రుడి కొడుకే అయినప్పటికీ.

కృష్ణుడు పురాణ కాలానికి ముందే పంజాబులో దేవుడుగా ఆరాధించబడటం జరిగింది. ఆ కృష్ణుడు గోపాలకుడు. అతణ్ణి దేవుణ్ని చేసిన వాళ్లు పంజాబులోని కర్షక జాతుల వాళ్ళు. కృష్ణుడు దేవుడు కావడంతో పంజాబు ప్రాంతంలో ఇంద్రుడ్ని కొలవడం వెనుకబడిందని పరిశోధకులు చెప్పారు.

ఇంద్రుడి కీర్తి మాసిపోవడానికి మరొక స్పష్టమైన కారణం యజ్ఞ కర్మలకు కాలదోషం పట్టడం. ప్రాచీన ఆర్యజాతుల ఆర్థిక జీవనం, పశువుల పెంపకం మీదా, వారి ఆహార సమస్య పశుబలుల మీదా ఆధారపడినంత కాలమూ ఇంద్రుడి స్థానం అత్యున్నతంగా వుండింది. అయితే వ్యవసాయం అభివృద్ధి కావడంతో పశువులను కోసుకుతినటం వట్టి 'దుబారా' వ్యవహారంగా పరిణమించింది. అంతకన్న పశువుల శ్రమను పొలాలు దున్నటం, బళ్లులాగడం, వాటిపాలను ఆహారంగా వినియోగించడం చాలాలాభసాటి అయింది. బుద్ధుడి నాటికి యజ్ఞం చాలా నింద్యమైపోయింది. బుద్ధుడు చాలా సులువుగా యజ్ఞాచారాలను మానిపించడమే గాక పశువులను కోసుకు తినడం ఆర్థికంగా ఎంత నష్టమో కూడా చెప్పాడట.

నిజానికి యజ్ఞకర్మలే జీవిత విధానంగా వుండిన ఆర్య తెగలు కూడా పశుపోషకులే, కాని కృష్ణుడు వ్యవసాయ నాగరికతకు చెందిన పశుపోషకుడు. అందుకు నిదర్శనంగా అతని అనుచరుడు బలభద్రుడు నాగలి కట్టిన వాడు. అతను తన నాగలితో యమునానుంచి పశుపోషకులుండే చోటికి కాలువతవ్వినట్టు హరివంశంలో వున్నది. ఇది నిశ్చయంగా పంటకాలువ అయివుండాలి.

ఇంద్రుడు నూరు యజ్ఞాలు చేసిన చేసిన వాళ్ళు (శతమఖులు) తన ఇంద్రపదవి కాజేస్తారని అసూయ పడినట్టు పురాణాలు చెపుతున్నాయిగాని, అతడు నిజంగా కష పూనినది తపస్సు చేసే వాళ్ళ మీద ఎవరు తీవ్ర తపస్సు చేసినా వారి తపస్సు భంగం చేయడానికి ఇంద్రుడు అప్సరసలను ఉపయోగించాడు. ఎందుకు?

డా. రొమిలాథాపర్ అభిప్రాయం అతీత శక్తులను పెంచుకోవటమో, పలాయనం చిత్తగించటమో అయి వుండవచ్చునని అయితే తపస్వులు మౌలిక సమస్యల సమాధానాలు అన్వేషించరనీ వారి సమాధానాలు అరణ్యకాలలోనూ ఉపనిషత్తులలోనూ ఉన్నాయనీ కూడా ఆమె అన్నారు

ఇంద్రుడు తపస్సుకు ప్రబల శత్రువనటానికి పురాణాల నిండా అనేక సంఘటనలున్నాయి. అంటే యజ్ఞం స్థానే తపస్సు వచ్చి ఉండవచ్చు. అదే నిజమైతే వేదాలకూ, వేదాంగాలకూ మధ్య గొప్ప పరిణామం జరిగి వుండాలి. ఉపనిషత్తులు రాసిన వాళ్లు అస్తమానమూ ఆకలితో బాధపడుతూ, ''అన్నమో రామచంద్రా!'' అంటూ అల్లాడిన వారు కారు. వారికి రకరకాల సమస్యలను గురించి ఊహాగానాలు చేసే విశ్రాంతి వున్నట్టు కనబడుతుంది.

బుద్ధుడి కాలానికి (క్రీ.పూ. ఆరవ శతాబ్దంలో) తపస్సు అమలులో వున్నది. బుద్ధుడే తపస్సు చేసి, అందువల్ల ప్రపంచానికి ప్రయోజనం లేదని నిర్ధారణ చేసుకున్నాడు. అతని మొదటి శిష్యులు తపస్వులే.

ఇంద్రుడి పతనం పూర్తయింది, ఇంద్ర పదవికి మానవోత్తములు ఎన్నుకోబడటంతో! ఉపనిషత్తులలో మనుషులను అతిఘోరపాపాల నుంచి కాపాడగలనని ప్రగల్భాలు పలికిన ఇంద్రుడు పురాణకాలానికి బ్రహ్మహత్యాది పాతకాలు చుట్టుకుని అజ్ఞాతవాసం చేశాడు పురాణకాలం గడిచాక ఇంద్రుడికి యుద్ధాలలో మానవులు సహాయం చెయ్యటం కూడా జరిగింది. కథాసరిత్సాగరం ఆరంభంలోనే అలాంటి సంఘటనలున్నాయి. (దశరథుడే ఇంద్రుడికి యుద్ధాలలో సహాయం చేశాడని రామాయణ కథ చెబుతున్నా, రామాయణం పురాణం కాదని నానమ్మకం. అది క్రీ.పూ. ఏడవ శతాబ్దంలో రాయబడిందన్న పరిశోధకులకు అబద్ధం ఆడవలసిన అవసరం ఉన్నట్టు కనబడదు )

ఇందులో అచ్చుగా ఇంద్రుణ్ణి మాత్రమే పరిశీలించాను అతని పరిణామం గురించి శాస్త్రీయంగా ఆలోచించినట్టయితే ఋగ్వేద కాలం నుంచి పురాణ కాలం దాకా భారతీయుల జీవితంలో – ప్రత్యేకించి ఆర్థిక విధానాలలో – ఎలాంటి మార్పులు వచ్చినది తెలుసుకోవచ్చు. పశుపోషణ ప్రధాన ఆర్థిక వనరుగానూ, వ్యవసాయం హీన వ్యాపకంగానూ ఉన్న కాలంలో అత్యున్నత స్థానంలో ఉన్న ఇంద్రుడు, వ్యవసాయ దశలోనూ, వర్ణ వ్యవస్థ విస్తరించిన కాలంలోనూ, రాజ్యాలూ, సామ్రాజ్యాలూ విస్తరించిన

కాలంలోనూ ఎలా పతనమయాడో భౌతిక చారిత్రక దృష్టిగల వారు గ్రహించవచ్చు. ఇది అవసరం మనం గతాన్ని అవగాహన చేసుకోకుండా వర్తమానాన్ని విశ్లేషించి, భవిష్యత్తుకు పథకాలు వెయ్యలేం. వేదాలూ, ఆరణ్యకాలూ, ఉపనిషత్తులూ, పురాణాలూ ఒకే సంస్కృతికి చెందినవని నమ్మేవాళ్ళు మనలో చాలామంది ఉన్నారు!

*యువ మాసపత్రిక, ఆగస్టు - 1980*

*కళలు - శాస్త్రీయ విజ్ఞానం, విరసం ప్రచురణ, సెప్టెంబరు, 1980*

# 1. ఆటవిక సమాజం

మనం ఈనాడు ''కుటుంబం'', ''వంశం'', ''రక్త బంధుత్వం'', ''కులం'', ''శాఖ'' అనేమాటలను ఏ విధంగా వాడుతున్నామో ఆ విధంగా ఎల్లప్పుడూ లేవు. ఆటవిక దశనుంచి నాగరిక దశకు మానవ జాతులు చేసిన ప్రయాణంలో అవి అనేక రకాల మార్పులకు లోనయాయి. ఈ మార్పులలో కొన్ని జరగటానికి సహస్రాబ్దాలు కూడా పట్టింది.

ఆరంభ దశలో మానవులు ముఠాలుగా జీవించారు. ప్రతిముఠాలో ఉండిన యావన్మందీ రక్త బంధువులే. రక్త సంబంధం లేనివారికి ముఠాలో స్థానంలేదు. అన్నదమ్ములనీ, అక్కచెల్లెళ్ళనీ విచక్షణ లేకుండా దాంపత్యం జరిపేవాళ్ళు.

ఇలాటి ఆచారం ఈనాడు మన సమాజానికి ఎంత విడ్డూరంగా కనిపించినా ఇలాటి సంప్రదాయాలు పురాణకాలంలో బొత్తిగా లేకపోలేదు. బ్రహ్మ తన కుమార్తెనే పెళ్ళాడాడన్నారు. (బ్రహ్మ అనేది ఆదికాలపు మానవ సమాజం – డాంగే) గ్రీకుల పెద్ద దేవుడైన జూస్ (Zeus) తన కూతళ్ళకు పిల్లల్ని కన్నాడు. కోసల దేశపు రాజైన దశరథుడికి కౌసల్య అనే భార్య ఎలా ఉన్నదో మనకెవరూ చెప్పరు. (కొందరు దక్షిణ కోసల అన్నది నిరాధరారంగా ఊహించారు) బౌద్ధుల రచనలు నిజమైతే సీత రాముడికి అక్క. అక్కలను పెళ్ళాడే ఆచారం ఈజిప్షియనులలో ఉండేదని మనకు తెలుసు.

ఒకప్పుడు, అంటే ఆటవిక దశలో, సర్వత్రా సపిండ దాంపత్యాలు ఉండేవని చెబుతున్నారు. ఇది అనూహ్యమేమీ కాదు. కాలక్రమాన సమష్టి దాంపత్యాలనేవి అమలులోకి వచ్చాయి. అన్నదమ్ములందరూ తమ భార్యలందరికీ సమష్టి భర్తలుగా ఉండేవారు. అలాగే అక్కచెల్లెళ్ళందరూ తమ భర్తలందరికీ భార్యలుగా ఉండేవాళ్ళు. అయితే ఈ ''అన్నదమ్ములు , అక్కచెల్లెళ్లూ'' అనే చుట్టరికాలు మనం ఈనాడు అనుకునేవి. ఎన్ని ''వేళ్లువిడిచిన'' వారైనా అన్నదమ్ములే అక్క చెల్లెళ్ళే.

లోగడ చెప్పిన రెండు రకాల దాంపత్యాలూ మిశ్రమం పొంది ఇతర రకాల దాంపత్యాలూ అమలులోకి వచ్చాయి. ఆటవిక దశ ముగిసేదాకా అవి అమలు జరిగాయి.

అటు తర్వాత భార్యా భర్తల జంటలు ఏర్పడ్డాయి గాని, మైథునమూ, పిల్లలను కనటమూ ఆ జంటలకే పరిమితమై ఉండలేదు. దీనికి నిదర్శనం మనకు భారతంలోనే కనబడుతుంది. బృహస్పతి, గర్భవతిగా ఉన్న తన తమ్ముడి భార్యకు గర్భం కలిగించ యత్నిస్తాడు. ఈనాడు మనకు జుగుప్సాకరంగా తోచే ఈ కథ ఆనాటి సామాజిక స్థితిని ప్రతిబింబిస్తుంది. కనకనే పురణస్థమయింది. అలాగే ఒక మునిపత్నిని ఎవడో వచ్చి చెయ్యి

పట్టుకుని కామక్రీడకు లాక్కుపోతుంటే ఆమె కొడుకు అభ్యంతరం చెబుతాడు "ఇది ప్రాచీనమైన ఆచారమేరా బాబూ" అంటాడు తండ్రి.

అటుతరువాత బహుపత్నీక వివాహాలూ, బహుపత్నీక కుటుంబాలు (Patriarchal families) వచ్చాయి సామాజిక వ్యవస్థపై ఇలాంటి కుటుంబాల ప్రభావం అంతగా లేదట. మన పురాణాలలో దశరథుడు, కృష్ణుడూ లాంటి బహుపత్నీకులూ కనబడతారు.

పతి పత్నీక కుటుంబం (Monagamian families) నాగరిక యుగంలో వచ్చింది.

అతి ప్రాచీన సమాజాల పాలన ఏ విధంగా జరిగింది ? జాతికి మూలం కులం (gens). అనేక కులాలు చేరి ఒక జాతిగా ఉండేది. ఉదాహరణకు· యదు, వృష్ణి, భోజ, అంధక కులాలు చేరి ఒక జాతి. ఆటవిక అనాగరిక దశలన్నిటిలోనూ సమాజానికీ (gentis) పునాదిగా ఉంటూ వచ్చాయి. దానిని మనం కులవ్యవస్థ (gentile organisation) అనవచ్చు. (ఈనాడు మనం కులాలంటున్నది వృత్తులను బట్టి ఏర్పడి, సమాజంలో అడ్డుగోడలుగా నిలిచిపోయి ఉన్నవి).

చిత్రమేమిటంటే , కులవ్యవస్థ ఏర్పడక ముందుండిన దశ ఎలాటిదో తెలుసు కునేటందుకు మనకు ఆధారం దొరుకుతున్నది. ఆ దశలో కులాలు కూడాలేవు – వర్గాలు మాత్రమే ఉండేవి : స్త్రీ వర్గమూ, పురుష వర్గమూనూ.

ఇది మనకెలా తెలుసు? మోర్గన్ ఆస్ట్రేలియాలోని ఆదివాసులైన "కమిలరోయ్" (Kamilaroi) జాతిని గురించి ఈ కింది వివరాలు సేకరించాడు.

ఈ జాతిలో ఆ కులాలున్నాయి. అందులో మూడు ఒక తెగా, మరి మూడు మరొక తెగా. ఇది న్యాయానికి కులవ్యవస్థే అయితే దానికి పూర్వం వర్గ వ్యవస్థ ఒకటి బలంగా నిలిచిఉండి, కులవ్యవస్థపై ఈ జాతి అభివృద్ధికాకుండా అంతరాయం కలిగించింది. అది ఎలా జరిగినదీ తెలుసుకుందాం.

కమిలరోయ్ జాతిలో రెండు తెగలున్నాయనీ, ఒక్కొక్క తెగలోనూ మూడేసి కులాలున్నాయనీ అనుకున్నాం. ఒకే తెగలోని కులాలమధ్య దాంపత్యం నిషిద్ధం. ఒక తెగకు చెందిన వారితో దాంపత్యం సాగించవచ్చు. కులవ్యవస్థలో ఇది ఇతర అవాంతరాలు లేకుండా జరుగుతుంది.

అయితే ఈ కమిలరోయ్ తెగలలో అవాంతరాలున్నాయి. అవి స్త్రీ పురుష వర్గాల మూలంగా ఏర్పడినవి .ఎందుకంటే, ఈ జాతిలో 4 పురుష వర్గాలూ, 4 స్త్రీ వర్గాలూ ఉన్నాయి.

స్త్రీ వర్గాల పేర్లు : ఇప్పత, బూత, మాత, కపోత.
పురుష వర్గాలు : ఇప్పై, కుంబో, ముర్రి, కుబ్బి.

ఈ వర్గాలు అన్ని కులాలలోనూ ఉన్నాయి. అయితే, ఏ కులంలో ఉన్నప్పటికీ, ఇప్పైలు, అందరూ అన్నదమ్ములే · అలాగే కుంబోలూ, ముర్రీలూ, కుబ్బీలూనూ

అదే విధంగా ఏ కులంలో ఉన్నాసరే, ఇప్పతలంతా అక్కచెల్లెళ్ళు అలాగే బూతలూ, మాతలూ, కపోతలూనూ.

ఇంతేకాదు. ఇప్పైలందరూ ఇప్పతలందరికీ అన్నదమ్ములు. ఒక తల్లి బిడ్డలు కావచ్చు వేళ్ళు విడిచిన తల్లుల బిడ్డలు కావచ్చు. ఇప్పై పురుషుడూ, ఇప్పత స్త్రీ కలుసుకుంటే వారు పూర్వం ఒకరి ముఖం ఒకరు ఎరుగక పోయినాసరే ''అన్నా'', ''అక్కా'' అన్నవరసలతో సంబోధించుకుంటారు కుంబోలకూ, బూతలకూ ముర్రీలకు, మాతలకూ, కుబ్బీలకూ; కపోతలకు సోదర సోదరీ బంధుత్వమే ఉన్నది.

స్త్రీ పురుష విభేదాన్ని పురస్కరించుకుని నాలుగు స్త్రీ వర్గాలూ, నాలుగు పురుప వర్గాలూ ఏర్పడి, వాటిలో ఒక పురుషవర్గమూ ఒక స్త్రీ వర్గమూ మాత్రమే సోదర సోదరీ బంధుత్వం కలిగి ఉన్నప్పటికీ, ప్రతి స్త్రీ వర్గానికీ ఒక పురుష వర్గంతో మాత్రమే దాంపత్య సంబంధం ఉండాలని నియమం ఉన్నది.

ఉదాహరణకు, ఇప్పైలకు కపోతలకు మాత్రమే దాంపత్యం ఉండాలి. ఇప్పై వర్గానికి చెందిన పురుషులందరూ కపోత స్త్రీలందరికీ భర్తలే, ఎన్నడూ ముఖాలు కూడా చూసుకోని ఇప్పై (పురుషుడు) కపోత (స్త్రీ) ని కలుసుకుంటే ఆమెను ''పెళ్ళాం'' అని పిలుస్తాడు ; ఆమెతో అతను దాంపత్య ధర్మాన్ని నెరవేర్చవచ్చు. అలాగే కుంబోలందరూ మాతలకు భర్తలలకు; ముర్రీ లందరూ బూతలందరికీ భర్తలు; కుబ్బీలందరూ, ఇప్పతలందరూ భార్యాభర్తలు.

ఇవే సామూహిక దాంపత్యాలు.

ఈ వ్యవస్థలో గమనించదగిన విషయాలేమిటంటే : నాలుగు పురుష వర్గాలలో ప్రతి దానికీ ఒక స్త్రీ వర్గంతో సోదర సంబంధం వున్నది. అందుచేత దాంపత్యం నిషిద్ధం. మిగిలిన మూడు స్త్రీ వర్గాలలో ఒక్కదానితోనే దాంపత్యం అనుమతించబడింది.

మరొక సంగతి ఏమంటే, కమిలరోయ్ జాతిలో రెండు తెగలు (శాఖలు). ఒక్కొక్క తెగలో మూడేసి కులాలు ఉన్నాయిగదా. ఈ కులాలు స్త్రీ పారంపర్యం గలవి. ఏ కులానికి చెందిన తల్లి పిల్లలది అదే కులం కాని, పిల్లల వర్గాలు మారిపోతాయి

ఒక కపోత స్త్రీకి (ఇప్పై పురుషుడి ద్వారా) పిల్లలు కలిగితే వారిలో మగపిల్లలందరూ ముర్రీలవుతారు. ఆడపిల్లలందరూ మాతలవుతారు.

అలాగే, కుంబో – మాత దాంపత్యంలో పుట్టిన పురుషులు కుబ్బీలు, స్త్రీలు కపోతలు.

ముర్రీ, బూతలకు పుట్టిన మగవాళ్లు ఇప్పైలు, ఆడవాళ్ళు ఇప్పతలు.

కుబ్బీ, ఇప్పతలకు పుట్టిన మగవాళ్లు కుంబోలు, స్త్రీలు బూతలు.

దీన్నిబట్టే ఇంతకుముందు చెప్పిన సోదరీ సోదర వర్గాలు నిర్ణయమయ్యాయి

ఈ ఏర్పాటు మూలాన వర్గాల మధ్య రక్త సంబంధాలు బాగా అల్లుకు పోయాయి. ''ఈ ఏర్పాటును పరిశీలించిన కొద్దీ ఇందులో ఆటవిక లక్షణాలు కొట్టవచ్చినట్టు కనబడతాయి'' అంటాడు మోర్గన్. కమిలరోయ్ జాతిలో ఉండే కులాలు

1. దువీ (Ignana), 2. ముర్రి ఇరా (kangaroo), 3. ముతే (opossum), 4. దినౌఉన్ (Fmu), 5. బిల్బ (Bandi coot), 6. నురై ( Black snake) అన్నీ జంతువుల పేర్లే.

ఈ కులాలలో స్త్రీ పురుష వర్గాలు ఇలా వున్నాయి.

1,3,5 కులాలలో పురుషుడు ముర్రీలూ, కుబ్బీలూ, స్త్రీలు మాతలూ, కపోతాలూను.

2,4,6 కులాలలో పురుషులు కుంబోలూ, ఇప్పైలూ; స్త్రీలు బూతలూ, ఇప్పతలూనూ.

1,3,5 కులాలు ఒక తెగ; 2,4,6 కులాలు మరొక తెగ. ఈ తెగలు ఒక్కొక్క కులం నుంచీ మూడేసి కులాలుగా విభజన చెంది ఉండాలి. దీనికి సాక్ష్యం ఏమిటంటే మొదటి మూడుకులాల మధ్యా రెండు మూడు కులాల మధ్యా దాంపత్య సంబంధాలు ఒకప్పుడు నిషిద్ధంగా ఉండేవి. అప్పుడు దాంపత్య వ్యవస్థ ఎలా ఉండేదంటే ఒక కులంలో సగం మంది స్త్రీలు రెండో కులంలో సగం మంది పురుషులతో దాంపత్యం నెరిపేవారు.

అయితే అచ్చుగా కులవ్యవస్థే గాక వర్గవ్యవస్థ కూడా ఉన్న కారణం చేత భిన్న కులాలమధ్య స్వేచ్ఛగా దాంపత్యం కొనసాగలేదు. ఒక్కొక్క కులమూ మూడేసి కులాలయింది. దానికితోడు స్త్రీ పురుషులలో నాలుగేసి వర్గాలుండటంతో దాంపత్య సంబంధాలు చాలా సంకుచితపడి, కులవ్యవస్థ స్వేచ్ఛగా అభివృద్ధి కాకుండా నిలిచిపోయింది. సన్నిహిత సోదరీ సోదరులమధ్య దాంపత్యాలు ఏర్పడకుండా ఉండగలందులకై ఏర్పాటయిన ఈ వర్గవ్యవస్థ చివరకు అవాంఛనీయమైన దాంపత్య సంబంధాలకే దారితీసి, ఎంతో శక్తివంతమూ, అనుల్లంఘనీయమూ అయికూర్చున్నది.

దీన్ని సడలించటానికి ఒక ఏర్పాటు చేశారు. ఇగ్వానా కులం ముర్రీలు ఒకప్పుడు రెండో తెగలోని బూతలను మాత్రమే పెళ్ళాడవలసి ఉండేది. వారు కంగారు కులంలోని మాతను (వేలు విడిచిన చెల్లెళ్ళను) వివాహం చేసుకోవచ్చున్నన్నారు. ఇలాటి అవకాశమే మిగిలిన కులాల్లోని స్త్రీ పురుషులకు ఇవ్వబడింది. ఇది గొప్ప సంస్కారమనటానికి

లేదుగాని, కమిలరోయ్ జాతివర్గ వ్యవస్థను కులవ్యవస్థగా పరివర్తన చేసుకోవటానికి ఇలా చేశారన్నది స్పష్టం అవుతుంది.

ఒక్కటి స్పష్టం : ఆటవిక దశలో అన్ని మానవ జాతులూ సమష్టి దాంపత్య విధానం అవలంబించాయి. ఆ దశలో అంతకన్న మరొక దాంపత్య విధానం లేదు. మన పూర్వీకులు అలాటి విధానాలను అమలు చేసినవారే ప్రపంచంలో ఇంకా కొన్ని జాతులు ఆటవిక స్థితిలో ఉండటం మూలానా, మన పూర్వీకులను గురించి మనకు కొన్ని కొన్ని సాక్ష్యాధారాలుండటం మూలానా, మన సమాజంలో కూడా కొన్ని కొన్ని ఆటవిక లక్షణాలు అవశేషాలుగా ఆచారాల మాటున ఉండటం మూలానా మనం నిజం తెలుసుకోగల స్థితిలో ఉన్నాం.

ఆస్ట్రేలియాలోని ఆదిమవాసులు ప్రాథమిక ఆటవిక దశలో అలాగే ఉండిపోయారనుకోనవసరం లేదు . వారి కళలూ, ఆచారాలూ కొంత అభివృద్ధిని సూచిస్తాయి. వారు నాగరికతలో పతనమయారనుకోవటానికీ అవకాశం లేదు. అయితే మిగతా ఆటవిక జాతులేవీ ప్రదర్శించని అత్యంత ప్రాచీనమైన స్త్రీ పురుష వర్గ విభజనను ఈ ఆదిమవాసులు ఇంకా అమలులో ఉంచటంచేత దానిని గురించి చెప్పుకున్నాం. ఆస్ట్రేలియా ఇతర ప్రపంచంనుంచి చాలాకాలం వేరుపడి ఉండకపోతే ఈ ప్రాచీన ఆచారం ఏనాడో అంతరించి ఉండకపోతే ఈ ప్రాచీన ఆచారం ఏనాడో అంతరించి ఉండును ప్రపంచమంతటా అంతరించిన జీవ జాతులు – డక్‌బిల్. కంగారూ – ఆస్ట్రేలియాలో దొరకటానికి కూడా ఆ ఖండం ఇతర ఖండాల నుంచి వేరుపడి ఉండటమే.

కులవ్యవస్థ (Gentile organisation) ఎలాంటి పరిణామాలు చెందినదీ ముందు ముందు తెలుసుకుందాం.

*ముద్రణ : ఆంధ్రజ్యోతి, వారపత్రిక 24-4-1970*

# 2. ఆటవికులలో వివాహ విధులు

ఈ కాలపు మన ఆచారాలలో, ముఖ్యంగా పెళ్ళి తంతుకు సంబంధించిన వాటిలో, ఆటవిక సాంప్రదాయాలు ఎన్ని ఉన్నాయో తెలుసుకోవటం ఆసక్తికరంగా ఉంటుంది.

మరొక సంగతి కూడా గమనించాలి. ఆధునిక రచయితలలోనూ, రచయిత్రులలోనూ వివాహ బంధంలో ఉండే ''విషం'' ఎలాటిదో స్పష్టంగా కథలలోనూ, నవలలలోనూ చిత్రించిన వారు రంగనాయకమ్మగారు. నిజానికి స్త్రీ పురుష పరస్పర విద్వేషం ఆటవిక సమాజంలో సర్వత్ర ఉండినదే. దాన్ని అధికమించడానికే వివాహవ్యవస్థ ఏర్పాటయింది. ఏదో ఒక తంతు జరిపి కొన్ని 'నిషేధాలు' తొలగిపోయినట్టు

గుర్తించినంత మాత్రాన భార్యాభర్తల మధ్య ఉండే విద్వేషం రద్దు అయిపోదు భార్యలకు వుండే నిషేధాలు కొన్నింటిని గురించి లోగడ రాశాను సన్నిహిత స్పర్శ, సహజీవనాల మూలాన భార్యాభర్తల మధ్య వైషమ్య కారణాలు ప్రకోపిస్తాయి. అంత మాత్రాన ఆ కారణాలు ప్రకృతిసిద్ధమనుకోరాదు. అవి ఆటవిక దశలో పుట్టినవి. ఈనాటికీ మనని వెంటాడుతున్నాయి. మనలో ఉన్న ఆటవిక సంస్కృతే రంగనాయకమ్మగారి రచనలలో మనం చూసేది.

మరీ వెనుకబడిన జాతులలో వివాహవిధి అంటూ ఏమీలేదన్న భావం కలుగుతుంది. కాని వారిలో కూడా లాంఛనప్రాయంగా ''తంతు'' ఉంటుంది. వివాహపు తంతుకు పరమార్థం ఒక [illegible]కి, ఒక పురుషుడికి ముడిపెట్టడం. దాన్నే మనం ''మూడుముళ్ళు చేశా[illegible] [illegible]మగవాడూ, ఒకరి నుంచి ఒకరు బహుమానాలు పుచ్చుకోవటమే ''నిషేధ[illegible] [illegible]గింపు. మన పురాణాలలో గాంధర్వ వివాహం ఉన్నది. ''దుష్యంతుడు'' ఏ [illegible] లేకుండానే, లోకానికి తెలియకుండానే శకుంతలను పెళ్ళాడాడు. కాళిదాసు [illegible]లో దుష్యంతుడు శకుంతలకు తన ఉంగరం ఇస్తాడు. మరి ఆటవికదశలో ఉన్న[illegible] ఇది వివాహవిధికిందనే వస్తుంది కాని నాగరిక దశకు చెందిన కథలలో కూడా [illegible] ఉంగరాలు మార్చుకుని పెళ్ళాడటం గురించి చదువుతాం. ఈనాడు కూడా ''ప్రధానం'' ఇలాగే ఉంటుంది. అది పెళ్ళే నిజానికి.

ఓరాంగ్ బె[illegible] జాతిలో పెళ్లిని ''దూరంగా ఉన్నవాళ్ళు దగ్గిర కావటం, విడిగా ఉన్నవాళ్లు ఏకం[illegible]'' అంటారు. క్రైస్తవ వివాహవిధిలో కూడా ఇలాటి ప్రకటనే జరుగుతుంది.

మానవజాతి [illegible] దశలలోనూ వివాహం ''మతభావ'' ప్రేరితమైనది. పెళ్ళి వధూవరుల జీవితాలకు మాత్రమే సంబంధించినది. అయినప్పటికీ, ఆటవిక దశలో స్త్రీ జాతికి, పురుష జాతికి మధ్య వుండే నిషేధాలను తొలగించటానికి ''మతం'' అవసరమవుతుంది నాగరిక సంస్కృతిలో వివాహబంధానికి ఆధ్యాత్మిక విలువలను అంటగట్టి, దాన్ని జీవాత్మకూ పరమాత్మకూగల సంబంధమనీ, ఆకాశానికీ, భూమికీ గల సంబంధమనీ ఏవేవో కల్పనలు అల్లారు. దాంపత్య జీవితం ఆటవికుల దృష్టిలో ''పాపం'' తో కూడుకున్నది. ఈ ''ప్రమాదాన్ని'', లేక ''పాపాన్ని'' తొలగించటానికే వివాహవిధి; దాంపత్యజీవనం క్షేమంగానూ, అభ్యుదయకరంగానూ, సుఖప్రదంగానూ ఉండేటట్టు చూడటమే దాని ఉద్దేశం. ఈ ''బంధం'' అతి పవిత్రమైనది. దాన్ని తెంచరాదు. ఇదే ఈనాడు కూడా అధికసంఖ్యాకుల నమ్మకం.

వివాహతంతు కేవలమూ ఇద్దరు వ్యక్తులను యేకం చెయయటమేగాని, రెండు జాతుల మధ్య సంబంధం ఏర్పరచటం కానేకాదు. పెళ్ళి ద్వారా ఒక కుటుంబంలోకి ఒక కొత్త మనిషి ప్రవేశించటం జరుగుతుంది. నిజమే, కాని వివాహ విధిలో ఆ ప్రవేశం

ప్రధానం కాదు. చాలా వివాహ విధులలో భార్యాభర్తల దేహ సంబంధాల ప్రసక్తి కూడా ఉండదు కేవలమూ స్త్రీ, పురుషుల మధ్యవుండే నిషేధాలను ఒక స్త్రీ, పురుషుడికి మధ్య రద్దు చెయ్యటమే వివాహవిధి ఆశయం.

అది ఎలా సాధ్యమవుతుందంటే, భార్యాభర్తల పరస్పర స్పర్శమూలాన వారికి హాని కలగకుండా చెయ్యడంద్వారా, సహభోజనం ద్వారా వారికి అపాయం సంభవించకుండా చూడాలి!

ఆటవికులు వివాహవిధికి గల భౌతిక శక్తిని గుర్తించుతారు. బాలింతచావు చచ్చిన మనిషి పిశాచం అవుతుందన్న నమ్మకం అనేక జాతులలో వున్నది. అందుకని అలా తన భార్య చచ్చిపోతే భర్త ఆ వివాహాన్ని శాస్త్రోక్తంగా రద్దు చేయించుకుంటాడట! విధవ వివాహానికి తంతు చాలా క్లుప్తంగా ఉంటుంది ఎందుకంటే, నిషేధాలు మొదటి వివాహంతోనే రద్దయిపోయి ఉంటాయి. పురుషప్రధాన జాతులలో వితంతువు అదివరకే భర్త జాతిలోకి వచ్చి ఉంటుంది గనక తతంగం చాలా తక్కువ ఉంటుంది.

వివాహ సమయంలో వధూవరుల మధ్య పరస్పర భీతి అవ్యక్తంగానూ, కొన్ని వేళల స్పష్టంగానూ ఉంటుంది. వారిద్దరినీ భూత పిశాచాలనుండి కాపాడే ఆచారాలురకరకాలుగా ఉంటాయి. వధూవరుల తల మీదుగా తుపాకులు పేలుస్తారు. ఊరేగింపుల ముందు వత్తులు పట్టుకుని నడుస్తారు. ఆకాశాన్ని ఈటెలతో పొడుస్తారు. చీనాలో, పెళ్ళి కూతుర్ని అత్తవారింటికి తీసుకుపోయే మేనామీద ఒక బొమ్మ ఉంటుందట ఒక మాంత్రికుడు కత్తి చేతబట్టి, పులిమీద యెక్కి ఉన్నట్టు బొమ్మ చిత్రించి ఉంటుంది ఆ మేనాలో ధూపం వేస్తారు.

మనలో ఎర్రనీళ్లు దిష్టి తీయటానికి ఉపయోగించే ఆచారం ఉన్నది. నిజానికి ఆ ఎర్రనీళ్లు రక్తానికి ప్రత్యామ్నాయం; పిశాచిలు రక్తం తాగి, తృప్తిపడి, వెళ్లిపోతాయి.

మన పెళ్ళి ఆచారాలకు మూలకారణం ఏదైనప్పటికీ, అవి ఆటవిక సంస్కృతికి చెందినవని స్పష్టంగా కనబడుతుంది.

అక్షింతలు చల్లటమూ, తలంబ్రాలు పోసుకోవటమూ అలాటిదే. అందుకు ఉపయోగించే బియ్యం భూతబలి అని ఆటవికులు భావించేవాళ్ళు. వధూవరులు తలంబ్రాలు పోసుకుని, డమడమా వాద్యాలు వాయిస్తే వారిని ఆవేశించి ఉన్న భూతాలు తృప్తిపడి, భయపడి పారిపోతాయని. అక్షింతలలో కుంకం కలపటం అవి రక్త భోజనంలాగా కనిింపించటానికేమో! పెళ్ళి కాగానే వధూవరులమీద బియ్యం చల్లే ఆచారం ఈనాడు పాశ్చాత్యదేశాలలో కూడా ఉన్నది.

కొన్ని సందర్భాలలో సంతానవృద్ధి కోరి కూడా బియ్యం చల్లటం ఉన్నదట. అసలు ఆశయం ఏదైనా ఇది ఆటవిక ఆచారమన్నది నిజం.

సాధారణంగా ఆటవికులలో వివాహాలు చీకటిపడేటప్పుడూ, రాత్రివేళా

జరుగుతాయట (మనకుకూడా రాత్రి ముమూర్తాలు పరిపాటే, కాని దక్షిణ ప్రాంతంలో పెళ్ళి ముహూర్తాలు ఉదయంపూట ఉంటాయి) చీకటిలో దృష్టి దోషం తక్కువగా వుంటుందనో, పెళ్ళితంతులో ''మిస్టరీ'' హెచ్చుగా వుండటానికో చీకటి పెళ్లిళ్లు చేస్తారు వధూవరుల ''సిగ్గు'' బయటపడకుండా చీకటి తోడ్పడుతుంది

వధూవరులను పెళ్లికి ముందు చాటుగా వుంచుతారు దాస్తారుకూడా. ముసుగులు వేస్తారు. కొన్ని జాతులలో వరుడు, వధువుకోసం కటిక చీకటిలో వెతికే ఆచారంకూడా వున్నది. పాతకాలపు స్పార్టాలో భార్యభర్తలు గాఢాంధకారంలోనే కాపురంచేసి, కొంతమంది బిడ్డలు కలిగాక గాని ఒకరి మొహం ఒకరు చూసుకొనేవారు కాదట! (జానపద కథలలో ఈ ఆచారాలు కొన్ని మార్పులతో కనిపిస్తాయి. ఒక ఆడదానికి ఏ మేకపోతునో, పామునో పెళ్ళిచేస్తారు. లేదా రాజకుమారుడు ఎలుకను పెళ్ళాడతాడు రాత్రిపూట వాళ్ళకు మనిషిరూపం వస్తుంది. కానీ ఈ రహస్యం పైవాళ్లకు తెలిస్తే భార్యాభర్తలకు వియోగం తప్పదు. దానికి గడువు ఏదో ఉంటుంది. మరొక ఆచారమేమంటే వరుడు తన వధువును అనేకమంది స్త్రీలమధ్య గుర్తించాలి.)

ఈజిప్టులో వివాహతంతు అయేదాకా వరుడు వధువు ముఖం చూడడు. (మనవాళ్లకూడా పెళ్ళిపీటలమీద వధూవరులకు మధ్య కాస్సేపు తెర ఒకటి అడ్డం పెడతారు. ఎందుకో తెలీదు. వధూవరులు ముందుగానే ఒకరి నొకరు చూసుకొని ఉంటారు. కట్నాలూ, కానుకలూ సెటిల్ అయిపోయికూడా ఉంటారు). పర్షియాలో గర్భదానం అయినాకనే భర్త భార్య మొహం చూస్తాడు.

మొరాయికో పెళ్ళికి ముందే విందు జరుగుతుంది. ఆ సమయంలో వధూవరులను ఒక సింహాసనంలాంటి దానిమీద కూర్చోబెడతారు. ఆ విందు (బూజం బంతి) లో అందరూ మహోల్లాసంలో ఉంటే వధువు కళ్ళు మూసుకుని నిశ్చలంగా ప్రతిమలాగా ఉండిపోతుంది. ఆమె ఆ కళ్ళు తెరిచేది పాన్పుమీదనే. ఆమెకు ముసుగు కూడా ఉంటుంది. జూలూ భార్య భర్తతో ఇంటికి వెళ్ళేటప్పుడు గుంపు మధ్య , ఎవరికీ కనబడకుండా దాక్కుని పోతుంది.

''పాణిగ్రహణం'' కూడా ఆటవిక ఆచారమే. మనం దాన్ని పెళ్ళికి పర్యాయపదంగా వాడుతాం. స్త్రీ పురుషులు చేతులు పట్టుకుంటే అది పెళ్ళేనని చెప్పినవాడు మన పురాణాలలో రాక్షస గురువు శుక్రాచార్యులు.

సాంతార్ వధువును తొట్టిలో పెట్టి తెస్తారు. ఈ పని చేసేది వధువు మేనమామ అవునో కాదో తెలీదు. మిలానీస్ వధువును చాపలతో చుట్టి, ఆమె ముఖానికి తాటాకు విసనకర్ర అడ్డం పెట్టి ఎవరో ఒకరు మోసుకొస్తారు. కీట్ జాతిలో వధువు పెళ్ళి అయినంతసేపూ వంచిన తల ఎత్తరాదు. ఈ ఆచారాన్ని మనం ''సిగ్గు'' కింద పరిగణిస్తాం. ఈ ''సిగ్గు'' లాంఛనప్రాయమైనది. కాని అసలు ఆచారం వెనక వున్న

అభిప్రాయం భయం - పెళ్ళికూతురి చూపులు పెళ్ళికొడుక్కు హానికలిగిస్తాయని!

పెళ్లికొడుకు దృష్టి పెళ్ళికూతురికి తగలకుండా మేలిముసుగు వేస్తారు. ఈ ఆచారం పాశ్చాత్య దేశాలలో ఇప్పటికీ ఉన్నది ఇథియోపియాలో పెళ్ళికూతురుపైన గుడ్డ ఆచ్ఛాదనం ఏర్పాటు చేసి తీసుకుపోతారు కొందరు గొడుగు అడ్డం పెడతారు. ఈ రెండు ఆచారాలూ మన దేశంలో ఉన్నాయి.

పెళ్ళికూతురికి పెళ్ళికొడుకు భయం ఎంతదాకా పోతుందంటే ఒక జాతిలో పెళ్ళికూతురు అడవిలోకి పారిపోయి, పులుల భయంకన్న భర్త భయం యెక్కువని నిరూపిస్తుంది గర్భదానమప్పుడు పెళ్ళికూతురు పారిపోకుండా మంచానికి వేసి కట్టడమూ, తొలి సమాగంలో ఆమె చావు కేకలు పెట్టటమూ మొదలైన విషయాలు నా చిన్నతనంలో విన్నాను.

ఇంకొక ఆచారం పెళ్ళివారికి మహారాజుల్లా జరపటం. మరోదేశంలో అతి పేదవాళ్ళుకూడా ఉభయ పక్షాలవారూ రాజుల్లాగా ప్రవర్తిస్తారు. వధూవరులను రాజదంపతుల్లాగా చూసి, వారి ఆజ్ఞలు పాలిస్తారు. మనదేశంలో కూడా కొందరు పెళ్లికొడుకులకు కిరీటాలూ, తురాయిలూ పెట్టి గుర్రాలమీద తేవటం ఉన్నది.

''తోడు పెళ్ళికూతురు'' ఆచారం కూడా ఆటవికులదిగానే కనిపిస్తుంది. బేనీ అనే జాతిలో పెళ్ళికొడుకు తన మిత్రులతోసహా పెళ్ళికూతురిని చూడవచ్చినప్పుడు, వాడికి ''మాయ పెళ్ళికూతురు''ను చూపి, వేళాకోళా లాడతారు. ఇదే మనలో ''వరసలాడటం'' కావచ్చు.

వివాహం జరిగే చోటును ''పొదరిల్లు''లాగా తయారు చెయ్యటం ఆటవిక ఆచారం. ఇది ఆధునిక పద్ధతిలో దక్షిణ ప్రాంతాలలోకూడా ఉన్నది తెలుగువాళ్లకూడా అరటి చెట్లూ, మామిడాకు తోరణాలూ కట్టి వివాహం ఏ ''వనం'' లోనో జరుగుతున్న అభిప్రాయం కలిగిస్తారు

వధూవరుల జాతకాలు పోల్చి చూడటం వెనక ఆటవిక భయం ఉన్నది. దక్షిణ దేశంలో జాతకాలు కలవటం ముందు ఏ ఇతర విషయాలూ ఎక్కిరావు, వధూవరులకు అన్ని విధాలా జోడు కలిసినాసరే! జాతకాలు కలవకపోతే ఆ పెళ్ళి జరగదు. ఒక ఆడదానికీ, మగవాడికీ ముడిపెట్టడానికి గ్రహాలు కూడా అనుకూలించాలి !

అసలు పెళ్ళికి ముందు చెట్లకు పెళ్ళి చెయ్యటం కూడా భయం నుంచే. ఇద్దరు పెళ్ళాలు పోయినవాడికి ఏ అరటి చెట్టుతోనో పెళ్ళి చేసి, దాన్ని నరికి, నాలుగో పెళ్ళి చేస్తారు!

వెనుకటి అయిదురోజుల పెళ్లిలో నాగవల్లినాడు ''దండాడింపు'' అనేది ఉండేది. ముండా జాతివాళ్ళు పెళ్ళి అనంతరం ''ఉత్తుత్తి యుద్ధం'' చేస్తారు. దండాడింపు ఆటవిక ఆచారం.

ఇంకొక వింత ఆచారం, ఆర్మేనియాలో యువతీయువకులు స్వేచ్ఛగానే తిరిగేవాళ్ళు, ప్రేమించుకొనే వాళ్లకూడా. కాని పెళ్ళి నిశ్చయమైనాక ఆడపిల్ల అందరితోనూ మాట్లాడదు, బావ పేరు చెప్పదు. అతని గురించి ఇతరులతో మాట్లాడవలసి వచ్చినా బిడయపడుతుంది.

ఫిజీలో ''పాణిగ్రహణం'' ప్రధానం కింద జమ పాణిగ్రహణం తరువాత పెళ్ళి జరిగితీరాలి. చేతులు కలపటమూ, వివాహ కాలంలో భార్యను భర్త ముద్దు పెట్టుకోవటమూ స్పర్శకు సంబంధించిన నిషేధాన్ని తొలగించటమన్నమాట. వధూవరులమీద ఒక బట్ట కప్పటమూ, ఇద్దరూ కలసి భోజనం చెయ్యటమూ నిషేధం తొలగింపు చర్యలే !

వధూవరులు కలిసి భోజనం చెయ్యటం కొన్ని జాతులలో అతి ముఖ్యమైన తంతు. ఆడది పెళ్ళి సమయంలో తప్ప అంతకుముందుగాని, అటుతరువాతగాని మగవాడితో కలసి భోజనం చెయ్యదు. కానుకలు కూడా ఒకరకమైన స్పర్శే. అవే ఆధునిక కాలంలో కన్యాశుల్కంగానూ, వరశుల్కంగానూ మిగిలిపోయాయి. కన్యాశుల్కం పోయింది గాని వరశుల్కంపోలేదు. కానుకలలో ఉండే ''మత'' సంబంధమైన అంతరార్థం అడుగంటి ఆచారం మిగిలిపోయింది.

వివాహవిధితో భార్యాభర్తల మధ్య ఉండే నిషేధాలు తొలగిపోయినా, నిషేధకారణాలు చెక్కు చెదరకుండా ఉంటాయి. ఆటవిక దశలో పెళ్ళిద్వారా ఏర్పడే బంధుత్వాలలో ఇవి కొట్టవచ్చినట్లు కనబడతాయి. అల్లుడికీ, అత్తగారికీ ; కోడలికీ, మామగారికీ మధ్య ఉండే నిషేధం బలవత్తరమయినది. కొన్ని జాతులలో పెళ్ళి అనుకున్న దగ్గరనుంచీ ఈ బంధుత్వాలు గలవాళ్ల ఒకరినొకరు తప్పుకు తిరుగుతారు. న్యూసౌత్‌వేల్స్‌లో ఇలా చెయ్యటం పెళ్ళి తరువాత జరుగుతుంది విక్టోరియా రాష్ట్రంలో పెళ్ళికూతురి తల్లీ, పినతల్లులూ, పెత్తల్లులూ పిల్ల మొగుడుతో జన్మలో మాట్లాడరు; అతడి కేసి చూడనైనా చూడరు. వాడు కూడా అత్తగారి పేరు నోట ఉచ్చరించడు.

జూలూ జాతిలో వధువుకు తన అత్తవారి వధువరులతో ఎలాటి సంబంధమూ లేదు – ఆమె మనసులో కూడా వాళ్ళ పేరు తలచరాదు. అల్లుడు అత్తవారి సమక్షంలో ఉండరాదు. ఆమె ఉన్న గుడిసెలో తాను వుండరాదు – ఆమెను పలకరించరాదు, చూడరాదు. ఆమెతో కలిసి భోజనం చెయ్యరాదు. ఇద్దరూ ప్రమాదవశాన ఎదురైతే అత్తగారు ముఖం కప్పుకొని, రొమ్ములు బాదుకుంటుంది. ఇద్దరిమధ్యా రాయభారం జరగాలంటే మూడోమనిషి ద్వారానే జరగాలి.

మేరీనా ప్రాంతంలోనూ, ఋశ్యాదేశంలోనూ ఉండే జాతులలో అల్లుడు అత్తగారికేసి చూడటం శిక్షార్హమయిన నేరం.

  

పర్యవసానంగా మనం తెలుసుకోవలసినది ఏమిటంటే, మనం ఎంత నాగరికత అభినయిస్తున్నా మన ఆచారాలు అనేకం ఆటవికదశకు చెందినవి. ఆ సంగతి మనం గుర్తించటం లేదు. వాటిని పాటించటానికి ఆటవికులకు వుండిన కారణాలు మనకు వుండటం లేదు వాటిలో ఎప్పుడన్నా అర్థం ఉన్నట్టు కనిపిస్తే అది స్వార్థంగా రుజువవుతుంది.

అన్నిటినీ మించిన ఆటవిక పశుత్వం మనం ఆడవాళ్ళపట్ల కనబరుస్తున్నాం. స్త్రీ పురుషుల మధ్య ఆటవిక దశలో పాటించిన శత్రుత్వం, అనాగరిక దశలోనూ, ఫ్యూడల్ దశలోనూ, ధనస్వామ్య దశలోనూ వేషాలు మార్చుకున్నప్పటికీ తొలగిపోలేదు సామ్యవాద దశలో తప్ప దీనికి ఉద్వాసన జరిగేటట్లు కనబడదు. దయాధర్మ భిక్షంగా స్త్రీలకు ఏవో హక్కులిస్తామని మగ మహారాజులు ముందుకు రావచ్చు కానీ స్త్రీలపట్ల కొంత నాగరికంగా ప్రవర్తించి, సంఘాన్ని సంస్కరించటానికి ముందుకొచ్చిన వాళ్ళు సమాజంతో హోరా హోరీ యుద్ధం చెయ్యవలసి వచ్చింది ఇంతకీ మత విశ్వాసాలు చాలా బలంగానే ఉంటున్నాయి ఇది తెలుసుకోవడం అందరికీ మంచిది. మనం పురోగమించాలనుకుంటున్నాం. స్త్రీలపట్ల పురోగమించటం మన చేతిలో ఉన్నపని.

*ముద్రణ: జయశ్రీ, మాసపత్రిక, జనవరి 1972*

# 3. ఆటవిక దశలో ఆడది

మనది చాలా విచిత్రమైన జాతి. పురోగామి దేశాలు గతంనుంచి సాధ్యమైనంత వేగంగా ముందుకు పోవాలనుకుంటూంటే, మనం గతాన్ని (తప్పుగా) స్మరించుకుని, నిట్టూర్పులు పుచ్చుతాం. ఒకానొక స్వర్ణయుగం నుంచి అంతకంతకూ దూరమైపోతున్నట్టు బాధపడతాం. ''ప్రాచీనం'', ''సనాతనం'' అన్న పదాలు మనకు పవిత్రతను సూచిస్తాయి. జబ్బువాళ్ళకు పుష్టిగల ఆహారంపైన భ్రాంతి వుండదు. వాళ్లు పాత చింతకాయపచ్చడిని, పాత ఉసిరికాయ పచ్చడిని గురించి పలవరిస్తారు. మనది జబ్బు జాతి.

దేనిని పునరుద్ధరిద్దాం – ఋషులూ ఋషిపత్నుల చెలగాటాలా ?

జాతీయోద్యమ భావాలు దేశంలో తల ఎత్తినప్పుడు మన సనాతనాచారాలను పునరుద్ధరించాలని ఒక నినాదం బయలుదేరింది ''మనం దేన్ని పునరుద్ధరించుదాం? ఆనాటి దేవుళ్ళు నిషిద్ధ పదార్థాలు తిన్నారు, తాగారు. పన్నెండు రకాల పుత్రులను, ఎనిమిది రకాల వివాహాలనూ పునరుద్ధరిచుదామా ? వితంతువులు తమ మరుదులకు పిల్లలను కనే నియోగపద్ధతిని పునరుద్ధరించుదామా? వివాహబంధంలో పాతకాలపు ఋషులూ, ఋషిపత్నులూ ఆడిన చెలగాటాలు పునరుద్ధరించుదామా? వారిలో ద్విపాత్నులు కూడా

బలి పశువులే!'' అన్నాడట రానడే.

ఇదంతా ఎవరు చెవిన పెట్టుకున్నారో తెలీదు పునరుద్ధరణవాదులు మాత్రం జాతీయోద్యమంలో పెద్దపాత్రే వహించారు స్వరాజ్య సాధనకు హిందూ మహాసభ కృషి చేయలేదని ఎవరూ అనలేరు.

''మంచి గతమున కొంచెమేనోయ్'' అన్నాడు మన అమరకవి గురజాడ ఆ మాట నమ్మినవాళ్ళ మన వెంట గతం యింకా ఎంత ప్రమాణంలో ఉన్నదో తెలుసుకోవడం అవసరం. అది చాలా భారీ పరిశ్రమ. ప్రస్తుతానికి స్త్రీ పట్ల మన సమాజం వైఖరిలో ఆటవిక లక్షణాలు ఏపాటి ఉన్నాయో టూకీగా చూద్దాం - ఇది మహిళా సంవత్సరం గద.

## వైదిక సూత్రాలూ, మతాచారాలూ అన్నీ ఆటవిక ఆచారాలే!

ఈ వ్యాసంలో నేను తీసుకున్న ఉదాహరణలన్నీ ఎర్నెస్ట్ క్రావీ రచించిన ''ది మిస్టిక్ రోజ్'' అన్న గ్రంథం లోనివి. ఈ ఉదాహరణలు ఆటవిక జాతులనుంచి తీసుకొన్నవి. ఆటవిక జాతులవాళ్ళ హెచ్చుగా వేటమీదా, కొద్దిగా పశుపోషణమీదా, ఆహారోత్పత్తిమీదా ఆధారపడినవాళ్ళ ముఖ్యంగా పురుషులు వేటలోనూ, యుద్ధాల లోనూ కాలం గడిపేవాళ్ళు. వారి సమాజాలు పురుష ప్రధానమైనవి. వారి ఆచార వ్యవహారాలు దాటరానివే అయినా, అవి మతం అనిపించుకోవు. సంస్కృతిలో ముందుకుపోయిన జాతులు ఆ ఆచారాలను వదులుకోని పరిస్థితిలో వాటిని మతాచారాలుగానూ, వైదిక సూత్రాలుగానూ పరిగణించారు. ఆధునికులు వాటికి ఏ పేరు పెట్టి ఎలాటి ఘనత అంటగట్టినా అవి ఆటవిక ఆచారాలే నన్నవి గుర్తుంచుకోవాలి.

ఇంకా గుర్తుంచుకోవలసిన ఒకటి, రెండు విషయాలు ప్రస్తావించి అసలు సంగతికి వస్తాను.

## ఆధునిక యుగంలో 'ఆటవిక' భయాలు :

ఒకటి - అది మానవుడి జీవితాన్ని బలంగా శాసించినది భయం . ''భయం! భయం ! బ్రతుకు భయం !'' అన్నది ఆదిమ మానవుల జీవితాలకు పూర్తిగా వర్తిస్తుంది. (అలాటి భయం బ్రతుకులు ఈడ్చేవాళ్ళు ఆధునికయుగంలో ఉంటే, వారింకా ఆటవిక యుగంలోనే వున్నారనీ ఆధునిక నాగరికత మధ్యలో ఆటవిక దశ మనగలుగుతున్నదనీ, మనం నిక్షేపంగా అనుకోవచ్చు.)

## 'అజ్ఞానం' లోంచే ఆటవిక భయాలు :

ప్రత్యక్షంగా కనపడేదీ, కనపడనిదీ కూడా ఆది మానవుణ్ణి భయపెట్టింది. ఆ

మానవుడు తనను కోట్లాది దుష్టశక్తులు దృశ్యంగానూ, అదృశ్యంగానూ చుట్టుముట్టి ఉన్నట్లు భావించుకునేవాడు ఈనాడు మనం కూడా ఏది మూఢ విశ్వాసమో, ఏది హేతుబద్ధమైన విశ్వాసమో తెలుసుకునేటందుకు శాస్త్ర విజ్ఞానాన్ని ఉపయోగిస్తాం. ఆనాటి ఆటవికుడికి అలాంటి శాస్త్ర జ్ఞానం లేదు. నేను ''మైక్రోల్స్ బైడిమిలియన్'' అన్న శాస్త్ర గ్రంథం చదివినప్పుడు హడలిపోయాను. సర్వత్రా అన్ని రకాల రోగ క్రిములు పిలపిల లాడుతూంటే ఏ మనిషిగాని ఎంతో కొంత కాలం ఎలా ఆరోగ్యంగా బతకగలుగుతున్నాడా అని నాకు ఆశ్చర్యం వేసింది. తరువాత తెలిసింది, ప్రకృతిలో అర్బుదాల సంఖ్యలో రోగ క్రిములున్నా మనిషి దేహంలో రోగ నిరోధక శక్తులున్నాయనీ, వాటిని పెంచుకోవచ్చుననీనూ.

అలాగే ఆధునిక మానవుడు అనేక వేల ఏళ్ళుగా పోగు చేసిన శాస్త్ర విజ్ఞానం అతన్ని ఆటవిక దశ నుంచి భయం నుంచి దూరం చేసింది ఎంతవరకు ? ఆ ప్రశ్నకు సమాధానం వేరే వెతుక్కోవాలి.

## మూల భయాలలో 'స్పర్శ' భయం ఒకటి :

రెండు – ఆటవిక మానవుణ్ణి బాధించిన భయాలకు మూల కారణమైనది స్పర్శ ఒకటి. ఎవణ్ణి తాకితే, దేన్ని తాకితే ఏం ప్రమాదమో ? స్పర్శ ప్రత్యక్షమైనది. దాని ద్వారా సంక్రమించే ప్రమాదం అప్రత్యక్షమైనది. కానీ రెంటికీ తేడా ఎరుగడు ఆటవిక మానవుడు. భూతాలు కీడు చేస్తాయి. చేతబడుల ద్వారా రోగాలూ, చావులూ కలిగించవచ్చు. తన ఆయుధాలు మరొకడు తాకినా ఆటవిక మానవుడు భయంతో తల్లడిల్లిపోయేవాడు మన శ్రోత్రియులు పాటించే మడీ, మనమంతా పాటించే రకరకాల అస్పృశ్యతా ఆటవికం కాదంటారా ? వీటికి మతాచారాలనీ, సాంఘిక నియమాలనీ పేరు పెట్టినంత మాత్రాన ఆటవికుల భయం నుంచి పుట్టినవి కాకపోవు. ఇందులో ఏదో శాస్త్ర దృష్టి వున్నదనీ, శౌచం కోసం అలాంటివి ఏర్పాటయాయనీ సమర్థించేవారున్నారు. మామూలు బట్టల్లాగే ఉతికి ఆరేసిన మడి బట్టకు ''టాబూ'' (పవిత్రం) ఎలా వుంటుంది ? నేను ప్రమాదవశాన దాన్ని తాకగానే ఆ బట్టకుండిన శుచిత్వం అంతా ఎలా ఎగిరిపోయింది ? ''రోజుకు మూడు స్నానాలు చేసే హిందూ బ్రాహ్మడు తన ఇంటిని సదరు అనారోగ్యంగా ఉంచటానికి జంకడు'' అన్నాడొక పాశ్చాత్యుడు. ఏమైనా శౌచ స్నానాలు నిష్ఠాపరులైన బ్రాహ్మణులలోనే కాదు. ఆటవికులలో కూడా ఉండేవన్నది మరచిపోరాదు !

## వ్యక్తివాదానికి పుట్టిల్లు ఆటవిక సమాజం :

మూడు – మనం ఈనాడు చాలా ఘనంగా ఆరాధించే వ్యక్తివాదం, అధునాతన

భావం అన్నది పెద్ద పొరపాటు ఆటవిక సమాజం వ్యక్తి వాదానికి పుట్టినిల్లు. ఆటవికులు చచ్చిపోతే వాళ్ళ సొంత వస్తువులను వాళ్ళతో పాతేసేవాళ్ళు. అవి ఇతరులకు పనికిరావు! నిజమైన ఆధునిక భావాలు సోషలిజం, కమ్యూనిజం – వ్యక్తివాదం కానే కాదు !

  

వైషమ్యాల పుట్ట ఆదిమ జీవితం . నిజం చెప్పాలంటే అడవి మానవుడు తనను తాను నమ్మినట్టుగా మరెవర్నీ నమ్మలేడు. ప్రకృతిలో అణువులు, ఏక కణాలు ఏర్పడిన విధంగా ఈ వ్యక్తివాదం నుంచి మానవుల వర్గీకరణ ఏర్పడింది. అందులో స్త్రీలూ పురుషులూ వేరువేరు వర్గాలు వాటి మధ్య వైషమ్యం ఉండేది విధిగా ఐక్యతతో కూడా వుండేది ఈ వైషమ్యం. ఈనాటికీ మతాచారాల రూపంలో నైతేనేం, సామాజిక కట్టుబాట్ల రూపంలో నైతేనేం. ''నాగరిక'' ప్రపంచంలో ఉండనే ఉన్నవి. అవి ఎంతవరకు మిగిలి ఉన్నవనేది ఈ క్రింది ఉదాహరణలను బట్టి ఎవరికివారు తేలికగా నిర్ణయించుకోవచ్చు. తమ జీవితాలలో లేనివి ఎక్కడా లేవన్న పొరపాటు ఎవరూ పడవద్దు. అన్ని రకాలకూ స్థలం ఉన్న మన దేశంలో అన్ని రకాల పాశవిక ఆచారాలకూ చోటున్నది.

''పరిసరాల ప్రభావమూ, బోధనా లేనంతవరకూ అందరూ ఆటవికులే'' అంటారు క్రావీ. అవి ఎంతవరకూ లోపించాయో ఆ మేరకు మనమంతా ఆటవికులమే మరి.

''భయం'' దూరంగా ఉండాలంటే కొన్ని నిషేధ ప్రక్రియలు కావాలి. పొద్దున్నే సంధ్య వార్చుతూ బ్రాహ్మడు ''ఉత్తిష్ఠంతు భూత పిశాచాః'' అంటాడు. ప్రతి ఆటవిక జాతికీ ఇలాటి మంత్రం కొటి తప్పక ఉండే ఉంటుంది. దిష్టి బొమ్మలూ, తాయెత్తులూ, శాంతులూ, పుణ్యాహవచనాలూ మొదలయినవన్నీ భయాన్ని దూరం చెయ్యటానికే. భయ కారణం గురించిన శాస్త్రీయ జ్ఞానమూ, వాటిని శాస్త్రీయంగా నిరోధించే మార్గాలు లేనంత కాలమూ అవి చిరంజీవులే.

## పెక్కు సామాజిక కట్టుబాట్లు ఆటవిక వారసత్వమే :

ఇక ఆటవిక దశలో స్త్రీల స్థితి గురించి తెలుసుకుందాం.

నిత్య దైహిక కర్మలు రహస్యంగా జరపటమనేది ఆదికాలం నుంచీ వస్తున్నది. అవి జరిపేటప్పుడు వ్యక్తి అపాయానికి మరింతగా గురి అవుతాడన్న భావం ఆదిలో ఉండేది. అది నాగరికతలో ''సంఘమర్యాద'' అనిపించుకున్నది. కొన్ని సందర్భాలలో మతాచారం అయింది. భోజనం చేసేటప్పుడు పైవాళ్ళు చూడరాదన్న భావం అందరికీ ఉండొచ్చు; కానీ బ్రాహ్మణులు దాన్ని బాగా శ్రోత్రియం చేశారు. ఆ బ్రాహ్మణులు

చూడటం వారికి సమ్మతం కాదని కొందరు ఊహించినది సరికాదేమో ! బ్రాహ్మణులు ''బాగా '' తినటం మధ్య యుగంలో వచ్చినది; తిండి తినేటప్పుడు రహస్యంగా తినడం ఆటవికుల నుంచి నేరుగా సంక్రమించినది. చాలా మతాచారాలలోనూ, అనేక సామాజిక కట్టుబాట్లలోనూ ఆటవిక వారసత్వం స్పష్టంగా కనబడుతుంది.

'' నిషేధాలు'' ఆటవిక దశలో స్త్రీల విషయంలో ఎలా ఉండేవో చూద్దాం.

## ఆడదాని జీవితంలో ముఖ్య ఘట్టాలు - విధి నిషేధాలు :

ఆడదాని జీవితంలో పర్వ ఘట్టాలు - రజస్వల కావడం, గర్భవతి కావడం, బాలింతరాలు కావడం.

కారొ్వైన్ దీవులలో గర్భవతి అయిన భార్యతో భర్త కలిసి భోజనం చెయ్యడు. తోడా స్త్రీలు అయిదు నెలలు నిండగానే ప్రత్యేకమైన గుడిసెలలో చేరిపోతారు. ఆదిమ జాతులలో ప్రసవ సమయంలో స్త్రీలు మాత్రమే దగ్గరుండాలి. బిడ్డ పుట్టినాక తండ్రి భార్యను గానీ, బిడ్డను గానీ నాలుగు రోజులపాటు చూడరాదన్నది బసూటోల ఆచారం. బాలింతరాలులో పవిత్రతా, మైలా కూడా ఉంటాయి. ఆ మైల శౌచ స్నానంతోగాని పోదు.

## రజస్వల అనంతరం :

రజస్వలకు సంబంధించిన నిషేధాలుకూడా ఉన్నాయి. ఈ స్థితిలో స్త్రీ పురుషుణ్ణీ, పురుషుడు స్త్రీనీ చూడరాదు. చిరిగ్వానా స్త్రీలు రజస్వల అయినప్పుడు ఎడంగా ఉండి, ఉపవాసాలు చేస్తారు. దుష్ట పిశాచాలు కన్యలతో మొదట సంగమించటంచేత గాయం అయి రక్తస్రావం కలుగుతుందని, అది నెల నెలా వచ్చి చేస్తూంటుందని సయాంని ఆదిమవాసుల నమ్మకం.

బహిష్టు సమయంలో స్త్రీ పురుషులు యెడంగా ఉండటం సర్వ సాధారణం. ముట్టయిన ఆడదాన్ని తాకికే రోగం వస్తుందని ప్ల్యాబ్లో ఇండియనుల నమ్మకం. మావోరీ పురుషులు ముట్టుదాన్ని తాకరు, ఆమెతో పడుకోరు, ఆమె మాట వినరు. పాపువాకు చెందిన మైలూజాతి స్త్రీలు ముట్టయినప్పుడు ఎడంగా ఉంటారు. ఆస్ట్రేలియా ఆటవికుడు ముట్టయిన తన భార్య తన కంబళి మీద నిద్రపోయిందని తెలిసి, ఆమెను చంపటమే గాక, రెండువారాలు గడిచేసరికి భయంతో తానూ చచ్చాడుట! ముట్టయిన స్త్రీలకు సంబంధించిన నిషేధాలు మనుస్మృతిలో కూడా ఉన్నాయట.

## స్త్రీల స్పర్శ అంటేనే పురుషులకు భయం :

మగవాళ్ళ సరసన ఆడవాళ్లు కూర్చోరాదని, ఆడవాళ్లు మగవాళ్లతో కలిసి

నడవరాదని మనలో ఆచారం ఉన్నది. అది స్త్రీలు మగవాళ్ళకు చూపే గౌరవంగా మనం భావిస్తాం. కాని అది దాటరాని ఆటవిక ఆచారం; మహాదోషం ; బలమయిన నిషేధం; శాండ్విచ్ దీవులలో స్త్రీలకు వేరే ఇళ్ళుంటాయి వారు వేరే వుంటారు. మార్క్వెసాస్ దీవులలో మగవాళ్ల సమావేశమై, హెచ్చుకాలం గడపటానికి ఉపయోగించే ప్రదేశానికి ఆడవాళ్ళు వచ్చి, దాన్ని ''మైల'' పరచకూడదు. అలా చేస్తే మరణ దండనే !

నుకుహివ దీవులలో ప్రముఖుల ఇళ్లలో వారి భార్యలకు కూడా ప్రవేశం లేదు. వాళ్లకు ప్రత్యేకమైన గుడిసెలు ఉంటాయి. మావోరి నాయకుడి ఇంట ఆడది అడగు పెట్టరాదు ఫిజియనులు తమ భార్యల ఇంట నిద్రచేస్తే వాళ్ళ పరువు పోతుంది; ఆ జాతిలో భార్యా భర్తల మూడోకంటికి తెలియకుండా అడివిలో ఎక్కడో సంకేతం ఏర్పరుచుకుని, అక్కడ రహస్యంగా కలుసుకుంటారట! న్యూ కాలిడోనియాలో భార్యలూ, భర్తలూ వేరువేరు ఇళ్ళలో నిద్రపోతారు. స్త్రీ పురుషులు ఇతరులు చూస్తూండగా సాధారణంగా మాట్లాడుకోరు. యాప్ దీవిలో సమష్టి గృహాలుంటాయి; అందులో ఒక చివర పురుషులకు విడిగా గదులుంటాయి – ''పురుషులకు ప్రత్యేక స్థలం''. న్యూ బ్రిటన్‌లో ప్రతి గ్రామంలోనూ రెండేసి పెద్ద ఇళ్లుంటాయి – ఒకటి స్త్రీలకూ; మరొకటి పురుషులకూ; ఒకరి యింట మరొకరు ప్రవేశించరాదు. సాలోమన్ దీవులలో స్త్రీలు పురుషుల ''పవిత్ర'' గృహాలలో ప్రవేశించరాదు సరేగదా, వాటి ముందుండే సముద్రతీర ప్రాంతం మీదుగా నడవరాదు కూడా. కాంబోడియాలో భార్య తన భర్త ఉపయోగించే దిండు గాని, పరుపుగాని తాను ఉపయోగించరాదు.

జూలూ జాతివాళ్ల తమ భార్యలను చాలా హీనంగా చూస్తారు. స్త్రీ పురుషులు కలిసి కనిపించటం అరుదు. భార్యా, భర్తా ఒకే చోటికి పోతున్నా, కలిసి వెళ్లరు. దక్షిణాఫ్రికాలోని బంటూజాతివాడు, తన కాళ్ళమీదుగా ఆడది దాటితే తాను పరుగెత్తే శక్తిని కోల్పోతాననుకుంటాడు. కప్పా భార్యా భర్తలు పగలు ఒకరి మొహం ఒకరు చూడరు, రాత్రి మాత్రమే కలుసుకుంటారు.

## స్త్రీలను అదుపు చేసేందుకు పురుషులు 'రహస్య' సంఘాలు :

స్త్రీ పురుష విభేదాలు ఒక్కొక్కప్పుడు తీవ్ర వైషమ్య రూపం దాల్చుతాయి. కాలిఫోర్నియాలోని (ఎర్ర) ఇండియనులు స్త్రీలను అదుపులో వుంచడానికి తీవ్రమైన చర్యలు తీసుకుంటారు. పోమో ఇండియనులు తమ భార్యలపై అధికారం నిలబెట్టుకోవడానికి నానా అగచాట్లు పడతారు; భార్యలను హడల గొట్టడానికి భర్త ''రాక్షసి'' లాగా నటిస్తాడు. టాటూ ఇండియను పురుషులకు ఒక రహస్యకూటమి

ఉన్నది ; వాళ్ల ఆడవాళ్ళను సరిఅయిన మార్గంలో ఉంచటానికి అప్పుడప్పుడూ నాటకాలాడుతారు, అందులో ప్రధాన పాత్రధారి పిశాచంలాగా వేషం వేసుకుని, ఆడ ప్రేక్షకుల మధ్య వచ్చి పడతాడు గ్వాలాలా ఇండియన్ జాతులవాళ్ళు కూడా ఆడవాళ్ళను అణచి ఉంచడానికి ఇలాటి నృత్యాలు చేస్తారు.

ఫ్యూజియన్ జాతిలో ఒక్కొక్కప్పుడు ఆడవాళ్ళదే పెత్తనం. అయితే పురుషులు తిరుగుబాటు చేసి, తమ అధికారాన్ని ప్రతిష్టించుకున్నారు. పురుషులు తిరుగుబాటుకు సంబంధించిన ఉత్సవం ''కీనా'' జరుపుకుంటారు ఆఫ్రికాలో కూడా ఆడవాళ్ళను అదుపు చెయ్యడం ఉన్నది. స్త్రీలనూ, పిల్లలనూ, బానిసలనూ అదుపులో ఉంచటానికిగాను సేటిగినీలో పురుషుల రహస్యసంఘం ఉన్నది. కొన్ని జాతులలో, పురుషులను ప్రతిఘటించటానికి స్త్రీల సంఘాలు కూడా ఉన్నాయి ; వాటిని చూసి పురుషులు భయపడేవారు.

స్త్రీ పురుషుల వర్గ వైరుధ్యం వ్యక్తమయ్యే మరొక అంశం ఏమంటే – పురుషులు మగదేవతలనూ, స్త్రీలు ఆడ దేవతలనూ ఆరాధిస్తారు ఒకవేళ హరప్పా నాగరికతలో అలాటి ఆచారం ఉండేదేమో! ఎందుకంటే అక్కడ లక్షల కొద్దీ ''అమ్మవారి'' బొమ్మలు దొరికినా, ముద్రికల మీదా, చెక్కడాలలోనూ ఒక్క స్త్రీ రూపం కానరాదు. ఏమయినా ఈనాడు మనవాళ్ల చేసుకునే వ్రతాలు నిజానికి అచ్చగా ఆడవాళ్ళవి. అలాగే మహారాష్ట్ర ప్రాంతంలో ఖండ్వా, భేతాళ వగైరా మగదేవతల ఛాయలకు ఆడవాళ్ళుపోరాదు.

గ్రీన్‌లాండ్ వాళ్ళు సూర్యుణ్ణి ఆడదిగానూ,చంద్రుణ్ణి మగవాడుగానూ పరిగణిస్తారు ; సూర్యగ్రహణ మప్పుడు పురుషులూ, చంద్రగ్రహణ మప్పుడు స్త్రీలూ ఇళ్ళలోనే ఉండిపోయి, బయిటికి రారు. (మన వైదిక సారస్వతంలో కూడా ''సూర్యా స్త్రీ'' గానూ, చంద్రుడు పురుషుడుగానూ చెప్పి ఉన్నది.)

స్త్రీ పురుషుల మధ్య ''పని విభజన'' అనాదిగా ఉన్నది. ఒకరి పనులు ఒకరు చేయరాదు. (ఈనాడు కూడా మగవాళ్ళు వంటచెయ్యడం మీదా, పిల్లలకు పాలు పట్టడం మీదా మనం యెన్ని కార్టూన్లు చూస్తున్నాంకాం ?)

నికరాగువాలో బజారు పనులన్నీ స్త్రీలే చూస్తారు. క్రయ – విక్రయాలు ఎలా జరుగుతాయోనని మగవాడు తొంగి చూసినా పట్టుకుని తన్నేస్తారు. ఆడవాళ్ళు విత్తులు నాటితేనే కాపు బాగా ఉంటుందని ఓరినోకో ఇండియనుల విశ్వాసం; ఆ పనిని మగవాళ్ళు చెయ్యరు. ఎస్కిమో ఆడవాళ్లు పెద్ద పడవలు నడుపుతారు; వాటిని మగవాడు నడపడం చాలా పరువు తక్కువ పని. మేరీబరో వాసులు తాము చేపలు పట్టే పరికరాల మీదుగా ఆడది దాటితే వాటిని అవతల పారేస్తారు. అలాటిదే జరిగితే ఒగాండా వాళ్లు పరికరాలను

''శుద్ధి'' చేస్తారు - బ్రాహ్మణ స్త్రీలు పనివాళ్ళ తోమి పెట్టిన పాత్రల మీద కాసిని నీళ్ళు చల్లి లోపల పెట్టినట్టు !

కాఫిర్ జాతివాళ్ళ తవు పశువులను ఆడవాళ్ళ తాకితే సహించరు. ఆగ్నేయాసియాలో స్త్రీలు పశువుల కొట్టాలలోకి అడుగు పెట్టరాదు. చాలా జాతులలో పురుషులే పాలు తీస్తారు మొరాకోలో ఉండే ఒక జాతిలో మగవాళ్ళు నీళ్ళ మోసుకు రావటం చాలా పరువు తక్కువ, కాని వాళ్లు తమ బట్టలూ, ఆడవాళ్ళ బట్టలూ కూడా ఉతుకుతారు.

మైథునం ఆరోగ్యకరవునీ, ఆయుష్షు వృద్ధి చేస్తుందనీ, సంపదను పెంపొందిస్తుందనీ ఉపనిషత్తులలో ఉన్నప్పటికీ, బ్రహ్మచర్యం చాలా పవిత్రమైనదనీ, సంతాన వృద్ధికోసం మాత్రమే స్త్రీ పురుషులు సంగమం చేయాలనీ మన సంస్కృతిలో పాతుకుపోయింది. ఇది ఆటవిక సంస్కృతినుంచి సంక్రమించిన విశ్వాసం. ఆటవికులు యుద్ధానికిగానీ, వేటకుగానీ బయలుదేరే ముందు భార్యలను కలవరు. చివరికి పందెపు కోడి పుంజులను కూడా స్త్రీలు తాకరాదు; తాకితే అవి గెలవవు. మరో జాతివాళ్ళు చేపల వేట తరుణంలో వారం రోజులపాటు బ్రహ్మచర్యం అవలంబిస్తారు. అస్సాంలో యుద్ధం చేసే సమయంలో స్త్రీలను కలవరు సరికదా, స్త్రీలు వండిన ఆహారం కూడా తినరు. మనవాళ్ళ ఉపవాసాలు ఏర్పాటు చేసినది, ఆడవాళ్ళ చేతికూడు తినకుండా వుండడానికి కాదు గద ?

*ముద్రణ: జయశ్రీ, మాసపత్రిక, జనవరి 1976*

# 4 స్త్రీల పట్ల నిషేధాలు

అన్ని నిషేధాల వెంబడి ఏదో ఒక విధమైన అస్పృశ్యత ఉంటుంది. నిషేధానికి కారణభూతమైన వైరుధ్యానికి ఒక పక్క ''పవిత్రతా'' రెండోపక్క ''మైలా'' ఉంటాయి. ఆటవికుల దృష్టిలో ''స్పర్శ'' అన్నదానిలో దృష్టి (దిష్టి) కూడా చేరుతుంది. అప్రత్యక్ష స్పర్శ - ఒకరి వస్తువులు తాకటం - కూడా వారిని తాకటం లాంటిదే. ప్రస్తుతం మనం ఆడవాళ్ళ ''మైల'' గురించి చెప్పుకుంటున్నాం.

నిషేధం భయం నుంచి పుడుతుంది. అదేవిధంగా ''స్పర్శ'' (నిషేధం తొలగింపు) స్నేహంనుంచీ, ప్రేమనుంచీ, సానుభూతినుంచీ పుట్టుతుంది. ఆడది ఎంత 'మైల' అయినా స్త్రీ పురుషుల మధ్య అప్పుడప్పుడు కావువూ, సంతానకాంక్షా కలగటంసహజం. కనక స్పర్శ తప్పనిసరి అవుతుంది! అంతమాత్రాన ఇతరత్రా ఆడదానికి వుండే మైలపోదు. నిషేధాలూ తప్పవు. కామ సంతృప్తికి కూడా వల్లమాలిన నియమాలు

అనేకం ఉంటాయి

కామంకన్న బలీయమైనది ఆకలిబాధ. తిండి దగ్గర స్త్రీ పురుషుల మధ్య అనేక నియమాలు పాటిస్తారు ఆటవిక జాతులవాళ్లు.

మధ్య ఆఫ్రికాలో ''మరువా'' జాతిలో స్త్రీ పురుషులు ఒకరు తింటున్నా, తాగతున్నా రెండోవాళ్ళు చూడరాదు స్త్రీలకూ, పురుషులకూ వేరువేరు పొయ్యిలూ, వంటాను లోకాంగో తీరవాసులలో ''వెంబా''సాక్షిగా పెళ్ళాడిన ఆడదే ధర్మపత్ని. భర్తకు వంటా ఇతరపనులూ చేసే హక్కు ''ఆదర్శపత్ని''కే ఉంటుంది నీగ్రోవాడి ఇతర భార్యలు ఆ పని చెయ్యరాదు.

మధ్య ఆఫ్రికాలో తూర్పు ప్రాంతంలో శీలం చెడిన భార్య తన భర్త ఆహారంలో ఉప్పు వేసి దాన్ని వాడుతింటే చస్తాడు – ఈ మూఢ విశ్వాసం ఆధారంగా అనేక సందర్భాలలో మగవాళ్ళ చావులకు భార్యలు కారణమని ఆరోపించటం జరుగుతుంది.

పశ్చిమ ఆఫ్రికాలో ''బ్రహ్మ'' జాతికి చెందిన స్త్రీ పురుషులు కలిసి భోజనం చెయ్యరు. ఈ నిషేధం ఇంకా అనేక ఆటవిక జాతులలో ఉన్నది. ''బేనీఅమెర్'' జాతిలో భార్య భర్త చూస్తుండగా తినదు. ''క్రుమెన్'' జాతిలో ముఖ్య భార్య మాత్రమే భర్తతో కలిసి భోజనం చేస్తుంది మధ్య ఆఫ్రికా తూర్పు భాగంలో ప్రతి గ్రామంలోనూ స్త్రీ పురుషులకు వేరువేరు భోజనశాలలుంటాయి.

ఈజిప్టులోనూ, అనేక అరబ్బీ జాతులలోనూ స్త్రీలు ''అపాంక్తేయులు'', ''బెనిగరిల్'' జాతివాడు చావనన్నా చస్తాడు గానీ ఆడదాని చేతి తిండీ, పానీయమూ తీసుకోడు. ''ఏమోయెడ్'' ఆడది తన భర్త పారేసినది మాత్రమే తినాలి సాందాల్ ఆడది మొట్టమొదటిసారిగా మగవాడితో సహా భోజనం చేసేది పెళ్ళిలోనే – అండమాన్ దీవులలో పెళ్ళిగాని మగవాళ్లు మగవాళ్ళలోనూ, ఆడవాళ్లు ఆడవాళ్ళలోనూ మాత్రమే భోజనం చెయ్యాలి చీనాలోనూ, కొరియాలోనూ ఆడవాళ్ళు మగవాళ్లకు వడ్డన చెయ్యొచ్చుగాని వాళ్ళతో కలిసి తినరాదు.

అమెరికన్ ఇండియనుల విందులలో మగవాళ్ళ భోజనాలు అయినాకనే ఆడవాళ్లు తింటారు. పిల్లలూ, కుక్కలూ వాళ్ళ పంక్తిలో కలుస్తారు. కాలిఫోర్నియా ఇండియనులలో స్త్రీ పురుషులు కలిసి తినరు సరేకదా, ఒకే పొయ్యిలో వంట చేసుకోరు. భార్య భర్త ఉచ్ఛిష్టం తినాలన్న నియమం ఆస్ట్రేలియాలో కూడా వుంది (ఇదంతా విస్తళ్ళ ఆదాకోసమని ఎవరూ భ్రమపడనవసరంలేదు). అనేక జాతులలో మగవాళ్ళ కన్న ముందు ఆడవాళ్లు తినడం నిషిద్ధం. మతం బలిసిన సమాజంలో దేవుడు అందరికీ మొగుడు కావడంచేత, దేవుడి నైవేద్యం అయేదాకా ఎవరూ తినరాదు.

''మావీ'' పురుషులు తమ వంట తమ ''సభాభవనం''లో చేసుకుంటారు. ఆడది చేసిన వంట ''మైల''. పిల్లలు మాత్రమే తల్లితోబాటు తినవచ్చు. పిజీలో భార్యాభర్తలే గాక, సోదరీ సోదరులు కూడా కలిసి భోజనం చెయ్యరు. ''రురుటువా'' స్త్రీలు మగవాళ్లతో కలిసి తింటే పిశాచం వాళ్ళను ఎత్తుకుపోతుంది! ''చో'' దీవిలో ఆడవాళ్ళకు మొగవాళ్ళు పులిస్తరాకులు పారేస్తారు.

న్యూజిలాండులో ప్రతి పురుషుడూ ఏకాంతంగా భోజనం చేస్తాడు. మిత్రులుగాని, స్త్రీలుగాని, బానిసలుగాని చూడరాదు. మగపిల్లలు తల్లులతో కలిసి తినరాదు. శాండ్విచ్ దీవులలో రాజుగారి భోజనశాలలోకి ఆయనగారి భార్యలు అడుగు పెట్టరాదు. ఆడది పుట్టినది మొదలు చచ్చేదాకా తన తండ్రి కంచం తగిలిన ఆహారం తినరాదు. సహజ ప్రేమలు అంటూ ఏమీలేవు ; బంధువర్గ భావాలు లేవు. మగ పిల్లవాడు తనంతట తాను తినగలిగినప్పటి నుంచీ తల్లి నుంచి వేరు చేయబడతాడు. వాడి ''తట్ట'' వాడికి ఏర్పాటవుతుంది. దేవుడికి నైవేద్యం పెట్టిన ప్రతి పదార్థమూ మగవాళ్ల తినవచ్చు; ఆడవాళ్ళు తాకితే అది మైల పడుతుంది మగవాళ్ళ వంటలకు ఉపయోగించేవి ''పవిత్రాగ్నులు''. వాటిని స్త్రీలు ఉపయోగించరాదు. (వేదకాలపు భావాలన్నీ మహోన్నత సంస్కృతినుంచి వచ్చాయనుకునేవారికి ఈ ఆటవిక జాతుల భావాలు కనువిప్పు కలిగిస్తాయా ?) ఆడపిల్లలూ, భార్యలూ తక్కువరకం తిండి తినాలి.

తాహితీలో ఆడవాళ్ళూ, మగవాళ్ళూ కలిసి తినరాదు. సోదరీ సోదరులు కలిసితిన్నా కొన్ని గజాల ఎడంలో కూర్చుని తినాలి; తినేటప్పుడు మాట్లాడుకోరాదు. తల్లితండ్రులూ, పిల్లలూ కలిసి సరదాగా కాలక్షేపం చెయ్యటమంటూ ఉండదు. రోగాలు రొష్టులు వచ్చినా ఈ నిషేధానికి తిరుగు ఉండదు.

భోజనం తరువాత మనిషికి ముఖ్యమయిన స్పర్శ మైథునం. అది భోజనానికి అనుబంధం. నాగరికుడి కన్న ఆటవికుడు తన దేహ కర్మలను చాలా గోప్యంగా ఉంచుకుంటాడు; వాటికి విఘ్నం కలుగుతుందని భయపడేవాడు. చాలా జాతులలో స్త్రీ పురుషులు మూడోకంటికి తెలియకుండా అరణ్యంలో సంకేతాన్ని ఏర్పరచుకొని అక్కడ కలుసుకుంటారు. ఉత్తర అమెరికాలో భర్తలు రాత్రిపూట భార్యల నివాసాలకు పోతారు ; పట్టపగలు చచ్చినా పోరు. పశ్చిమాఫ్రికాలో దంపతులు ఇళ్ళలోపల కాక, వెలుపలగాని, పొదలలోగాని మైథునం చేస్తూ ఎవరి కంటనైనా పడితే, వాళ్ళు చూసిన మనిషికి బానిసలు అయిపోవాలి; తరువాత వాళ్ళ వాళ్ళు వాళ్ళను విడిపించుకుంటారు.

నాగరికులకన్న ఆటవికులు సెక్సు సంబంధమైన విషయాలు మాట్లాడేటప్పుడు ఎక్కువ మర్యాద పాటిస్తారు. సాధు పదజాలం వాడతారు. వాళ్ళకు ''బూతు''

తెలియదు. బూతు మాటలు ఉపయోగించటం జరిగితే అది మత సంబంధమైన కోపోద్రేకాన్ని మాత్రమే వ్యక్తం చేస్తుంది.

ఆడ జంతువులలాగే స్త్రీలు ''సిగ్గు'' గా ప్రవర్తించటం పురుష దౌర్జన్య భయంకొద్దీ మాత్రమే ఆటవికులలో ''సెక్సు'' సంబంధించిన నిషేధాలు, మత భీతిగా పరిణమిస్తాయి ఒక ఆడది అధికంగా ప్రసవవేదన పడినా, ఒక మగవాడికి నపుంసకత్వం కలిగినా వాళ్ళ వస్తువులను ఎవరో తాకటం వల్ల అలా జరిగిందని వాళ్ళు నమ్ముతారు. మగవాళ్లు తమ మర్మాంగాలను పెద్ద గుడ్డలు మూటల మాటున దాచుకోవటానికి కారణం ''సిగ్గు'' కాదు, భయం - అవి ఇతర పురుషుల కంటపడితే ప్రమాదమని!

ముఖ్యంగా పురుషుడి జననేంద్రియాలపైన స్త్రీలకు అద్భుత ప్రభావం ఉంటుందని విశ్వాసం ఉన్నది తన జననేంద్రియాలు వాచి చీమలు కుట్టినట్టు బాధపెడితే పురుషుడు ఎవరో స్త్రీ తనను హింసించడానికి ''చేతబడి'' చేసిందని నమ్ముతాడు. ఆడవాళ్ళు తాము బాధించదలచిన పురుషుల మీద ''చేతబడి'' చేసే పద్ధతులు ఇలా వుంటాయి. ఆడది ఒక గడ్డిపిత్తు తీసుకొని, దానిమీద మంత్రం చదివి, దాన్ని పురుషుడికేసి విసురుతుంది. లేదా ఇంత దుమ్ము మంత్రించి, ఆ పురుషుడు మూత్ర విసర్జన చేసిన చోట చల్లుతుంది. లేదా ఆడది తన మర్మావయవాన్నే మంత్రించి, అవతల మనిషి తన భర్త కాకపోయినా, వాణ్ణి తనతో సంభోగానికి ప్రేరేపించి, తద్వారా వాడికి హాని చెయ్యవచ్చు. ''అరుంటా'' జాతివాళ్ళలో సిఫిలిస్ సోకినప్పుడు ఇలాంటి చేతబడి జరిగిందని నమ్మారు. ఆటవికులు మంత్రం లేక ఏ రోగమూ రాదని నమ్ముతారు.

జూలూ జాతివాడికి తన భార్య ప్రవర్తన అనుమానాస్పదంగా తోచినప్పుడు 'వైద్యుడి' దగ్గర 'మందు' సంపాదించి తాను తీసుకుని, వైద్యుని ద్వారా తన భార్యకు రోగం కలిగించడు కాని రోగ కారకశక్తిని సంక్రమింప జేస్తాడు. తరువాత ఆమె ఎవరితోపోతే వారికి రోగం వస్తుంది – కాని ఆమెకు ఏ రోగమూ రాదు. ఆడవాళ్ళలో అదృశ్యంగా ఉండే రోగకారకశక్తి గురించి పురుషులకు చాలా భయం. అందుచేత వాళ్ళు మరొక ''మందు''ను ఎడమచేతిలో గాటు చేసుకుని దానికి పూసుకొని, ఆ చేత్తో స్త్రీని తాకి చూస్తారు . అప్పుడు వేళ్లు పీక్కుపోతే ఆ మనిషిలో రోగకారకశక్తి ఉన్నదన్నమాట! అలాంటి స్త్రీ జోలికి పోరు.

ఇలాటి రోగకారకశక్తి ఉంటుందన్న భయంతోనే విధవ జోలికి ఎవరూ వెళ్ళరు. అయితే విధవలలో ఇలాటి శక్తి నిర్మూలించే తంతు జరిగినమీదట ఆమెను తిరిగి పెళ్లాడవచ్చును. ఒకడికి కొంతకాలం భార్యగా ఉండిన వితంతువును పెళ్ళాడటానికి నాగరికులలో ఉండే జంకు వెనుక ఇలాటి ఆటవిక భీతి ఏమన్నా ఉన్నదేమో తెలియదు.

కన్యనే పెళ్ళాడాలన్న నియమంలో ఏ పురుష సంపర్క భీతి ఉండకపోదు. పురుషులను గురించిన ఇలాటి జంకు మన సమాజంలో లేకపోవడం గమనార్హం

స్పర్శ చెడుకి పనిచేసినట్టుగా మంచికీ పనిచేస్తుంది .''మత్తు'' ప్రక్రియలు స్త్రీ పురుషులమధ్య మోహం కలిగించేవి. కొన్ని జాతులలో కొన్ని వస్తువులను మంత్రించి అవతలివాళ్ళకు ధరించడానికి ఇస్తారు. మోహం పుట్టించే వస్తువులలో వెంట్రుకలూ, మూలికలూ, తాంబూలమూ, తలనూనెలూ వుంటాయి. నాగరికులనబడేవారిలో ''మత్తు'' మందుల ప్రయోగాలు అరుదే అయినా, వాళ్ళ భాషలో వాటి అవశేషాలు కన్పిస్తాయి. (''అది మొగుడికి ఏ మందు పెట్టిందో!'')

మగవాళ్ళకు ఆడవాళ్ళ స్పర్శ అంటే భయం దేనికి ? వాళ్ళ ''గుణాలు'' తమకు సంక్రమిస్తాయని. ఆడది ''అబల'' ఆడదాని స్పర్శ తనను దైహికంగా బలహీన పరుస్తుందని ఆటవికుడి భయం! అదే నాగరికుడిలో ''నైతిక'' దౌర్బల్యంగా మారింది.

ఈ భయం మైథునం దగ్గర పరాకాష్ఠ చెందుతుంది. మైథునం దౌర్బల్య కారణమన్న నమ్మకం సార్వత్రికమైనది. ఈ నమ్మకాన్ని బలపరిచేటట్టుగా మగవాడు సంభోగానంతరం నీరసపడి, రక్తపోటు పెంచుకుంటాడు.

శుక్లం బలమనీ, వీర్యం ప్రాణమనీ ఆటవికుల నమ్మకం. జూలు మగవాడు తన బలం వృషణాలలో ఉన్నదని నమ్ముతాడు (''వృషణాలు జారాయి'' అన్నది మనిషి నీరస స్థితినీ, ''వృషణాలు అదిరాయి'' అన్నది ధైర్యం సడలిందనడానికీ ఈనాడు మనలో కూడా వాడుకలో ఉన్న మాటలు) ఈ కారణం చేతనే ఆటవికులు యుద్ధానికీ, వేటకూ ముందు స్త్రీ సంభోగాన్ని వర్జిస్తారు. ఇంకా చిత్రమేమంటే సంభోగం వ్యక్తినే గాక జాతినంతా నీరస పెడుతుందన్న భయం కొందరిలో ఉన్నట్టు కనిపిస్తుంది. కొన్ని జాతులలో యుద్ధానికి వెళ్ళిన వాళ్ళతోబాటు ఇంటిదగ్గర దిగబడిపోయిన వాళ్లు కూడా స్త్రీ సంపర్కం వర్జిస్తారు.

స్త్రీ పురుషుల మధ్య వుండే అసంఖ్యామైన నిషేధాలకు అన్నిటికీ మూలకారణం స్త్రీత్వానికీ పురుషత్వానికీ మధ్య ఉండే ప్రాథమిక వ్యత్యాసం. ఆడది రజస్వల అవుతుంది. నెలనెలా ముట్టు అవుతుంది. గర్భవతి అవుతుంది. ప్రసవిస్తుంది. ఆడదాని జీవితంలో రక్తస్రావాలకు ప్రత్యేక ప్రాముఖ్యం ఉన్నది. ఈ రక్తస్రావాలు ఆడదాన్ని మగవాడికి ఆటవిక దశలో కూడా అస్పృశ్యురాలిని చేశాయి.

నాగరిక ప్రపంచం రక్తాన్ని కొంతవరకు ఏవగించుకుంటుంది. కాని ఆటవికులు స్త్రీని అంటరానిదిగా చూడటానికిమటుకు కారణం ఏవగింపు కానేకాదు. ఆటవికులు రక్తాన్ని పానీయంకింద భావిస్తారు. వాళ్ళు రక్తం తాగి దాహం తీర్చుకుంటారు. అమితంగా

దాహం వేసినప్పుడు తమ రక్తనాళాన్ని కోసి తమ రక్తాన్ని తామే తాగటం కూడా కొందరు ఆటవికులలో కద్దు. శరీరానికి అత్యవసరమైన ఉప్పు చాలా జాతులవాళ్ళకు రక్తం ద్వారా తప్ప లభ్యం కాదు

అసలు సంగతి ఏమిటంటే, మామూలుగాకన్నా సహజ రక్తస్రావాలకు గురి అయిన తరుణంలో ఆడది మరింత ఆడదిగా ఉంటుంది. అన్ని నిషేధాలకూ మూలం ఈ ఆడతనం రక్తస్రావంలోన్న దశలో ఆడదాని స్పర్శకు ఆటవికుడు మరింత భయబడతాడు – ఈ భయం నాగరికతలో జుగుప్సగా మారింది.

బహిష్టు రక్తం అనారోగ్యకరమని ఒక అభిప్రాయం ఉన్నది. కాని ఈ భావానికి ఎలాటి ఆధారమూ లేదు ఆదిమ జాతులవాళ్ళ ''అనారోగ్య భీతి'' నాగరికులలో ''పిశాచభయం''గా మారింది అంతే !

స్త్రీ పురుషుల మధ్య ఉండే నిషేధాలన్నిటి వెంటా పురుషుడి భద్రతే ప్రధానం కావటం స్పష్టంగా కనబడుతుంది. స్పర్శద్వారా పురుషుడి గుణాలు స్త్రీకి సంక్రమిస్తాయన్న ''భయం'' అంతగా కనపడదు.

ఆడదానినుంచి తనకు స్పర్శద్వారా సంక్రమిస్తుందనే గుణాలలో ముఖ్యమైనది దుర్బలత్వం. ఆడది అబల; ''వీకర్ సెక్స్'' – బలంతోనూ, శరీర నిర్మాణంలోనూ వాళ్ళు పురుషులకు తీసికట్టుగా ఉంటారని.

అయితే ఇందులో ఒక అసందర్భం ఉన్నది. ఒకటి ఏమంటే, నిషేధాలు వాళ్ళను బలహీనంగా ఉంచటానికి కొంతవరకూ తోడ్పడుతాయి. కొన్ని జాతులలో స్త్రీలు పులి మాంసం తినరాదు. మరికొన్ని జాతులలో పుష్టికరమయిన ఆహారాలను వర్జించాలి ! రెండో సంగతి ఏమంటే కొన్ని జాతులలో శ్రమంతా ఆడవాళ్ళదే కావటం మూలంగా వాళ్ళు చాలా బలిష్టంగా వుంటారు. అయినా వాళ్ళు ''అబలలే.''

ఆడవాళ్లలో మరొక లక్షణం పిరికితనం తెల్లవాళ్ళు కనిపిస్తే వాళ్ళు పారిపోతారు. వాళ్ళు చీటికీ మాటికీ కంటనీరు పెట్టుకుంటారు కూడా.

ఆడవాళ్ళ జీవితంలో సహజంగా జరిగే రక్తస్రావాలు వాళ్ళను జబ్బు మనుషులను చేస్తాయని ఆటవిక పురుషుల నమ్మకం. అంతేగాక భూత, పిశాచాలు స్త్రీలతో సంగమిస్తాయన్న విశ్వాసం మూలాన పురుషులు వాళ్ళను చూసి భయపడతారు. ఆడదానిలో వాళ్ళు అతీతశక్తులు చూస్తారు ఆడదాని ''మిస్టరీ'లో నాగరిక మానవుడికి గల నమ్మకం కూడా తక్కువైనదేమీ కాదు.

ఆడతనం లోకువగా ఉండటం అనాదిగా ఉంటున్నదే. నాగరికదశ ఆరంభ దశలోకూడా ఆడది స్నానం చేసిన నీటిలో మగవాడు స్నానం చేస్తే వాడి పుంస్త్వం

రెండు వర్గాల మధ్యా ఏర్పరచిన నిషేధాలు పనిచేశాయి. అయితే ఈ మంచి సామాజిక వ్యవస్థలో జీర్ణమయిపోయినాక మనకు మిగిలినదేమంటే ఆటవిక దశయొక్క అవలక్షణాలు మాత్రమే.

ఈనాడు ''మంచి'' మీద కూడా దాడి ఆరంభమయింది.''పురుషత్వమూ'', ''స్త్రీత్వమూ'' అన్నవి ఖండించబడుతున్నాయి స్త్రీ పురుషులమధ్య పరస్పరాకర్షణ అన్నది కూడా అనాగరికంగా భావించబడుతున్నది. ''ప్రేమ''కు పాత నిర్వచనం పోతున్నది. స్త్రీ విమోచనోద్యమం వెర్రితలలు వేస్తే వెయ్యవచ్చునుగాని స్త్రీ పురుషుల మధ్య అనేక రకాల నిషేధాలకు ఇక ముందు తావుండదనటానికి సందేహం లేదు. మానవజాతి ఆటవిక భావాలను వొదుల్చుకోక తప్పదు.

*ముద్రణ: జయశ్రీ, మాసపత్రిక, ఫిబ్రవరి, 1976.*

# 5. సమాజపరిపాలన

చరిత్రయుగంలో మనం రాజకీయ పరిపాలన మాత్రమే ఎరుగుదుము. మన దేశం లాంటి వెనుకబడిన దేశాలలో కుల సంఘాలూ, కులకట్లూ, పీఠాధిపతుల తాఖీదులూ అక్కడక్కడా వినవచ్చినా, వెలివేయటాలూ, ప్రాయశ్చిత్తాలూ అన్నవి ఏ మూలో అమలులో ఉన్నప్పటికీ రాజకీయచక్రం ఈ ''సనాతనత్వం'' మీద, నల్లేరు మీద బండిలాగా, నడిచిపోగలదు.

అయితే ఈ రాజకీయ పరిపాలన అన్నది నాగరికతో వచ్చినది. అంతకు పూర్వం సమాజాలు కొన్ని నియమాలను పాటిస్తూ, ఆ నియమాలను కాలానుగుణంగా మార్చుకుంటూ సాగింది. కులకట్లూ, వెలులూ ప్రాచీన సమాజం తాలూకు అవశేషాలు.

ఆటవిక దశలోనూ, అనాగరిక దశలోనూ కూడా సమాజ వ్యవస్థకు మూలాధారం ''కులం''(gens) కులవ్యవస్థ (gentile organization)కు ఎలాటి విఘ్నమూ లేకుండానే మానవులు ఆటవిక దశలో మూడు అంతస్థులూ, అనాగరిక దశలో మూడు అంతస్థులూ ఎక్కి వచ్చారంటే కులం అన్నది మానవ సమాజ పరిణామానికి ఎంత బలం చేకూర్చినదో అర్థమవుతుంది. ఆసియా, యూరప్, ఆఫ్రికా, ఆస్ట్రేలియా ఖండాలలోని ప్రతి జాతీ కులం వ్యవలస్థ కలిగి ఉండినదే

ఈ కులానికి gens, sept, clan, phrara అని వేరు వేరు దేశాలలో పేర్లుండేవి. సంస్కృతంలో ''గణం'' అనే వారు. లాటిన్‌లో gens గ్రీక్‌లో genos అనేవి సంస్కృతం మాటకు చాలా దగ్గరగా వున్నాయి. కులం అనేమాటకు వంశం అన్నది పర్యాయపదం. (రఘు వంశం, ఇన వంశం, రఘుకులం, ఇనకులం).

ప్రతి కులానికీ ఒక మూల పురుషుడు (లేక స్త్రీ) ఉన్నట్టూ, ఆ మనిషి సంతతి

వారంతా ఒక కులానికి చెందినవారుగా వ్యవహరించినట్లు మనకు తెలుసు. వంశకారత్వం స్త్రీదైతే వంశ (కుల) నామం స్త్రీ పరంపరలో - తల్లి నుంచి పిల్లలకూ, కూతురి పిల్లలకూ సంక్రమించింది, పురుషుడైతే పిల్లలకూ, కొడుకు పిల్లలకూ సంక్రమించింది.

మన పురాణాలలో అత్యంత ప్రాచీనమైన దేవ గణాల పేర్లు తప్పిస్తే, పురాణ పురుషులందరూ ''మగ'' వంశాలకు చెందినవాళ్లే - సూర్య వంశం, చంద్ర వంశం, భరత వంశం, యదు వంశం ఇత్యాది

ఒక ప్రసిద్ధుడి పేర నడిచే వంశంలో మరొక సరికొత్త ప్రసిద్ధుడు పుట్టుకొస్తే వంశం పేరు మారిపోయేది. సూర్య వంశం, ఇక్ష్వాకు రఘువుల పేర్లు కూడా సంపాదించుకున్నది. చంద్ర వంశం, భరత వంశం, కురు వంశం కూడా అయింది వంశాలు విభజన చెందడానికి మధ్యమధ్య కొత్త వంశకారకులు పుట్టుకు రావటం ఒక కారణం కావచ్చు. సర్వే సర్వత్రా ప్రపంచమంతటా, ఆటవిక యుగంలో మొదటగా ఏర్పడిన వంశాలన్నీ స్త్రీల కారణంగా ఏర్పడినవే. ఆ దశలో మనుషుల తండ్రులెవరో నిర్ణయించటం అసంభవం కావటమే అందుకు కారణం

వంశాలు మాతృకారకాలు కావటం నిలిచిపోయి పితృకారకాలు కావటం మొదలు పెట్టినా, కుల వ్యవస్థకు భంగం రాలేదు.

వివిధ సామాజిక పరిణామ దశలలో రెండు ప్రముఖమైన మార్పులు జరిగాయి. ఒకటి, స్త్రీ పరంపరపోయి పురుష పరంపర రావటం; రెండు ఆదిలో సమష్టిగా కులానికంతకూ ఉన్నడి సొత్తుగా ఉండిన సంపద, తండ్రి నుంచి పిల్లలకు సంక్రమించే నియమం అమలు జరగటం. ఇవి రెండూ కూడా చాలా అద్భుత పరిణామాలే. సాంఘిక స్వరూప స్వభావాలలో ఊహించరాని పరిణామాలతోనే ఇవి సాధ్యమయ్యాయి. అయినా కూడా కుల ప్రాతిపదికకు ఎలాటి భంగమూ కలగకుండానే మానవ జాతులు నాగరిక దశ దాకా చేరుకోగలిగాయి

కులవ్యవస్థను నిర్మూలించినది నాగరికత. ఈ కుల వ్యవస్థను వదలకుండా మానవ సమాజాలు ఆటవిక దశను అధిగమించి అనాగరిక దశకూ, దాన్నికూడా అధిగమించి నాగరిక దశకూ రాగలిగాయంటే నాగరికతను సాధించటానికి కూడా కులవ్యవస్థే ఆధారమయిందంటే దాని బలం ఎలాటిదో తెలుసుకోవటం అవసరం.

ఈనాటి నాగరిక జాతుల పూర్వ రూపాలు అమెరికాలోని ఆదిమవాసులలో సుస్పష్టంగా కనిపించాయి. వాటిని మోర్గాన్ చక్కగా పరిశీలించి, వివరించాడు.

ఆదిమ సమాజంలోని కులాలు ఎలా ఉండేవంటే కులానికొక పేరుంటుంది; కులంలోని వారంతా సమంగా రక్త బంధువులే. పరస్పర సంబంధం గల కులాలు కొన్ని కలిస్తే ఒక తెగ అయేది. (ఉదా : యదు, వృష్ణి, భోజ, అంధకులు) నేక తెగలు ఏకమై ఒక జాతి ఏర్పడింది. అనాగరిక దశ పూర్తి పరిణామం చెందగా జాతుల (Conleorracu)

సమాఖ్య ఏర్పడింది. (జరాసంధుడు ఇలాటి సమాఖ్యను రూపొందించాడేమో). ఒకే భాషకు చెందిన ఉప భాషలు (Dialects) మాట్లాడే జాతులన్నీ ఒక సమాఖ్యలో చేరాయి.

కుల వ్యవస్థలో ఈ సమాఖ్యను మించిన పరిపాలనా సంస్థ ఎక్కడా లేదు. ఈ సంస్థలో పౌరుడు (పురంలో నివసించేవాడు), రాజ్యం (రాజ పాలనలో ఉండేది) అన్న మాటలకు చోటు లేదు

నాగరిక యుగానికి పూర్వం గ్రీకులు అలాటి వ్యవస్థలోనే జీవించారు; అటికాలోని 4 ఎథీనియన్ జాతులూ, స్పార్టాలోని 3 డోరియన్ జాతులూ కలిసి ఒక సమాఖ్య అయ్యాయి. అయితే అమెరికాలోని అనాగరిక జాతుల సమాఖ్యల కంటె గ్రీకులు మరికొంత అభివృద్ధి సాధించారు. అమెరికాలోని నాగరిక సమాఖ్యకు చెందిన జాతులు తమ తమ ప్రాంతాలను ఏకం చేసుకోలేదు; గ్రీకులు ఏక దేశంలో ఏక ''ప్రజ''గా విలీనం చెందారు. రోమనులు కూడా ''ప్రజ'' అనే పదమే వాడారు. Populus Romanus

ఆటవిక, అనాగరిక దశలో సమాజంలో ఎన్ని మార్పులు వచ్చినా, అది ఎంత పెరిగినా, కులం ఉంటూ వచ్చిన ''డెమోక్రసీ'' కి ఎలాటి భంగమూ కలగలేదు.

ఆదికాలపు కులాలు స్త్రీ పరంపర గలవని చెప్పుకున్నాం. ఒకే మూల స్త్రీ నుంచి పుట్టినట్టు చెప్పుకునే వారంతా ఒక కులంగా వ్యవహరించేవారు. ఈ వంశంలో ఉద్భవించిన పురుషులకు ఇదే వంశంలో జన్మించిన స్త్రీలతో దాంపత్యం నిషిద్ధం. వారు ఇదే కులనామం పెట్టుకున్నా కులాంతర స్త్రీలకే పిల్లల్నికనేవారు. ఆ పిల్లలు తమ తల్లుల కులం చెప్పుకునేవారు. ఏ కులంలో పుట్టినా పురుషుల సంతానానికి ఆ కులంలో పుట్టినా పురుషుల సంతానానికి ఆ కులంలో స్థానం లేదు.

పైన చెప్పినది కులం అనేదాని అత్యంత పురాతన దశ. ఆటవిక దశ అత్యున్నత స్థితిలోనూ, అనాగరిక దశ ప్రాధమిక దశలోనూ ఉండి అమెరికను ఆదిమవాసులలో ఇలాటి కులాలుండేవి. ఇలాటి దశలో ఉండిన కులానికి చెందిన స్త్రీకే కర్ణుడు దొరికి ఉంటాడనుకునేటందుకు స్వల్పంగా ఆధారం కనబడుతుంది. రాధ సూతకుల స్త్రీ ; ఆమె భర్త సూతుడన్నారు గాని అతడి పేరు ఎక్కడా కనబడదు. కుమార విద్యా ప్రదర్శనమప్పుడు కర్ణుడు పాల్గొనటానికి అభ్యంతరం అతను అభివృద్ధిలోకిరాని కులానికి చెందినవాడు కావటమేననిపిస్తుంది ''నువ్వు క్షత్రియుడవా ? '' అని అడిగితే కర్ణుడు చెప్పలేకపోతాడు. అంత ప్రాచీనకులాలలో విభజనలేదు.

అనాగరిక దశ మధ్య విదశలో స్త్రీ పారంపర్యం పురుష పారంపర్యంగా పరివర్తన చెందింది. అయితే ఈ పరివర్తన పూర్తికావడానికి కొన్ని వేల ఏళ్ళు పట్టివుండవచ్చు. మన దేశంలో ఈనాటికీ స్త్రీ పారంపర్యం అమలు చేసే జాతులన్నాయన్నది జ్ఞాపకం ఉంచుకోవాలి.

ఈ మార్పు విజయవంతం కావటానికే స్త్రీ , పురుషుల మధ్య వివాహాలన్న ఆచారం

ప్రారంభమయింది ఎందుకంటే పురుష సంతతి స్పష్టంగా రుజువుకావాలంటేనూ, పిల్లలకు తండ్రి కులం సంక్రమించాలంటేనూ, ఒక నిర్దిష్టమైన తండ్రి అనేవాడుండాలి.

అయితే ఈ దశలోకూడా దాంపత్యం అన్నది భార్యా భర్తలకే పరిమితమై ఉండలేదు. ఆస్తి ఆర్జించే శక్తి అంతకంతకూ పురుషులకు అధికం కాసాగింది. ఆ ఆస్తి ''కులం'' లోనే ఉండాలంటే పురుష పారంపర్యంలో కులవ్యవస్థ ఏర్పడాలి మగవాడి పిల్లలూ, రక్తబంధువులూ ఒక కులంలోవారే అని నియమం పెడితే సంపద కులందాటి అవతలకి పోదు

అయితే అంతమాత్రం చేత స్త్రీ తన భర్తకే పిల్లలను కనాలని లేదు. క్షేత్రజుడూ, కృత్రిమపుడూ, పేనర్భవుడూ, కానీనుడూ, గూఢోత్పన్నుడూ, క్రేతుడూ, సహూఢజుడూ మొదలైన పుత్రులు తండ్రికి పుట్టిన వాళ్ళుకారు. పరశురాముడు క్షత్రియ జాతిని నిర్మూలించగా, క్షత్రియ స్త్రీలు బ్రాహ్మణులకు పిల్లలను కని నశించే క్షత్రియ వంశాలను నిలబెట్టినట్టు భారతంలో చెప్పి ఉన్నది. అంబికా అంబాలికలూ, కుంతీ మాద్రులూ తమ భర్తల వంశాలను ఇదే విధంగా నిలబెట్టారు. ఇది జరిగే నాటికి దాంపత్య వివాహాలు అమలులో ఉన్నా కూడా దాంపత్య ధర్మం నియమబద్ధంగా లేదు. అందుచేత మోర్గాన్ అమెరికను ఆదిమవాసులను గురించి చెప్పిన దానికి మన భారతంలోనూ సాక్ష్యం ఉన్నది.

ఇంతే కాదు. ఈ రకం వివాహాలుకూడా బ్రాహ్మణులలోకన్న క్షత్రియులలో ముందు వచ్చినట్టు ఛాందోగ్యోపనిషత్తులో కనబడుతున్నది. జాబాలి కొడుకు సత్యకాముడు తన తండ్రి ఎవరో తెలియనివాడు. అతను ఒక గురువు వద్దకు వెళ్ళి విద్య అడిగితే ఆ గురువు (హరిద్రుమతుడు) ''నీ తండ్రి ఎవరు ?'' అని అడుగుతాడు సత్యకాముడికేకాదు. అతని తల్లికికూడా తెలీదు. ''అలా అయితే నువ్వు బ్రాహ్మణుడివే అయిఉంటావు'' అని గురువు అతనికి ఉపనయనం చేసి చదువు చెబుతాడు.

భారతంలోని ఉపాఖ్యానాల నాటికి పురుష వారసత్వమూ, వ్యష్టి వివాహాలూ వచ్చాయి. కాని ''నాతిచరామి'' అన్న ప్రమాణం లేదు అందుకే, ఉద్దాలకుడి భార్యను ఎవరో బ్రాహ్మణుడు సంభోగార్థమై తీసుకుపోతూ ఉంటే ఆమె కొడుకు శ్వేతకేతుడు ఆగ్రహిస్తాడు. అప్పుడు ఉద్దాలకుడతనితో, ''అది తప్పుకాదు. ఇది చాలా ప్రాచీనమైన ఆచారమే '' అంటాడు. అన్నప్పటికీ శాంతించక శ్వేతకేతుడు, భార్యలు ఇతరులతో అతిచరించరాదన్న నియమాన్ని ప్రతిపాదిస్తాడనుకోండి, అది వేరే విషయం.

బహుశా ఉద్దాలకుడి దశలోనో అంతకన్న కొంచెం పూర్వదశలోనో దీర్ఘతముడనేవాడు తనభార్య తనను పోషించనిరాకరించగా, ఆమెకు పతివ్రతా ధర్మాలు ఉపదేశించబోతాడు. ఆమె ఆగ్రహించి దీర్ఘతముణ్ణి తన కొడుకులచేత నదిలో పారేయిస్తుంది.

ప్రారంభ దశలో కులం అన్న దానికి మూడు ముఖ్యలక్షణా లుండేవి. 1. కులంలో వారి మధ్య రక్తసంబంధం, 2. నిరాక్షేపణీయమైన స్త్రీ పారంపర్యం, 3. కులంలోని వారి మధ్య దాంపత్య నిషేధం

కులాలు ఒక్కొక్కటిగా ఏర్పడి ఉండటం అసంభవం, కనీసం రెండేసిగా ఏర్పడి ఉండాలి అలా అయితే తప్ప ఒక కులంస్త్రీలు మరో కులం పురుషులతో దాంపత్యం నెరపటానికి అవకాశం ఉండదు అంటే అవి ''వరస''గల కులాలన్న మాట. గయోపాఖ్యానం నాటకంలో అర్జునుడు కృష్ణుణ్ణి ''శిశుపాలుడు మరదిగదా, శిశుపాలుడు వలచిన నట్టి చేడియ నీకులన్ విశదముగ చెల్లెలేగద, పశువా ఏమనుచు దానిబట్టితి చెపుమా?'' అని అడగటంలో బొత్తిగా అర్థం లేకపోలేదు.

అనేక కులాల సమామ్నాయమైన జాతి (tribe) పాలన ఇలా జరిగేది.

ప్రతి కులానికీ ఒక పెద్ద (Sachem) ఉండేవాడు. అతనుగాక కొందరు నాయకులు (Chiefs) ఉండేవారు.వీరు కులానికి చెందిన వారే అయి ఉండాలి కులం స్త్రీ పరంపర గలదైతే ఒక ''పెద్ద'' కు పుట్టిన కొడుకుకు ఆ పెద్ద అనంతరం ''పెద్ద'' అయేహక్కు లేదు; అతని సోదరుడికిగాని మేనల్లుడికిగాని ఉంటుంది. పెద్దలూ, నాయకులూ కూడా కులంవారు ఎన్నుకోవలసిందే. ''పెద్ద'' పదానికి వారసత్వం ఉన్నదిగాని, నాయకత్వం వారసత్వం ద్వారారాదు ఒక నాయకుడు పోతే మరొకడు ఎన్నికకావాలి. నాయకత్వానికి ఎన్నుకోబడేవాడు వీర పరాక్రమాలు గలవాడై ఉండాలి. ద్వారకలో ఉగ్రసేనుడు ''పెద్ద''గానూ, కృష్ణ బలరాములు మొదలైనవారు నాయకులుగానూ ఉన్నట్టు కనబడుతుంది

ఒక కులంవాళ్లు స్త్రీ పురుషులందరూ సమంగా పాల్గొని ఎన్నుకునే పెద్దను జాతికి చెందిన మిగిలిన కులాల వారందరూ ఆమోదించాలి. తమ పెద్దలను ఎన్నుకునే హక్కేగాక, పదవిలోనుంచి తొలగించే హక్కుకూడా కులజులకుండేది.

పెద్దను ''అభిషేకించే'' టప్పుడు అతనినెత్తిన కొమ్ములుంచే ఆచారం అమెరికను ఆదిమజాతులలో ఉండేది. అలాగే పదవినుంచి తొలగించటాన్ని ''కొమ్ములు తీసెయ్యటం'' అనే వారు. మనలోకూడా, ''వాడికేం కొమ్ములు వచ్చాయా?'' అనటమూ, ''శృంగభంగమయింది'' అనటమూ చిత్రం,

సామాజికాభివృద్ధితోబాటు ఆస్తిహక్కులు చిత్రంగా మారాయి. ఆటవిక దశలో కులం ఆస్తి, సమష్టిగా అందరిదీ అయిఉండేది. వ్యక్తి సొంతం అనదగిన వస్తువులు – వాటిని మనిషి తోబాటు పూడ్చేసేవారు.

స్త్రీ వారసత్వంపోయి పురుషవారసత్వం వచ్చినా కూడా పాత ఆస్తి హక్కులు పూర్తిగా మారలేదు. ఎవడన్నా చచ్చిపోతే వాడి ఆస్తి అతనిపిల్లలకుగాక, అతని అన్నదమ్ములకూ, అక్కచెల్లెళ్ళుకూ, మేనమామలకూ పోయేది. అదే, స్త్రీ చస్తే ఆమె

పిల్లలకూ, అక్కచెల్లెళ్ళకూ పోయేదిగాని, ఆమె అన్నదమ్ములకు పోయేదికాదు అంటే చచ్చిపోయిన మనిషి కులానికి చెందిన సన్నిహితులకు పోయేది. భార్య ఆస్తిమీద భర్తకూ, భర్త ఆస్తిమీద భార్యకు ఎలాంటి హక్కూ ఉండేది కాదు. ఆ అలవాటు పూర్తిగా చావకనేమో మనం స్త్రీకి ఎలాంటి ఆస్తి హక్కులూ లేకుండా చేసినా కూడా ''స్త్రీధనం'' అన్నదాన్ని గౌరవించాం.

కులవ్యవస్థలో వ్యక్తి స్వేచ్ఛకు కులం పూచీపడేది. కులంలోని వారిమధ్య ధృడమైన బంధం వుండేది. (దాన్ని మనం clannthness అని ఈనాడు కొంచెం వెటకారంగా పిలుస్తాం.) కులంలోని ఒకడికి జరిగిన అన్యాయం కులానికంతకూ జరిగినట్టు, కులంలో ఒకణ్ణి ఎవరన్నా హత్యచేస్తే పగతీసుకునే బాధ్యత కులంవారందరి మీదా ఉండేది.

కులాలమీదా, తెగలమీదా, జాతిమీదా, సమాఖ్యమీదా సర్వాధికారాలు ''సభ''కు ఉండేవి. ఈ సభ అన్నది వేదకాలపు ఆర్యులలోనూ, పురాణకాలంలో కొన్నికొన్ని సందర్భాలలోనూ అత్యంత ప్రాముఖ్యం వహిస్తుంది. ఇది ''నాయకుల సభ'' (Council of Chifs). హరి వంశంలో కృష్ణుడు ఏ నిర్ణయం చేయవలసి వచ్చినా సభను సమావేశపరిచి ముఖ్యుల అభిప్రాయం తెలుసుకునేవాడు. ఆ తరువాతనే తన ఉద్దేశం చెప్పేవాడు.

''కులసభ'' అన్నిటికన్న చిన్నది. ప్రాథమికమైనది. ఇది చర్చించే విషయాలన్నిటిని గురించి కులంలోని స్త్రీ పురుషులందరూ మాట్లాడవచ్చు. జాతి కంతకీ కలిపి, ఒక మహా ''సభ'' ఉండేది; అందులో నాయకులే పాల్గొనేవారు.

అమెరికాలోని Iroquois జాతికి చెందిన వ్యక్తులందరూ నిజమైన సమభావం, సౌభ్రాత్వం, స్వేచ్ఛా అనుభవించేవారు. అందరికీ సమమైన హక్కులుండేవి. వారు నిత్య జీవితంలో కల్తీలేని కమ్యూనిజం అమలు జరిపేవారు. దీన్నే ''ప్రిమిటివ్ కమ్యూనిజం'' అంటారు.

*ముద్రణ : ఆంధ్రజ్యోతి, 1-5-1970.*

# ౬. కుటుంబం : బంధుత్వాలు - పెళ్ళిళ్లు

మనది ఆర్య సంప్రదాయానికి చెందిన సాంఘిక వ్యవస్థ. ఈ వ్యవస్థలో ప్రతి ఒకడూ ఒక వర్గానికీ, అందులో ఒక శాఖకూ చెంది ఉంటాడు. ప్రతి ఒకడికీ ఒక గోత్రం ఉంటుంది.

సంప్రదాయం ప్రకారం పెళ్ళి చేసుకునేవారు ఒకే వర్గానికీ, ఒకే శాఖకూ చెంది ఉండాలి ; కాని ఒకే గోత్రానికి చెంది ఉండరాదు.

అందరికీ ''ఇంటిపేరు'' అనేది ఉంటుంది. అయితే ఈ ఇంటి పేర్లు ఇటీవల

వచ్చినవి వీటిలో ఊళ్ళ పేర్లూ, వృత్తి పేర్లు కూడా ఉన్నాయి వీటిని బట్టి కులగోత్రాలు నిర్ణయించలేం. చుండూరు, బెజవాడ, కొమ్మూరు, జాగర్లమూడి మొదలైనవి ఇంటి పేర్లుగా గలవారు అన్ని వర్ణాలోనూ ఉండవచ్చు. దానిని బట్టి వర్ణ వ్యవస్థ ఇంటిపేర్ల కన్న పురాతనమైనదని తేలుతుంది.

అలాగే ఒక గోత్రానికి చెందినవాళ్ళు అన్ని శాఖలలోనూ, దేశంలోని అన్ని ప్రాంతాలలోనూ ఉన్నారంటే, గోత్రాలు ఏర్పడ్డ తరువాత కాలంలోనే ప్రాంతీయ విభజనా, శాఖా విభజనా ఏర్పడినట్టు స్పష్టమవుతుంది.

ఏనాడో ఆటవిక దశలోనే సపిండ వివాహాలు నిషేధించబడ్డాయి. గోత్రాలు ఏర్పడ్డాక సగోత్ర వివాహాల నిషేధం జరిగింది. ప్రాంతీయ విభజనా, శాఖా విభజనా జరిగినాక వివాహ సంబంధాల పరిధి ఇంకా సంకుచితమయింది. నా గోత్రం కాని కన్యలు శాఖాంతరాలలో ఉన్నా, ఇతర ప్రాంతాలలో ఉన్నా నేను పెళ్ళాడరాదు.

సగోత్ర వివాహాలను నిషేధించటంలో ఉద్దేశ మేమంటే, ఒక గోత్రానికి చెందిన స్త్రీ పురుషులందరూ సోదరీ సోదరులని; ఒకే మూలవ్యక్తి నుంచి వచ్చిన సంతతి అని – వారి మధ్య రక్తసంబంధాలు తెలియకపోయినానూ.

కులాలు స్త్రీ పరంపరలో సాగినంతకాలమూ పిల్లలకు తల్లి కులమే ఉండేది. కాని గోత్రాలు పురుష పరంపరలో ఏర్పడ్డాయి. పిల్లలు తండ్రి గోత్రానికి చెందుతారు. నా మేనత్తది నా గోత్రమే అయినా, ఆమె సంతానం ఆమె భర్త గోత్రానికి చెందినవాళ్ళు గనక, ఆమె కుమార్తెను నేను పెళ్ళాడవచ్చు. నా అక్క కూతురినే నేను పెళ్ళాడినా అది సగోత్ర వివాహం కాదు. ఈ విధంగా, ఏనాడో ఆటవిక సమాజం నిషేధించిన సపిండ వివాహాలు తిరిగి అవతరించాయి.

ఈనాడు కుటుంబం అంటే ఏమిటో మనకు తెలుసు. నా పితామహుడూ, పితామహీ, నా తండ్రీ, తల్లీ, నా అన్నదమ్ములూ, వివాహాలు అయేదాకా నా అక్కచెల్లెళ్ళూ, నా పిల్లలూ, నా కొడుకుల సంతానమూ – ఇది నా కుటుంబం.

బంధుత్వాలు ఇంకా కాస్త విస్తృతంగా ఉంటాయి. నా తండ్రి అన్నదమ్ములు కూడా నా తండ్రులే. (పెదనాన్న, చిన్నాన్న). వాళ్ళ పిల్లలు నాకు అన్నలూ, తమ్ములూ, అక్కలూ, చెల్లెళ్ళూ, (ఒక వేలు ఎడంగా) నాపిన తండ్రుల, పెత్తండ్రుల భార్యలు నాకు అమ్మలు (పిన్నమ్మ, పెద్దమ్మ). నా తల్లి అక్క చెల్లెళ్ళు కూడా నాకు ఇదే వరస: వారి భర్తలు కూడా నాకు తండ్రుల వరసే.

నా తండ్రి తాలుకు అక్కచెల్లెళ్ళు నాకు అత్తలు, వారి సంతానం నాకు బావలూ, వదినెలూ అవుతారు.

మన బంధుత్వాలు ఇంతకన్న హెచ్చు దూరం వెళ్ళవు. రెండువేళ్ళు విడిచిన తండ్రివైపు బంధువులను దాయాదులంటాం. తల్లివైపు బంధువులను దూరపు బంధువుల

కింద జమకడతాం.

నాలుగు తరాలు గడిచాక కుటుంబాలు ''తెంచుకోవటం'' కూడా కద్దు. ఈ బంధుత్వాలు దగ్గిరా, దూరము నిర్ణయించటానికి మనకు మైలపద్ధతి ఒకటి ఉన్నది – పదిరోజుల మైలా, మూడు రోజుల మైలా, స్నానంతో సరి !

కుటుంబమూ, బంధుత్వాలూ, వివాహ వ్యవస్థా మొదటినుంచీ ఇలాలేవు. వేలాది సంవత్సరాలపైన వీటిలో అతి విచిత్రమైన మార్పులు జరిగాయి. అవి అంతులేని సంఘర్షణల ఫలితంగా జరిగాయి.

ఆదికాలపు ఆటవిక మానవులు ఇంచుమించు పశుప్రాయులుగా ఉండి, ప్రకృతి సిద్ధంగా దొరికిన ఆహారాన్ని తింటూ తాముండే ప్రాంతానికి కట్టుబడి, గుంపులు గుంపులుగా జీవించారు. వారు తమ గుంపును అభివృద్ధి చేసుకుంటూ అందరూ సపిండులుగా ఉండేవారు.

నాగరిక మానవులకు ఇలాటి ''సపిండ'' సమాజం ఎక్కడా తగలనిమాట నిజమే. కాని ఆర్కియాలజిస్టులు తమ త్రవ్వకాలలో అత్యంత ప్రాచీన కాలంలో మానవులు ఉపయోగించిన రాతి పరికరాలు గమనించారు. అంత ''క్రూడ్'' గా ఉండే పరికరాలను ఉపయోగించే మానవులు ఏనాడో అంతరించారు నాగరికులు గమనించిన అనాగరిక జాతులలో ఏదీ అలాటి పరికరాలు ఉపయోగించేటంతటి ఆటవిక దశలో లేదు.

హవాయిలోనూ, పోలినీసియా దీవులలోనూ, మరికొన్ని ప్రాంతాలలోను నాగరిక మానవులు గమనించిన అత్యంత ప్రాచీన వ్యవస్థను మోర్గన్ ''మలయా'' సంప్రదాయమన్నాడు. ఆ జాతులలో ఉండే బంధుత్వాలు అమిత క్లుప్తమైనవీ, అత్యంత ప్రాచీనమైనవీనూ. ఆ జాతులలో అయిదు తరాల మధ్య అయిదు రకాల బంధుత్వాలే ఉండేవి ; తాతా, తండ్రీ, తనూ, సంతానమూ, మనమలూనూ. (ప్రాచీన చీనా సంప్రదాయంలో పైన మరి రెండు తరాలనూ, కింద మరి రెండు తరాలనూ చేర్చి తొమ్మిది రకాల బంధుత్వం ఏర్పాటు చేశారు.)

నేను హవాయివాణ్ణి అయితే నా అన్నదమ్ముల పిల్లలూ, అక్కచెల్లెళ్ళ పిల్లలూ కూడా నన్ను ''నాన్నా'' అని పిలుస్తారు. నా తండ్రి తోబుట్టువును నేను ''అమ్మా'' అని పిలుస్తాను. వాళ్ళ పిల్లలు నాకు అన్నదమ్ములూ, అక్కచెల్లెళ్ళూ అవుతారు. నా తల్లి అన్నలూ, తమ్ములు కూడా నాకు తండ్రి వరసే. నా అన్నదమ్ములూ, వరస అన్నదమ్ములూ – ఎన్ని వేళ్ళు విడిచిన వారయినా సరే – వారందరి భార్యలనూ నేను ''పెళ్ళాం'' అని పిలుస్తాను అలాగే నేను స్త్రీ అయితే నా అక్క చెల్లెళ్ళూ, మన అక్కచెల్లెళ్లు ఎందరున్నా సరే – వారి భర్తలందరూ నా భర్తలే. నేను వాళ్ళను ''మొగుడు'' అని పిలుస్తాను.

ఇది అత్యంత ప్రాచీనమైన సమాజ వ్యవస్థ. ఈ బంధుత్వాలను బట్టి ఒకప్పుడు

ఏకోదరులైన స్త్రీ పురుషుల మధ్య దాంపత్యం ఉండేదని స్పష్టమవుతుంది. ఇలాంటి సమాజంలో అందరూ రక్త బంధువులే. దూరపు బంధుత్వాలంటూ లేవు. వేళ్లు విడిచిన బంధుత్వాలు లేవు ఇది ''సపిండ'' (Consanguin) కుటుంబం.

ఇటువంటి కుటుంబాలు ప్రత్యక్షంగా చూసిన వారు లేరు అయితే దాంపత్య వ్యవస్థలో మార్పు కలగగానే బంధుత్వాలు మారవు ఆ కారణం చేత ఈనాటి బంధుత్వాలు ఒకనాటి వ్యవస్థకు సంకేతాలుగా మిగిలిపోతాయి వెనుకబడిన జాతులలోనూ అదే జరిగింది. మన తల్లి తాలూకు అక్క చెల్లెళ్ళందరూ తండ్రి భార్యలు కాకపోయినా వాళ్ళను ''అమ్మా'' అనే అంటున్నాం – ఎందుకంటే ఒకప్పుడు వాళ్ళంతా తండ్రి భార్యలే. అలాగే మనం మేనమామ భార్యనూ, తండ్రి సోదరినీ కూడా ''అత్త'' అనే అంటున్నాం ఒకప్పుడా ఇద్దరు వ్యక్తులూ ఒకరే. ఆ వ్యక్తి కూతురు మనకు భార్య అయికూడా ఉండేది గనక. భార్యల తల్లులూ మనకు ''అత్త''అవుతున్నారు. ఈ ''వరసలు '' ఒకనాటి వాస్తవికతను ఇంకా సూచిస్తున్నాయి.

అయితే మనుషులు ఆటవిక దశలో ఉండగానే ఒక తల్లి పిల్లల మధ్య దాంపత్యం జాతి క్షీణించటానికి కారణమవుతుందన్న సంగతి స్పష్టమయింది అలాటి దాంపత్యాలు నిషేధానికి గురిఅయ్యాయి ఇలాటి నిషేధం నిమిత్తమే ఆస్ట్రేలియాలోని ఆదిమవాసులు స్త్రీ పురుష వర్గాలను నాలుగేసి శాఖలుగా విభజించి, అందులో ఒక్కొక్క పురుషశాఖకూ, ఒక్కొక్క స్త్రీ శాఖతోనే దాంపత్యం ఉండేటట్టు నియమం ఏర్పాటు చేశారు.

కులాలు ఏర్పాటు కావటంతో ఈ పీడ పూర్తిగా విరగడ అయింది.

సొంత సోదరీ సోదరులమధ్య దాంపత్యాలు కొనసాగాయనీ, అనేకమంది స్త్రీలూ, అనేక మంది పురుషులూ సమష్టి దాంపత్యాలు నెరపారనీ నమ్మటం నాగరిక మానవులకు అసాధ్యమనిపిస్తుంది. సాండ్‌విచ్ దీవులకు కొత్తగా వెళ్ళినప్పుడు అమెరికన్ మిషనరీలు అక్కడి సాంఘిక పరిస్థితులను చూసి ''షాక్'' తిన్నారుట. ''వావి వరసలు లేవు , అక్కడి వాళ్ళు స్వేచ్ఛా ప్రణయజీవులులాగా కనబడ్డారు; దంపతీ నియమాలు లేవు; నీతి లేదు '' అని వాళ్లు రాశారు.

నీతి లేదన్నది అపోహ. అనాగరిక సమాజాలలో సాంఘిక నియమాలు అనుల్లంఘనీయమైనవి. తేడా ఏమంటే ప్రాచీన సమాజాల నీతి వేరు మనం నీతి అనుకునేది వేరు. మహాభారతంలో వాహీనులనే గణజీవులను గురించి కర్ణుడు శల్యుడితో చెప్పేదీ, ఈ మిషనరీలు సాండ్విచ్ దీవిలో ఉండేవారిని గురించి చెప్పేదీ ఒక్కటిగానే ఉన్నది. ఈ కర్ణుడే శల్యుడికి మరొక కథ చెబుతాడు ; అరట్ట దేశానికి చెందిన కొందరు దాస్యులు ఒక పతివ్రతను ఎత్తుకుపోయి చెరిచారట. అప్పుడామె వారిని శపిస్తూ ''మీ స్త్రీలు వ్యభిచారిణిలవుదురు గాక, మానవులందరిలోకీ హీనులుగా ఉందురు గాక'', అన్నదిట ''ఆ కారణం చేతనే అరట్టులకు వారి పిల్లలు వారసులు కారు. వారి అక్క

చెల్లెళ్ళ పిల్లలు వారసులవుతారు'' అంటాడు కర్ణుడు సాంఘిక పరిణామాన్ని తల్లకిందులు చేసి!

ఏకోదరుల మధ్య వివాహాలు నిషేధించబడడంతో సపిండ (Consanguin) దాంపత్యాలు అంతరించి , ''మైత్రీ'' (Punalua) వివాహాలు అమలులోకి వచ్చాయి. ఈ వివాహాలలో సొంత అన్నదమ్ములూ, వరస అన్నదమ్ములూ కూడా తమ భార్య లందరినీ సమష్టిగా అనుభవిస్తారు. కొన్ని జాతులలో సొంత అన్నదమ్ములూ, వరస అక్క చెల్లెళ్ళందరూ తమ భర్తలను సమష్టిగా అనుభవిస్తారు. దాంపత్య ధర్మంలో ఈ కాస్త మార్పు రావడానికి కొన్ని వేల ఏళ్ళు పట్టినట్టు కనిపిస్తుంది.

కులాలు (వంశాలు) పరిణతి చెందినకొద్దీ సొంత సోదరీ సోదరుల మధ్యనేకాక వరసవాళ్ళ మధ్యకూడా దాంపత్యాలు నిషేధం పొందాయి. ఇలాంటి దాంపత్యాల ఫలితంగా ఏర్పడిన బంధుత్వాలు ''తురాను'' సంప్రదాయంగా చెప్పబడ్డాయి. అంటే ''మలయా'' సంప్రదాయం మీద ''తురాను'' సంప్రదాయం వచ్చిందన్నమాట ఈ మార్పు ఫలితంగా , నా చెల్లెలి సంతానం నా సంతానం కావటంమాని నా మేనల్లుళ్ళూ, మేనగోడళ్ళూ అయ్యారు ! నా తండ్రి చెల్లెలు నాకు తల్లి వరస కావటంమాని, అత్త వరస అయింది మిగిలిన బంధుత్వాలలో మార్పురాలేదు. (ఈనాడు మన బంధుత్వాలు తురాను సంప్రదాయానివే ; కాని మనం అవలంభించే వివాహ విధి ఆర్య సంప్రదాయానికి చెందిన దంపతీ (Monogamian) పద్ధతికి చెందినది.)

మైత్రీ వివాహాలు అనాగరిక దశ రెండవ విదశదాకా కొనసాగాయి. అనేక డజన్ల సంఖ్యలో అన్నదమ్ములు తమ భార్యలను సమష్టిగా అనుభవించారు. ఇది అప్పటి బ్రిటనులలో సర్వసాధారణం. ఇక్కడ మనం గమనించవలసిన దేమంటే ఈనాటి దంపతీ వివాహాల ఫలితంగా అన్నదమ్ములు డజన్ల సంఖ్యలో ఉండరు. ''మైత్రీ'' కుటుంబాలు చాలా పెద్దవి ; అనేకమంది భార్యలూ, వారి భర్తలూ, వారి ఉమ్మడి సంతానమూ ఒకే కుటుంబంగా నివసించేవారు.

కాలక్రమాన మైత్రీ వివాహాలు వెనకబడి ''జంట'' వివాహాలు – Syndyasmian family - వచ్చాయి. (సిండియాస్మోన్ – జతకలపటం) ఈ ఏర్పాటులో ఫలాని భార్యకు ఫలాని భర్త అన్నది ఉండేది ; కాని ఆ దాంపత్యాలు నామమాత్రమైనవి, నిలకడ లేనివి వాళ్ళు యథేచ్ఛగా విడిపోయి ఇతర స్త్రీ పురుషులతో సంపర్కం పెట్టుకోవచ్చు స్త్రీ పురుషులకు సమాన హక్కులుండేవి.

ఈ జంట వివాహాలు ప్రేమానురాగ బంధాల వల్ల ఏర్పడినవి కావు. మొహాలు తెలీనివారి మధ్య పెద్దలు పెళ్లి ఏర్పాటు చేసేవారు. పెళ్ళాడేవారి సమ్మతి అవసరం లేదు. సంతానం పూర్తిగా స్త్రీకే చెంది ఉండేది. ఇలాటి వివాహాలలో Aztee జాతివారు కొంగులు ముడివేసే ఆచారాన్ని పాటించేవారు.

ఈనాడు మనం అమలు చేస్తున్న వివాహవిధిని శ్రద్ధగా పరిశీలిస్తే , కొంగులు ముడివెయ్యటం లాంటివి అంటుంచి అన్ని విధాలా మనం అనాగరిక వైఖరినే అవలంబిస్తున్నట్టు కనబడుతుంది మన సంప్రదాయంలో కూడా మొహాలు తెలియనివాళ్ళ మధ్యనే వివాహాలు జరుగుతున్నాయి. పెద్దలు వాటిని ఏర్పాటు చేస్తున్నారు. తేడా అల్లా, స్త్రీకి పురుషుడితో సమమైన స్వేచ్ఛ లేదు. మనవి ఆజన్మదాంపత్యాలు పిల్లల మీద తల్లికుండే అధికారం కనేవరకే

కుల (వంశ) న్యవస్థ బలపడడంతో ''మైత్రీ'' కుటుంబం సంకుచితమైపోయింది. ఒకే కులంలో వారి మధ్య వివాహాలు నిషిద్ధాలు, పరాయి కులంలో నుంచి భార్యలను తెచ్చుకోవాలి. అందుచేత ''కన్యాశుల్కం'' ఇచ్చి భార్యలను తెచ్చుకోవటమూ, శత్రు కులాలనుంచి కన్యలను బలత్కారంగా తెచ్చి పెళ్ళాడటమూ పరిపాటి అయింది ఇవి రాక్షస వివాహాలు భీష్ముడు కాశీరాజు కుమార్తెను ఇలాగే ఎత్తుకు రావటం జరిగింది. రాక్షస వివాహాలను మన పూర్వులు ఆమోదించారు – గాంధర్వ వివాహాలను ఆమోదించినట్టే.

జంట వివాహాలు చాలాకాలం అమలులో ఉండి, అనాగరిక దశ అంత్యదశలో ఈనాటి దంపతీ వివాహాలుగా మారాయి. అవి నాగరిక దశలో స్థిర రూపం పొందాయి.

సపిండ కుటుంబాలలోనూ, మైత్రీ కుటుంబాలలోనూ తండ్రి హక్కులకు ఏ మాత్రమూ తావు లేకపోయింది. మైత్రీ కుటుంబాల కాలంలోనే కుల విభజన జరిగింది. ఆ కులాలు కూడా స్త్రీ పారంపర్యంగలవి స్త్రీ పారంపర్యం పురుష పారంపర్యంగా పరివర్తన చెంది , సమష్టి వివాహాలకుబదులు జంట వివాహాలు అమలులోకి రావటంతో పైతృక హక్కులకు బీజం ఏర్పడింది.

సమాజంలో మగవాడిది పైచెయ్యి అయిన కొద్దీ, స్త్రీ తన భర్తను విడిచి ఇతర పురుషులతో జీవించే హక్కును కోల్పోయింది. ఇతర స్త్రీలను భార్యలుగా చేసుకుని బహు భార్యత్వం అమలు చేసుకునే హక్కు పురుషుడికి మిగిలింది. ఇలాటి పురుషులు మన పురాణాలలోనూ, పుక్కిటి పురాణాలలోనూ చాలా మంది ఉన్నారు.

గ్రీకుల పౌరాణికుడు హోమర్ చేసి రచనలనాటికి గ్రీకులు దంపతీ వివాహాల దశకు వచ్చారు. కాని ఆనాటి గ్రీకు సమాజంలో స్త్రీకి ఎలాటి హక్కులూ లేవు. ఆమె గౌరవనీయురాలు కాదు. ఆమె తనవారిని వదిలి అపరిచిత ఇంటమెట్టేద్ది, ఆమె జన్మ సంతానం కనటంతోనే సార్థకమయేది. ఆమె ఇంచుమించు ఇంటి పరిచారిక. ఇతర పురుషుల ఎదటికి రారాదు. ఆమె పట్ల భర్త ''తండ్రి'' వైఖరి అవలంభించేవాడు.

ఇంచుమించు 3,000 ఏళ్లక్రితం గ్రీకు స్త్రీలు ఎలా వుండేవారో ఈనాడు మన స్త్రీలు అలాగే ఉండటం గమనించదగినది. ఇంతకంటే కూడా వింత విషయం ప్రస్తావించక తప్పదు. ఈనాడు స్త్రీల పరిస్థితి మెరుగుపరచాలనుకుని రచనలు చేసే రచయిత్రులు,

పురుషులు తమ భార్యల పట్ల ''తండ్రి'' పాత్రను నిర్దుష్టంగా నిర్వహించమని వేడుకున్నారే గాని, భార్యాభర్తల మధ్య నిజమైన సమత్వం రావాలని కోరుకోవటం లేదు. అందుకు కారణం వారికి తెలియకపోవచ్చు ; అలా కోరటం సాంఘిక విప్లవాన్ని ఆహ్వానించటమవుతుంది. అందుకనే ఈనాటి ఆడది తన భర్తను ''నన్ను అర్థం చేసుకో, నాకూ ఒక హృదయం ఉన్నదని గుర్తించు నా మనసును సంతోషపెట్టు, బాధ పెట్టకు'' అని అర్థిస్తున్నది. ఈ కోరికలు ఏ కూతురు ఏ తండ్రి నైనా కోరవచ్చు !

*ముద్రణ : ఆంధ్రజ్యోతి, వారపత్రిక , 8-5-1970*

# 7. సమాజమూ - ఆస్తి హక్కులు

మానవ సమాజం ఆటవిక దశలో మూడు అంతరాలూ, అనాగరిక దశలో మరో మూడు అంతరాలూ గడిచి నాగరిక దశకు చేరుకోడానికి మూడు శక్తులు తోడ్పడ్డాయని చెప్పవచ్చు.

1. మనిషి జ్ఞాన విజ్ఞానాలు క్రమంగా అభివృద్ధి చెందుతూ వచ్చాయి. అతను తన పరికరాలను పెంచుకుని, అభివృద్ధి చేసుకొని తన మనుగడకూ, క్షేమానికీ, పెరుగుదలకూ అవసరమైన విధంగా ప్రకృతి శక్తులమీద విజయం సాధిస్తూ వచ్చాడు. చేపలు పట్టటమూ, విల్లుబాణాలతో జంతువులను వేటాడటమూ అతని ఆహార పరిధిని విస్తరించింది. వ్యవసాయమూ, చెట్ల పెంపకమూ, పశుపోషణా అతనికి స్థిర నివాసం సాధ్యం చేశాయి మానవ గణాలు సంఖ్యాభివృద్ధి చెందటానికి తగిన వసతులు ఏర్పడ్డాయి. లోహ పరిశ్రమ నాగరికతను అతనికి అందుబాటులోకి తెచ్చింది.

2. ఇదే సమయంలో మానవుడు తన సాంఘిక వ్యవస్థను ఎప్పటికప్పుడు తన అభ్యుదయానికి అనుకూలించేలాగా మార్పులు - విప్లవయుతమైన మార్పులు- చేసుకుంటూ వచ్చాడు. జాతి మంచి కోసం ఏకోదరుల మధ్య దాంపత్యాలూ, రక్త బంధువుల మధ్య దాంపత్యాలూ నిషేధించబడ్డాయి కులాలు ఏర్పాటయ్యాయి. వాటి మధ్య దాంపత్య నియమాలు అమలు జరిగాయి. జాతిపాలన కోసం నాయకులూ, రక్షణ నిమిత్తం రణ నాయకులూ నియమించబడ్డారు. స్వేచ్ఛా, సమత్వమూ, సౌభ్రాత్రమూ, ప్రజాతంత్రము నిర్దుష్టంగా అమలు జరిగాయి. సమష్టి వివాహాలు పోయి జంట వివాహాలూ, దంపతీ వివాహాలూ వచ్చాయి సామాజికాభివృద్ధి సాధించటంలో స్త్రీ పాత్ర కన్నా పురుషుడి పాత్రకు ప్రాముఖ్యం రాగానే కుల పరంపర తల్లినుంచి తండ్రికి మార్చబడింది. చిట్టచివరి మెట్టుగా జాతి సమాజం స్థానాన్ని రాజకీయ సమాజం ఆక్రమించుకున్నది.

పైన చెప్పిన అంశాలకన్నా అతి ముఖ్యమైనది ఆస్తి హక్కు. రాను రాను సమాజ స్వరూప పరిణామాన్ని ఈ ఆస్తి హక్కే అధికంగా శాసించి, నాగరికదశ వచ్చేసరికి అత్యంత బలీయమైన సాంఘిక శక్తిగా రూపొందింది

మానవ పురుషగమనంలో ఈ ఆస్తిహక్కు నిర్వహించిన పాత్రను స్థూలంగా పరిశీలించుదాం

నిప్పును ఉపయోగించటం తెలియక, పరిణతమైన భాష కూడా లేక, హస్త విన్యాసాలతో సంభాషణ సాగిస్తూ, సరిఅయిన ఆయుధాలు ఎరగక ఎలాటి సామాజిక భావాలూ, నియమాలూ లేకుండా , ప్రకృతి సిద్ధంగా లభ్యమైన ఆహారం మీద జీవిస్తూ వచ్చిన అతి ప్రాచీన మానవుడి స్థితిని మనం ఊహించవలసిందే గాని ఆ స్థితిని గురించి మనకు ప్రత్యక్ష సాక్షం లేదు.

మానవుడి తొలి ఆయుధం దుడ్డు (Club) తరువాత చెకుముకి, ములికి గల ఈటె వచ్చింది చెకుముకి కత్తులూ, బేరాణాలూ, రాతి గొడ్డళ్ళూ , సమ్మెటలూ వచ్చాయి. తడపలతో అల్లిన బుట్టలకు మట్టి పట్టించి వంట పాత్రలుగా చేశారు. తరువాత కుండల తయారీ వచ్చింది. నారతాళ్ళూ, నార పోగులూ, నార బట్టలూ వచ్చాయి పదును చేసిన తోళ్లూ, చెట్టు బెరడు కప్పిన గుడారాలు వచ్చాయి.

జనసంఖ్య పెరిగింది. జనానికి ఒకే స్థావరాన్ని అంటిపెట్టుకుని ఉండే అవసరం తప్పి, చలన శక్తి వచ్చింది ''సపిండ'' కుటుంబాల పద్ధతి విడిచిపెట్టి కులాలు ఏర్పాటు చేసుకున్నారు. చిన్న చిన్న మురాలుగా చీలి, తెగలు ఏర్పాటు చేసుకుని అక్కడక్కడా గ్రామాలు నిర్మించుకున్నారు. కాని ఆ గ్రామాలకింకా రక్షణలు ( కాత్రగడలు) లేవు. వారికింకా పిండి ధాన్యాలు తెలియవు. వారి కాలమంతా ఆహార సేకరణలోనే గడిచేది నరమాంస భక్షణ ఉండేది. కాని వారి భాష చాలాబాగా అభివృద్ధి చెందింది. వారు ఆటవిక దశనుంచి అనాగరిక దశలో అడుగు పెట్టటానికి తగిన అభివృద్ధి సాధించారు

ఆటవికులకు చెప్పుకోదగిన ఆస్తి ఉండేది కాదు ''ఇది ఆస్తి, దీనికి విలువ ఇవ్వాలి. దీన్ని వాంఛించవచ్చు. దీన్ని వారసత్వం ద్వారా పొందాలి'' అన్న భావాలు వారికి ఉండేవి కావు. అప్పటికి వారికుండిన ఆస్తి కొద్ది ఆయుధాలూ, చెకుముకి ఉపకరణాలూ, ముతక బట్టలూ, దుస్తులూ, పాత్రలూ, ఆభరణాలూ మాత్రమే. భూములు వేరు వేరు జాతుల సమష్టి ఆధీనంలో ఉండేవి వ్యష్టి సంపద పెరుగుతూ వచ్చింది. లందులో ముఖ్యమైనదంతా వ్యక్తితోపాటు ఖననం చేసేసి, మిగిలాది అతని కులంవాళ్లు పంచుకునేవాళ్లు. కులాలు ఏర్పాటు కాకముందు ఏం చేసేవారో మనకు తెలీదు. కాని కులాలంటూ ఏర్పాటయ్యాక యావదాస్తి కులంతోనే ఉండాలన్న నియమం

దృఢంగా ఏర్పడింది.

ఇది మానవులు సృష్టించుకున్న తొలి ఆస్తి హక్కు. ఈ ఆస్తిహక్కు అన్ని దశలలోనూ అమలు జరిగింది. గ్రీకు, లాటిను జాతులు నాగరిక దశలోకి వచ్చినాక కూడా ఈ తొలి ఆస్తిహక్కును చాలాకాలం అమలులో ఉంచారు

అతి దీర్ఘంగా నడిచిన ఆటవిక అంధకార యుగంనుంచి మానవుడు అనాగరిక దశలోకి అడుగుపెట్టాడు. ఆరంభ అనాగరిక దశలో మానవులు (ముఖ్యంగా పశ్చిమార్ధగోళంలోనివారు) మట్టిపాత్రల నిర్మాణాన్ని బాగా అభివృద్ధి చేశారు. పడుగు పేకలతో బట్టలు నేశారు. మొక్కజొన్న వ్యవసాయం సాగించారు. లిపి ఏర్పడింది. గ్రామాలకు కర్రలదడులు (కాట్రగడలు) రక్షణలుగా వెలిశాయి. ముడి చర్మాలతో డాళ్ళు తయారయ్యాయి; అవి వారిని బాణాలనుంచి కాపాడేవి. ఇళ్ళ నిర్మాణ వాస్తు అభివృద్ధి అయింది. కొయ్య రోళ్ళూ, రోకళ్ళూ వచ్చాయి. (ధాన్యం, పిండి కొట్టటానికి).

భూములింకా సమష్టిగానే ఉన్నప్పటికీ పొలాలు సాగుచేసుకునే హక్కు వ్యక్తులపరమై, వారి సంతతికి సంక్రమించసాగింది భార్యా భర్తల ఆస్తి వేరువేరుగా ఉండేది. వారు మరణిస్తే ఎవరి ఆస్తి వారి కులంలోనే ఉండిపోయేది.

స్త్రీ పారంపర్యాన్ని అంటిపెట్టుకున్న జాతులలో చనిపోయిన పురుషుడి ఆస్తిలో హెచ్చు భాగం అతని ఆడ తోబుట్టువులకూ, వారి సంతానానికీ, అతడి మేనమామలకూ పోయేది ; అత్యల్ప భాగం మాత్రమే అతని అన్నదమ్ములకు దక్కేది. స్త్రీ ఆస్తి ఆమె తోబుట్టువులకూ, తల్లులకూ పోయేది.

పురుష సంతతికి మారిన జాతులలో (ఉదాహరణకు Ojibwa జాతిలో ) కులాలు పురుష పరంపరలో ఏర్పాటయినా కూడా ఆస్తి హక్కులు పైనచెప్పినట్టే అమలు జరిగాయి; (స్త్రీలకు ఆస్తి హక్కులేమీ లేకుండా చేసిన మనంకూడా స్త్రీ ధనాన్ని అంటటం చాలా హేయమని భావిస్తాం.)

అనాగరిక దశలో ఆస్తులు పెరిగినమాట నిజమేగాని, ఆస్తిహక్కు అన్నది ఒక ప్రబలమైన సామాజిక శక్తిగా రూపొందటం ఇంకా జరగలేదు.

ఈ దశలోనే ఆస్తి హక్కులకు సంబంధించిన రెండవ నియమం అమలులోకి వచ్చింది. ఆస్తికి వారసులు కులంవారంతా కాదు. సన్నిహితులు మాత్రమే ఆస్తి కులంలోనే ఉండాలన్నది తొలి ఆస్తిహక్కు తాలూకు మతభావం. అలాకాకుండా ఆస్తి హక్కును ఈ రెండవ నియమం కులానికి చెంది ఉన్న వారిలో సన్నిహితులకు పరిమితం చేసింది. ఈ రెండవ హక్కు ఏర్పడేనాటికి పురుష పరంపర ఏర్పడి ఉండడంచేత సన్నిహితులన్న వారంతా పురుష పరంపరకు చెందినవారే.

అనాగరికత ప్రథమ భాగంలో నరభక్షణ అనే సంప్రదాయం అంతరించింది. కాని యుద్ధాలప్పుడు పాటించబడేది అనాగరికత మధ్య విదశలోనే ఇది పూర్తిగా అంతరించింది ప్రథమదశలో మనుషులు వ్యక్తి గౌరవమూ, వక్తృత్వమూ, మతాభిమానమూ, నిర్దుష్ట వర్తనమూ, ధైర్యమూ, పౌరుషమూ ప్రకటించటం నేర్చుకున్నారు అయితే వారిలో క్రౌర్యమూ, ఘాతుకత్వమూ, మూఢవిశ్వాసాలూ హెచ్చుగా ఉండేవి ప్రకృతిని ఆరాధించేవారు ఈ దశలో అలిఖిత సారస్వతం విరివిగా సృష్టిఅయి అప్పటివారిని బలంగా ప్రభావితం చేసింది. అనేక పురాణాలూ, గాథలూ, సంప్రదాయాలూ పుట్టాయి.

అనాగరికదశ మధ్య అంతరం పూర్వార్థగోళంలోని పశువుల పెంపకంతో ప్రారంభమయింది. పశ్చిమార్ధగోళంలోని ఆదిమవాసులు ఈ దశలో కంచుకరిగించి, పోత పొయ్యటం నేర్చుకున్నారు. రెండువౌరల కత్తులు తయారు చేశారు. ప్రాకార రక్షణగల నగరాలు నిర్మించారు. చాలా పెద్ద మట్టి భాండాలు తయారు చేశారు. నూలుచుట్టలూ, కాలమానం కొరకు పంచాంగమూ, ఏదో ఒకరకం లిపి సృష్టించుకున్నారు. విస్తృతమైన పురోహితవర్గం ఏర్పాటయింది జాతిలో నాయకులు, కులీనత్వం ప్రకటించే లక్షణాలు తలెత్తాయి.

పూర్వార్ధగోళంలో పశుసంపదను పెంపొందించుకున్నవారు కూర మొక్కలనుగాని, వ్యవసాయాన్నిగాని ఆశ్రయించినట్టు కనబడదు (బృందావనంలో గోకులంవాళ్ళ వ్యవసాయం చేసినట్టు కనబడదు అయినా వాళ్ళు వనాన్ని తగలబెట్టటం హరివంశంలో చెప్పి ఉన్నది – అది వ్యవసాయానికి మొదటి మెట్టు అంతేగాక బలరాముడు నాగలిపట్టుకు తిరిగాడు. దానితో అతడు కాళిందినుంచి వ్రేపల్లెకు కాలవ తీసినట్టు కూడా హరివంశంలో ఉన్నది. కాని అది మంచినీటి కోసమే లాగా కనబడుతుంది. )

ఈ విదశలో వ్యక్తుల ఆస్తి బాగా పెరిగింది. భూమి ఇంకా జాతికి ఉమ్మడిగానే ఉన్నదిగాని అందులో ఒక భాగం సంఘపాలకులకూ, హెచ్చుభాగం వివిధ కులాలకూ పంచబడింది కాని తన ఆధీనంలో ఉన్న పొలాలను అమ్మేహక్కు ఎవరికీ లేదు

వంశ పారంపర్యం స్త్రీలనుంచి పురుషులకు మారటానికి బలమైన కారణం ఆస్తి హక్కు ఆస్తిని పెంపొందిచటంలో పురుషుడి పాత్ర క్రమంగా హెచ్చుతున్నది. అతని సంతానానికి ఆ ఆస్తి సంక్రమించాలన్న భావం ప్రాముఖ్యం వహించింది.

లోహ పరిశ్రమ అనాగరికతను అత్యుతన్నత స్థాయికి తెచ్చింది. అది ఆస్తి సంపాదనకు చేసిన దోహదం అనన్యమైనది సంపదా, వ్యష్టి సంపదా అపారంగా అభివృద్ధి

అయ్యాయి. బానిస విధానం సమాజంలో బాగా పాతుకుపోయింది బానిసలే సంపదను సృష్టించటానికి సాధనమయ్యారు. వ్యవసాయం చాలా అభివృద్ధిలోకి వచ్చింది. జాతులు వేరువేరు స్థానాలలో పెంపొంది స్థానబలం చేకూర్చుకున్నాయి రక్షిత నగరాలు వెలిశాయి వాంఛనీయమైన ప్రదేశాల కోసం యుద్ధాలు సాగాయి పరాక్రమం ఆరాధనీయమయింది

ఈ స్థితిలోనే ''యజమాని కుటుంబాలు''(Patriarchal families) పుట్టుకొచ్చాయి. అత్యంత సంపన్నులయిన వాళ్లు అనేకమంది భార్యలను కట్టుకుని, బలగాన్ని పెంచుకున్నారు. బహు భార్యలూ, బలగమూ – యజమాని కుటుంబానికి గీటురాయిగా భావించటం పొరపాటు. ఈ కుటుంబాలకు చెందిన అసలయిన బలగం అసంఖ్యాకులయిన బానిసలు. యజమానులకు తమ బలగం మీద సర్వాధికారులుండేవి భార్య అయ్యేది, కొడుకయ్యేది, కూతురయ్యేది, బానిస అయ్యేది – యజమాని ఎవరిని హింస పెట్టినా, చంపినా దానికి తిరుగు ఉండేది కాదు.

అనాగరిక దశ ఉన్నతిలో భూమి వ్యక్తుల పరమయింది. దంపతీ వివాహాలు ఈ స్థితిలోనే అమలులోకి వచ్చాయి. గుర్రాలూ, పశువులూ, గొర్రెలూ అసంఖ్యాకమైన మందలలో వ్యక్తుల ఆస్తి అయ్యాయి. గ్రీకులలోనూ, మన పురాణాలలోనూ కూడా ఇలాటి సంపద ఉండేది. పొలాలు వ్యక్తుల ఆస్తి అయ్యాయి. వాటికి కంచెలు ఏర్పడ్డాయి.

ఈ దశలోనే మూడవ ఆస్తి హక్కు నియమం అమలులోకి వచ్చింది. మృతుడి ఆస్తి అతడి పిల్లలకు మాత్రమే చెందుతుంది. దంపతీ వివాహాల వల్ల పిల్లలకు తండ్రి అయినవాడు స్పష్టంగా ఉండటంచేత తండ్రి ఆస్తికి పిల్లలు వారసులు కావటం వీలయింది

ఈ మూడో ఆస్తి హక్కు నియమం కొన్ని సమస్యలు తెచ్చిపెట్టింది

ఒక వ్యక్తికి మగపిల్లలులేరు. ఆడపిల్లలే ఉన్నారు. ఆ వ్యక్తి చనిపోయాక అతని ఆస్తి కూతుళ్ళదయింది. కాని వారు పెళ్ళి చేసుకోదలచినప్పుడు కులంవారు అభ్యంతరం చెప్పారు. వారు పెళ్ళి చేసుకుని మరొక కులం (వంశం) లోకిపోతే ఆస్తి కులాంతరానికి వెళ్ళిపోతుంది. యూదుల ధర్మశాస్త్ర నియంత అయిన మోజెస్ కులంవారి అభ్యంతారన్ని బలపరుస్తూ, ఆ పిల్లలు తమ కులంవారినే పెళ్ళాడవచ్చునని తీర్పు చెప్పాడు. అనాదిగా నిషిద్ధమై ఉన్న వివాహ నియమాన్ని ఆస్తి హక్కు కొట్టిపారేసింది.

గ్రీకుల మనువులాటివాడు సోలన్ కూడా ఇదే పరిస్థితిలో సరిగా ఇలాటి తీర్పే చెప్పాడు. దీనినిబట్టి కొన్ని సాంఘిక నియమాలూ వాటి ఉల్లంఘనలూ భౌతిక కారణాలవల్ల అన్ని జాతులలోనూ ఒకే విధంగా జరిగినట్లు స్పష్టమవుతుంది. ఇంకా దగ్గర ఉదాహరణ తీసుకోవాలంటే మనలో వివాహాలు మనుధర్మశాస్త్రానికి విరుద్ధంగా

జరుగుతున్నాయి ఇలాంటి ఆచారాల వెనక ఆస్తి హక్కుల ప్రభావం స్పష్టంగా కనబడుతుంది.

వ్యక్తుల ఆస్తులు పెరగటంతో వారి పలుకుబడీ, హోదా కూడా పెరిగాయి. కొన్ని వంశాలు ''ఉన్నతి'' సాధించుకున్నాయి. సమత్వం అడుగంటింది. (పురుష పరంపరను అవలంబించిన కులాలను వంశాలనవచ్చు). సంఘంలో బానిసలు అనే ఒక హీనవర్గం వెలిసింది. ఆర్యసమాజంలో వీరు శూద్రులు వీరికి వేదాలు చదివే హక్కు లేదు వైదిక సమాజంలో వీరికి స్థానం లేదు స్త్రీలు కూడా శూద్రులలాగే ఒక హీనజాతిగా పరిగణించబడ్డారు

ఈ అసమత్వం సంఘంలో (జాతిలో) స్పర్ధలకూ, సంఘర్షణలకూ దారితీసింది ఆస్తి , హోదా అనే రెంటిమీదా అగ్రవర్గం తిష్ఠవేసి కూర్చున్నది ఈ పరిస్థితి గురించి మోర్గన్ అన్న మాటలతో ఈ వ్యాసం ముగిస్తాను.

''ఈ నియమం ఉండాలా, ఊడాలా అన్నది మధ్య యుగాలలో మానవులను వేధించిన ప్రముఖ సమస్యలలో ఒకటి పర్యవసానం ఎలా ఉండబోతుందన్నది స్పష్టమే అమెరికాలో మినహా , హక్కుదార్లను (Privileged classes) కూలదోయ లేకపోవటం అనేకవేల సంవత్సరాలుగా సాధ్యం కాకుండా ఉన్నప్పటికీ, సంఘంపై వారి భారం నిరూపించబడింది.

''నాగరికదశ ఆరంభమయాక ఆస్తి అపారంగా అభివృద్ధి అయింది. అది వివిధ రూపాలు ధరించింది. దాని ఉపయోగాలు బహుముఖాలుగా అభివృద్ధి అవుతున్నాయి. దాని నిర్వహణ సొంతదారులకు లాభసాటిగా ఉండగలందులకు అసాధారణ ప్రజ్ఞ ఉపయోగించబడుతున్నది ; ఈ కారణంగా ప్రజలు దాని శక్తిని అదుపులో పెట్టలేకపోతున్నారు. మానవ మేధ తన సృష్టిని చూసి తానే దిగ్భ్రాంతి చెందుతున్నది అయినా, మానవ మేధ ఈ ఆస్తిని జయించే రోజు వస్తుంది (మోర్గన్ ఈ మాట అన్న 40 ఏళ్ళకు ఆ రోజు వచ్చింది) ఆనాడు ప్రభుత్వానికీ, అది సంరక్షించే ఆస్తికీ గల సంబంధమూ, ఆస్తులు గలవారి హక్కులూ, బాధ్యతలూ నిర్వచించబడ్డాయి. వ్యక్తి లాభం కన్న సంఘ లాభం గొప్పది ; ఈ రెంటికీ సమన్వయం జరగాలి. గతంలో లాగే భవిష్యత్తులో కూడా అభ్యుదయమే పరమార్థం కావాలంటే, ఆస్తి జీవనం మానవుడి చరమ లక్ష్యం కారాదు. మానవుడు భూమి మీద ఉన్న కాలంతోనూ, ఉండబోయే కాలంతోనూ పోల్చితే నాగరిక యుగం కింద గడిచిన కాలం అత్యల్పమైనది. ఆస్తే పరమాదర్శంగానూ, ఏక లక్ష్యంగానూ గల వ్యవస్థకు వినాశనం తప్ప మరొక పరిణామం లేదు; ఎందుకంటే ఆస్తి జీవనంలో స్వయం నిర్మూలనకు బీజాలు ఉన్నాయి. పరిపాలనలో

డెమోక్రసీ. సంఘంలో సౌభ్రాత్రమూ, అందరికి సమమైన హక్కులూ, అనుకూల్యాలూ ఉండటమూ, అందరికీ విద్యా – ఇవే భావి సమాజానికి లక్షణాలని అనుభవమూ, వివేకమూ, జ్ఞానమూ క్రమంగా గ్రహిస్తున్నాయి. ప్రాచీన కులాలు అమలు చేసిన స్వేచ్ఛా, సమానత్వమూ, సౌభ్రాతృత్వము తిరిగి ఉన్న దశలో వ్యవస్థీకరించబడతాయి ''

ఈ మాటలు రాసిన మోర్గన్ గొప్ప ద్రష్ట అనటానికి సందేహం లేదు. నూరేళ్ళ క్రితం ఆయన ఈ మాటలు రాసినదరిమిలా నాగరికత ఇంకా చాలా ముందుకు వచ్చింది దాని వినాశనం ఈనాడు మరింత స్పష్టంగా కనబడుతున్నది. ఆస్తి హక్కు భీకర పైశాచిక రూపాన్ని అమెరికా ప్రపంచ ప్రదర్శనకు పెట్టింది

మోర్గన్ చెప్పిన ఉన్నత సమాజం 1917 నవంబరు 7న భూమి మీద పడింది ఆ తేదిన నాగరిక దశలో రెండవ పాదం ప్రారంభమైనట్టు భావించవచ్చు. ఆటవికదశ అనాగరికదశ అనేక దశ సహస్రాబ్దాలపాటు కొనసాగి, అడుగడుగునా విప్లవ పరిణామాలు సాధించాయి. అడుగడుగునా మానవుడు ఎదుర్కొన్న ఘర్షణ ఈనాడు మనం ఊహించను కూడా ఊహించలేం. నాగరిక యుగం ప్రారంభమై 3,4 వేల ఏళ్ళే అయింది. సమ సమాజమే నాగరిక యుగపు ప్రధాన లక్షణమనీ, అనాగరిక యుగపు ఆస్తిహక్కులు నాగరిక యుగపు రెండో పాదంలో క్రమంగా అంతరించాయని భావి చరిత్రకారులు రాయటం జరగవచ్చు.

*ముద్రణ : ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 15-5-1970*

# 8. వేదకాలపు ఆర్యులు

[ లోగడ నేను వ్రాసిన వ్యాసాలను గురించి కొన్ని విమర్శలు వచ్చాయి. అవ రెండు రకాలుగా ఉన్నాయి. ఆ వ్యాసాలలో ఉన్న వైజ్ఞానిక విషయాలు (ఆంత్రొపాలజీకి సంబంధించినవి), అధునాతనంగా లేవని కొందరు వైజ్ఞానికులు ఆక్షేపించారు. ఆంధ్రజ్యోతి పాఠకులకు Up - to - date ఆంత్రొపాలజీ చెప్పటమే నా ఉద్దేశమైతే నూరేళ్ళనాటి మోర్గన్ పుస్తకం తీసుకుని ఉండనని వారు సులువుగా గ్రహించి ఉండవచ్చు.

నేనీ వ్యాస పరంపర ఎందుకు రాస్తున్నానో కొంతవరకు బాగా గ్రహించినవాళ్ళ రెండో రకం విమర్శకులు. మన పూర్వులు ఆటవికదశనూ, అనాగరికదశనూ గడిపిన వారేనని సూచించటానికి ఈ వ్యాసాలు రాశాను. మన దేవతలూ, మహర్షులూ, పురాణ పురుషులూ అనాగరిక, ఆటవిక జీవితం గడిపారన్నమాట ఈ రెండో రకం విమర్శకులకు మింగుడు పడలేదు. మత విశ్వాసాలు తెచ్చిపెట్టిన వ్యామోహాన్ని కొంతవరకైనా కొందరిలోనైనా వదలగొట్టటానికి ఈ వ్యాసాలు ప్రారంభించాను. అందుకోసమే మోర్గన్

పుస్తకంలో విషయాలు - వాటిలో శతాంశం కన్నా కూడా తక్కువ - ఉపయోగించుకున్నాను. అంతే గాని మోర్గన్ ఈ విషయాలమీద లేటెస్ట్ అథారిటీ అని కాదు

నా ప్రయత్నానికి ఒక సామ్యం చెబుతాను అణువు బాంబులను గురించి సామాజిక రాజకీయ దృక్పధంతో రాయబూనిన వాడికి ఆ బాంబుల నిర్మాణానికి సంబంధించిన సరికొత్త వైజ్ఞానిక విషయాలు తెలియటం అంత ముఖ్యం కాదు అందుచేత ఆంత్రొపాలజీ తెలిసినవారు నాకు సహాయపడి రెండో రకం విమర్శకులను ఖండించటం అవసరం . నెమలి ఈకలు ధరించేవాళ్ళు చెంచులని తెలిసినవాళ్లుకూడా కృష్ణుడు వాటిని ధరించటం అవతారపురుషుడి లక్షణమని గుడ్డిగా నమ్మేవాళ్లున్నారు. ఇలాంటి మూఢ విశ్వాసాలు సవాలక్ష మనవాళ్ళ బుర్రలను జలగల్లాగా పట్టి పీల్చేస్తున్నంతకాలమూ, మనం వైజ్ఞానికంగా గాని, రాజకీయంగా గాని, ఆర్థికంగా సైతం ఆధునిక జాతిగా రూపొందలేం. ఆ నమ్మకమే నన్నీ వ్యాసాలు రాయటానికి ప్రేరేపించింది

ఈ వ్యాసాలలో నేను సొంతంగా కనిపెట్టినది ఆవంత కూడా లేదు. లోగడ, మోర్గన్ రచించిన "Ancient Society" పైన ఆధారపడినట్టే ఇక ముందు రాసే వ్యాసాలను దేవీ ప్రసాద్ చటోపాధ్యాయ రచించిన ''లోకాయత్'' ఆధారంతో రాస్తాను వీటివల్ల కొందరికైనా గతమానవ చరిత్రను గురించి కాస్త స్పష్టమైన అభిప్రాయాలు ఏర్పడితే అంతే చాలు - కొ.కు ]

ఋగ్వేదరచన (సృష్టి) క్రీస్తుపూర్వం 1500 సంవత్సరాల క్రితం ప్రారంభమై, కొన్ని శతాబ్దాల పాటు సాగిందట. క్రీస్తు పూర్వం 800-600 మధ్య బ్రాహ్మణాలూ, ఉపనిషత్తులూ వచ్చి ఉండొచ్చునంటున్నారు. శ్రౌత, గృహ్యసూత్రాలు క్రీస్తు పూర్వం 500-300 మధ్య వెలువడి ఉండవచ్చునట.

మన భారతీయ సంస్కృతికి మూలకందంగా ఉన్న ఈ సాహిత్యాన్ని సృష్టించిన ఆర్యులు పశుపోషకులు. ఉపనిషత్తులు వెలువడేనాటికి కూడా పశువులే వారి ప్రధాన సంపద. పశుసంపదను ఎంతగా పెంపొందించుకున్నా వారికి తృప్తి ఉండేది కాదు.

ఋగ్వేదకాలంలో వరిధాన్యం లేదు యవ (బార్లీ) మట్టుకే ఉండేది అప్పటి జీవితంలో వ్యవసాయానికి ఏమీ ప్రాముఖ్యం ఉండేదికాదు. వృషభాన్ని పూజించేవారు. గోవులకోసమూ, తరచుగా ప్రార్థించేవారు. గోవులకోసం యుద్ధాలు చేసేవారు. ఆ యుద్ధాలకు ''గోష్టి'' (గోవాంఛ) అని పేరుండేది. ఆవులకోసం దూడలు అరవటం వారికి సంగీతంలా ఉండేది. ఇంద్రుడి కొరకు పాడే గీతాలను అలాంటి సంగీతంలో

పోల్చేవారు ఆవుపాలు. వెన్నా చాలా ప్రియమైనవి. యజ్ఞాలకు దేవతలకు అర్పించే వాటిలో అవి ముఖ్యమైనవి

వ్యవసాయం అముఖ్యమే కాకుండా, న్యూనంగా కూడా భావించబడేది బ్రాహ్మణులు వ్యవసాయం చెయ్యరాదని మనువు శాసించాడు. వేదాధ్యయనానికీ, వ్యవసాయానికీ పొత్తులేదుట.

ఆర్యులు సారవంతమైన ఉత్తరభూములలో స్థిరపడినాక కూడా, తమ చేత జయించబడిన స్థానికులకే వ్యవసాయం వదిలారు వ్యవసాయానికి అధిష్ఠాన దేవత అయిన సీత (నాగలిచాలు) ఇంద్ర వరుణుల లాంటి దేవతలకంటె చాలా తక్కువైనది

పశుపోషణ జీవనాధారంగా గల జాతులు ప్రపంచంలో ఎక్కడున్నా అవి పురుష ప్రధానమైనవే పశుపోషణ మగవాళ్ళపని. అందుచేత వేదాలలో ఆడదేవతలు మగదేవతలకన్న హీనమైనవాళ్ళు వారిలో అందరికన్న గొప్పదైన ఉషస్సు కూడా ''మూడోక్లాసు'' దేవత, ఆవిడకు సోమం ''పోసే'' వారు కారు ఉషస్సు తరువాత ముఖ్యమైన ఆడదేవత సరస్వతి ఆమె కూడాదేవతలలో చాలా హీనమైనది. పృధ్వీ, రాత్రీ, వాక్‌ల ప్రస్తావన చాలా స్వల్పం మగ దేవతల భార్యల పేర్లు మాత్రమే వినిపిస్తాయి.

ఋక్కులు సృష్టి అవుతున్నంత కాలమూ, శతాబ్దాల తరబడి, ఆర్య సమాజం పురుష ప్రధానంగానే ఉండిపోయింది. అయితే ఈ కాలంలో వారి చైతన్యం పెరుగుతూ వచ్చింది; ఒకే భగవంతుడన్న సిద్ధాంతాన్ని గ్రహించటానికి వారు మథనపడుతూ వచ్చి వచ్చి, ఋగ్వేదం చివర దశలో (పురుష సూక్తంలో) ఆ భగవంతుణ్ణి మగవాడుగా, అక్షరాలా ''పురుషుడు'' గా తెలుసుకున్నారు.

వేదకాలపు ఆర్యులకు ఓడిపోయిన అనార్యులలో కూడా పశుపోషక జాతులవారున్నారు ఆ జాతుల నాయకులు కూడా పురుషులే ఇంద్రుడు కృష్ణులను ( ఆ పేరుగల జాతిని ) జయించాడు, ఆ జాతి నాయకుడు కృష్ణుడనేవాడు, అతనికి దేవత్వం ఆపాదించారు ఋగ్వేదంలోని రుద్రుడు నిషాదులనే వేటగాళ్ళకు నాయకుడుగా చెప్పబడ్డాడు ఆ రుద్రుడూ పురుషుడే.

వేదకాలపు ఆర్యుల దృష్టిలో స్త్రీలు చాలా హీనమనటానికి బోలెడన్ని ఆధారాలున్నాయి. చనిపోయిన భర్తతోబాటు భార్య కూడా మరణించటం ( అను మరణం) తొలి వేదకాలంలో ఆచారంగా ఉండినట్టు కనబడుతుంది.

స్త్రీ అనృత స్వరూపమని మైత్రాయణీ సంహితలోనూ, మంచి ఆడది చెడ్డ మగవాడి కన్న హీనమని తైత్తిరీయ సంహితలోనూ ఉన్నది ఆడది రాత్రి కాలంలో పురుషుణ్ణి మభ్యపెట్టి కావలసిన వస్తువులు రాబట్టుకుంటుందన్న ఆక్షేపణ కథా

సంహితలో ఉన్నది.

వేదకాలపు సమాజంలో స్త్రీకి తక్కువ స్థానం ఉండటానికి కారణం ఆ సమాజం తాలూకు ఆర్థిక వ్యవస్థ స్వభావమే.

వ్యవసాయం మీద ఆధారపడిన సమాజాలలో జీవితానికి స్త్రీ కేంద్రంగా ఉండి గౌరవించబడేది. వ్యవసాయానికి అధిదేవతలు ఆడదేవతలు – సీతా, ఆశా, అనఘా, భూతీ వగైరాలు – కొన్ని గృహ్యసూత్రాలలో కీర్తించబడ్డారు ఇక్కడ వీరి స్థానం మగదేవతలకన్న మిన్నగా ఉన్నది అయితే ఈ సూత్రాలు వేదరచన జరిగాక చాలా కాలానికి వచ్చాయి. అంతేగాక వైదిక ప్రజలకు ఈ సమయానికి వ్యవసాయం చాలా ప్రధానమయింది.

వ్యవసాయం ప్రారంభంలో ఆడవారి పనిగా ఉండేది. వ్యవసాయం తెలియని స్థితిలో పురుషులు వేటాడేటప్పుడు స్త్రీలు ఆహారాన్ని పోగుచేసేపని చేసేవారు. కాయలూ, పప్పులు వగైరాలు ఏరుకొచ్చేవారు. అలాటి సమాజాలు పురుష ప్రధానంగానే ఉండేవి. ఆ దశలో స్త్రీలు తమ నివాసాల సమీపంలోనే విత్తులు నాటి, ఆహారానికి పనికివచ్చే మొక్కలు పెంచసాగారు. వారికృషి ద్వారా లభించే ఆహారం మీద హెచ్చుగా ఆధారపడదగిన దశ వచ్చేసరికి సమాజానికి స్త్రీలు ప్రధానంగా పరిణమించారు. పురుషుల ప్రాధాన్యం వెనకపడింది. స్త్రీలు వంశకారకత్వం వహించారు.

ఎద్దుల చేత పొలాలు దున్నించే స్థితి వచ్చినదాకా కర్షక సమాజాలు స్త్రీ ప్రధానంగానే ఉంటూ వచ్చాయి. అటు తరువాత మళ్ళీ పురుషులకు ప్రాముఖ్యం వచ్చింది

వేటాడే దశ నుండి పశువులను పెంచటం అవలంభించిన జాతులలో ఇలాంటి మార్పు రాలేదు. వేటాడే వారు కొన్ని జంతువులను ప్రాణాలతో పట్టితెచ్చి మచ్చిక చేశారు. ఇలా మానవుడికి మొదటగా మచ్చిక అయిన జంతువు కుక్క. అది వారికి వేటలో కూడా సాయపడింది వేటాడటం లాగే, పశువులను పెంచటం కూడా మగవాళ్ళపని. అందుచేత పశువులను పెంచే జాతులు పురుష ప్రధానంగానే ఉండిపోయాయి (ఉదా : నీలగిరి ప్రాంతానికి చెందిన తోడాలు.)

వ్యవసాయం ధర్మమా అంటూ జాతులు స్థిరంగా ఒకచోట నివాసాలు ఏర్పాటు చేసుకునే అవకాశం లభించింది. ఆరంభదశలో వ్యవసాయం స్త్రీలకు ప్రాముఖ్యం ఇచ్చిందని చెప్పుకున్నాం. ఆ కారణంగానే చాలా ఆలస్యంగా వ్యవసాయం ప్రారంభించిన జాతులు ఇటీవలిదాకా స్త్రీ వారసత్వాలను పాటించాయి. (ఉదా: తిరువాన్కూరు, కొచ్చిను ప్రజలు, ఖాసీకాజాతివారు).

పురుష ప్రాధాన్యం గల ఆర్యులకు స్త్రీ ప్రాధాన్యం గల అనార్యులకు మధ్య

సహజంగా తీవ్ర సంఘర్షణ సాగింది. ప్రపంచమంతటా ఈ సంఘర్షణ తీవ్రంగానే జరిగింది ; అయితే మనదేశంలో జరిగినంత పాశవికంగా మరెక్కడా జరిగినట్లు కనబడదు దీని ఫలితమే, అగ్రవర్ణులు హీనవర్ణ స్త్రీలను పెళ్ళాడడమూ, బాల్య వివాహాలు, సతి సహగమనమూనూ. ఆర్యులు స్త్రీలను అణగార్చడానికి ఇంత కౄరమైన మార్గాలు అవలంబించారంటే, అనార్య జాతులలో స్త్రీ ఎంతో ఔన్నత్యం కలిగి ఉండాలి విధవల పట్ల నిరసనా, భర్త చితిమీద భార్యను సజీవంగా దహించటమూ, లేదా జుట్టు తీసేసి, శవంలాగా తయారు చేసి మానవ సహజమైన సుఖాలు, ఆనందాలు లేకుండా చేయటమూ – ఇంత కంటె స్త్రీల పట్ల క్రౌర్యాన్ని ఊహించటం సాధ్యంకాదు. భర్తకు ఎడంగా స్త్రీకి వ్యక్తిత్వమే లేదని నిరూపించటానికి క్షుద్రమైన పతివ్రతా దర్మాలు సృష్టించటమే గాక వితంతువు కనబడటమే దుశ్శకునం చేసింది సమాజం.

## ఆర్య సమాజం - అనాగరిక సమాజం

క్రీస్తు పూర్వం కనీసం 700 ఏళ్ళ క్రితం ''నిఘంటువు '' తయారయింది. అందులో ''గోవు'' అన్న శబ్దానికి ''పృధ్వి'' అన్న అర్థం ఇవ్వబడింది. ( గో ప్రదక్షిణం భూ ప్రదక్షిణకు సమానమనే కథ ఒకటి మన పురాణాలలో ఉన్నది) నిఘంటువులోనే ''ఇలా'' శబ్దానికి పృధ్వి, గోవు, వాక్కు అన్నం అనే అర్థాలున్నాయి.

వేదకాలపు ఆర్యులు గోవును చాలా గొప్పగా చూసేవారు. కామధేనువు సమస్తమూ ఇవ్వగలదని వార నమ్మకం గోవు దేవతలకే తల్లి అని ఒక ఋషి అన్నాడు.

ఆఫ్రికాలో కాఫర్లూ, డింకాలూ అనే అనాగరిక జాతుల జీవనానికి వేదకాలపు ఆర్యుల జీవనానికీ పోలికలున్నట్టు Winteınıt/ అనే ఆయన ఊహించాడు. ఈ పోలికలు గమనించదగినవి.

పశువుల కోసం డింకా జాతివాళ్లు ఇతర జాతులపైన దాడి చేస్తారు. తొలి వేదకాలపు ఆర్యులూ అదే చేశారు. పశువుల కొట్టానికీ, వంశాలకూ ఆర్యులు గోత్రమనేమాట వాడారు డింకాలు కూడా ఈ రెంటికీ ఒకేమాట వాడారు.

శత్రువులపై దాడిచేసి ఆర్యులకు గోవులను తెచ్చిపెట్టిన సమరనాయకుడు ఇంద్రుడు ఇంద్రుడు వారి నాయకుడయ్యే కాలానికి వారి పశుసంపద బాగా పెరిగింది. అది అంతగా పెరగక పూర్వం ఆర్యులకు వరుణుడు నాయకుడుగా ఉండేవారు. ఈ విషయంలో కూడా ఆనాటి ఆర్యులకూ, డింకా జాతి వారికీ పోలిక ఉండటం చిత్రం

డింకాల పశుసంపద అందగా అభివృద్ధి అయినది కాదు. వారి ప్రధానదేవుడు వరుణుణ్ణి స్ఫురింపచేస్తాడు. అతనికి వారు పెట్టుకున్న పేరుకు అర్థం ''పెద్దవాన''.

వాళ్లకూడా తన దేవుడికి స్తోత్రాలు పాడుతారు.

వరుణుడు ఆకాశాన్నీ, భూమినీ వేరు చేశాడని ఆర్యులు నమ్మారు. సరిగా అలాటి నమ్మకమే డింకాలకూ ఉన్నది భూవ్యాకాశాలను వేరు చెయ్యటమన్నది ప్రపంచమంతటా ప్రాచీనులు నమ్మిన కథే ఈ కథ పురాతన ప్రాచీనాలలోనూ, మెసొపొటోమియాలోనూ, ఈజిప్టులోనూ ఉండేది పోలినీసియాలో ఈనాటికీ ఉన్నది. దీనినిబట్టి కూడా వేదకాలపు ఆర్యులు అనాగరికులని తేలుతుంది

## ఆ కాలపు దేవతలు

డింకాల దేవుడు (''పెద్దవాన'' ) ఒకప్పుడు వాస్తవమైన మనిషే అయివుండి, వారికి నాయకత్వం వహించినట్టు కనబడతాడు. తోడాల దేవతలు కూడా ఒకప్పుడు మనుషులే అయినట్టు కనబడతారు.

వేదకాలపు దేవతలు కూడా మనుషుల మధ్య మనుషులలాగే మెసిలినవారే. ఇంద్రుడు నరుడనీ, నృతముడనీ సంబోధించబడ్డాడు. అతను (సంపదను) విభజించేవాడు అగ్ని కూడా ''నృణాం నృతమః'' , ''నృణాం నృపతి'' . మిత్రుడూ, వరుణుడూ సోమపానం చెయ్యటానికి ఆహ్వానించబడతారు. ఇలాటి ఉదాహారణలెన్నయినా ఉన్నాయి.

వేదరచనా కాలంలో వాస్తవమైన మనుషులకే దేవత్వం ఆపాదించబడినట్టు సాయనుడే ఒప్పుకున్నాడు. మరుత్తులను గురించి ఆయన, ''నృభి ః మనుష్యైః ఏక సద్భిః దేవత్వం ఆ పన్నైః మరుద్భిః '' అన్నాడు.

వేదాల ఆధారంతో చూస్తే మరుత్తులు గణజీవులుగా ఆదిమ సమష్టి జీవితం గడిపినట్టు కనిపిస్తారు. అందరూ సోదరులు, సమానులు. ఒకేచోట పుట్టి , కలిసి పెరిగినవారు వారిది ఒకే శక్తి, ఒకే స్నేహం. ఒకే జన్మ. ఆదిమవాసులందరిలాగే వారు కూడా పాడేవారు. వారు పాడినవి ''పనిపాటలు'' – సమష్టి శ్రమ చేసేటప్పుడు పాడేపాటలు ( దంపుళ్ళ పాటలూ, నాట్ల పాటలూ లాటివి) మరుత్తులలాగే ఋభులూ, వహ్నులూ, అశ్వినులు కూడా దేవత్వం పొందారు.

సోమ, వరుణ, మిత్ర, బ్రహ్మణస్పతి, సావిత్రి మొదలైనవారు దేవతలలో జమ అయి ఉండిన్నీ వేదకవులలో సంఖ్యంగా ఉండేవారు. వరుణుడు గడిచిన కాలపు సఖుడు.

వేద కవులు తమకూ దేవతలకూ గల సఖ్యం గురించి విరివిగా ప్రస్తావిచారు. ఇంద్రుడు, సఖుడూ, రక్షకుడూనూ. అశ్వినులు ''సౌఖ్యంలో మాతో సమానులు'' అగ్ని ''సఖ సఖ్యేవరేణ్యః''.

ఈ దేవతలు మనం అనుకునే దేవతలు కారు. వీరు అచ్చుగా మరోలోకానికి

సంబంధించినవారు కారు. ఇంతేకాదు వేదకాలపు ఆర్యులకు యీ దేవతలతో గల సంబంధాలు కాలక్రమమున మార్పు చెందుతూ వచ్చాయి. ఈ మార్పులను గురించి ముందు తెలుసుకుందాం.

*ముద్రణ · ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 22-5-1970*

# 9. వేదకాలపు దేవతలలో మార్పులు

ఋగ్వేద రచన కొన్ని వందల ఏళ్ళ మీద జరిగిందన్నది నిజం. ఈ కాలంలో ఆనాటి ఆర్య సమాజం అనేక మార్పులు చెంది ఉండాలి. ఈ మార్పులు అనేక రూపాలలో మనకు కనిపిస్తున్నాయి. అందులో ఒకటి వేదకాలపు దేవతలపట్ల వేదకాలపు ఆర్యులకు కలిగిన భావ పరివర్తన

తొలికాలంలో రచించిన ఋక్కులలో ఒక దానిలో అగ్ని ''అసురా!'' అని సంబోధించబడ్డాడు. మరొకచోట ఇంద్రుడు కూడా అలాగే సంబోధించబడ్డాడు

ఆర్యులు అసులరును శత్రువులుగా చూసినట్టు మనకు తెలుసుగాని, అసుర శబ్దం ఒకప్పుడు వారికి గౌరవవాచకమన్నది మనకు తెలియదు. అసుర శబ్దం గౌరవ వాచకం నుంచి నిందా వాచకంగా మారటం పెద్దమార్పే.

అంగీరసులూ, అధర్వణులూ, భృగులూ వేద కాలపు ఆర్యులకు ప్రాచీనులు (ఆదికాలపు ''తండ్రులు''). అంగీరసులు ఋగ్వేదంలో కొంత భాగం రచించినట్టు ''అనుక్రమణి''లో ఉన్నదట. వాళ్ళు ఒకప్పుడు మామూలు మనుషులన్నది నిర్వివాదాంశం ఇంద్రుడి సఖ్యంతో వారు దేవత్వం పొందారట యజ్ఞంలో అంగీరసులకు నాయకత్వం వహించిన ఇంద్రుడు ''అంగిరస్తముడు'' అయ్యాడు. అలాగే బృహస్పతీ, అగ్నీ కూడా అంగీరసులే

రాను రాను అంగీరసులు దేవతలుగా మారారు. మరుత్తులలాగానూ, ఋషులలాగానూ వారు కూడా ఒక సమష్టికి చెందినవారు.

వ్యక్తుల విషయంలోలాగే సంపద కూడా సమష్టికి చెంది ఉండేది ''సమానంధనం'', అగ్ని దావానలం సృష్టించాడు. అందరూ సమానులైన మనుష్యులతో కలిసివున్న అగ్ని రాక్షసులను చంపాడు. ఇంద్రుడు గోవులను కాపాడి వృత్రుణి చంపి అందరికీ సముడుగా ఉన్నాడు.

ఈ సమత్వం దేవతలలోనూ ఉండేది ఇంద్రాగ్నులు కవల పిల్లలవలె ఒకేజన్మ గలవారు. నా సత్యులు సభల కూర్చుని మనుషులతో కలిసి సోమపానం చేశారు. అశ్వినులు పుట్టుకలోనూ, స్నేహంలోనూ సమానులు.

కాని ఈ ''సమష్టి'' జీవితం కొంతకాలానికి భగ్నమయింది అందుకు కొందరు విలపించారు కొందరు ఆ సమష్టి సంప్రదాయాన్ని తిరిగి నెలకొల్పాలని కూడా చూశారు కాని సాంఘిక పరిణామ చక్రం వెనక్కుతిరగదు.

ఋగ్వేదంలోని ఆఖరు సూక్తానికి చెందిన మూడు ఋక్కులూ, అందరూ సమబుద్ధిగానూ, సమైక్యంగానూ ఉండాలనీ, పూర్వకాలపు దేవతలలాగానే తమ తమ భాగాలను సమంగా తీసుకోవాలనీ, అందరి మంత్రాలు, వ్రతాలూ ఒకే రీతిగా ఉండాలనీ హెచ్చరిస్తున్నాయి.

సమత్వమూ, సమష్టిభావమూ పోయిన కారణంచేతనే ఈ హెచ్చరిక జరిగిందనటానికి సందేహం లేదు. పూర్వకాలపు దేవతల ఉదాహరణ కూడా అందుకే చెప్పవలసి వచ్చింది....ఇంద్రుడిప్పుడు తనవంతు హెచ్చుగా ఉండాలని అడగుతున్నాడు.

## ఋతం

ఋగ్వేదకాలపు ఆర్యులకు అంగీరసులూ, అథర్వణులూ కూడా చాలా ప్రాచీనులు. ఎలాంటి భేదాలూ ఎరగకుండా సమష్టి ధేనువులతో సమ బుద్ధి గలిగి, కలిసి కృషి చేస్తూ దేవకార్యాలకు ఎలాటి విఘ్నాలూ కలగకుండా ఒకరికొకరు హాని చేసుకోకుండా సమష్టి జీవితం గడిపి, సమృద్ధితో జీవించినవాళ్ళు, వారి ఘనతకూ, సమర్థతకూ మూలం ''ఋతం''.

ఈ ''ఋతం'' అన్నది అర్థమైతేనేగాని ఆనాటి జీవితం అర్థం కాదు. ఋతం పోవటంకూడా వేదకాలపు ఆర్యుల జీవితాలలో మార్పుకూ, వారి దేవతలలో మార్పుకూ కారణం అయివుండాలి.

ఆనాటి వారు ''ఋతం'' అన్న దాన్ని ఎలా అర్థం చేసుకున్నదీ మనం ఊహించవలసిందే గాని, అవగాహన చేసుకోవటం చాలా కష్టం అది భౌతిక, నైతిక నియతి (ఋతానికి విరుద్ధమైనది అనృతం).

''ఋతానుసారం ప్రాచీనులు సూర్యుణ్ణి ఆకాశంలో ఉంచారు. సూర్యుడు ఋతం యొక్క ప్రకాశవంతమైన ముఖం. అగ్ని సమిధలనుంచి మానవుల కోసం ఋతం నుంచి పుట్టే ఋత జ్వాల. ఋత నియమాన్ని అనుసరించి నదులు ప్రవహిస్తాయి''. ఈ విధంగా వేదాల్లో ఋతం వివరించబడింది.

ఇలాంటి ఋతం వేదకాలంలోనే అంతరించింది. ఋతం హితమైన జీవనాన్ని వేదకవులు శపించారు

ఋతంతో దేవతలకు గల సంబంధం చాలా స్పష్టంగా ఋగ్వేదంలో కనబడుతుంది.

అగ్ని ఋత ధేనువులను తెచ్చి యిచ్చాడు.

మిత్ర, వరుణులు యజమానులకు ( యజ్ఞం చేసేవారికి ) ఋతాన్ని తెచ్చి యజ్ఞ సమృద్ధి కలిగించారు.

''ఓ ఇంద్రా, పూర్వంలోలాగే నువ్వు ఆగారానికీ, ఋతానికీ రక్షకుడవుగా ఉండు''.

ఋతం గత (మిత్ర, వరుణులు) ఉభయులు యజ్ఞంలో అత్యధికంగా గోవులను అందిస్తారు (మిత్ర, వరుణులు అసురులని సంబోధించబడ్డారు)

ఇలా ఋతం ఆ కాలపు జీవితాలలో అత్యంత ప్రాముఖ్యం వహించింది మిత్ర వరుణులు వేదకాలానికి ఇంకా ముందుండినవారు. అందులో వరుణుడు ఋతానికి రక్షకుడు. ఋతంనుంచి పుట్టినవాడు, ఋతాన్ని పెంపొందించేవాడు.

వరుణుడి శక్తి ఎంతదంటే ఎగిరే పక్షులూ, ప్రవహించే నదులూ అతని శక్తికీ, ఆజ్ఞకూ, ఆగ్రహానికీ అతీతం కాలేవు. అతను సర్వజ్ఞుడు. అతనికి తెలియని మర్మంలేదు. అతనికి తెలియకుండా ఏ ప్రాణీ రెప్పపాటు వెయ్యలేదు. ఏ మనిషి ఎన్నిసార్లు రెప్ప వాల్చాడో అతనికి లెక్కే ; మనిషి ఏమి చేసేదీ ఏమనుకునేదీ, ఏ ఉపాయం పన్నేది వరుణుడికి తెలుసు (అంటుంది అథర్వ వేదం). వరుణుడి ఈ శక్తులన్నిటికీ మూలం ఋతం.

ఋతానికి వరుణుడంత సన్నిహితుడైన వేద కాలపు దేవుడు మరొకడులేడు అందుచేతనేమో ఋతంతోబాటు వరుణుడూ పతనమయ్యాడు.

ఋతం ఎందుకు పతనమయిందో తెలిస్తే వరుణుడి పతనకారణంకూడా తెలుస్తుంది.

వరుణుడి స్థానంలోకి వచ్చినవాడు ఇంద్రుడు. ఇంద్రుడు యుద్ధాలు చేయడానికీ, పశువులను దోచుకొనటానికీ ప్రసిద్ధుడు.

''ఓ ఇంద్రా, శత్రువులు సమీపిస్తున్నారు. ఈ శుభదినాన వారి సంపదలను కొల్లగొట్టి మా కియ్యి . వరుణుడు నిషేదించి, నిర్మూలించు'' అంటుంది ఋక్కు.

అంటే వరుణుడి లెక్కన దోపిడీ అనేది అనృతం – ఋతానికి విరుద్ధం. కాని ఈ ఋక్కు రచించినవారికి వరుణుడి నీతి కాదు కావలసింది. గోవులు. అందుచేత వాళ్ళ ఋతాన్ని, దానితోబాటు వరుణుణ్ణి వెనక్కు నెట్టేసి, ఇంద్రుణ్ణీ దోపిడీని ఆశ్రయించారు.

ఇలా ప్రారంభమైన వరుణుడి పతనం ఐతరేయ బ్రాహ్మణంలో శునశ్శేపుడి కథలో పరాకాష్ఠ అందుకున్నది.

హరిశ్చంద్రుడనే రాజు, నూరుమంది భార్యలుండి కూడా సంతానం లేక, వరుణుడి వద్దకు వెళ్ళి, తనకు ఒక కొడుకును ప్రసాదించినట్టయితే వాణ్ణి వరుణుడికి బలి ఇస్తానంటాడు. వరుణుడు సరేనంటాడు. హరిశ్చంద్రుడికి రోహితుడు (లోహితుడు) అనే కొడుకు పుడతాడు వరుణుడు వాణ్ణి బలికోరుతాడు. పిల్లవానికి పదిరోజులు నిండాక బలి ఇస్తానంటాడు హరిశ్చంద్రుడు పదిరోజులకు వరుణుడు మళ్ళీ వస్తాడు. పిల్లవాడికి పళ్లు రానిమ్మంటాడు హరిశ్చంద్రుడు అతను తాత్సరం చేస్తూ, రోహితుడికి పళ్ళు ఊడనివ్మనీ, తిరిగి రానివ్మనీ, అస్త్ర విద్యలు నేర్వనివ్మనీ కాలయాపన చేస్తాడు

అంతదాకా పెరిగిన రోహితుడు వరుణుడికి బలి కాకుండా ఉండటానికి ఇంటి నుంచి పారిపోయి ఏళ్ళ తరబడి అరణ్యాలలో సంచరిస్తాడు. అలా సంచరిస్తూడగా రోహితుడికి తిండికి మాడే ఒక బ్రాహ్మణ కుటుంబం కనిపిస్తుంది బ్రాహ్మడికి ముగ్గురు కొడుకులున్నారు

''అయ్యా, నీకు వంద ఆవులిస్తాను. నాకు బదులుగా వరుణుడికి బలికావాటానికి నీ కొడుకులలో ఒకణ్ణి ఇయ్యి '' అంటాడు రోహితుడు బ్రాహ్మడితో

ఆ బ్రాహ్మడి – పేరు అజిగర్తుడు – పెద్ద కొడుకు నివ్వనంటాడు. బ్రాహ్మడి భార్య మూడో కొడుకు నివ్వనంటుంది. మధ్యవాడు శునశ్శేపుడు వంద ఆవులిచ్చి రోహితుడు శునశ్శేపుణ్ణి కొని వరుణుడికి తీసుకుపోయి ఇస్తాడు ''క్షత్రియుడి కన్న బ్రాహ్మడు మెరుగు'' అని వరుణుడు సమ్మతిస్తాడు.

శాస్త్రోక్తంగా శునశ్శేపుణ్ణి బలి ఇవ్వటానికి నలుగురు ఋత్విక్కులు రాజసూయం ప్రారంభిస్తారు. శునశ్శేపుణ్ణి యజ్ఞపశువుగా అలంకరించి తెచ్చాక వాణ్ణి యూప స్తంభానికి కట్టటానికి ఋత్విక్కుడెవడూ ఒప్పుకోడు ఇంకో వంద గోవులనిస్తే తానే ఆపని చేస్తానంటాడు అజిగర్తుడు. వందగోవులనూ ఇస్తారు. తరువాత యజ్ఞ పశువును నరికేవాడు కనబడడు మరో నూరు గోవులనిస్తే తానే నరుకుతానంటాడు తండ్రి అజిగర్తుడు.

అప్పుడు శునశ్శేపుడు పాతకాలపు దేవతలైన ప్రజాపతీ, అగ్నీ, సావిత్రి, వరుణుడూ, సర్వే దేవతలూ ఇంద్రుడూ మొదలైనవారిని ధ్యానించి బలి నుంచి బయటపడతాడు. (ఈ దేవతలలో ప్రాచీనకాలపు వరుణుడుకూడా ఉన్నాడు)

శునశ్శేపుడి కాలానికి వరుణుడు ఇలా ఎందుకు తయారయ్యాడో అజిగర్తుడి దురాశే స్పష్టం చేస్తుంది. ఆవుల కోసం అతడు తన కొడుకుని తానే నరకటానికి సిద్ధపడ్డాడు.

శునశ్శేపుడి ప్రార్ధనలలో ఈ మాటలున్నాయి

''మమ్మల్ని నిర్రుతినుంచి కాపాడు. మమ్మల్ని పాపాల నుంచి విముక్తులను చెయ్యి''

ఋతం పోయిందన్నవాళ్ళు ఇంకా ఉన్నారు. వారిలో కుత్సుడనేవాడు ఇలా అన్నాడు.

''పూర్వకాలపు ఋతం ఏమయింది? దాన్ని వశం చేసుకున్న నూతనుడెవడు ? (ఎవడూ లేడని సాయన భాష్యం .) త్రిలోకాలలోని దేవతలారా, మీ ఋతం ఎక్కడికి పోయింది ? మన పాతకాలపు ఆహుతులు ఏవి ? వరుణుడు ఏంచేస్తున్నాడు ? అందుకే మనకీ దుర్దశ ...''

బ్రాహ్మణాల కాలానికి వరుణుడొక క్రూర రాక్షసుడుగానూ, భయపడవలసినవాడుగానూ తయారయ్యాడు. అగ్నిష్టోమం పూర్తి అయ్యాక స్నానం చేసిన యజ్ఞకర్త వెనక్కి తిరిగి చూస్తే వరుణుడు కనిపిస్తాడని ! అశ్వమేధయాగం అయ్యాక వరుణుడు ప్రతినిధిగా ఒక బ్రాహ్మణ్ణి నీటిలోకి తోస్తారు. అలా వరుణుడి పీడ విరగడవుతుందన్నమాట

వరుణుడి పతనమే కాదు బ్రాహ్మణులలో దేవతల చర్యలేవీ నైతిక దృక్పథంతో కూడుకున్నవి కావు. వాళ్ళు అసురులను చంపటానికి రాక్షసుల సహాయం పొంది, విజయం లభించినాక వారికిస్తామన్న సమ భాగం ఎగగొట్టేస్తారు. వాళ్ళు మనుషులను పైకి రానివ్వరు. ఎవరిని బొందితో స్వర్గానికి రానివ్వరు. మానవులు చేసే తపస్సులకు విఘ్నాలు కలిగిస్తారు. మానవులలో పుణ్యం పెరిగి నరకానికి వచ్చేవారిసంఖ్య తరిగిపోతూంటే యముడు ఏడ్చిన ఘట్టాలు మన పురాణాలలో ఉన్నాయి. వారి స్వార్ధానికి అవధి లేదు.

అందరిలోకీ పరమ నీచుడు స్వయంగా ఇంద్రుడు. (''పూర్వగాథా లహరి'' లో ఇంద్రుడి చరిత్ర చదివినట్టయితే అతను చెయ్యని పాడుపని గాని, చేసిన మంచిపనిగాని ఉన్నట్టు కనబడదు.) బ్రాహ్మణాలలోని ఇంద్రుడి చర్యలు చాలా నీతి బాహ్యమైనవి.

''ఇతను (ఇంద్రుడు) నముచితో ఒక ఒప్పందం చేసుకుని, దాన్ని ఉల్లంఘించటానికి పూనుకుని, విజయం సాధిస్తాడు. త్వష్టి కొడుకైన విశ్వరూపుణ్ణి అతను హత్య చెయ్యటం అకారణమూ, దుష్టమూనూ...అహల్యమీద ప్రేమతో అతను ఆమె భర్త రూపం ధరించి వచ్చి ఆమెను వంచిస్తాడు.... ఇతని రంకు ఇతనినే బెడిసికొట్టింది. ఇతని కొడుకైన కుత్స ఔరవుడు తనకూ తండ్రికీ గల పోలికను ఆధారం

చేసుకుని ఇతని భార్య అయిన శచీపిలోమని ప్రణయం సాధిస్తాడు... ఇతను తనకు పాలితులైన మరుత్తులనే దోస్తాడు.

వరుణుడి స్థానం ఆక్రమించిన ఇంద్రుడు ఇలాటివాడు.

ఇంద్రుడి ఆధిక్యత ఆర్యులలో సమసమాజం అంతరించి వర్గ సమాజం అవతరించినట్టు తెలియజేస్తుంది వర్గ సమాజంలో ఋతం అంతరించి ''కర్మ'' ఆవిర్భవించింది.

సత్కర్మ చేసుకువాళ్లు బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య జన్మ లెత్తుతారనీ, దుష్కర్మ చేసుకువాళ్లు ఏ కుక్కగానో పందిగానో, చండాలుడుగానో పుట్టుతారనీ ''చాందోగ్యోపనిషత్తు తెలుపుతున్నది.'' ఈ కర్మ సిద్ధాంతం ఈనాటికి మనని వదిలి పెట్టకుండా ఉన్నది.

సమసమాజం పోయి వర్గ సమాజం అవతరించినట్టు తెలియజేస్తుంది. వర్గసమాజంలో ఋతం క్షీణించిన కాలంలో వేదకవి అయిన కుత్సుడు ''హృదయ పూర్వకంగా అంటున్నాను - ఋతం తిరిగి జన్మించాలి ''అన్నాడు, కాని చరిత్రగతిని ఆపటం కుత్సుడివల్లగాని మరే వేదకవి వల్లగాని కాలేదు. వర్గ వ్యవస్థ మరింత బలపడి అసమత్వం పరాకాష్ఠ అందుకున్నది. అయితే కాలచక్రం ఒక చుట్టు పూర్తిచేసి, తిరిగి సమ సమాజం ప్రపంచంలో అవతరిస్తున్నది దీనితోబాటు ధర్మమూ, నీతి మార్పు చెందక తప్పదు. ఆ కారణంగా కుత్సుడు ఆనాడు అన్నమాట భవిష్యత్తులో నెలకొని ఋతం పునరుద్భూతం కావచ్చు.

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 5-6-1970.*

# 10. స్త్రీ పురుష సంబంధమైన నీతి

ఇంతవాడికి కూడా స్వేచ్ఛానురాగం అనే మాట వినబడగానే ఎగతాళిగా నవ్వ బుద్ధవుతుంది. స్త్రీ పురుషుల అనురాగ బాంధవ్యాలను అరికట్టడానికి మెడమీద తల ఉన్న ప్రతి మనిషీ ప్రయత్నం చేస్తూనే వున్నాడు. స్వేచ్ఛగా తిరిగేవాళ్లు తిరుగుతూనే ఉన్నారు. నిరసించేవాళ్ళు నిరసిస్తూనే ఉన్నారు.

దీనికి నీతి అని గొంతు దిగని పచ్చి వెలక్కాయ వంటి పేరొకటి పెట్టారు పేర్లకేం ? దేశభక్తి పేర హత్యలు చెయ్యటం లేదా ? మతం పేర అంతకన్న వెధవ పనులు చెయ్యటం లేదా ? ''నీ మంచికే '' అంటూ వీధి బడిపంతుళ్ళు పిల్లల్ని కోదండం తీసి కింద తాటాకుల మంటలు పెట్టలేదా - నా చిన్నతనపు రోజులదాకా కూడా ?

ఇది నీతి అయినా కాకపోయినా దీని ప్రచారం మాత్రం వేరు కారణాలవల్ల

జరుగుతున్నది

ఈ ఏర్పాటువల్ల మనిషిలో ఉన్న Possessive - instinct (తెలుగులో ఏమంటారు ?) ఒకటి ముందు తృప్తి పడుతున్నది. చిన్నపిల్లవాడు పప్పుండ యావత్తూ తనే తినాలని వాంఛించి దాన్ని లంకించుకుని ఎక్కడో చాటుగా పోయి తాపీగా ఆరగించినట్టు, మగవాడు ఒక స్త్రీని ముందరగానే బుక్ చేసుకుని (పదేళ్ల పిల్లను వెధవ ప్రమాణాలన్నీ చేసి, దానిచేత చేయించి కార్యపు మంత్రాలూ, దంపత్తాంబూలాలూ, పాన్పూ మొదలైన వాటితో సహా పెళ్లితంతు జరపటం ముందరగా బుక్ చేసుకోవటం కాక ఏమనిపించుకుంటుంది ?) తరువాత దాని మీద సర్వ హక్కులూ తనకు శాంక్షన్ చేయించుకుంటాడు. అవసరమైతే పరదా కూడా పెడతాడు. దాని వంక మరొకణ్ణికాని దాన్ని మరొకడి వంకకాని చూడనివ్వడు ఒంటరిగా పెళ్ళాన్నింటవదిలిపెట్టి పోవల్సివస్తే ఒక్కోసారి ఇల్లు బయట తాళం కూడా వేసి పోతాడు !

ఆడదీ అంతే దానికీ తను మగవాణ్ణి తనకే అట్టే పెట్టుకోవాలని ఉంటుంది అందుచేతే హిందూ లా ప్రకారం ఒకడనేక భార్యలను చేసుకోవటానికి అనుమతి ఉన్నప్పటికీ, ప్రతి వర్ణంవాడూ తక్కువ వర్ణపు స్త్రీని వివాహం ఆడవచ్చునని శాస్త్రాల అనుమతి ఉన్నప్పటికీ దాదాపు అందరూ ఒక పెళ్లాంతోనే కాలక్షేపం చేస్తున్నారు. ఏనాడైతే ''మనం దక్కించుకోగలిగినది మనకి కాదు, ఏది మనకు తప్ప దక్క దలుచుకోలేదో అదే మనది '' అనే విజ్ఞానం వస్తుందో ఆనాడే ఈ instinct అంతరిస్తుంది.

కొంతవరకు ఈ instinct యొక్క ఫలితంగా మొత్తంమీద దీనికి, నిప్పుకు, గాలల్లే, తోడుగానూ అసూయ ఉంటుంది. అందుచేతను పెళ్ళాం ఇంకోడివంక చూస్తే సహించలేకపోవటమే కాక ఎవడో ఎవరి పెళ్ళాంతోనో మాట్లాడుతుంటే తన సొమ్మేదోపోయినట్టు భావిస్తాడు మానవుడు ఈ నీతిని కాపాడే బాధ్యత యావత్తు అతని నెత్తినే పడుతుంది.

ఈ నీతికి మంచి ప్రచారం ఇచ్చే మూడోవిషయం ఒకటి గోప్యంగా ఉంది. అదేమిటంటే నాగరికతయొక్క అభివృద్ధి ఏ నాగరికత తీసుకున్నా సరే ఒకటి కనపడుతుంది ప్రతి జంతువుకూ అత్యవసరంగా కావలిసిన ఆహార, నిద్రా, మైథునాలు గోప్యం చెయ్యబడితై. నాగరికత ఉన్నదని చెప్పుకుంటూ తిరిగే మనిషి తన ఆకలిని నలుగురికీ తెలియచెయ్యనివ్వరాదు, నలుగురిలో ఆవలించరాదు, నలుగురూ చూస్తూండగా ఎవతెనన్నా చూసి గుటకలు వెయ్యరాదు. అందుచేత ఏమవుతుందీ, నాగరికత బలిసిన కొద్దీ పెళ్లాం కన్న పనిమనిషి సులభసాధ్యం అవుతుంది. కనక పరిపూర్ణంగా సంసార సుఖం అనుభవించదలిచినవాడు తన చర్య గోప్యంగా ఉంచవలిసివస్తుంది లేకపోతే అటువంటివాణ్ణి నాగరికత లేని పశువుకింద కట్టేస్తారు. ఎటొచ్చీ ఉన్నంతలో బహిరంగంగా ఉంచదగినది ఏకపత్నీ వ్రతమూ, ఇప్పుడమల్లో ఉన్న

నీతి. ఎప్పుడు నాగరికత మానవుణ్ణి పరస్త్రీ చెయ్యి పట్టుకుని ''నువ్వు నాకు కావాలి !'' అనలేకుండా చేసి స్త్రీ పురుషుల మధ్య గోడ కట్టిందో అప్పుడు స్వేచ్ఛానురాగం అనేమాట అశ్లీలమైపోయింది. ప్రకృతి గాలితోపాటు నీటితోపాటు ప్రసాదించిన సుఖం మానవుడికి దాదాపు అసాధ్యమైపోయింది.

ఈ నీతియొక్క ఫలితాలు

ఒకే సంఘంలో - ఒక్కోసారి ఒకే కొంపలో - ఆడదానికోసం తపిస్తున్న మొగవాడూ, మగవాడి కోసం తపిస్తున్న ఆడదీ నాగరికత నిర్మించిన గోడకు అటూ ఇటూ ఉండి ఆవేదన పడుతూంటారు వాళ్ల బాధ చూస్తే ఈ నీతి తీసి పారెయ్యటం వల్ల ఎంతో పుణ్యం కలుగుతుందనిపిస్తుంది ఎంత కటిక వాడికైనా - మాట్లాడటం నేర్చిన మనుష్య మృగాలు మినహా.

ఈ నీతి రంకుతనమనే మాటకు నిర్జీవమైన అర్థం ఇచ్చింది. నన్ను నియమిస్తే రంకుతనమనేదాన్ని సౌందర్య సహితమైన స్త్రీ పురుషుల కలయికగా define చేస్తాను యాభై ఏళ్ళవాడు తన మీద యిష్టంలేని మూడో పెళ్ళాన్ని నిర్బంధించి పొందటం రంకుతనం . నీతిగా ఉంటుంది గదా అని ఎర్ధంటి మొగుడూ రోగిష్టి భార్యా సంభోగించటం రంకుతనం. అటువంటి భర్తల్లో సౌందర్య పిపాసావేశం ఉంటే, నీతి విరుద్ధంగా ప్రవర్తించటం కాని, పరిస్థితులు అనుకూలంగా మార్చుకోవటం గాని చాతకాకపోయినప్పుడు పుంస్త్వం తీసేసుకోటం యోగ్యమైనపని

ఈ నీతి సుఖవ్యాధులను సంఘంలో వేళ్ళతో సహా నాటేసింది ఏ పాపమూ ఎరగనివాడు తండ్రి చేసిన పాపానికి వికారస్వరూపుడు కావటమూ, సిఫిలిస్ వల్ల బాధపడటమూ జరుగుతున్నది.

ఈ నీతి యూజెనిక్స్‌లో నమ్మకం గలవాడు తన యిష్టం వచ్చిన స్త్రీవల్ల సంతానం కనటానికి వీలులేకుండా చేస్తున్నది ఒక చక్కనిపాటగాడు తనవంశంలో గానవిద్య నిలబెట్టుకునే అవకాశం లేదు ఇట్లాగే కేవలం శరీర సౌఖ్యాన్ని దాటిపోగల ప్రేమకూ, స్త్రీ పురుషుల స్నేహభావానికీ ఈ నీతి చాలా అంతరాయంగా ఉంది

ఈ నీతి తన పిల్లలుగా వ్యవహరింపబడుతున్న పిల్లలు నిజంగా ఎవరికి పిల్లలో తెలుసుకోలేకుండానూ, తనవల్ల ఇతరత్రా పుట్టిన పిల్లలను తన పిల్లలని చెప్పుకోటానికి లేకుండానూ చేస్తున్నది.

వర్ణభేదంలో ఏదైనా గూడార్థం ఉంటే దానికి నీతి చాలా అపకారం చేసింది. వర్ణాలన్నిటినీ కలిపేసి, ఈ నీతే లేకుండా ఉంటే కారణాంతరాలచేత ఒక వర్ణంలో పుట్టిన మరోవర్ణపు శిశువును ఫలాని వర్ణపు శిశువని పోల్చటం వీలై ఉండును. ఈ నీతి స్త్రీ నోరు కట్టేసింది. మనకిప్పుడు మిగిలి ఉన్నది సంస్కార భేదమే కాని నిజంగా వర్ణ భేదం కాదు - సనాతనిష్టులు వర్ణాశ్రమ ధర్మాలను గురించి గొంతు బొంగురు పొయ్యేదాకా

అరవనివ్వండి కాక!

ఇటువంటివి తవ్విన కొద్దీ ఎన్నయినా ఉండవచ్చును. కాని ఒకటి మాత్రం నిజం . ఏ నాగరికత గానివ్వండి నశించకుండా అభివృద్ధి కావాలంటే ఒకటి తెలుసుకోవాలి. ఏ నియమం యొక్క ఫలితాలు వాంఛింపబడటంలేదో ఆ నియమం ఆచరించటం శరీరాయాసం. ఏకాదశి ఉపవాసం ఉంటే మోక్షం రావచ్చు. నాకు మోక్షం వద్దు. నా ఆరోగ్యం అభివృద్ధి కావచ్చు నాకదీ వద్దు. ఇక నాచేత ఉపవాసం చేయించి ఏం లాభం ? స్త్రీ పురుష సంబంధమైన నీతి, నేను మొదట చెప్పినట్టు ఏ సదుద్దేశంతో ఆరంభమైనా, అసూయ మొదలైన వాటివల్ల అమలులో ఉంచబడ్డది, అది నిర్బంధం. దాని ఫలితాలెవరూ వాంఛించరు

*చిత్రగుప్త, పక్షపత్రిక, 15-6-1935*

# 11. ఆడ జమానా

ఇది ప్రపంచ చరిత్రలో అపూర్వమైన సంగతి. ఇటువంటిది ఎప్పుడూ ఎక్కడా జరిగి ఉండలేదు - ఆడమళయాళమూ, ప్రమీలా రాణి యొక్క స్త్రీ సామ్రాజ్యమూ కూడా దీనికి చాలవు. బాగా ఆలోచించి చూస్తే, ఇది మన రాష్ట్రంలోనే, మనదేశంలోనే వచ్చిపడ్డదనుకోటానికి ఎంతమాత్రమూ వీలులేదు. ఈ విపత్తు జగత్తునంతా ఆవరించింది ఇది - ఈ ఆడ ప్రభుత్వం.

నామాటలు నమ్మలేకుండా ఉన్నవారు, నేను కాస్త ఉంటే గంపెడు చేస్తున్నాననుకునేవారు, ఎవరైనా ఉన్నారా ? తొందరపడకండి. ఓపిక పట్టి నిదానంగా ఆలోచించండి. నాది ఎంత సూక్ష్మబుద్ధో తమకందరికీ తెలుసు కనక నేను ఆత్మశ్లాఘం చేసుకోవలసిన అవసరం కూడా లేదు, అదృష్టవశాత్తూ, సత్యాన్వేషణలో నేను ఎంత ఆరితేరిన చెయ్యినో నేనే చెప్పుకుంటే మాత్రం యేమంత బాగుంటుంది కనకా ! ఇక ఇంటి ఆడవాళ్ళతో పోట్లాడి సన్యసించే మచ్చుకూడాకాను నేను. కనక నేను కేవలమూ నిజమే, అదీ నిష్పక్షపాతంగా చెబుతున్నానని తమరు నమ్మి ఈ వ్యాసం చదవాలని నా ప్రార్థన.

ఇది ఆడజమానా అన్నాను. మరి మన సంఘంలో ఆడది ఎక్కి రావటానికి వీలులేకుండా చాలా ఘట్టి బందోబస్తు చేశామే - అనగా పుట్టిన నాటినించీ దాసీత్వానికి తరిఫీదు చేస్తూ, అడ్డమైనవాళ్ళకు అణగిపడివుండమని ఉద్బోధించే కుమారీశతకం వగైరా గ్రంథాలే చదివిస్తూ, నిరపాయకరమైన పాతివ్రత్యం వారికి దాటరాని ఆదర్శంగా పెట్టి, స్త్రీ పురుష విచక్షణలేని వయస్సులోనే దక్షిణ ( వరశుల్క) సహితంగా ఏ అయ్య చేతిలోనో

పెట్టి, వారికి ఎటువంటి హక్కులూ – కనపడటం, వినపడటం, వోటు చెయ్యటం, ఆస్తి పంచుకోటం, జీవితాన్ని భీవూ చేయించుకోవటం మొదలైనవి – లేకుండా చేసి వాళ్ళకెక్కడా ఊపిరి సలపకుండా నవరంధ్రాలూ బిగించి ఉన్నామే, సాంఘికంగాకూడా వాళ్ళు ఇష్టంలేని భర్తను వదిలెయ్యటానికి వీలు లేకుండా, మరో పెళ్లాడటానికి వీలులేకుండా, అదృష్టవశాత్తూ మొగుడుపోతే జుట్టుంచుకోటానికీ, పూలు పెట్టుకోటానికీ, రెండుపూటలా భోంచెయ్యటానికీ, మంచి బట్టలు ధరించటానికీ అర్హత లేకుండా చేసి, మన మూఢ విశ్వాసాలు కూడా వాళ్ళకు అపకారం ఉండేటట్టు చేశామే ; ప్రాకృతంగా కూడా వాళ్ళ నెలకు మూడునాళ్ల వాకిట ఉండటం, అది తప్పించుకున్నారా, తొమ్మిది నెల్లు గర్భం మోసి ఆఖరుకు చచ్చేటంతపని అయి ప్రసవించటం జరుగుతున్నదే – ఇంత నిర్బంధం పాలయిన స్త్రీజాతి, అబలాజాతి మన మీద ప్రభుత్వం చెయ్యటమేమిటి ? తెలిసి మాట్లాడుతున్నావా ! అని నన్ను తమరు ప్రశ్నించవచ్చు.

అక్కడే ఉంది తిరుగుడంతా ! వాళ్ళను చూస్తే మనకు యేదో భయం లేకపోతే మనం ఇంత ఎందుకు చెయ్యవలిసివచ్చిందీ ? ''ప్రకృతి ఎట్లాగూ స్త్రీ జాతిని కనికరించలేదు కదా, ఆవార మనం వాళ్ళకు సంఘంలో ఉన్నత స్థానం ఇచ్చి వారికి న్యాయంచేద్దాం'' అని మనం ఎందుకు అనుకోలేదు ? వారి అబలాత్వం మనం నమ్మలేదు, వారి శక్తి మనం ఎరుగుదుం. మగవాడి బలం సమ్మెట యొక్క బలం. ఆడదాని యొక్క బలహీనత్వం విద్యుచ్ఛక్తిని మోసుకుపొయ్యేతీగల బలహీనత్వం ఈ ఆడవాళ్ళుందే. అట్లా నిస్సహాయులల్లే కనిపిస్తారు. ఆధారం లేకపోతే తోటకూర కాడలల్లే వేళ్లాడబడిపోతారు ; వాళ్ళజోలికి పోయినామో చచ్చే షాక్ తగులుతుంది!

మళయాళ స్త్రీలూ వెనకటి ప్రమీలారాణీ మొదలైనవారి ప్రభుత్వం ఒక ప్రభుత్వమా ? మనల్ని చంపి మింగ గల సింహానికీ మనలోపల ప్రవేశించి చంపే క్రిమికీ ఎంత భేదం ఉందో అంత భేదం ఉంది ప్రమీలా రాణికీ, మనల్ని పరిపాలిస్తున్న స్త్రీలకూ. నేను స్త్రీనైతే నాకు ప్రమీలా రాణియొక్క హక్కులక్కర్లేదు అవన్నీ ఇవ్వటం ఉందే, అది ఎలెక్ట్రిక్ తీగనుతెంచి కొరడాతాడు చెయ్యటమే !

ఇక ఆడవాళ్ల ప్రభుత్వం మన సంఘంలో ఏ విధంగా నడుస్తున్నదో చూద్దాం. మొట్టమొదట మనం తెలుసుకోవలసిన విషయం ఏమిటంటే పురుషుడికి స్త్రీ గార్డియన్. స్త్రీ పురుషుడికి దాసీ అనుకోవటం పురుషుడి అవివేకం. మగవాడిమతాన్ని, ఆచారాలను , నాగరికతను పట్టుకొస్తున్నది ఆడది. చివరకు ఇతగాడి మాతృభాషకూడా ఆవిడగారి పోషణలోనే ఉంది – ఇతగాడు పిల్లలతోపాటు

పురుషుడనే పక్షి పొడుగుపాటి దారంతో స్త్రీఅనే రాతికి కట్టబడి ఉంది అందుచేత ఈ పక్షి ఎటు ఎగరబోయినా యీరాయే అడ్డం వచ్చి ఎటుచూసినా కృష్ణుడే కనిపించిన కంసుడివతు అవుతుంది. ఈ పోతుపక్షి, మగవాడు ఎంత గొప్పవాడయి కూర్చుంటే మాత్రం ఏం లాభం – తన భార్య యొక్క భర్త కాకుండా పోలేకపోయిన తర్వాత ! .వెనక ఒకసారి నేను ఒక గొప్పవాడి భార్యను చూశాను. నాతో ఆవిడ మాట్లాడలేదు. ఊరికే చూసింది – ''నా భర్తను ఎరుగుదువు గదా నా వంక చూడు నువ్వంత గౌరవంగా చూస్తున్న ఆ వ్యక్తిని మెల్లి మెల్లిగా కబళించి వేస్తున్నది నేనే ఆయన ఇంటికి రాగానే చూడవలిసింది నా మొహం, భోజనం చేయవలిసింది నా చేతుల సహాయంతో, సిగ్గుపడవలసింది నన్ను చూసి, తప్పించుకుపోలేంది నానుంచి'' అన్నదామె చూపు. నేను ఎందుకో ఆమెను చూసి భయపడ్డాను. ఆయన్ను చూస్తే జాలివేసింది కాని వెనకటి గౌరవం పోయింది. అన్యాయమే ఆవిడను ఆయన తనకుతానై పెళ్ళాడి ఉండడు – ఆయన తల్లీవాళ్ళూ చేసి ఉంటారు!. ..

పురుషుడు డ్రీమర్ – ఏకాంతంగా కూర్చుని కలలు కంటూ ఉంటాడు ''ఈ విధంగా కాలం వెళ్లబుచ్చుదాం, మనపిల్లలను ఈ విధంగా తయారుచేద్దాం '' అని కాని తీరాచెయ్యవచ్చేటప్పటికి ప్రతిదానికీ ఆడది అడ్డం వస్తుంది – బలం చేతగాదు, ఉపాయం చేతకాదు; మనం ఊహించనైనా లేని ఒకానొక శక్తి చేత.

మగవాడి దాసి అన్నట్టు నటిస్తూ ఆడది మగవాడిసుఖం యావత్తూ తన అరిచేతులలో పెట్టుకుంది తిండి సుఖం దగ్గిరనించి రతి సుఖం వరకూ పురుషుడు స్త్రీ అనుమతి మీద ఆవిడ ఇవ్వదలచిన స్వరూపంలో పొందాలి ఒక ఇల్లాలు ప్రతి వంటకంలోనూ కారం వెయ్యవలిసిన దానికి రెట్టింపు తక్కువ కాకుండా వేస్తుంది. ఆవిడ జ్ఞాపకం వచ్చినప్పుడల్లా, ''పాపం, ఈఆవిడ భర్త కావాలన్నా కారం తక్కువగా తినలేడు కదా ! ఆయన జన్మకు కారం లేకుండా తినటం ఏమిటో తెలియదు కదా'' అని అనుకుంటాను, నా గుండె పగిలిపోతుంది ; ఎప్పుడైనా ఒకపూట ఎవరింటికైనా భోజనానికి పోలేడని కాదు, అట్లా ఎంతకాలం జరుగుతుందీ?

ఆ విధంగానే సన్నని భార్యగల భర్తకు బొద్దుగా ఉండే భార్య ఉంటే ఎట్లా ఉంటుందో తెలియదు కదా!

భార్య పిల్లలను రోతగా పెంచేదైతే భర్త ఏమి చెయ్యటానికీ లేదు కదా !

ఇటువంటి ఇబ్బందులు భార్యలకు మాత్రం లేవా అని అడగవచ్చును. లేపు సన్నని భర్తకూ లావుపాటి భర్తకూ భేదం తెలియదు సామాన్య స్త్రీకి. స్త్రీ దాదాపు ఎటువంటి భర్తతోనైనా సంసారం చెయ్యగలదని హావెలాక్ ఎలిస్ చెబుతున్నాడు. మిగతా విషయాల్లో

'చేత' అంతా ఆడదానిదే కనక 'ఫిర్యాదు' లేదు.

పురుషుడు ఎంత ''పొడిచేసిన'' వాడైనాసరే ఇంటికి వచ్చిన తర్వాత తను చదువుకున్నదీ తను అనుభవంమీద నేర్చుకున్నదీ తను బుద్ధికుశలత వల్ల ఊహించినదీ, అంతా మరిచిపోలేక పోయినాడో ఇంట శాంతి ఉండదు ఇప్పటి కాలపు యువకులు భార్యలతో సుఖంగా కాపరం చెయ్యలేకపోవటానికి కారణం తగిన వేదాంతం లేకపోవటమే. ఆడదాని అధికారం సహించగలగటానికి మగవాడికి ఎంత వేదాంతమైనా అవసరం

రేషనలిజం అనేది ఆడదానికి పరమశత్రువు ఆమె పరిపాలన కింద మగవాడు తన మనస్సును చంపుకుని సిగ్గుమాలినవీ, అర్థం లేనివీ అనేకపనులు చెయ్యవలిసి ఉంటుంది. ఏ కుర్రవాడో కొత్తగా మనస్సు వికసిస్తున్న ఉద్రేకంతో ''నేను బాజాలతో సహా కార్యం చేసుకోను, శాస్త్రోక్తంగా మైలా పురుడూ పట్టనూ, అది చెయ్యనూ,ఇది చెయ్యనూ'' అంటూంటే వింటే నాకు నవ్వు వస్తుంది. చివరకు ఆడవాళ్ళు ఎట్లాగో వాళ్ళ యిష్టం సాధించి తీరుతారు. నా స్నేహితుడొకడు పంతం కొద్దీ మైల ఇంట్లో కలిపాడు 'అవన్నీ ఎట్లా తడుపుతారో చూస్తానూ ' అన్నాడు. ఇంట్లో మయిలపడదగిన వస్తువులన్నీ ముట్టుకుని. వాళ్లు వాటినన్నిటినీ తడపలేదు, నిజమే, కాని వాడి ఒంటి మీద బట్టలు మాత్రం తడిపి తీరారు. నా స్నేహితుడు వెధవ మొహం పెట్టి 'అర్థం ఏమిటి ?'అన్నాడు – ఆడవాళ్ళకు అర్థంతో పని ఉన్నట్టు.

సంసారపక్షంగా అవసరం కలిగే వైద్యమూ, నీతీ, న్యాయమూ, ప్రపంచజ్ఞానమూ, శాస్త్ర పురాణ పరిచితీ, కళాభిజ్ఞతా ప్రతి ఆడదానికీ ఉన్నది ఒక ఊళ్ళో ఒక కుర్రవాడు చెట్టుమీదినించి పడి కాళ్లు విరుచుకున్నాడు. పొరుగింటి ఆడవాళ్లు మంచి వైద్యం చెప్పారు. – సలసలా కాగే ఉడుకునీళ్లు పోసి రోగికి పెరుగన్నం పెట్టమన్నారు. ఆ కుర్రవాడు రెండు రోజుల తరువాత చచ్చాడు ఆ ఉడుకు నీళ్లు పోస్తుంటే వాడు పడ్డ బాధ వర్ణనాతీతం. ( నిజంగా జరిగింది) ఈ ఘటనను గురించి ఏ విధమైన వ్యాఖ్యానమూ జరగలేదని నేను వేరే చెప్పనక్కర్లేదు.

అదే మగవాడు ఇంట్లో ఆడవాళ్లు తెమ్మన్న డాక్టరును తీసుకు రాకపోయినాడో మరో డాక్టరు వల్ల రోగాలు నయమవుతున్నా ఇంట్లో శాంతి మాత్రం ఉండదు.

ఆడవాళ్లకు ఇంత అధికారం ఎట్లా వచ్చిందంటే సులభంగా చెప్పవచ్చును, ''సృష్టిలోనే వాళ్లు శక్తి స్వరూపిణిలు'' అనేసి. కాని ఆ అధికారాన్ని దక్కించుకోటానికి వాళ్ళ ప్రకృతి ఏవిధంగా తోడ్పడుతున్నదో తెలుసుకోవటం చాలా అవసరం.

స్త్రీకి సిగ్గులేదు. అందుకనే ఆవిడ పరభృతంగా ఉండగలదు. అందుకనే

పురుషుడు తన స్త్రీ దుష్ప్రవర్తనకు సిగ్గుపడ్డట్టు స్త్రీ తన పురుషుడి దుష్ప్రవర్తనకు సిగ్గుపడదుకూడా సూక్ష్మ విచక్షణ చేసేటంత నాజూకు స్త్రీకి లేదు అందుకనే దేనితోనైనా సరిపెట్టుకోగలదు స్త్రీ లిఖిత పూర్వకంగా అధికారం కోరదు. ఆ అధికారాలు దక్కేవి కావు. స్త్రీకి నిజమైన న్యాయబుద్ధి, సత్యాన్వేషణపరతా లేవు అంతస్సాక్షి కూడా లేదు మనల్ని ఆకర్షించేది స్త్రీలో బోలెడంత ఉండికూడా మనకు అసూయ కలిగించేది స్త్రీలో ఈషణ్మాత్రం లేదు.

స్త్రీ సంఘంలో అతి హీనస్థానాన్ని ఆక్రమించటానికి అంగీకరించింది నిరాయుధురాలుగా ఉండటానికి ఒప్పుకుంది. మనకు తనతో బోలెడంత అవసరం కల్పించుకుంది. ఇవన్నీ మనల్ని మింగేస్తున్న మార్వాడీలు చేసేపనులే.

చదువుకుని 'పురుషులతో సమానమైన హక్కులు' సంపాదించిన స్త్రీలను చాలామందిని చూశాను అంతా కోరలు తీసిన త్రాచులు - నామాట నమ్మండి.

*ఆంధ్రభూమి, మాసపత్రిక, జూన్, 1937.*

# 12. స్త్రీలూ - సాంఘిక ప్రవర్తనా

జంతుజాలానికి దక్కుదల పోరాటం ద్వారా సాధనమవుతూ ఉంది ( ఈ సూత్రాన్ని Struggle for existence అంటారు), కాని మానవుడు పోరాటానికి బదులు సత్ప్రవర్తనని పరిణామ సాధనంగా ఉపయోగించటం నేర్చుకున్నాడు. సత్ప్రవర్తన అనేదాన్లో రెండు ప్రధానాంశాలిమిడి ఉన్నాయి : మొదటిది, ఆత్మ పరీక్ష చేసుకొనేశక్తి , అంటే, ఇతరుల దృష్టిలో మనం ఎట్లా ఉన్నది తెలుసుకోగలగటం , రెండోది, మన అవసరాలు ఆత్మ ప్రయత్నం ద్వారా తీరుతున్నాయనేది గుర్తించటం.

కొన్ని పెంపుడు జంతువులు తమ యజమాని పెంపకానికి లోబడి కొన్ని పరిస్థితులలో ఆత్మనిగ్రహంతో కూడిన సత్ప్రవర్తన పరిమితంగా ప్రకటించటం మన అనుభవంలో విషయమే. అయినా బుద్ధిపూర్వకంగా, ప్రయోజనాన్ని గుర్తించి, సత్ప్రవర్తన అవలంబించ గల శక్తి మానవుడికి తప్ప ఇతర జంతువులకి లేదు. ఆ కారణం చేతనే జంతువులకి జీవితంలో దక్కగలది తృప్తిమటుకే అయితే మానవులకి జీవితంలో ఆనందం కూడా దక్కుతున్నది.

ఉన్నత వర్గాలవారు సత్ప్రవర్తన అనేదాన్ని కొంత వరకు హాస్యాస్పదం అయ్యేటట్టు చేసినప్పటికీ మానవత్వం అనేదానికి మూలకుదురు సత్ప్రవర్తన అనక తప్పదు వ్యక్తులకి జీవితంలో ఏ మాత్రమో ఆనందమూ, ఉమ్మడి మీద ఏ మాత్రమో సాంఘిక పరిణామమూ సాధ్య మవుతున్నా యంటే అది వ్యక్తుల సక్రమ ప్రవర్తనవల్లనే సాధ్య మవుతూ ఉంది.

సంఘానికి హానికరమైన అంశాలు - దారిద్ర్యమూ, వృధా క్షుద్బాధా, అకారణ

వ్యాధులూ, అజ్ఞానమూ, అధోగతీ మొదలైనవి - సంఘంలో పొడసూపి నప్పుడల్లా వాటికి కారణం కొంతమంది యొక్క దుఃప్రవర్తనేనని సులభంగా ఋజువు చెయ్యవచ్చును. ధనాశా పీడితులూ, అధికార మదాంధులూ, దోపిడీగాళ్లూ సంఘ నియంతృత్వం వహించగానే సంఘం ఇక్కట్లు పాలుకావటం జరుగుతూ ఉంది. కులతత్వాలూ, పెట్టుబడిదారీ, పరదేశాక్రమణ కాంక్షా మొదలైన స్వరూపాలలో దుఃప్రవర్తన మానవ సమాజాలని పట్టుకుని దీర్ఘవ్యాధిలాగా పీడిస్తూ ఉంటుంది.

మానవ సంఘాలే ఈ విధంగా ఉంటే మానవ సముదాయాల యొక్క దుర్గతి ఇంకా హీనంగా ఉంది. ఎందుచేతనంటే వ్యక్తులు పాటించిన పాటయినా ప్రవర్తన గురించి దేశాలూ, జాతులూ పాటించటం లేదు. అసలు దేశాల మధ్యా, జాతుల మధ్యా మానవత్వం అనేది బొత్తిగా శూన్యంగా ఉంది. ఒక దేశాన్ని మరొకటి దుర్భాషలాడటమూ, మోసగించటమూ, బెదిరించటమూ, అతిక్రమించటమూ, వీలైతే ముంచటమూ సామాన్య అంతర్జాతీయ రాజకీయాలుగా ఉంటూ ఉంది. ఏదేశమూ ఇతర దేశాలు తమ ఎడల మానవత్వం చూపిస్తాయని ఆశించదు. అటువంటిది దేశాల చరిత్రలో లేనేలేదు.

ఆత్మగౌరవం లేని జాతుల విషయంలోనే ఇట్లా ఉందేమోననుకుంటే జాత్యహంకారంతో విర్రవీగే దేశాల ప్రవర్తన మరీ అడుక్కు తిన్నట్టుంది. ప్రపంచంలో మంచి సర్వోత్తమ జాతి అనే జర్మనులు ఇతర దేశాల మీద ప్రయోగింటే అవాచ్యాలూ, ఇతర దేశాలలోకి బలత్కారంగా పిలవకుండా పెట్టకుండా వెళ్లి అక్కడ చేసే అత్యాచారాలు చూస్తే జాతీయాభిమానం లేని దేశాలే నయం అనిపిస్తుంది.

జాతుల పరస్పర ప్రవర్తన ఇట్లా అఘోరించటానిక్కారణం ఏమిటి ? సంఘాలలో వ్యక్తులు సంఘ శ్రేయస్సుకోరి సత్ప్రవర్తన అవలంబిస్తూ ఉంటే ఈ సంఘాలే అంతర్జాతీయ రంగాన పశువులల్లే ప్రవర్తించి ఆత్మద్రోహం చేసుకోవటం దేనికి ? జర్మనీవంటి విజ్ఞాన పూరితమైనదేశం మానవత్వం విసర్జించి పశుత్వం అవలంబించి పోరాటం ద్వారా దక్కుదల కాంక్షించటం దేనికి ?

ఈ ప్రశ్నలకు ప్రధాన సమాధానం : సంఘాల జీవితాన్ని పశుశక్తులు ఆవేశించి ఉండటం; అప్రధాన సమాధానం : అంతర్జాతీయ రంగాన మానవత్వానికి, సత్ప్రవర్తనకీ ఎటువంటి ప్రచారమూ లేకపోవటం.

ఈ విద్రోహకరమైన వాతావరణంలోకి అవతార పురుషుడల్లే వచ్చి గాంధీ మహాత్ముడు మనదేశాన్ని ''మానవత్వం'' అవలంబించమని శాసించాడు. గాంధీ తత్వం క్రియకు సత్ప్రవర్తనే. ఆయన నాయకత్వం క్రింద ఇంత దేశమూ పశుత్వాన్ని విసర్జించి మానవ భాష అవలంబించింది. అవతలివాళ్లు పశుత్వం అవలంబించినా మనం మానవత్వం విసర్జించనవసరం లేకపోగా , అవతలివాళ్లు కూడా మానవులు అన్నట్టే

ప్రవర్తించమని గాంధీజీ మనదేశానికి బోధించాడు.

కాని యేసుక్రీస్తులూ, గాంధీజీలూ మానవ సమాజానికి దక్కరు వాళ్లు మానవ హృదయాలకు జ్ఞానప్రకాశం మటుకే ఇవ్వగలరు గాని, మార్గం గుర్తించుకు పోవలసిన వాళ్లం మనమే మానవ చరిత్రలో మొట్ట మొదటిసారి ఓ పెద్ద దేశం – ప్రపంచంలో అయిదోవంతు భూఖండం – మతతత్వం విసర్జించి నందుకు కలిగిన ఫలితమేమిటో మనం కళ్ళారా చూస్తూనే ఉన్నాం

కాని గాంధీతత్వం నుంచి మనం మానవత్వం కోల్పోకుండా ఉండటమనేది నేర్చుకోవాలి. ప్రవర్తనను విసర్జించి పశుత్వం అవలంబించడం కేవలమూ ఆత్మద్రోహం. ఆమాట అని ప్రపంచ మంతటా మానవత్వం వెలిసినట్టూ , సాంఘిక విద్రోహక శక్తు లంతరించినట్లూ ప్రవర్తించటం అది కూడా చాదస్తమే అవుతుంది అందుచేత మానవాభ్యుదయం కోరే స్త్రీ పురుషులు పశుశక్తులను లొంగ దీయటాని కనువయిన మానవ ప్రవర్తన అవలంబించాలి. అదే కాలానుగుణ్యమైన నీతి.

ఈ సందర్భంలో స్త్రీలు తమ ప్రత్యేక ప్రవర్తనను నిర్ణయించుకోవటం అత్యవసరం. స్త్రీ జాతి – ముఖ్యంగా మన దేశంలో – ఒక వర్గంగా అమానుషత్వానికి గురి అవుతున్నమాట అబద్ధం కాదు. ఇతర రూపాల అమలులో ఉన్న సాంఘిక అత్యాచారం లాగే స్త్రీ గురి అవుతున్న అత్యాచారాలు కూడా సంస్కారం బుఢఖా తగిలించుకునే చలామణి అవుతున్నాయి. కల్పించుకుని గాలిమేడలు కట్టేవారి మాటలతో స్త్రీ జాతి మభ్యపడక గమ్యస్థానం మానవత్వంగానూ సాధనం సరయిన ప్రవర్తనగానూ భావించినట్టయితే సాంఘిక పరిణామం కొంత తప్పక చేకూరుతుంది. మానవత్వపు హక్కు ఒకరి నడిగి పుచ్చుకునేది కాదు, అది మానవులై పుట్టినవారందరికీ స్వతస్సిద్ధంగా ఉన్నదే. ఇక ప్రవర్తన అనేది లోపల ఉన్న మనో వికాసం కొద్దీ నిర్ణయించబడుతుంది.

మానవత్వం గురించీ ప్రవర్తనను గురించీ గుర్తించవలసిన ముఖ్య విషయం ఏమిటంటే తద్వారా సంఘం యొక్క అభివృద్ధికి పనికొచ్చే వ్యక్తిగతమైన లక్షణాలు – ఆత్మ గౌరవమూ, ఆత్మజ్ఞానమూ, జీవితం ఉమ్మడి సొత్తనే వివేచనా – ఏర్పడటమూ, సంఘ విద్రోహకరమైన శక్తులను ప్రతిఘటించే శక్తి సామర్థ్యాలు ఏర్పడటమూనూ. పడ్డవాడెప్పుడూ చెడ్డవాడు కాడనే సూత్రం మీద ఆధారపడి మంచి మనిషి అనే ప్రతిష్ట కోసం పశుశక్తులకు తల ఒగ్గటం – సినిమా కథల్లో ఎంతగా ప్రచారం చెయ్యబడుతున్నా – మంచి పద్ధతి కాదు. పశుత్వానికి పశుత్వంతో సమాధానం ఇవ్వటం అతి హానికరం. ఈ రెండు తప్పుడుదారులూ వర్జించి ఆడజాతి ఆత్మ నిర్ణయానికి రానలసి ఉంది.

స్త్రీ జాతియొక్క మానవత్వమూ ప్రవర్తనా స్త్రీ జాతిని ఉద్ధరించటానికే గాక సంఘానికి కూడా చాలా శ్రేయస్సు చేకూర్చగలవు. స్త్రీలు సంఘంలో ఒక భాగం కావటమే గాక సంఘం యొక్క పతనాన్ని స్త్రీ జాతి కొంతవరకైనా పురుష సహాయం అవసరం

లేకుండా అరికట్ట గలిగి ఉంది

హిట్లరు జర్మనులను పశువులకింద మార్చటానికి విఘ్నేశ్వర పూజ చేసినప్పుడు తన కార్యక్రమంలో స్త్రీ జాతిని పడదొయ్యటం ప్రధాన కర్తవ్యాలలో ఒకటిగా పెట్టుకున్నాడు ''స్త్రీ యొక్క ప్రధాన కర్తవ్యం పురుషుడికి భోగవస్తువుగా ఉండటమూ, జాతిని పెంపొందిచటమూ'' అని హిట్లరు సిద్ధాంతీకరించినప్పుడు మిగతా దేశాల్లో వున్న స్త్రీ జాతులు నిర్ఘాంతపోయాయి . స్త్రీలలో వున్న పశుశక్తులను రెచ్చగొట్టాడు. ''ప్రతి ఆడదానికీ మొగుణ్ణి ఇస్తాము'', అని నాజీ పార్టీ ప్రచారం చేసింది. మానవత్వం గల ఆడది తన స్త్రీ తత్వంద్వారా భర్తను సంపాదించుకోలేని పక్షాన అవివాహితగానైనా ఉండిపోతుంది గాని భర్తకోసం ఇంకొకరి సహకారం వాంఛించదు. ఏ విధంగానైనా ఒక భర్తను సంపాదించుకోవటమే ముఖ్యమని నమ్మి స్త్రీ మానవత్వాన్ని దక్కించుకోగలగటం కలలోమాట.. నాజీపార్టీకి బలం చేకూర్చి పెట్టినది మానవత్వం కోల్పోయిన జర్మను స్త్రీలు వారందరికీ మొగుళ్ళు దొరికారో లేదో మనకు తెలీదు గాని అందులో చాలామంది స్టెరిలైజేషన్ ద్వారా మాతృత్వాన్ని మటుకు నమ్మకంగా కోల్పోయినారు.

పశుశక్తుల విజృంభణ ద్వారా సాధ్యమయ్యే ఆర్థిక పరిణామం మనదేశాన్ని ఆవరించనున్నది. దీని వెంట, మానవత్వాన్ని నిర్వీర్యం చేసి, ఆత్మ గౌరవం స్థానే అహంకారాన్నీ, వివేకానికి బదులు వెకిలితనాన్ని స్థాపించిన కుసంస్కారం చెలరేగే అవకాశం ఉంది. దీన్ని ప్రతిఘటించి మానవుల్నీ మానవత్వాన్నీ సంరక్షించటానికి స్త్రీ జాతి తమ వంతు కర్తవ్యం నెరవేర్చగల స్థితిలో ఉండే ప్రయత్నం చెయ్యటం అత్యవసరం.

*ఆంధ్ర మహిళ , పక్షపత్రిక, సంపుటి1, సంచిక13, 15నవంబర్ 1944.*

# 13. స్త్రీ జీవితంలో ప్రేరణలు

ఆత్మరక్షణలూ, అర్థమూ, కామమూ, మాతృత్వమూ - ఈ సహజ ప్రేరణలు జీవిత చైతన్యానికి మూలకారణాలని కొందరు శాస్త్రజ్ఞులు నమ్ముతున్నారు. వీటిలో దేనికి ఏ విధమైన అంతరాయాలు కలిగినా అంతలెక్క జీవితం దుఃఖ భాజనమవుతుంది.

మనిషిలో ఉండే ప్రేరణలు ''పచ్చిగా'' లేవు. అవి జ్ఞానానుభవాల ద్వారా సంస్కృతి పొంది ఉన్నాయి. అందుచేత ఆత్మ రక్షణ కేవలమూ ప్రాణరక్షణగా కాక సాంఘిక హక్కుల రూపంలో మన చైతన్యాన్ని ఆవేశిస్తుంది. ఆ విధంగానే అర్థప్రేరణ కేవలమూ తిండికోసమే ఎగబడక నగలూ, దుస్తులూ, ఇతర ఉపకరణాల కోసం పాకులాడుతుంది. కామం ప్రేమకోసం దేవులాడుతుంది. మాతృత్వం సేవారూపం పొందుతుంది.

''పచ్చి'' ప్రేరణలతో కూడుకున్న చైతన్యం గల క్షుద్ర జంతువులు ఆ ప్రేరణలమధ్య కలిగే సంఘర్షణకు తట్టుకోగలవు. కుక్కముందు ఆహారం పెట్టి పక్కనే మనం కఱ్ఱ పట్టుకుని నిలబడితే, ఆహారం కోసం దెబ్బలు సహించాలో, ఆత్మరక్షణకోసం ఆహారం విసర్జించాలో తేల్చుకుని ఆ నిర్ణయం ప్రకారం నడుచుకోగలుగుతుంది కాని సంస్కారంతో కూడుకున్న జీవితం పునాదిగా ఉన్న ''పచ్చి'' ప్రేరణల మధ్యకలిగే సంఘర్షణకి నిలబడలేదు అది చాలా ప్రమాదాలకి దారి తీస్తుంది.

ఈ విషయాలు మనసులో ఉంచుకుని ఆడదాని జీవితం గురించి ఆలోచించి నట్టయితే ''ఆడబ్రతుకే మధురం'' అని ఎవరూ గానం చెయ్యరు - ఆడజాతిని వంచించటానికి తప్ప.

మొదట ఆడదాని ఆత్మరక్షణ ప్రేరణ తీసుకుందాం ఆచారంగా గాని, చట్టపరంగా గాని, ఆడదానికాట్టే హక్కులు కనిపించవు ఈనాడు కూడా అత్తవారింట హింసపడే ఆడదానికి రక్షణలేదు ఇష్టంలేని భర్తను విడిచిన ఆడదాన్ని సంఘం భర్తకు తిరిగి వప్పగిస్తుంది, లేదా నీరసించి ఊరుకుంటుంది స్త్రీ రక్షణ సమస్య దగ్గర సాంఘిక చైతన్యంలేనట్టే ప్రవర్తిస్తుంది !

ఇది చాలా ముఖ్యమైన విషయం. ఎందుచేతనంటే సంస్కారం పొందిన జీవిత చైతన్యాన్ని సంఘం వేరు చెయ్యటానికి లేదు. నిర్మానుష్య ప్రదేశంలో ఒక ప్రాణి ఉండి ''పచ్చి'' ప్రేరణల పునాదిమీద సంస్కారంతో కూడిన ప్రవర్తన అవలంబించటమంటూ జరిగి సంఘంగా ఉన్నప్పుడు కూడా పచ్చి ప్రేరణలచేత ప్రేరేపించబడేవి, జ్ఞానం లేని మృగాలు. అవి కూడా ఎప్పుడైనా మొండిగా తిరగబడి ఆత్మరక్షణ చేసుకోవటం జరుగుతుంది. కాని మొగాళ్ల మీద ఆడదాని ఆత్మరక్షణకి సంఘం తోడురావటం నికరంగా లేదు. పిల్లని ఓ అయ్య చేతులో పెట్టే సమయంలో బావురుమని ఏడిచి తల్లిదండ్రులీ అసమర్థతే పైకి ప్రకటిస్తారు. భర్త తన వస్తు వాహనాలని రక్షించుకొన్నట్లుగానే భార్యను కూడా రక్షించుకోవచ్చు కాని భార్యకి దౌర్జన్యం నుంచి తన శరీరాన్ని గాని, అభిమానాన్ని గాని రక్షించుకునే సాధనం లేదు భర్తలందరూ చెడ్డవాళ్లని కాదు. ఆమాటకు వస్తే జంతువులు కూడా అనుక్షణమూ ప్రాణాపాయ స్థితిలో వుండవు. కాని హాని కలిగే పరిస్థితులలో దాని కాత్మ రక్షణ సాధనం లేకపోవటం గమనించవలసిన విషయం. అందుచేత సంఘంలో బతికి ఉండటం అలవాటయిన స్త్రీ తన ఆత్మ రక్షణ ప్రేరణని అణగ దొక్కుకొనవలసి వస్తుంది

రెండవది అర్థ ప్రేరణ. తమ పిల్లలకి అర్థలోపం రాకుండా ఉండగలందులకు తల్లిదండ్రులు సాధ్యమైనంతలో ఇంత తినటానికికున్న మొగుణ్ణి తీసుకురావాలని

చూస్తారు. కాని నూటికి ఎనభై మందికి తినతిండిలేని దేశంలో ఈ ప్రయత్నాలు ఎంతవరకు సఫలమయేదీ ఊహించవచ్చు. భాగ్యవంతుణ్ణి పెళ్ళాడిన ఆడదాని కృూడా అర్థకాంక్ష ఉండే అవకాశం ఉంది. అర్థకాంక్ష అనేది అవకాశం బట్టి మారుతూ ఉంటుంది గనక దరిద్రుడి భార్యకు అర్థకాంక్ష తీరనట్లే, భాగ్యవంతుడి భార్యకి నగల కాంక్షతీరకపొయ్యే అవకాశం ఉంది. అదీకాక ఆడదానిలో అర్థకాంక్ష తెచ్చి పెట్టగల చైతన్యం అట్టే కనిపించదు. – భర్తమీద లేని ప్రేమ నటించటం తప్ప. అర్థప్రేరణలో విశ్వాసం లేనివాళ్ళూ, పోగొట్టుకున్నవాళ్ళూ ''భార్య''(భరించబడేది) కావటం ఆడదానికి ''సుఖం'' అనే భ్రాంతిలో పడొచ్చు. కాని అందువల్ల చైతన్యాన్ని పురికొల్పే ప్రేరణల్లో ఒకటి అణిగి పోతున్నదని గ్రహించటం అవసరం.

మూడవది కామప్రేరణ. ఇక్కడకూడా ఆడదాన్ని చూసి అసూయ పడవలసిన అవసరం కనిపించదు. మన సంఘంలో ఆడదానికి ''ప్రేమించే'' శక్తి ఉందనుకోవటానికి ఆధారం ఏమీ లేదు – ప్రణయ కథకులు క్షమిస్తే, మొదటి సంగతి మనం పధ్నాలుగేళ్ళకే ఆడపిల్లలకి మొగుళ్లని అంటగట్టేస్తున్నాం. ''కామం'' ఒక ప్రేరణగా ఆడదానిలో తల ఎత్తక పూర్వమే దాని సంతృప్తికి మార్గం ఏర్పాటు చేస్తున్నాం. అందుచేత ఈ ప్రేరణ ఆడదానిలో ఒక చైతన్యం కల్పించి దానికి సంస్కారం అంటగట్టే అవకాశం లేదు. ''ప్రేమ'' ద్వారా కామ సంతృప్తి తప్పనిసరి అయినప్పుడు గాని ఆ ప్రేరణ ఒక చైతన్యాన్ని తెచ్చి పెట్టదు. ఆ చైతన్యానికి సంస్కారం అంటే అవకాశం రాదు. సంకెళ్ళతో కట్టుకున్న భర్తని ప్రేమచేత ఆకర్షించటానికి ఏ ఆడది ఎందుకు ప్రయత్నించవలసి వస్తుంది ?

ఆఖరు ప్రేరణ మాతృప్రేరణ . ఇక్కడ కూడా ఈ ప్రేరణ ఏ విధంగా అణగదొక్కబడేదీ మనం నిత్యమూ చూస్తూనే ఉన్నాం. పిల్లల ప్రాణానికి తన ప్రాణం అడ్డువేసే అవకాశం ఆడదానికి రానేరాదు. వాళ్ళ ఆరోగ్యానికి గాని, అభ్యుదయానికిగానీ జీవశక్తి ధారపోసే అవకాశం ఆడదానికి లేదు. పిల్లల్ని పెంచటం గురించిగానీ, ఆరోగ్య విధానాలను గురించి గాని తెలిసిన తల్లులు – శిక్షణ పొందిన ఆడవాళ్లు మన సంఘంలో లేరు. ఏ పదేళ్లో వచ్చేపరికి పిల్లలే తల్లి కన్న ఎక్కువ ''చదివిన''వాళ్లయి కూచుంటారు. ఆపైన తల్లియొక్క మాతృత్వం పిల్ల నిరసనకి గురికావటం తప్ప మరేమీ లేదు.

సంఘంలో కొన్ని హక్కులుండి, వాటిని సంరక్షించుకునేటందుకు పోరాడగలిగి, తనకు కావలసిన ద్రవ్యాలను సంపాదించటానికి ఉద్యమించగలిగి, తాను కోరిన భర్త ప్రేమ సంపాదించటానికి పాటుపడగలిగి, తన పిల్లల ఆరోగ్యాభివృద్ధులకొరకు సర్వ శక్తులూ ధారపోయగలిగిన స్త్రీది సమగ్ర జీవితమైతే మన ఆడవాళ్లు జీవించటం లేదని వేరే చెప్పనవసరం లేదు.

స్త్రీ జీవితాన్ని సంస్కరించటానికి పూనుకునేవాళ్ళు చాలామంది అనుకోకుండానే ఒక గోతిలో పడతారు , వాళ్ల ప్రత్యేక ప్రేరణలు ఉద్ధరించటానికి ప్రయత్నిస్తారు. స్త్రీ జీవితంలో కామప్రేరణ చాలా అణగదొక్కబడి ఉండటం గమనించిన ఒక ప్రసిద్ధ రచయిత తెలుగుదేశంలో ఉన్న స్త్రీలందర్నీ రంకుతనం చెయ్యమని హెచ్చరించాడు. ప్రేమించి పెళ్లాడే అవకాశం దొరికితే ఆడవాళ్ళ జీవితం చాలా వరకు బాగుపడుతుందనే అభిప్రాయం కలవాళ్లు చాలామంది ఉన్నారు. స్త్రీలకి వారసత్వపు హక్కూ, ఉద్యోగాలు చేసుకునే అవకాశమూ ఉంటే వాళ్ల కష్టాలు చాలాభాగం ఈడేరుతాయనే వాళ్లింకా ఎక్కువమంది ఉన్నారు. కాని ఒక్క విషయం ఎక్కువమంది గమనించినట్టు కనబడదు. అదేమిటంటే, అన్ని ప్రేరణల్లోకీ ప్రబలమైనది ఆత్మరక్షణ ప్రేరణ. ఇది తెచ్చిపెట్టే చైతన్యం పోరాటం. స్త్రీని పోరాటానికి ప్రోత్సహించిన సంస్కర్తలు కనిపించరు.

పోరాటాన్ని విసర్జించి అర్థప్రేరణకూ కామప్రేరణకూ లొంగిపోయిన వాళ్లని సంఘం తక్కువచూపు చూడటం గమనిస్తున్నాం. కాని సంఘ సంస్కరణకి నడుముకట్టిన స్త్రీలందరూ పోరాటాన్ని అవలంబించినవాళ్లే. క్రియకు వాళ్లనే సంఘం హర్షిస్తున్నది. మిగతా ప్రేరణలను సంస్కారయుతంగా తృప్తి పరుచుకునే హక్కు పోరాటం ద్వారా తప్పరాదు.

పోరాటాన్నికూడా పశుశక్తిగా పరిగణించే మేధావులు లేకపోలేదు. కాని ఈ పోరాటం పశుశక్తుల మీదనే అనిగ్రహిస్తే దాని విలువ తెలుస్తుంది. సంస్కారంతో కూడిన సాంఘిక హక్కుల కోసం పోరాడకుండా ''పచ్చి'' ప్రేరణలకు లోబడి శరీరం అమ్ముకునే వాళ్లనీ, కామ సంతృప్తి చేసుకునే వాళ్లనీ అరికట్టలేని సంఘం, ఈ ప్రేరణలని సంస్కారయుతంగా సంపాదించుకోవటానికీ ప్రేమించటానికీ హక్కురూపేణా తృప్తి పరచుకోవటానికీ ఆమోదించదు పశుప్రేరణలను ప్రతిఘటించలేక సంస్కారానికి అంతరాయంగా నిలబడగలది పశుశక్తికాక మరొకటి కాదు. దాన్ని అతిక్రమించటానికి పోరాటంకన్న మరొక సాధనం లేదు మన సంఘంలో స్త్రీ జీవితాన్ని ఈ స్థితికి తెచ్చింది కూడా ఈ పశుశక్తులే ఆ కారణం చేత స్త్రీ జాతి యొక్క అభ్యుదయం కోరినవారు క్షుద్ర చట్టాలతో సంతృప్తి చెంది ఊరుకోరాదు. కేవలం రజస్వలానంతర వివాహాలూ, కొద్దిపాటి చదువులూ స్త్రీ జీవితాన్ని సమగ్రం చెయ్యలేవు. సహజ ప్రేరణలను తృప్తి పరచుకోవటంలో అత్యుత్తమ సంస్కారాన్ని వినియోగపరచుకునే హక్కు ప్రతి మానవ ప్రాణికీ ఉన్నది. అది సంఘం నుంచి ఆడది పోరాడి పుచ్చుకోవలసిన మొదటి హక్కు.

*ఆంధ్ర మహిళ, పక్షపత్రిక, సంపుటి 1, సంచిక,15, 20-12-1944.*

# 14. ప్రేమ వివాహాలు

ప్రేమ వివాహాలూ,వాటికి సంబంధించిన సమస్యలూ మన సంఘాన్ని ఈనాటి వరకూ బాధించకపోయినా మన ముందు తరం వాళ్లకి ప్రేమ వివాహాల సమస్య ఏర్పడి తీరుతుంది. ఆ సమస్య వాళ్లకి తెచ్చిపెట్టే కష్ట సుఖాల గురించి మనం తెలుసుకుని ఉండటం వ్యర్థం కాదు.

వివాహం ద్వారా మనం ఏయే సుఖాలు ఆశించి ఉండినా క్రియకు పెళ్లి మనకొక ఆశ్రమధర్మం కిందనే జమ అయి ఉండింది. మన తరం వాళ్లం పూర్వీకులకంటె ప్రేమను గురించి ఎక్కువగా చదివి ఆలోచించామేగాని పెళ్లి చేసుకునే విషయంలో పూర్వీకుల కన్న భిన్నమైన మార్గాలు తొక్కి ఉండలేదు. ఎక్కడైనా ఒకరు ముందుగానే తాము కట్టుకోబోయే వారిని చూచుకుని ఆమోదించటం ఆచరణలోకి వచ్చినప్పటికీ అందువల్ల వివాహ తంత్రంలో మార్పేమీ లేదు.

ముందు రాబోయే తరం వాళ్ళు - ఇప్పుడు పుట్టి పెరుగుతున్న వారిలో చాలామంది - ఈ రకం పెళ్లిళ్లతో తృప్తి పడరని మనంగట్టిగా నమ్మవచ్చు. వాళ్లు తమ భార్యల్నీ భర్తల్నీ మొహాలుమటుకే చూసి పెళ్లి చేసుకోరు. వారి పరిచయం ముందుగా కోరుతారు. ప్రేమించి పెళ్లాడే హక్కువెంట, వారికి పెళ్లాడే వారి పరిచయం చేసుకునే హక్కుకూడా సంప్రాప్తమవుతుంది.

హక్కులు చాలా విచిత్రమైనవి. వాటి సరిహద్దులు నిర్ణయించటం సులభం కాదు. ప్రేమించి పెళ్లాడే హక్కు వెంబడి పెళ్లాడే మనిషిని పరిచయం చేసుకునే హక్కు ఏర్పడట్టే, ఒక్క పెళ్లాడే వాడితోనేగాక పెళ్లాడటానికి అర్హతగల వారందరితోటీ పరిచయం చేసుకునే హక్కు కూడా ఏర్పడుతుంది. ఆ విధంగానే ప్రేమించి పెళ్లాడే హక్కు వెంబడే, ప్రేమించకుండానే అవతలివ్యక్తి యొక్క డబ్బో పదవో కోరి ఆ మనిషి యొక్క ప్రేమను ఏమాయోపాయం చేతనైనాసరే సంపాదించే హక్కు కూడా ఏర్పడుతుంది. ప్రతి హక్కు వెంటా దాన్ని దుర్వినియోగపరిచే అవకాశాలుంటూ ఉంటై. వాటిని అరికట్టటానికి ఎప్పుడూ వీలుండదు. ఆవంక పెట్టి మనుష్యులకు ప్రేమించి పెళ్లాడే హక్కులేకుండా చెయ్యాలని వాదించటం మూఢత్వం. ఇటువంటి మూఢత్వంలో పడకుండా ఉండటం మనం చెయ్య దగిన మొదటి పని. అటువంటి మూఢత్వం లోనే పడదలిస్తే మనిషికి ఏ హక్కు ఉండదనేది మరవరాదు.

ఇక ప్రేమ వివాహాలు చేసుకునేవారి కష్ట సుఖాలు విచారింతాం. వాళ్లకి పెద్ద చిక్కు ప్రేమతోనే వస్తుంది. ప్రేమ వ్యక్తుల మనస్తత్వాన్ని బట్టీ, ఉదారంగానూ, ఉత్తేజంగానూ, భయంకరంగానూ, వెకిలిగానూ, యేహ్యంగానూ, హాస్యాస్పదంగానూ పరిణమిస్తుందని ఎవరు అన్నారు. దానికి కారణం శాస్త్రీయంగా మనం ఊహించవచ్చును. ప్రేమ అనేది

కావం ప్రేరణననుసరించి కలిగే ఒక భావం. కాని అది ఇతర ప్రేరణలకీ, వాటిననుసరించికలిగే భావాలకీ సంబంధంకలిగి ఉండేది. అన్ని ప్రేరణలూ అందరు వ్యక్తులలోనూ ఒక విధమైన పరిణతిపొందవు. కొందరిలో కొన్ని ప్రేరణలు ప్రకోపించి ఉంటై. కొన్ని ప్రేరణలు వికటించి ఉంటాయి. కొన్ని ప్రేరణలు ఆరోగ్యవంతంగా ఉంటాయి. కొన్ని అణచబడి ఉంటాయి. వాటిననుసరించి ఉండే భావాలు కూడా అంతే.

ఆత్మరక్షణ తీసుకుంటే అది వికటించిన మనిషికి జాస్తిగా పోట్లాడే స్వభావం ఉంటుంది. అణిచిపెట్టి ఉంటే అసహాయత్వం ఏర్పడుతుంది. అది ప్రకోపించినప్పుడు ఆ మనిషి జీవితంలో పోరాటం ప్రధానాంశంగా ఉంటుంది.

ఆ విధంగానే అర్థ ప్రేరణలో మార్పులవల్ల మనుషులు తిండిపోతులు కావటమూ, లోభులు కావటము, జూదగాళ్ళు కావటమూ, ద్రోహులు కావటమూ బైరాగులుగా తిరగటమూ మొదలైనవి జరుగుతాయి.

కావం ప్రేరణ మనుష్యుల్ని మితిమీరిన ఇంద్రియలోలత్వానికీ, కఠిన బ్రహ్మచర్యానికీ, అవినీతికీ, అనవసరనీతికీ, పశుత్వానికీ పురికొల్పుతుంది.

అట్లాగే మాతృత్వం కఠినత్వానికీ, పక్షపాతానికీ, అర్థం లేని దాతృత్వానికీ, పిరికితనానికీ, త్యాగానికీ, సేవకూ దార్లు తీస్తుంది.

ప్రేమ భావాన్ని ఇన్ని రకాల భావాలతోనూ జోడించి నప్పుడు దానికి రకరకాల విలువలు ఏర్పడటం వింత ఏమీ లేదు.

ఈ సమస్య మరింత క్లిష్టం కావటానికి మరో కారణం ఏమంటే కేవలం కామ సంతృప్తి విషయంలోనే మనుష్య మృగం సంపాదించుకున్న రకరకాల అసమర్థతలు. మిగిలన మృగాలకి భావాలు లేక పోవటమే గాక కామ సంతృప్తి విషయం అనుమానానికి తావులేదు. మనిషికిదే ఒక భయంకరమైన సమస్య. ఈ సమస్య లేనట్టు నటించటం మూలాన మరింత గడ్డు సమస్యగా పరిణమించింది.

ఈ పరిస్థితులలో మనం మన తరువాత వాళ్ల వివాహ సమస్యను గురించి ఏం చెయ్యగలం ? వాళ్లకి మనం చెయ్యగల సహాయం ఏమిటి ? మర్మ శాస్త్రాలు చదివి కొంత జ్ఞానం సంపాదించుకోనిచ్చిన తరువాత కూడా వాళ్లకి చాలా చిక్కులున్నాయి. ఇంతకు పూర్వం చెప్పినట్టుగా వాళ్ల ప్రేమలు ఘోరంగానూ, భయంకరంగానూ, వెకిలిగానూ, హాస్యాస్పదంగానూ, పరిణమించకుండా ఉదారంగా, ఉత్తేజంగా పరిణమించేటట్టు చూసే బాధ్యత మన మీద ఉన్నది. అనగా వాళ్ల ప్రేమ వివాహాలకి సరి అయిన ఆరోగ్య వాతావరణం కల్పించే బాధ్యత మన మీద ఉన్నది.

దానికి గాను మనం శక్తి వంచనలేకుండా చెయ్యదగిన సదుపాయాలలో మొట్టమొదటిది మన పిల్లల్లో ప్రేరణలు వికటించకుండానూ, అకారణంగా హద్దుమీరి ప్రకోపించకుండానూ చూడటం మన పని.

రెండవ విషయం - వివాహోన్ముఖులుగా ఉండేవారిలో కామ ప్రేరణ ఎట్లాగూ ప్రకోపించి ఉండనే ఉంటుంది. గనక ప్రేమకు - కామ పరమైన ప్రేమకు ఎక్కువ ప్రాముఖ్యం ఇవ్వనవసరంలేదు. అంతకంటె చేసేదేమంటే ప్రేమ భావానికి మిగిలిన ప్రేరణలతో సంబధాన్ని పిల్లలకి తగుమాత్రం బోధించటం. ఇది చెయ్యని పక్షంలో యౌవనాని కనవసరమైన ప్రాముఖ్యం ఇచ్చి ప్రతి మనిషీ - ముఖ్యంగా ప్రతి ఆడదీ - యవ్వనాన్ని వార్ధక్యం దాకాపాడుగించటానికిగాను పిల్లల్ని కనకా, పిల్లలకి పాలిచ్చి పెంచకా, అలంకరణ మీద అహోరాత్రాలు వ్యర్థం చే . ఈనాటి పాశ్చాత్య సమాజానికి మనంకూడా ప్రతిగా తయారయే అవకాశం ఉంది. ఇవి సంఘానికి శ్రేయస్కరమనిగాని వ్యక్తుల అభివృద్ధికి అవసరమని గాని అనుకోవనసరంలేదు. ఆరోగ్య కారణాలని ఆర్థిక కారణాలు దాటి వెళ్లినప్పుడే ఈ అభ్యాసాలు జాతికి కూడా అపకారము.

మన మాదిరిగా వెనకపడి ఉన్న దేశాలు అభ్యుదయం సాధించాలంటే రెండు నేర్చుకోవాలి. ఒకటి, లేని హక్కు సంపాదించటమూ, రెండు, వాటిని సక్రమంగా అమలు పరచుకునే విధానాలు అన్వేషించటమూనూ. ప్రపంచమంతటా ఏర్పడిన ప్రేమ వివాహాలు మన దేశంలో ఏర్పడే సూచనలు లేకపోవటం శోచనీయం. కాని ఇటువంటివి కేవలమూ అనుకరణ ద్వారా రావటం కన్న బుద్ధిపూర్వకంగా జ్ఞానోదయం ద్వారా రావటం చాలా శ్రేయస్కరం. దానికిగాను దేశంలో ఉన్న విద్యాధికులంతా పాటుపడవలసి ఉంటుంది. ఇటువంటి మార్పులను సహించని తత్వాన్ని కష్టపడి సంస్కరించవలసి ఉంటుంది. ఆ పిమ్మట ఈ కొత్త సంస్కరణకు అనుకూలమైన వాతావరణం ఏర్పరచవలసి ఉంటుంది. మానవుడూ, మానవ సంఘాలూ కేవలం ఉద్రేకాలద్వారా పరిణామం చెందలేవు. ముమ్మాటికి ఇది అసంభవం. మానవ పరిణామానికి జ్ఞానం తప్ప మరో మార్గంలేదు.

*ఆంధ్రమహిళ, పక్షపత్రిక, సంపుటి 1, సంచిక19, 15-2-1945.*

# 15. స్త్రీ జాతిని గురించిన దుష్ప్రచారాలు

5 మార్చి నాటి ''ఆంధ్ర మహిళ''లో ''చిత్రాలవల్ల స్త్రీలకి జరుగుతున్న అన్యాయం'' అనే వ్యాసం పడింది. ఆడవాళ్ల అమాయకత్వాన్నీ, అసమర్థతనీ, అర్థంలేని సహనాన్నీ భారతీయ చిత్రాలు ప్రశంసించి ప్రచారం చెయ్యటమేగాక ఆడవాళ్ల చురుకుతనాన్నీ, స్వాతంత్ర్య కాంక్షనీ, సంస్కార కాంక్షనీ తీవ్రంగా నిరసిస్తూ ఉంటున్నై. దీన్ని గురించి ఇది వరకే కొందరు వ్యాసాలు రాసి ఉన్నారు. కాని ఈ విషయమై తగినంత అలజడి జరగలేదు.

ఒక సినిమా చిత్రాలలోనే గాక దిన దిన సాహిత్యంలోనూ, హరిదాసులు చెప్పే పిట్టకథల్లోనూ, శాసన చట్టాల్లోనూ, అనేక సాంఘిక నిబంధనల్లోనూ అనుక్షణమూ ఆడవాళ్ల కన్యాయం జరుగుతూనే ఉంది. ఇది సంఘమంతటా అల్లుకుపోయి జీవితంలో

లోతుగా వేళ్లు వేసి ఉన్న ముళ్లకంప.

ఇటు వంటి దుష్ప్రచారం వెనక ఉండే మూలకారణాలు ( ఆర్థిక- సాంఘిక దోపిడి వగైరాలు) నూటికి తొంభై తొమ్మిది మంది గ్రహించరు, పట్టించుకోరు. వారు సాంఘిక వాతావరణాన్ని బట్టీ మనస్తత్వాన్ని బట్టి నడుచుకుంటూ ప్రచారానికి మటుకేలొంగుతారు. ఉదాహరణకు, వైశ్యులను నాటకరంగం మీద ఎక్కించి ప్రజలచేత నవ్వింపజేస్తే ప్రజలు నవ్వుతారు. వారు నవ్వుతున్నారు గదా అని నాటక కర్తలు హాస్యం కోసం అటువంటి పాత్రలనే చిత్రిస్తారు. వైశ్యులు దాన్ని గురించి అలజడి చేసిన రోజు నుంచీ ఆ ఆచారం క్రమంగా అంతరిస్తుంది.

కనుక స్త్రీలు తమ జాతికి జరిగే అన్యాయాన్ని ప్రచారం ద్వారా చాలా వరకు అరికట్టుకోవచ్చును. స్త్రీ జాతికి సేవ చేయటానికి నడుము కట్టిన ''ఆంధ్ర మహిళ'' వంటి పత్రికలు స్త్రీలకి జరిగే అన్యాయాన్ని - సినిమాలైనాసరే, కథలైనా సరే, హరికథలైనా సరే- ఎప్పటికప్పుడు తీవ్రంగా విమర్శిస్తున్నట్టయితే ఆ అన్యాయం కట్టుపడటమే కాక స్త్రీ ఉన్నతికి గాను జరగదగిన యథార్థ సంస్కారానికి తగిన వాతావరణం కూడా ఏర్పడుతుంది. మహిళాభ్యుదయం ఆశయంగా పెట్టుకున్న ప్రతి పత్రికా తన ఆశయం తాలూకు దృష్టి పథంనుంచి జీవితాన్ని సర్వతోముఖంగా విమర్శించటం అత్యవసరం.

స్త్రీ సమస్యలు కేవలమూ స్త్రీలకి మాత్రమే సంబంధించినవికావు. మార్క్సిస్టులు చెప్పినట్టు ఒకరిని నిర్బంధంలో ఉంచేవాళ్లు స్వేచ్ఛను అనుభవించలేరు. అబిసీనియాలో రుణదాతలు బాకీదార్లని తమ చేతులకి కట్టేసుకు తిరుగుతారు. బంధితులు జైలులో బంధించబడి ఉంటే కాపలావాళ్లు బయట బంధించబడి ఉంటారు. బ్రిటనుదారిద్ర్యానికి భారతదేశమే కారణం. ఆ విధంగానే ఆడవాళ్ల స్వాతంత్ర్య సమస్య మగవాళ్ల స్వాతంత్ర్య సమస్యతో లంకె వేసి ఉంది. స్త్రీలకి అన్యాయం చేస్తున్నవాళ్లు పురుషులక్కూడా అన్యాయం చేస్తున్నారు. మన చిత్రాల్లో చూపబడే ఆదర్శసతీమణులు పెళ్ళాలుగా గలవాళ్లపాట్లు పరమాత్ముడికెరుక !

*ముద్రణ : ఆంధ్రమహిళ, పక్షపత్రిక, సంపుటి1, సంచిక21, 15-3-1945*

# 16. దాంపత్యంలో వ్యత్యాసాలు

సంఘంలో ఆడదాని దోపిడి అనేక ఆచారాలద్వారా జరుగుతున్నది. స్త్రీల శ్రేయస్సు కోరేవాళ్లే ఆచారాలను ప్రతిఘటించటానికి ప్రయత్నించి సంఘానికి వెలి అవుతారు; కాని ఆ ఆచారాలు అడుగంటినమీదనే సంఘానికి అభ్యుదయం చేకూరుతుంది.

సుమారయిన తెలివితేటలు కలవాడు అయిదునిమిషాల్లో గ్రహించే విషయాన్ని ఒక్కొక్కసారి సంఘం యాభై సంవత్సరాలలో కూడా గ్రహించ లేకపోతుంది. దానికి తగినట్టే సంఘంయొక్క అభ్యుదయానికి విరుద్ధంగా పనిచెయ్యటానికి కంకణం కట్టుకున్న విద్రోహులుకూడా సంఘంలో ఉంటారు.

స్త్రీకి సంబంధించిన ఆచారాలలో చాలాభాగం దురాచారాలని మనం ఈ రోజుల్లో గ్రహించగలం. ఆడది పుట్టింటా, అత్తవారింటా హేయమైన బానిసజీవితం గడపటమూ, తండ్రి తాలూకు ఆస్తులమీద స్త్రీకి హక్కులు లేకపోవటమూ, అతిబాల్యంలో వివాహం చెయ్యటమూ, నడివయువ్వనంలోనే నలుగురు పిల్లల తల్లి అయి వృద్ధాప్యంలో పడిపోవటమూ, భర్తపోతే తల గొరిగించుకుని, తిరిగి వివాహం చేసుకునే హక్కు లేకుండా, ఏవిధమైన ఆనందంగాని పొందే యోగ్యతలేకుండా, రెండుపూటలా ఇంతతిండి అయినా తినరాకుండా, అడ్డమైనవాళ్ళకీ చాకిరి చెయ్యటానికి మటుకే నోచుకోవటమూ మొదలైన దురాచారాలను గురించి ప్రజల అభిప్రాయాలు క్రమంగా మారుతూ వస్తున్నాయి. ఇదికూడా ఎంతో అలజడి జరిగిన మీదటగాని సాధ్య కావటంలేదు.

వర్గశత్రుత్వం అతిహేయమైనది, నీచమైనది. దానికి లోబడి మానవులు పశువులకన్న అసహ్యంగా ప్రవర్తిస్తారు. ఆడదానికి అతి కనీసపు హక్కు లివ్వటానికి బిల్లుపెడితే దాన్ని సంఘం దారుణంగా ఎదుర్కొంటుంది. నే నిప్పుడు దారుణమైన దురాచారాలను గురించి చర్చించి అది దోపిడికి ఎంత అనువుగా ఉన్నదీమటుకే రాస్తున్నాను.

దాంపత్యంలో భార్యభర్తల తేడాలు మనకి ఆచారంగా వస్తూ ఉన్నాయి. ఆర్థికంగా భార్య తాలూకువాళ్ళకన్న భర్త తాలుకువాళ్ళ కాస్తకలవారయితే అమ్మాయి అదృష్టవంతురాలంటారు. వరుడు కొంచెం తక్కువ ఆస్తిపరుడైతే మొగ్గ అటే ఉందంటారు. మొగ్గ మరీ జాస్తయితే ఇల్లరికం కింద జమకట్టేస్తారు.

రెండోది చదువు. సామాన్యంగా ఆడపిల్లలకి మగవాళ్ళ కొచ్చే చదువుండదు. ఎక్కడైనా పొరపాటున ఆడపిల్ల కూడా బాగా చదువుకున్నదే అయితే, ''వాడి మాట అదేం వింటుంది ?'' అంటారు ఖర్మంచాలక భార్యే కొంచెం ఎక్కువ చదివినదయితే మొగుణ్ణి చూసి సంఘం ఒక్క నిట్టూర్పు విడిచి ఊరుకుంటుంది.

మూడోది వయసు. ఏ కారణంచేతో భర్త భార్య కంటె పెద్దవాడై ఉంటే తప్ప అది సరయిన దాంపత్యంగా మనకి తోచదు. భార్యభర్తకన్న ఏ యేడాదో యేణర్థమో మాత్రమే ఎక్కువుంటే వరుడికి వయోహీనత ప్రాప్తించిందంటారు. భర్తకన్న భార్య బాగా పదిపన్నెండేళ్ళు చిన్నదయితే ఎవరూ ఆశ్చర్యపడరు పైపెచ్చు ''ఏమీ పరవాలేదు. పదేళ్ళు

తేడా అయితే మటుకేం ? పిల్లలు పుట్టరా ? సుఖపడరా ? '' అంటారు

ఈ వాదన అవలంబించి మగవాడికి పదేళ్లు పెద్దదయిన పిల్లనుమటుకు కట్టరు!

ఈ వ్యత్యాసాలు పొరపాటునగాని సంఘ శ్రేయస్సు కోసం పెద్దలు శాస్త్రరీత్యా నిర్ణయించినవిగాని కావు. మరెందుకొచ్చినట్టు ? ఇవి ఎందుకాచారాలయినై ? వీటిలో మార్పు తీసుకురావటానికి ప్రయత్నిస్తే సంఘం నిర్లిప్తత వహించి ఊరుకుంటుందా ?

బాగా ఆస్తి ఉండి స్వతంత్రంగా తన భర్తని ఎన్నుకునే అవకాశం ఉన్నప్పటికీ ఆడది తనకన్న భాగ్యవంతుడికోసం ఎందుకు చూస్తుంది ? బియ్యే పాసయిన పిల్ల ఐ.సి.ఎస్. వాడి కోసం ఎందుకు వెతుకుతుంది ? ఆడదానికెన్ని అవకాశాలిచ్చినా తన నెత్తిన ఆ కళ్లు పెట్టే అర్హతగల భర్తకోసం ఎందుకెదురు చూస్తుంది ?

ఇది బానిసబుద్ధి. అందుచేతనే అది దోపిడి విధానాన్ని పెంచే ఆచారాలకు లొంగి ఉంటుంది. ఈ ఆచారాలే బానిసత్వానికీ జన్మస్థానం కూడానూ.

మాటవరసకి ఈ ఆచారాలంతం చేసి ఆడపిల్లలు తమ యీడువాళ్లనే, తమంత చదువూ డబ్బూకలవాళ్లనే పెళ్లాడే ఆచారం అమలులో పెడితే ఆడదాని జీవితంలో జరిగే పరిణామం మనం ఊహించవచ్చు. ఇటువంటి ఆచారం వచ్చిన మర్నాడు ఆడది మగవాడు తనకన్న ఉత్తమజాతి జంతువనే భావన విసర్జించగలుగుతుంది. ప్రతి విషయంలోనూ తను భర్తకి లోకువే అనే జ్ఞానం ఆమె జీవితాన్ని వెంబడించదు. భర్తని సులభంగా తన సంఘంలోవాడుగా స్వీకరించి, అతని సంఘంలో తానుకూడా స్థానం సంపాదించుకోగలుగుతుంది. భర్త చలాయించే చిల్లరధాష్టీకాన్ని అయిదు నిమిషాలు చలాయించదు. అసలు భర్తకూడా ధాష్టీకం చెలాయించటానికి ప్రయత్నించడు. పెళ్లయి భర్త దగ్గరికి పోవటమంటే ఆడదానికప్పుడు మరో కొత్త జన్మ అనిపించదు. భార్యకి భర్త పంచుకోలేని ఒక రహస్య మానసిక జీవితం అవసరం లేదు.

దాంపత్యంలో వ్యత్యాసాలు అంతం చెయ్యటం వల్ల సంఘానికి ఉమ్మడిగా ఎంత ప్రయోజనం ఉందో ఎవరూ సరిగా గ్రహించలేదని నా అనుమానం. ఏ విషయం గురించి గాని మనం ఆలోచించటం ప్రారంభిస్తే గాని క్రమంగా దాని సత్యం బయటపడదు. నలుగురూ - ముఖ్యంగా స్త్రీలు - ఈ విషయం గురించి ఆలోచించటం ప్రారంభించగలందులకే ఈ నాలుగుముక్కలూ రాశాను. ఈ విషయం ముందుముందు ఇంకా తెలివైన మనుషులు ఇంకా విజ్ఞానపూరితమైన విషయాలు రాసి సంఘం కళ్లు తెరుస్తారని నాకు దృఢమైన నమ్మకం ఉంది.

*ముద్రణ : ఆంధ్రమహిళ, పక్షపత్రిక, సంపుటి2, సంచిక5, 15-5-1945.*

*పునర్ముద్రణ : ఆంధ్రజ్యోతి, దినపత్రిక, 18-10-1988.*

# 17. ఆడపిల్లల పెళ్ళిళ్లు

మనదేశంలో ఆడపిల్లల పెళ్ళిళ్ల సమస్య రానురాను చాలా క్లిష్టంగా తయారయింది. శారదా చట్టం కూడా ఈ సమస్య పరిష్కారం కావటాని కేమాత్రమూ తోడ్పడుతున్నట్టు కనిపించదు. నిజానికి శారదాచట్టం ఒక సమస్యని పరిష్కరించేటందుకు పెట్టినదికాదు; అతి బాల్య వివాహాలవల్ల కలిగే దురన్యాయం చూసి సహించలేనివాళ్ల అంతరాత్మలకు కొంచం ఉపశాంతి కలిగేటందుకు పెట్టినది. అందువల్ల శారదాచట్టం నిరుపయోగమైనదని కాదు; దాని ప్రయోజనాన్ని పూర్తిగా పొందేటందుకు అవసరమైన పద్ధతుల్ని సంఘం - ముఖ్యంగా తెలుగు సంఘం - అవలంబించలేదు. అందుకు హరవిలాస శార్దాగారు బాధ్యులు కారు.

క్రియకు తెలుగుదేశంలో ఆడపిల్లల పెళ్లిళ్లు వాయిదా పెళ్ళిళ్లుగా (delayed marriages) తయారయినాయి గాని సంస్కారం పొందిన పెళ్ళిళ్ళ కింద జమకాలేదు. వెనకటి రోజుల్లో పిల్లకు త్వరలో పెళ్ళి చెయ్యకపోతే ఎక్కడ రజస్వల అయిపోతుందో అని తల్లిదండ్రులు తహతహలాడేవారు. రజస్వలానంతర వివాహాలొచ్చినాక కూడా ఈ తల్లిదండ్రుల తహతహ అట్లాగే ఉంది ! ఆ రోజుల్లో ఆడపిల్లలు అభం శుభం ఎరుగని స్థితిలో భార్యత్వం మీద వేసుకునేవారు గనుక వాళ్లకి భర్తల్ని వెదికే బాధ్యత తల్లిదండ్రులపై ఉండేది. మరి ఈనాడున్నూ పిల్లలకి భర్తల్ని తల్లిదండ్రులే వెదుకుతున్నారు ! పాతికేళ్లు వచ్చిన కుమార్తెలకు సహితం మొగుళ్లని వెదికే తల్లిదండ్రులపాట్లు చూస్తుంటే వీళ్ళకి వివాహం గురించి అభిప్రాయాలేమీ మారలేదని మనకి స్పష్టంగా తెలుస్తుంది. ఈ తల్లిదండ్రుల్ని నేనడుగుతున్నాను. మీ పిల్లల మొగుళ్ళని మీరెందుకు వెదుకుతారు ? మీ పిల్లల్నే ఎందుకు వెదుక్కోనివ్వరు ?

''మా పిల్లలకి మొగుళ్లని వెదుక్కునే అవకాశంలేదు,'' అంటారు. అవకాశం ఎందుకివ్వరు?

''వాళ్ళకి చాతకాదు,'' అంటారు. ఎందుకు నేర్పరు ?

అంతేనా ? మా పిల్లని మీ అబ్బాయికి చేసుకుంటారా అని మీరు వెళ్లి వరుడి తల్లిదండ్రులని అడిగితే వాళ్లు నిర్మొహమాటంగా ''కట్నం ఏమిస్తారు ?'' అని అడుగుతారు.

అదే మీ పిల్ల వెళ్ళి వాళ్ల అబ్బాయిని అడిగితే ఆ అబ్బాయికి కట్నం విషయం అడిగేదమ్ముంటుందా ? ఒకవేళ అబ్బాయి, ''మీ నాన్న కట్నం నాకేం ఇస్తాడు?'' అని అడిగితే, ''మా నాన్న కేమిటి సంబంధం ? '' అని పిల్ల అడగదా ?

మగపిల్లవాడిక్కావలసింది భార్య – కట్నంకాదు. మగపిల్లలూ, ఆడపిల్లలూ పెళ్ళిళ్ళ విషయం తమలో తాము తేల్చుకునే రోజేవస్తే కట్నాల సమస్యే ఉండదు మనం వాళ్ళకు ఒకళ్లనొకరు కోరుకునే అవకాశం ఇవ్వటం లేదు అటువంటి అవకాశం ఉండినచోట పెళ్ళిళ్లు వధూవరుల ఇష్టప్రకారమే ఇప్పుడున్నూ జరుగుతూ ఉన్నాయి

ప్రతి ఆడపిల్లా వెళ్లి ఎవరో ఒక పిల్లవాణ్ణి, ''నన్ను పెళ్ళి చేసుకుంటావా ? '' అని అడగాలని నా తాత్పర్యం కాదు. మగపిల్లవాడయేది, ఆడపిల్ల అయేది, తనకు ఒక మనిషి గట్టిగా కావాలని తోచినప్పుడు ముందు అడక్క తప్పదు. ఈ విషయంలో మగపిల్లలకీ ఆడపిల్లలకీ మనం సమానమైన అవకాశాలిస్తే నూటికి తొంభైసార్లు మగపిల్లలే ఆడపిల్లల్ని అడగటం జరుగుతుంది అటువంటప్పుడు ప్రస్తుత స్థితిలో ఆడపిల్లల తండ్రులే మగపిల్లల వేటకి జాస్తిగా బయలుదేరటం చాలా తలకిందులు ఏర్పాటు. ఈ విధంగా ఆడపిల్లలు పెళ్ళిళ్ల మార్కెట్‌లో అతిచౌక అయిపోయి, వాళ్ళ వెంట వేలకువేలు కట్నాలు తూకం పెట్టవలసి వస్తున్నది.

సంఘంలో ఈ ఏర్పాటు అంతమై పెళ్ళిళ్లు సక్రమంగా జరగాలంటే పెద్దవాళ్ళలో జరగవలసిన మానసిక పరివర్తన బోలెడంత ఉన్నది పిల్లలు భార్యలనుగాని, భర్తలనిగాని సంపాదించుకునే భారం తమమీదే ఉందని చిన్నతనం నుంచే స్పష్టంగా తెలుసుకునేటట్టు చెయ్యాలి. వయసువచ్చిన పిల్లలు ఒకళ్ళకేసి ఒకళ్లు చూసుకోవటమే రంకనే పిచ్చి అభిప్రాయాలు వాళ్ళ తలలో పెట్టక వాళ్లు ఒకరితో ఒకరు స్వేచ్ఛగా పరిచయం చేసుకునే అవకాశం ఇవ్వాలి. రంకుతనం హేయమైనదని నమ్మించగలిగితే పిల్లలుకూడా పెద్దవాళ్లంత నీతిగానూ ఉండగలరు పెద్దవాళ్ళం స్వేచ్ఛగా పరస్త్రీలతోనూ, పరపురుషులతోనూ మాట్లాడుతున్నాం కాదూ? ఆ పరిచయం రంకుతనానికి దారి తీస్తున్నదా ? అదంతా వట్టి చాదస్తం. పెద్దవాళ్లకన్న పిల్లలకి ఆత్మ గౌరవంగాని శరీరాభిమానంగాని తక్కువ ఉంటుందను కోవటానికి ఆధారంలేదు ఆమాటకొస్తే నీతిలో వాళ్లకుండే విశ్వాసం పెద్దవాళ్లకుండదు.

వాళ్లంతట వాళ్లు చేసుకునే పెళ్ళిళ్లు ఆదర్శప్రాయంగా ఉంటాయని కూడా నా అభిప్రాయం కాదు అసలు ఆదర్శప్రాయమైన పెళ్లంటూ ఉండదు. ఒకపిల్ల తన భర్తను ఎన్నుకునేటప్పుడు తనకు లభ్యమయే వాళ్లందరిలోకీ ఉత్తముణ్ణే ఎన్నుకోవటానికి ప్రయత్నిస్తుంది. ఒకవేళ తన లోటుబాట్లు చప్పున తెలుసుకోక తనకుమించిన భర్తని సంపాయించటానికి ప్రయత్నించినట్టయితే ఆ ప్రయత్నాలు విఫలం కావటంవల్ల ఆత్మజ్ఞానం కలిగే అవకాశం ఉంది. మరొకళ్లు చేసే పెళ్ళిలో ఇది సాధ్యం కాదు. సామాన్యంగా మధ్య తరగతి ఆడపిల్ల తల్లిదండ్రులు మొదట్లో కొండలకి వెంట్రుకలు

కడతారు. ఆఖరుకు తమరిచ్చే కట్నానికి తగిన భర్తరాలేదనే అభిప్రాయం బాగా ఏర్పడిపోతుంది ఈ చిక్కు సొంతాన చేసుకునే పెళ్ళిళ్ల కుండదు. ఏ కారణం చేతనైనా ఒక పిల్ల ''ఇంతకంటె తక్కువవాణ్ణి నేను చేసుకోను,'' అని పట్టుపట్టినప్పుడు తన కోరిక సఫలం చేసుకునేటందుకు పిల్ల విశ్వ ప్రయత్నం చెయ్యటానికీ, ఫలించని పక్షంలో అవివాహితగా ఉండిపోవటానికీ అవకాశం ఇవ్వటం ధర్మం.

నా పెళ్ళి మరొకరు చేసేకన్న నేను చేసుకోవటం నాకూ సంఘానికీ శ్రేయస్కరమని ఈనాడు రుజువు చెయ్యటానికి పూనుకోవటం అనవసరం. భారతదేశానికి స్వాతంత్ర్యం కావాలని రుజువు చెయ్యటం లాగుంటుంది. కాని దురదృష్టవశాత్తూ ఎక్కువమంది తల్లిదండ్రులింత పరమసత్యాన్ని కూడా గ్రహించక, పిల్లల్ని చదివించక, వాళ్ల పెళ్ళిళ్ల భారం తమమీదే వేసుకుని నిద్రాహారాలు లేక ఆఖరికి ఏదోవిధంగా పెళ్లి చేసి కొంపలు గుల్లలు చేసుకుంటూ, తీరా తమ కూతుళ్ళకి చక్కని పెళ్ళిళ్లు చేశామనే తృప్తి అయినా పొందలేని దుస్థితిలో ఉన్నారు. ఇది శోచనీయం ఈ పరిస్థితులు మార్చటానికి బుద్ధిమంతులైనవాళ్లు మార్గదర్శకులుగా ఉండి తమ ఆడపిల్లలకి విజ్ఞానమూ, బాధ్యతా, ఆత్మవిశ్వాసమూ, తృప్తికరమైన వివాహాలూ కలిగిస్తారని నమ్ముతున్నాను. ఇటువంటి మార్పు ప్రస్తుతం ప్రత్యేకించి ఆడపిల్ల తల్లులలో రావలసి ఉంది.

*ముద్రణ : ఆంధ్రమహిళ, పక్షపత్రిక, సంపుటి2, సంచిక5, 20-7-1945.*
*పునర్ముద్రణ : ఆంధ్రజ్యోతి, దినపత్రిక, 4-10-1988.*

# 18. రోడ్డుపక్క రోమియోలు

డబ్బు పారేస్తే మహరాజులాగా లోపలికి రానిచ్చే సానిపిల్ల లగాయతు, డబ్బు ఎదురిచ్చే పూటకూళ్ళమ్మ దాకా అనేక రకాల బస్తీ స్త్రీలతో మెలగనేర్చిన గిరీశం పంతులు రామచంద్రపురం వెళ్లి బుచ్చమ్మను 'లవ్' చెయ్యటం ఆరంభించగానే పెద్ద చిక్కులో పడ్డాడు. ఏమంటే దానికి 'లవ్ సిగ్నల్స్ ' ఏమీ తెలీవు !

మగవాడికి ఆడదాన్ని చూస్తే కలిగే ఆకర్షణ, దేశకాల పాత్రాలను బట్టి సౌందర్య పిపాసో, సంభోగ వాంఛో, ప్రేమో అనిపించుకుంటుంది. ఈ భావాలను ఎంతవరకు నిగ్రహించుకోవాలనేది నిర్ణయించేవి నీతీ, ఆచారమూనూ మాటవరసకి, స్త్రీలు ఘోషా పద్ధతి అవలంబించే సమాజంలో, మగవాడు సౌందర్య పిపాస కూడా ప్రకటించటానికి వీల్లేదు – అవినీతి. అదే మనదేశం తీసుకున్నట్టయితే, ఇక్కడ ఆడవాళ్ళకు ఘోషాలేక పోయినప్పటికీ, వీధిలో వెళ్లే ఆడదాన్ని తేరిపార చూడటం తప్పు – అనాచారం. మరి,

పాశ్చాత్యదేశాల్లో స్త్రీలు పురుషులను ఆకర్షించటానికి నానా అగచాట్లూ పడతారు. రెండు గంటలు కష్టపడీ ముస్తాబై వీధిలోకి వచ్చిన స్త్రీ తనను ఎంతమంది పురుషులు తేరిపార జూస్తే తన శ్రమ అంత ఫలప్రదమైనదని భావిస్తుంది. తనను చూడగానే మగవాళ్లు ఈలలు వేస్తే పరమానంద భరితురాలవుతుంది. మనదేశంలో మగవాళ్లు చేయగూడని పనులుగా భావించబడే ఈ తేరి పార చూడటం, ఈలలు వెయ్యటం వంటివి అమెరికాలో సౌందర్య పిపాసగా భావించబడతాయి. అందులో అవినీతీ లేదు, అనాచారమూ లేదు.

పరస్త్రీతో సంభోగించాలనే వాంఛ ప్రపంచమంతటా అవినీతిగానే పరిగణించబడుతున్నది. అయితే, అన్ని దేశాలలోనూ నీతి దూరమైన స్త్రీ పురుష సంబంధం- రంకుతనాలు - అమలు జరగటం అందరికీ తెలిసిన విషయమే. ఈ రంకుతనాలన్నీ విజయవంతంగా - అంటే, పైకి పొక్కకుండా - ఎట్లా జరుగుతున్నాయంటే, స్త్రీ పురుష పరస్పర సహకారం వల్ల. ఇక్కడే గిరీశంగారి లవ్ సిగ్నల్స్ ఉపయోగంలోకి వచ్చేది.

అయితే ఈ ప్రేమ సంకేతాలు సర్వత్రా పనిచెయ్యవు. అవతల మనిషి బుచ్చెమ్మలాటి దైనప్పుడు ఇవతల గిరీశం 'స్టంప్' అయిపోతాడు. గిరీశం ఢక్కా ముక్కలు తిని ఉన్నవాడు గనక, బుచ్చెమ్మకు లవ్‌మేకింగ్ చెయ్యటంలో గల ఇబ్బందులు బాగా గుర్తించి ఉపాయంగా వ్యూహం పన్నాడు. కాని అందరికీ అంత తెలివితేటలుండవు; అవతల మనిషి మనసు పూర్తిగా తెలుసుకోకుండా మీద చెయ్యివేసేసి 'షాక్' తింటారు.

అవినీతికరమైన వాంఛను వ్యక్తం చెయ్యటంలో ఆచార సంప్రదాయాలున్నాయి. అవతలివాడు తనతో సంభోగం కోరినప్పుడు తన కిష్టం లేకపోతే ఆడది చెప్పదగిన సాకులు పదమూడింటిని ఒక హాలీవుడ్ సినిమాతార ఒక వ్యాసంలో వివరించింది! వాటిల్లో కెవ్వున అరిచి మూర్ఛపోవటంగాని, ఎవడ్రా నువ్వు ? ఇదుగో ఎవరండోయ్, రక్షించండి ! అని కేకలు పెట్టటం గాని లేదు....

ఇక మిగిలినది ప్రేమ. స్త్రీ పురుషుల మధ్య ఉండే ఆకర్షణ లన్నిటిలోకీ ఇది సర్వోత్తమమైనదిగా నాగరిక ప్రపంచంలో చలామణీ అవుతున్నది. ఇది మానవ సంస్కృతికి ఉన్నత నిదర్శనం. ప్రేమించి పెళ్ళాడటం స్త్రీ పురుషులకు గల ఉత్తమ సామాజిక హక్కులలో ఒకటిగా భావించబడుతున్నది.

పాశ్చాత్య దేశాలలో ఈ హక్కు సిద్ధాంత రీత్యా అమలులో ఉన్నప్పటికీ, వాస్తవంలో అమలు కావటానికి ధనికవాదం అడుగడుగునా అడ్డు తగులుతున్నది. తమకు ప్రేమించే శక్తి ఉన్నప్పుడు కూడా ఆదేశాలలో స్త్రీలు ప్రేమకు ప్రాధాన్యం ఇవ్వక, ఆర్థిక క్షేమానికి అమ్ముడు పోతారు. ధనికులైన పురుషులు అందగత్తెలను భార్యలుగా

సంపాదించుకోగలుగుతారు. 'నువ్వు ఆ స్త్రీని డబ్బుతో కొన్నావు' అని ఎవరైనా అంటే ఆ ధనిక పుంగవుడు ఆమోదించక పోవచ్చుగాక, కాని అది కొనుగోలు గాకపోదు. అదే విధంగా , డబ్బున్న స్త్రీలు తమకు కొడుకులు కాదగిన యువకులను పెళ్లాడటం కూడా చాలాసార్లు జరుగుతున్నది. ఇదంతా గౌరవనీయమైన వడుపువృత్తే తప్ప మరేమీ లేదని చెప్పవచ్చు.

సోషలిస్టు వ్యవస్థను అమలులో పెట్టిన రష్యా, చైనా మొదలైన దేశాలలో కలిగిన గొప్ప సాంఘిక పరివర్తన ఏమంటే, ఆ దేశాలలో ప్రేమ వివాహాలకు తప్ప మరో రకమైన వివాహాలకు ఆస్కారం లేకుండా చేసేశారు. విప్లవం పూర్తికాగానే ప్రేమ రహితమైన వివాహాలనూ, బలవద్వివాహాలనూ రద్దు చేసుకునేటందుకు స్త్రీలకు పూర్తి అవకాశాలూ, ప్రోత్సాహమూ ఇచ్చారు. స్త్రీలు ఆర్థికంగా తమ కాళ్ళ మీద తాము నిలబడేటట్టు చేస్తూ, వారికి పురుషులతో సమమైన ఆర్థిక ప్రతిపత్తి కలిగించారు. ఈ విధానమే రష్యాలో వేశ్యావృత్తినీ, సుఖవ్యాధుల వ్యాప్తినీ నిర్మూలించటానికి తోడ్పడింది. నిన్న మొన్న జరిగిన చైనా విప్లవం అనంతరం ప్రజాన్యాయ స్థానాలు లక్షలాది వివాహాలను రద్దు చేసి స్త్రీలు తాము ప్రేమించిన వారిని వివాహం చేసుకునేటట్టు చేశాయి. వివాహం విషయంలో చైనా స్త్రీలు బానిసల కంటే హేయంగా ఉంటూ వచ్చారు. బజారులో పశువులను కొన్నట్టుగా కొని తెచ్చుకోవటం ఆచారంగా ఉండేది. పిల్లలు కలగని ధనవంతులు ఏ పేదవాడి భార్యనో రెండేళ్లపాటు కిరాయికి తెచ్చుకుని పిల్లలని కనిపించి, వారిని ఉంచుకుని ఆ స్త్రీలను తిరిగి తమ భర్తల దగ్గరకి పంపేసేవారట! ఇంత కన్న భయంకరమైన ఆచారం ఎవరూ ఊహించుకోలేరు. అదంతా ఈనాడు మారిపోయింది. ఇటువంటి సంఘటనలు వింటుంటే, చైనా స్త్రీలు విప్లవం కోసం ఎందుకు పోరాడారో మనకు అర్థమవుతుంది.

మనదేశమూ, మనమూ, మన ఆచార సంప్రదాయాలూ తీసుకుంటే, మనం ఎటూ తేలని స్థితిలో ఉన్నాం. శారదా బిల్లు అమలులోకి వచ్చినప్పుడే సంఘం కొంత కదలబారింది. అతిబాల్య వివాహాలు పోయాయి. అంటే స్త్రీలు వ్యక్తురాళ్లయి వివాహం చేసుకునేటందుకు పథకం ఏర్పడింది. కాని, ప్రేమ వివాహాలకు దారి ఏర్పడలేదు (శారదా బిల్లు ఉద్దేశ్యం కూడా అది కాదు .) రజస్వల కాబోయే ముందు పెళ్లి అయి, రజస్వల అయిన ఏడాదికి కాపరానికి వెళ్ళే ఆచారంగల వారికి శారదా బిల్లు చేసిన మహోపకారం ఏమంతలేదు. కాని అది చేసిన గొప్ప మేలేమంటే, రజస్వలానంతర వివాహాలకు ప్రచారం కలిగించింది. రజస్వల కాకముందే పెళ్లి చేసుకోవాలన్న నిర్బంధం పోయేసరికి, ఆడపిల్లలను తల్లిదండ్రులు పాతికేళ్ళదాకా కూడా అవివాహితులుగా ఉంచగలిగారు. చప్పున పిల్లను ఎవరికో ఒకరికి ముడి పెట్టే దుర్దశ తప్పింది.

ఇందువల్ల స్త్రీ విద్య హెచ్చింది. తొమ్మిదో ఏట నుంచి పెళ్ళికీ, పదమూడో ఏట నుంచీ పిల్లల్ని కనటానికీ ఎదురు చూడవలసిన దుస్థితి తొలగి పోగానే, ఆడపిల్లలు హాయిగా హైస్కూలు చదువూ, కాలేజీ చదువూ చదవసాగారు.

ఇంతలో యుద్ధం వచ్చింది. దాని వెనకాడితే స్వాతంత్ర్యం వచ్చింది. ప్రభుత్వం స్త్రీలకు ఉద్యోగ సౌకర్యాలు కలగజేసింది. పెద్ద బస్తీలలోనూ, పట్టణాలలోనూ ఆడపిల్లలు ఉద్యోగాలలో ప్రవేశించారు.

ఇన్ని మార్పులు జరిగినా ప్రేమ వివాహాలకు ప్రాతిపదిక ఏర్పడలేదు. దీనికి చాలా కారణాలున్నాయి.

వివాహ విధానంలో ఏ మార్పు రాలేదు. వెనుకటి రోజుల్లో తండ్రులు తమ పదేళ్ళ కూతుళ్ళకు మొగుళ్ళను వెతికితే, ఈనాటి తండ్రులు తమ ఇరవై ఏళ్ళ కూతుళ్ళకు మొగుళ్లను వెదుకుతున్నారు.

వెనకటి పదేళ్ల పిల్లలకు తమకు కాబోయే భర్త యొక్క మంచి చెడ్డలను గురించి ఎంత తెలుసో, ఈనాటి ఇరవై ఏళ్ల వధువులకు అంతకంటె కొంచెం తక్కువే తెలుసు!

ఆనాటి ఆడపిల్ల అమాయకత్వం చేత మంచి సంబంధం కూడా వద్దన్నా, కూడని సంబంధం చేసుకుంటానన్నా పెద్దవాళ్లు మందలించేటందుకుండేది. ఈనాటి వధువు అజ్ఞానం చేత తప్పునిర్ణయం చేస్తే పెద్దవాళ్లు మందలించటానికి అంతగా వీలుండదు.

''ఆడపిల్లను ఎక్కువ చోట ఇయ్యి , తక్కువ చోట తెచ్చుకో !'' అని వెనక అనేవాళ్ళు. ఈనాడింకా మన మనస్తత్వం మారలేదు. స్కూల్‌ఫైనల్ దాకా చదువుకున్న పిల్ల బియ్యేకు తక్కువైతే చేసుకోదు. తమ శిరస్సులు తమ భర్తల కాళ్ళకంటే ఎత్తుండరాదన్న వైఖరి ఎంత చదువుకున్న ఆడపిల్లలకూ పోవటంలేదు.

మగవాళ్లు కూడా అంతే. ఇంటరు పాసయిన వాడు ఆడ బియ్యేను చేసుకోవటానికి ఒప్పుకోడు ! అన్ని విధాలా భార్య తనకన్న తక్కువలోనే ఉండాలి.

పైగా, పెళ్లి చేసుకోవటానికి ఒప్పుకున్న ప్రతివాడికీ కట్నం రూపంలో లంచం కావాలి. వెనక, ఈ కట్నాల దాహం పెళ్లి కొడుకుల తలిదండ్రులకు మాత్రమే ఉండేది ఇప్పటి పెళ్లి కొడుకులు పెద్ద వాళ్లయిన వాళ్లు గనక తల్లిదండ్రులమీద నెపం లేదు. వీళ్ళకే కట్నాలు కావాలి.

ముప్ఫై ఏళ్లవాడికీ, ఇరవై ఏళ్ల దానికి పెళ్లి చేసినా కూడా, వారికి పరిచయం పెళ్లి అయినాక కలగవలసిందే గాని, పెళ్లికి ముందు పరిచయమన్నది లేదు.

ఈ పరిస్థితులలో ప్రేమ వివాహాలకు ఆస్కారం ఏమీలేదని వేరే చెప్పనవసరం లేదు.

ఆచారాల సంగతి వదిలేసి, వ్యక్తుల సాంఘిక మనస్తత్వం తీసుకుందాం.

ఈ కాలపు కుర్రాళ్ళకు, కిందటి తరం వాళ్ళకన్నా సౌందర్య పిపాస కొంత హెచ్చుగా ఉన్నమాట నిజమే. సినిమాతారల సెక్స్ అప్పీలూ, పోస్టర్ల ద్వారా , పత్రికల ద్వారా , సినిమాలద్వారా దాని ప్రచారమూ, విరివిగా వచ్చిపడుతున్న సెక్స్ సాహిత్యమూ, విదేశీ పత్రికలూ వృథా పోవటంలేదు. కాని ఈ సౌందర్య పిపాసను వివాహం ద్వారా తృప్తి పరచుకుందామనే దృక్పథం వారికి లేదు. పిల్ల అందం కోసం మిగతా విషయాలు త్యాగం చేయాలనే ఉద్దేశ్యం ఎవరికీ లేదు. తన భార్య అందం చూసి నలుగురూ ఆనందించే పక్షంలో తన పరువుకు భంగమన్న వైఖరి ఏమీ మారలేదు ''భార్యా రూపవతీ శత్రుః '' అన్న సిద్ధాంతంలో మార్పు రాలేదు. అందుచేత ఈనాటి యువకుల సౌందర్య పిపాస వెంట, సౌందర్యం పట్ల గౌరవాభిమానాలు ఏమీ లేవు. అందుచేత, వాళ్ల తమ సౌందర్య పిపాసను పరస్త్రీల విషయంలోనే పాటిస్తారు. ఎవరైనా తమ భార్యలను అందంగా కనబడనిస్తే, వాళ్లను గురించి ఎక్కువ మంది పురుషులకు తక్కువ అభిప్రాయమే ఉంటుంది.

ఇక ఆడవాళ్ళ సాంఘిక మనస్తత్వం తీసుకుంటే, బాగా చదువుకుని పెళ్లికి ఎదురు చూస్తున్న ఆడపిల్ల కూడా 'ఖైదు' లో నుంచి బయటికి రాదు. తమ జీవితాలు ఎవడో ఒకడికి కైంకర్యం అయిపోయినట్టూ, వాణ్ని గురించే తప్ప తమకు మరొకరిని గురించి తెలుసుకోవలసిన అగత్యం లేనట్టూ ప్రవర్తిస్తారు. అంతేగాని, తమ ఈడు కుర్రవాళ్ళతో కలుపుగోలుగా తిరిగి రకరకాల మనస్తత్వాలను పరిశీలించరు. వాళ్ళలో తమని ఆకర్షించే లక్షణాలేమైనా ఉన్నాయేమో, తమలో ఏ లక్షణాలైనా ఇతరులను ఆకర్షిస్తున్నాయేమో చూడరు. తమ పురుషుడంటూ ఏర్పడకముందే అందరినీ పరపురుషులుగా చూస్తారు. ఒక్క రంకుతనం కోసమే ఆవిడ పురుషులతో కలివిడిగా ఉండాలనే బూజుపట్టిన మనస్తత్వం ఇంకా చాలమంది ఆడపిల్లలను పట్టి వేధిస్తున్నట్టు కనబడుతుంది. ఆడవాళ్ల తమకూ మగవాళ్లకూ సెక్స్ బాంధవ్యం తప్ప మరొక సాంఘికం సంబంధ లేదన్న వైఖరి అవలంబించటం – కనీసం, అవలంబించినట్టు ప్రవర్తించటం – పోయే వరకూ వారు తమకై తాము ఒకరిని ప్రేమించటం గాని, ప్రేమ వివాహాలు చేసుకోవటంగాని, జరగదు.

ఇటువంటి చిక్కులన్నీ ఉండగా వీటితోబాటు సంఘంలో ధనిక వాదం ప్రబలంగా ఉన్నది. అసలు ప్రేమ అంటేనే ఏమిటో తెలియని అవివాహిత ప్రేమ కోసం భద్రతను త్యాగం చెయ్యటానికి యత్నించటం పొసగదు.

జీవితంలో పాక్షికమైన మార్పులు వస్తున్నాయి. ఆడది నిన్నటికన్న ఇవాళ బయటకి వచ్చింది. కాని ప్రేమ వివాహాలకు అనుకూలమైన పరిస్థితి ఏ మాత్రమూ ఏర్పడలేదు. మగవాళ్ల ఆడదాన్ని నిన్నటి కన్నా ఇవాళ దగ్గరగా చూస్తున్నారు. కాని,

వాడి సాంఘిక మనస్తత్వంలో మార్పు కలగలేదు. కామోద్రేకం మాత్రం పూర్వం కన్న పురుషులలో ఎక్కువగా విజృంభిస్తున్నది. రోడ్డు పక్కక రోమియోలు తయారవుతున్నారు రంకుతనానికి ఆహ్వానించేటప్పుడైనా ఈనాటి రోమియోలకు ప్రేమ అభినయించటం చేత కాదు, అభినయించాలన్న ప్రయత్నమూ లేదు. ఏ పిల్ల మీదనో కన్నువేసి ఒంటరిగా దొరకగానే చెయ్యి పుచ్చుకుంటాడు. అటువంటి పరిస్థితిని ఎట్లా ఎదుర్కోవాలో ఆ పిల్లకూ తెలీదు. ఒక్క కేక పెడుతుంది. అల్లరి అవుతుంది.

మగవాళ్లు ఆడవాళ్లను కేవలం భోగవస్తువుగా పరిగణించే మనస్తత్వం వదిలించుకున్న దాకా, వీళ్ళ ప్రవర్తన ఇంతకంటే బాగుండే అవకాశం లేదు. ఆడజాతి మీద ఈనాటి మగజాతికి గల గౌరవం చాలా రెట్లు పెరిగితే గాని, ప్రేమ వివాహాలకు పునాది ఏర్పడదు. నాగరిక ప్రపంచంలో ప్రేమించటం ఎంత మాత్రమూ తప్పులేదు, కేవలం కామించటం చాలా నీచమైన పని.

*ముద్రణ: ఢంకా, మాసపత్రిక ఏప్రిల్,1956.*

# 19. స్త్రీలను గురించి

స్త్రీలు పైకి రావాలనీ, సంఘంలో వారికి గౌరవ మర్యాదలు హెచ్చాలనీ, వాళ్ళు మగవాళ్ళకు అనుబంధాలుగా మాత్రమే ఉండిపోరాదనీ అందరూ ఒప్పుకుంటారు. అయితే ఇది ఏ విధంగా సాధ్యమవుతుందనేది ఎవరికీ స్పష్టంగా తెలీదు. మన ఎరికలో వీరేశలింగం పంతులుగారు స్త్రీ పునర్వివాహాలు చేశారు. స్త్రీ విద్యను ప్రబోధించారు. భావకవులు స్త్రీని ఒక దేవతగా ఆరాధించి, ''నగల్ తొడి మేనిడి'' చాపటాన్ని గర్హించారు. భావ వచన కవి చలంగారు వివాహం మీద కత్తికట్టారు. ప్రేమా, అందమూ, స్వేచ్ఛా – ఇవి ఉంటే స్త్రీ ధన్యురాలవుతుందనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. అటు తరువాత ఆడదానికోసం అలా స్ట్రాటో స్ఫియర్ లోకి ఎగిరినవాళ్ళు మరి లేరనే చెప్పాలి. హనుమంతుణ్ణి చూసి పిల్ల కోతులు ఎగిరినట్టుగా అర్భకపు కధకులు ''మెడ కింది వాపు'' లనూ, తమ ప్రేయసుల రవికెల పరిమితాలను వర్ణించారు. గాని, చాలా వరకు చెమటకంపే మిగిలింది.

ఇటీవల కొందరు స్త్రీ రచయితలు స్త్రీ సమస్యను చాలా సుగమం చేసేశారు. తప్పంతా మగవాళ్ళదే. వాళ్ళు భార్యలను అర్థం చేసుకోరు. వాళ్ల ఫీలింగ్స్‌కోసం కేర్ చెయ్యరు. మగవాళ్ల మనస్తత్వం సరిఅయిననాడు స్త్రీ సమస్యే ఉండదన్న అభిప్రాయం కలిగిస్తున్నారు రచయిత్రులు.

వీరిలో ఎవరూ అసలైన స్త్రీ సమస్యను తాకనైనా లేదనీ, అది అంత తేలికైన సమస్య కాదనీ నా నమ్మకం.

నిజానికి సమస్య వేదకాలం నాటిది. వివాహ వ్యవస్థ ఏర్పడక పూర్వంకూడా వైదికార్యులు స్త్రీని హీనంగానే చూశారు. జబల కొడుకు సత్యకాముకుడికి తండ్రి ఎవరో జబలకే తెలీదు. అయినా బ్రాహ్మలు సత్యకాముణ్ణి బ్రాహ్మడికింద జమచేసి ఉపనయనంచేసి, బ్రహ్మ విద్య చెప్పారు. అటువంటి కాలంలో కూడా వైదిక కర్మలను పురుషులే చేశారు. గోత్రాలు (అసలు అర్థం పశువుల కొట్టాలు) ఏర్పడ్డప్పుడు కూడా వాటిని మగవాళ్ళ పేరనే ఏర్పాటు చేశారు.

ఈ హీనస్థితి నుంచి కాపాడటానికి మధ్య యుగాలలో ఒక ప్రయత్నం జరిగింది. దానికి సాధనంగా ఉపయోగపడినది ప్రణయారాధన. ప్రబంధాల దగ్గిరకి వచ్చేసరికి స్త్రీ పట్ల పురుషుడి ప్రవర్తన కొద్దిగా మారింది. పరాశరుడు మత్స్యగంధిని గంగ మధ్యలో గాలించటంలేదు. గర్భవతిగా వున్న బృహస్పతి భార్యను బృహస్పతి తమ్ముడు చెరచటం లేదు. ఉద్దాలకుడి భార్యను ఎవడో బ్రాహ్మణుడు చెయ్యి పట్టుకుని తన కామేచ్ఛ తీర్చుకొనటానికి లాక్కుపోతూ ఉంటే ఆమె కొడుకైన శ్వేతకేతుడు ఆగ్రహించటమూ, అందులో తప్పేమీలేదని ఉద్దాలకుడు తన కొడుకుతో అనటమూ లేదు.

పురుషుడు స్త్రీని కామించి ఆమెకోసం విరహంపడి, ప్రాణాలు విడవటానికి సిద్ధపడతాడు. ఆమెకు కాళ్ళు పడతాడు . (దుష్యంతుడు). ఆమెచేత కాలితన్నులు తింటాడు. (కృష్ణుడు). స్త్రీకి అసూయపడే హక్కు, భర్త మీద అలిగే హక్కు లభించింది. స్త్రీలకోసం కోపగృహాలు కూడా ప్రత్యేకంగా ఏర్పటయ్యాయి. వీటిని ఆకాలం నాటి ''స్త్రీల ప్రత్యేక స్థలాలు'' అనవచ్చు.

చిత్రమేమిటంటే పురాణాలలోని సత్యభామ అపరదుర్వాసుడు కాదు. ఆమెలో అసూయ, ఆగ్రహావేశాలు లేవు. ఇవన్నీ మధ్యయుగాలలో జరిగిన కల్పన. వైదికయుగంలో స్త్రీకి ఔన్నత్యం లేకపోయినా, కొంతవరకు స్వేచ్ఛ ఉండేదని రుజావుచెయ్యవచ్చు. ప్రబంధకాలంలో స్వేచ్ఛ మాట దేవుడెరుగుగాని కొంత ఔన్నత్యం లభించినమాట నిజం. అయితే అంత మాత్రాన స్త్రీ సమస్య పరిష్కారమయిందా ? పరిష్కారం కాకపోగా జీవితంతోబాటు మరింత క్లిష్టం కూడా అయింది.

అతి బాల్యవివాహాలు, సతీసహగమనమూ వితంతువులను వికారంగా తయారుచేసి గొడ్డుచాకిరి చేయించటమూ, వాళ్ళకు ఆస్తి హక్కులు లేకుండా చెయ్యటమూ మొదలైన వాటితో సమాజం స్త్రీని మహాదారుణంగా వేటాడింది. భర్తృహరి చెప్పిన వివేక భ్రష్టుడిలాగా స్త్రీ అనేక భంగుల సంపాతం చెందింది.

వీరేశలింగంగారి దగ్గిరికి వచ్చేద్దాం. అప్పటికే ''సతి''పోయింది. పోయినా మిగతావేవీ పోలేదు. వితంతువులకు వివాహాలు చేయించే ఉద్యమం నడిపించారు పంతులుగారు. ఆ పెళ్ళిళ్ళను చలంగారు ఆక్షేపించటం సహజమేగాని, పంతులుగారు

ఆనాడు ఉద్యమం లేవదీయకపోతే ఈనాడు ఇంత స్వేచ్ఛగా స్త్రీ పునర్వివాహాలు జరుగవు. బుర్రలు గొరిగించుకుని వెట్టిచాకిరి చేసి, ఎవరి మోచేతికిందో నీళ్ళు తాగుతూ ఉండవలసిన అనేక మంది స్త్రీలు సంసార సుఖం అనుభవిస్తున్నారు. పిల్లలను కూడా కంటున్నారు. ఆ వివాహాలు జయప్రదమయ్యాయా, ఆ దంపతులు సుఖంగా ఉన్నారా అని చలంగారు అడిగి లాభంలేదు. ఏ దంపతులూ సుఖంగా ఉండే కిటుకు చలంగారు ఎక్కడా చెప్పలేదు పైపెచ్చు పెళ్ళిళ్లకే ఆయన ఎసరు పెట్టారు. ఇది గొప్ప ఐడియా అని ఎందుకు మెచ్చుకోవాలంటే వివాహ వ్యవస్థను రద్దు చెయ్యటం మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్, మావో, నంబూద్రిపాద్‌లకు కూడా అసాధ్యం గనక !

చలంగారు ఆకాశనికెత్తారని సర్వత్రా ఆమోదించబడుతూనే ఉన్నది. స్త్రీ ఉన్నతి కోసం చలంగారు చూసినది ఏమిటి ? ప్రేమ : ప్రేమికుడితోనే లేచిపోయిన చలం హీరోయిన్ వాడితో పాతివ్రత్యం నెరుపుతానంటుంది ! (చూడు ''మైదానం''). చలంగారికి అభ్యంతరం పాతివ్రత్యం కాదు. పతిపత్నీ సంబంధం. స్త్రీ సమస్య పరిష్కారమయిందా ? కాలేదని సవినయంగా మనవి చేస్తాను.

స్త్రీ పట్ల పురుషుడి వైఖరి మారితే స్త్రీ సమస్య పరిష్కారమవుతుందన్న ధోరణి అవలంబించే ముప్పాళ్ళ రంగనాయకమ్మగారు కూడా పాతివ్రత్యంతో పేచీపడడం లేదు. ఆవిడ నాయిక తన భర్త పాదాల దగ్గిర దాసీగాపడి ఉండటానికి అభ్యంతరం చెప్పదు – అతను తనను అర్థం చేసుకుంటే (చూడు ''రచయిత్రి'').

అసలు సమస్య ఏమిటి ? ఇది మగవాడి ప్రపంచం. ఈనాటి జీవితంలో పురుషుడు ప్రధానపాత్ర నిర్వహిస్తున్నాడు. స్త్రీ అప్రధానపాత్ర నిర్వహిస్తున్నది ఆ విషయం దాచిపెట్టేందుకు స్త్రీ సౌందర్యం అత్యంత ఆరాధనీయంగా కీర్తించబడుతున్నది. భోగ్యవస్తువుగా స్త్రీ అడుగడుగునా చిత్రించబడుతున్నది. సెక్సుకు ప్రాముఖ్యం పెరిగినకొద్దీ స్త్రీ సమస్య నీరుకారి పోతుందని నేను ఘంటాపథంగా చెప్పగలను. సినిమాలూ, చిత్తకార్తె రచనలు స్త్రీని ఊబిలోకి ఈడ్చేస్తున్నాయి. ఈ దుష్పరిణామాన్ని చలంగారి రచనలు ఏ మాత్రమూ అడ్డగించలేదు.

స్త్రీ విద్య అవసరమే చాలా అవసరం. విజ్ఞానంలో స్త్రీ పురుషుడికి వెనకబడి ఉండవలసిన అవసరం ఏమీ లేదు. కాని స్త్రీకి జీవితంలో గల పాత్ర మారకపోతే విద్య ద్వారా అసంతృప్తి, మానసిక, శారీరక వ్యభిచారమూ మాత్రమే దక్కుతాయి. (''ఒకప్పుడు పూలు అమ్మాను; ఇప్పుడునన్ను నేను అమ్ముకోవలసిందే'' అంటుంది షాగారి ఎలెజా)

సమాజంలో ఒక వర్గం మరొక వర్గాన్ని అణచి పెట్టి ఉన్నప్పుడు రెంటిల్లోనూ మార్పులు రావాలి. అణగారి వున్న వర్గం తాను మారుతూ తనను అణచిపెట్టిన వర్గాన్ని

మార్చాలి అవి సంఘర్షణలూ వైరుధ్యంతో కూడుకున్నవికావు. కార్మికులకూ, పారిశ్రామికులకూ మధ్య కేవలం సంఘర్షణేగాక వైరుధ్యం ఉన్నది. స్త్రీ పురుషులమధ్య కేవలం సంఘర్షణే ఉంటుంది. ఆడవాళ్లు మగవాళ్ళను మారమన్నంత మాత్రాన ఈ సంఘర్షణ సమసిపోదు.

జీవితం చాలా విశాలమైనది. ఇందులో సెక్సుకు తగిన స్థానమే ఇచ్చినట్టయితే స్త్రీల వ్యక్తిత్వం ప్రతి ఒక్క జీవితరంగంలోనూ వికాసం చెందవచ్చు. అది ఒక్క పడకగదిలోనే వికాసం చెందాలనిగాని, సినిమాలలోలాగా ప్రతి మైదానమూ, తోటా, కొండా స్త్రీ పురుషులకు అయాచితంగా లభించిన పడకగదే అనుకొని నమ్మటం- లేక నమ్మినట్టు ప్రవర్తించటం - స్త్రీలకు మనం చేస్తున్న మహాద్రోహం.

ఆర్థికంగానూ, వైజ్ఞానికంగానూ ఈనాడు స్త్రీలు అందుకోలేని స్థాయిలేదు. మన ఎదుట స్త్రీలు తుపాకులు తీసుకుని గెరిల్లా పోరాటాలు సాగిస్తున్నారు. మనం సిగ్గు తెచ్చుకోవాలి!

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక 28 - 6 -1968*

# ౨౦. స్త్రీల సమస్యలు

మనది బడుగు దేశం. మనం బడుగువాళ్లం. మన సంస్కృతీ, సంప్రదాయాలూ, ఆచారాలూ, అలవాట్లూ వెనకబడి ఉన్నాయనుకొనటానికి మనం అభ్యంతరం చెప్పవద్దు. (వాటిని మనం ఒదులుకుంటామా అన్నది వేరేమాట) మనకన్న ముందున్న దేశాలున్నాయి. వాటిలో కొన్ని సామ్రాజ్యాలు వెలగబెట్టినవి; మరికొన్ని విప్లవాలు చేసి, మనకన్న అట్టే ముందున్నవి కాకపోయినా, సామ్యవాదం మీద ఆధారపడిన ఆర్థిక విధానాలద్వారా ముందుకొచ్చినవి. మనం ఈనాడు రెంటినీ అనుకరించ వ్యర్థ ప్రయత్నం చేస్తున్నామనుకోండి. అది ప్రస్తుతాంశం కాదు.

ఇంగ్లాండుంది. అది శ్రేయోరాజ్యం. తలసరి సంపాదన చాలా హెచ్చు. జీవన ప్రమాణాలు కూడా హెచ్చు. మన స్త్రీలతో పోలిస్తే అక్కడి స్త్రీలకు సాంఘికంగా ఎక్కువ స్వేచ్ఛ, ఎక్కువ హక్కులూ ఉన్నాయి. వాళ్ళు ప్రేమించి పెళ్లాడుతారు. (ప్రేమించడం మానేస్తే విడాకులు పుచ్చుకుంటారు . లేక ఇస్తారు) వాళ్ళలో గొప్ప డాక్టర్లూ, రచయితలూ, విమర్శకులూ, ఇతర మేధావులూ వున్నారు.

కాని ఇక్కడ కూడా స్త్రీ సమస్యలున్నాయి. ఒకప్పుడు అక్కడి స్త్రీలు వోట్లకోసం పెద్ద పోరాటం సాగించటం జరిగింది. అక్కడ ఉన్నత విద్య చదివిన స్త్రీలలో పదోవంతు మాత్రమే ధనార్జనలోకి దిగుతున్నారు. అంటే మిగతా తొమ్మిదివంతుల మంది భర్తల చేత భరించబడుతున్నవాళ్ళేనన్న మాట. ఇల్లూ, వాకిలీ, పిల్లా, జెల్లా

చూసుకుంటారన్నమాట.

శ్రామిక స్త్రీలకు పురుషులకన్న ఇంగ్లండులో తక్కువ వేతనాలిస్తారు మగవాళ్ళకిచ్చే దానిలో సగమో, ఇంతకన్న ఒక్క పిసరు ఎక్కువో ఉంటుంది. పురుషులతో తమకూ సమంగా వేతనాలిమ్మని వాళ్లిప్పుడు ఆందోళన చేస్తున్నారు. నిజానికి ఈ ఆందోళన అనవసరం. ఎంచేతంటే, ఇప్పుడు ఇంగ్లండులో వున్న లేబర్ ప్రభుత్వం ఆశయాలలో స్త్రీ పురుష వేతనాలను సమం చెయ్యటం కూడా ఒకటి పైపెచ్చు ఇప్పుడిక్కడ కార్మికశాఖా మంత్రి ఆడది- బార్బారా కాసిల్.

ఇంత అనుకూల పరిస్థితులలో సైతం బ్రిటిష్ కార్మిక స్త్రీలు ఆందోళన చెయ్యక తప్పలేదు, ఇంగ్లండులోని ఫోర్డ్ కర్మాగారాల లోని ఆడ మెషీనిస్టులు సమ్మె చేశారు. వాళ్ల కోరిన విధంగా వేతనాలివ్వటం వల్ల ఫోర్డ్ సంస్థ దివాలా ఎత్తిపోదు. ఆ సంస్థ ఇచ్చే వేతనాల మొత్తంలో ఇది ఒక నీటి బొట్టు. కాని ఫోర్డు సంస్థవారు ఆడవాళ్ల మగవాళ్ళతో సమంగా చూడటంలో వుండే ''విప్లవాన్ని'' గ్రహించి అంతులేని నష్టాన్నయినా భరించటానికి సిద్ధపడి తొమ్మిదివేల మందిని పనిలోనుంచి బర్తరఫ్ చేశారు. సమ్మెదార్లను ''ధనిక వర్గ పత్రికలు'' దుమ్మెత్తి పోశాయి. సమ్మె మూడువారాలు సాగింది. కార్మిక మంత్రిణి బార్బారా కాసిల్ కలుగజేసుకొని ఏడు గంటలసేపు కంఠశోషపడి వేతనాలు పెరిగేటట్టు చూసింది. కాని స్త్రీలకు పురుషులతో సమంగా వేతనం ఉండేటట్టు మాత్రం చేయలేదు.

ఇదంతా ఏనాడో అంధయుగంలో జరిగినది కాదు. ఇటీవల జరిగినదే. ఈ విషయం ఎందుకు ప్రస్తావించానంటే, మనవాళ్లు ఇంగ్లండు లాంటి శ్రేయో రాజ్యాలకు వెళ్ళి అక్కడి స్త్రీల స్థాయి చూసి, ''ఆహా ! మన దేశం కూడా శ్రేయోరాజ్యంగా రూపొందితే మన స్త్రీలకు ఏ సమస్యలూ వుండవు గదా ! '' అనుకోవచ్చు. కాని అది పొరపాటు ! ధనిక స్వామ్యం అమలు అయ్యే శ్రేయోరాజ్యాలన్నిటిలోనూ ఈ విచక్షణ ఉండనే ఉన్నది. ధనిక స్వామ్యం ''ముదిరి'' ఫాసిజం వచ్చినప్పుడు స్త్రీలు హిట్లరు పరిపాలనలోలాగా పురుషుల భోగవస్తువు లవుతారు. (వస్తువులన్నమాట నుడికారంతో వాడినది కాదు).

ఇందుకు వ్యతిరేకంగా రష్యా చీనా తదితర దేశాలలో సామ్యవాదం అమలు జరగగానే ఆర్థికంగా స్త్రీ పురుషుల మధ్య ఈ వ్యత్యాసం మంత్రించినట్టు మాయమయింది. ఇలా ఎందుకు జరిగిందో ఆలోచిస్తే మనం మన స్త్రీల సమస్యల పరిష్కారం కోసం చిన్న చిన్న గోరుగిచ్చులు సూచించటం జరగదు. గోటితో పొయ్యేదానికి గొడ్డలి ఉపయోగించడం అవివేకమే.

స్త్రీలకు సంబంధించిన సమస్యలను గురించి ''రొమాంటిక్'' గా ఆలోచించటం

కాస్సేపు కట్టిపెట్టి వాస్తవ భౌతిక విషయాలు కొన్ని ఆలోచిద్దాం కొందరు స్త్రీలు డబ్బున్న చోటపడి, మంచి మంచి చీరలు , నగలూ, కార్లూ, పార్టీలూ అనుభవిస్తూ, భర్తలు చెప్పే అబద్ధపు ప్రేమమాటలు నమ్ముతూ, కలెక్టరుగారి బొచ్చుకుక్కలాగా, సుఖానందంతో తేలిపోతూ, ''మనదేశంలో ఆడదానికి అన్ని హక్కులూ ఉన్నాయి, ఏ సమస్యా లేదు '' అనవచ్చు మరి కొందరు కేవలం అజ్ఞానం చేత అదే అనవచ్చు . మరికొందరు ''స్త్రీలకు సమస్యలున్నాయి గాని అవన్నీ పురుషుల సమస్యలే '' అనేసి, స్త్రీ పురుషుల ఉమ్మడి సమస్య తప్ప - అవి ఏ యుగంలోనైనా ఉంటాయి - ప్రత్యేకించి స్త్రీ సమస్యలంటూ లేనే లేవని దబాయించవచ్చు. అంత మాత్రం చేత మంత్రించినట్టుగా వాస్తవం మారిపోదు.

సినిమా కథలలో తప్ప, మామూలు కథలలోనూ, అంతకంటే జాస్తిగా జీవితంలోనూ కనిపించే వరకట్నాలను తీసుకుందాం ; ఇది ''హుష్ కాకీ'' అంటే పోయే సమస్య కాదు

వరకట్నాలను తీసుకోవటం నీచమనీ, దోషమనీ, అలాంటి వాళ్ళను చీపురుకట్టలు తీసుకుని వెంటబడి తరమాలనీ అనుకొంటున్నట్టుగా ఎవరూ ప్రవర్తించటం లేదు. అంటే దానికి స్థూలంగా సాంఘికుల ఆమోదముద్ర ఉన్నదన్నమాట.

ఒక పిల్లను పెళ్లి చేసుకునేవాడు కట్నం ఇస్తేగాని చేసుకోననటంలో అర్థం - ఇంప్లికేషన్ - ఏమిటి ? వెనక, అంటే అంధయుగాలలో, స్త్రీలను ధనికులు బానిసలుగా కొనేవారు. , వాళ్లకూడా బానిసతోబాటు డబ్బిమ్మనేవాళ్లకారు. మన ''అల్లుళ్ల''కున్న ప్రజ్ఞ వాళ్ళకి లేకపోయింది. ఈ మన ''అల్లుడు'' డబ్బు తీసుకున్నందుకు పెళ్ళాన్ని పోషిస్తాం గదా అనవచ్చు బానిసలను కొన్నవాళ్ళుకూడా పోషించే వాళ్లు. వీళ్ళు ఎక్కువ వెలగబెట్టుకున్నదేమీ లేదు. ఈనాటి వధువు ఆనాటి బానిసకన్న చాలా హీనస్థితిలో ఉన్నది. (ఆడది నిక్షేపంగా ఉన్నదనే స్త్రీలు నన్ను క్షమిస్తే,)

ఈ వరశుల్కంతో పోలిస్తే కన్యాశుల్కం చాలా నయం. దుష్టుడు గిరీశం ''సెల్లింగ్ గరల్స్ - డామిట్ !'' అంటే ఏంగాక ! పిల్ల అందచందాలు, పనిపాటలూ, వినయ విధేయతలూ చూసి హెచ్చు కన్యాశుల్కం ఇచ్చి, కొనేసుకునేవారు, మంచి ధరకు అమ్ముడైన పిల్ల మరింత సంపన్నమైనచోట పడేది. వరశుల్కంకన్న కన్యాశుల్కం హీనమైనదని లోకమంతా కోడైకూసినా నేను వినిపించుకోను. (అది కావాలన్నట్టు వ్యాఖ్యానించేరు !)

ఎంతమంది ఆడపిల్లలు తండ్రులు తమకూతుళ్లను రొమ్ముల కుంపట్లల్లే చూస్తున్నారో, తామిచ్చే కట్నాలు చాలక సంబంధాలు తిరిగిపోతుంటే ఆ కూతుళ్ళను ఎంతగా తిట్టుకుంటున్నారో , ఎంతకూ పెళ్లిగాని కూతుళ్ళని ఎలా

ఈసడించుకుంటున్నారో, తమ మూలాన తల్లిదండ్రులు పడేబాధా, వాళ్ళ నిరసనా చూసి, ఎంత మంది అవివాహితలు నరకబాధపడి , ఏ భ్రాష్టుడైనా చేసుకుంటే చాలుననే మానసికస్థితికి దిగజారుతున్నారో, ఈ సమస్య వెంబడి ఎంత సాంఘిక క్రౌర్యం ఉంటున్నదో ఎవరూ ఆలోచించరా ?

పెళ్లి కావలసిన యువకుల్లో చదువుకున్న పెళ్ళవంటే ఒద్దనేవాళ్ల ఎందరున్నారోమనకు తెలుసు. పెళ్ళామే వచ్చినా, అది ఉద్యోగం చేసి తమ దారిద్ర్య భారాన్ని కొంత వరకైనా తగ్గించ బూనుకుంటే ఏం జరుగుతుందో మహీధర రామమోహనరావుగారు ''ఇక ఆ కథ అంతే'' లో చక్కగా చూపారు. సత్యజిత్‌రాయ్ ''మహానగర్''లోకూడా చక్కగా చూపాడు. ( ఆ కథ అంతేనని మనం నిరాశావాదం అవలంబించవద్దు, ఆ కథ ఎట్లా మారుతుందో దాన్ని గురించి ఆలోచించటం మంచిది).

ఆడదాని హైన్యాన్ని రుజువు చెయ్యటానికి వాళ్ల ముట్టవుతారనీ, కడుపుతో వుంటారనీ అనే భ్రాష్టులు కూడా వున్న మన సమాజంలో ఆడదానికి సమస్యలే లేవనటం దారుణం : వాటిని గురించి ఆలోచించకపోతే మానెయ్యవచ్చు. ఆలోచించేవాళ్ల ఆలోచిస్తారు.

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 27-9-1968.*

# 21. వరకట్నాలు సదాచారమా ?

4-4-69 ''ఆంధ్రజ్యోతి సంచిక'' లో ''వరకట్నం దురాచారమా'' అని శ్రీమతి చల్లపల్లి స్వర్ణకుమారి అడిగారు. వరకట్నాల ఆచారాన్ని పనిపెట్టుకు సమర్థించనవసరంలేదు. ఆ ఆచారం చక్కగా అమలులో ఉన్నది. దానికి వచ్చిపడిన ప్రమాదం ఇంతలో ఏమీ లేదు.

''వరకట్నం దురాచారం కాదు '' అంటే చాలామందికి ఆశ్చర్యం కలగొచ్చు. కొందరికి కోపం రావచ్చు. ఇందులో సగం నిజం కాదు. వరకట్నం దురాచారం కాదని చాలా హెచ్చు మంది నమ్మడమేగాక, ఆచరణలో కూడా వుంచారు. కొద్దిమందికి కోపం వస్తుందనేమాట నిజమే. దానికి కారణం తరువాత విచారింతాం.

వరకట్నాలను సమర్థించటం ఏమంత కష్టం కాదు. అది ఒక విధమైన ఆర్థిక పుటేర్పాటు. భర్త భార్యను యావజ్జీవమూ పోషించాలి. ఆమె పిల్లల్ని కంటె ఆ పిల్లల్నీ పోషించి, పెద్దవాళ్ళనుచేసి చదువులు చెప్పించి, వాళ్ళలో ఆడవాళ్ళు వుంటే వాళ్ళకి కట్నాలు పోసి పెళ్ళిళ్ల చేయాలి. అంచేత ఆడది పెళ్లినాడు కొంత కట్నంతెస్తే అది యిలా సద్వినియోగమవుతుంది. మగవాడు ఉద్యోగాలు చేసి ఆర్జిస్తాడు. వంటింట చేరి వంట

చేసి ఆడది కుటుంబానికి ఎలాటి ధనాదాయమూ కలిగించదు. ఆడపిల్లలకు తండ్రి ఆస్తిలో భాగం ఉండేదికాదు గనుక. కడుపున పుట్టినందుకు దాని కోసం ఇంత డబ్బు పోసి వీలయినంత, సాధ్యమైనంత ఘరానా భర్తను చెయ్యడం తండ్రి విధి.

ఇది ఫక్తు ఆర్థిక సమర్థన

అయితే వరకట్నాలను పురస్కరించుకున్న సాంఘిక భావాలు, సమర్థనలు, కొన్ని వున్నాయి. శ్రీమతి స్వర్ణకుమారి వాటిని ప్రస్తావించకపోవడం శోచనీయం.

పిల్ల ఇతరత్రా ఎంతో అందగత్తే, లక్షణవతీ అయినప్పటికీ, ఆమెను కట్నం లేకుండా పెళ్ళాడితే వాడి స్టేటస్ దెబ్బతింటుంది. పిల్ల అందగత్తెఅనో, పనిమంతురాలనో కట్నం తీసుకోకుండా పెళ్ళాడినవాడు ''నాప''

కనక దాని లాజికల్ కంక్లూజన్ ఏమిటంటే అందచందాలు, సుగుణాలు పాటించక ఎంత హెచ్చు కట్నం తీసుకుని పెళ్లాడితే అంత గొప్ప స్టేటస్.

పై దృక్పథంతో వరుడి స్టేటస్‌కూ, వధువు అర్హతలకూ ఉండే కాంట్రడిక్షన్ స్పష్టంగా అర్థం చేసుకోవచ్చు.

దానికి మరొక కొరాలరీ ఏమిటంటే, వరులను సంపాదించడం మార్కెట్ వ్యాపారం గనక (ఈ మాట స్వర్ణకుమారిగారు ఒప్పుకుంటున్నారు). ప్రతి తండ్రి తన కూతురుకి సాధ్యమైనంత ఉన్నతమైన సంబంధం తీసుకురావటం వాడి విధి గనక, పేద తండ్రుల కూతుళ్ళు ఇల్లాళ్ళుగా ఉండటానికి ఎన్ని అర్హతలు గలవారైనా సరే. హీనులయిన భర్తలను చేసుకోవటానికిసిద్ధంగా ఉండాలి. ''మార్కెట్'' వాతావరణంలో ''పిండి కొద్దీ రొట్టె''

ఆడపిల్లల వివాహయోగ్యతా, మగపిల్లవాళ్ల వరశుల్కయోగ్యతా, సూటిగా ఆర్థిక సూత్రాలపైన ఇలా నిలబడితే వివాహ వ్యవస్థకు క్రమంగా ఏగతి పట్టేదీ, తద్వారా సమాజం ఎలా పరిణమించేదీ ఊహించడం కష్టంకాదు.

అభిమానవతి అయి, కాస్త చదువుకున్న ఆధునిక యువతి, తన తండ్రి ఆ కట్నం మొహాన పారెయ్యకపోతే తన భర్త తనను చేసుకుని ఉండేవాడు కాడన్న సంగతి తెలిసి, ఆ భర్తతో ఎలాటి మనస్తత్వంతో కాపురం చేస్తుందో, ఆ ఆలోచనను అణిచి పెట్టటానికి తన ఫైనర్ ఫీలింగ్స్‌ను ఎంతగా మొద్దుపరచుకోవాలో ఊహించడం కష్టంకాదు.

ఇంకొక్క సంగతికూడా స్పష్టంగా తేల్చుకోవాలి.వరకట్నం ఒక ఆర్థిక సమస్య అనే మాటుంటే భార్య చదువుకున్నదై , ఉద్యోగం చేయగలిగితే, నాలుగు రాళ్లు తాను కూడా తెచ్చి కుటుంబ ఆర్థిక భారం తానుకూడా పంచుకోగలదైతే, కట్నం లేకుండా యువకులు పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నారా ? వధువు బియ్యే చదివిందనో, ఎమ్మే

చదివిందనో, రీసెర్చి చేస్తుందనో అనగానే చాలా మంది ''అబ్బో మాకొద్దు!'' అనేస్తారేం ? సంసారాన్ని ఒంటిగా లాగలేకుండా ఉన్న ఒక్క మొగుడు కూడా, తన భార్య చిన్న ఉద్యోగం చేసి నాలుగురాళ్లు తెస్తానంటే ఎగిరి పడతాడేం ? గతిలేక భార్య ఉద్యోగం చేయడానికి ఒప్పుకున్నా అస్తమానం రాచి రంపాన పెడతాడేం? (''ఇక ఈ కథ యింతే'' అన్న మహీధర రామమోహనరావు గారి రచన లాగ)

అందుచేత వరకట్నాలకు ఆర్థిక కారణం తప్ప వేరే కారణాలు లేవనుకోవడం పెద్ద పొరపాటు. పునాదిలో అది ఉన్నప్పటికీ దానిమీద సాంఘిక ప్రభావాలు చాలా వున్నాయి స్థూలంగా అవేమిటంటే :

1. డబ్బుగలవాడికి సోషల్ ప్రివిలేజీలు హెచ్చుగా ఉండాలి. లేనివాడు జీవిత పోరాటంలో ఓడితీరాలి.
2. ఆడది మగవాడికి లొంగే వుండాలి. ఎంత స్వల్ప విషయంలో కూడా అది మగవాడికి సమం కారాదు.

ఈ పై రెండు అంశాలూ నచ్చనివాళ్లు వరకట్నాల ఆచారాన్ని తప్పక ద్వేషిస్తారు వర కట్నాలు ఈనాడు మన సమాజంలో ఉన్న ఆర్థిక, సాంఘిక వ్యవస్థకు ఒక సంకేతం. ఇది ఎన్నటికీ ఇలాగే ఉండిపోతుందనుకొనేవారు వర కట్నాల ఆచారాన్ని ఆమోదిస్తున్నారు కాని ఈ వ్యవస్థ మారుతుందనీ, మారాలనీ అనుకునేవాళ్లు వరకట్నాలను ద్వేషిస్తారు.

ఒక వ్యవస్థ అమలులో ఉన్నంత మాత్రాన దాన్ని అందరూ ఆకాశానికెత్తాలని, ఆమోదించాలనీ ఎక్కడా లేదు. మనదేశంలో పెట్టుబడిదారీ విధానమూ, ధనస్వామ్యమూ అమలులో ఉన్నాయి. కాని వాటిని అందరూ ఆమోదించడంలేదు. వాళ్లు సమాజంలో మార్పు కోరుతున్నారు.

ఇంకొక విషయం కూడా గమనించాలి. కట్నాలు తీసుకోకుండా పిల్లను చేసుకోవటం తలవంపులని అధిక సంఖ్యాకులు అనుకున్నట్టే, అత్యల్ప సంఖ్యాకులు కట్నం అడగడం నామర్దా అనికూడా భావిస్తున్నారు.

అలాగే వధువు డిగ్రీ కలదీ ఉద్యోగం చెయ్యగలదీ అయితే ఆమెను చేసుకోవటానికి ఎగిరి గంతేసే యువకులు కూడా అక్కడక్కడా ఉంటున్నారు భవిష్యత్సమాజాన్ని సూచించేది వీళ్ళేగాని, వరకట్నాలను ఆరాధించే వాళ్లూ, సమర్థించేవాళ్ళు కారు.

ఆఖరు సంగతి పాశ్చాత్య సంస్కృతే అంటారో, ప్రాచీన సంస్కృతే అంటారో, ప్రేమ వివాహాలు మిగిలిన అన్ని వివాహాలకన్నా సర్వోత్కృష్టమైనవిగా సభ్య నాగరిక ప్రపంచం ఆమోదిస్తున్నది. పూర్వం స్త్రీల స్వయంవరాలు జరిగాయి. పాండవులకు

ముందుగానే అంబ అనే కాశీరాజు కూతురు సాల్వుణ్ణి ప్రేమించానని భీష్ముడితో చెప్పుకున్నది.

ప్రేమ వివాహాలు అభ్యుదయవాదులకు అభిమానపాత్రం కావటానికి మరొక కారణం ఏమంటే, ప్రేమ వివాహం వధూవరుల మధ్యగల సాంఘిక వ్యత్యాసాలని, పూర్తిగా కాకపోతే చాలా వరకు రద్దుచేస్తుంది.

''ఎందుకొచ్చిన ప్రేమ వివాహాలు ? ప్రేమ వివాహాలని చెప్పి చేసుకున్నవి పెద్దవాళ్ళు చేసిన పెళ్ళిళ్ళకన్నా కూడా అధ్వాన్నంగా ఉంటున్నాయి'' అనేవాళ్ళు బయట వాతావరణం ప్రేమ వివాహాలకు ఎంత అనుకూలంగా ఉన్నదీ గమనించడంలేదు. భార్యను తనతో సమంగా చూసుకొనే భర్త నలుగురిలోనూ నవ్వులపాలు కాకుండా ఉండడం ఇంచుమించు అసంభవం.

అయినా ప్రేమ వివాహాలకు భవిష్యత్తున్నదనీ, భవిష్యత్తు ప్రేమ వివాహాలవేపే ఉన్నదనీ నమ్మే అల్ప సంఖ్యాకవర్గం ఒకటి ఉన్నది. వరకట్న దురాచారం – దాన్ని దురాచారమనే అంటాను. – ప్రేమ వివాహాలకు గొడ్డలిపెట్టు అందుచేతనే అల్ప సంఖ్యాక వర్గం వాళ్ళు వరకట్నాలను మనస్ఫూర్తిగా ద్వేషిస్తారు. ఈ దురాచారాన్ని ఏదో మిష మీద ఆమోదించే ప్రతి ఒక్కరూ అభ్యుదయ పరిణామాలకు అడ్డుగా ఉన్నవాళ్ళేనని నా నమ్మకం.

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక,18-4-1969.*

# 22. ఇంటి చాకిరి

ప్రపంచమంతటా ఇంటిచాకిరి ఆడదానిదిగా ఉంటున్నది. దోచుకునే దేశాలూ దోచుకోబడే దేశాలూ, ముందుకొచ్చిన దేశాలూ, వెనక్కుపోతున్న దేశాలూ, కోటీశ్వరులపాలనలో ఉన్నవీ, శ్రామికులపాలనలో ఉన్నవీ – ఈ విచక్షణ ఏమీ లేకుండా ఆడది ''ఇల్లాలు'' పాత్ర నిర్వహిస్తున్నది. పేదవాళ్ల పని మనుషులను పెట్టుకోరు. మరీ సంపన్న దేశాలలో పనిమనుషులు దొరకరు.

ఎటొచ్చీ చాకిరీ పట్ల మనుషులకు గల అభిప్రాయాలలో చాలా తేడాలు ఉంటాయి. ఈ అభిప్రాయాలను నిర్ణయించేది నాగరికత. ఆ నాగరికతకు పునాది సామాజిక వ్యవస్థ.

ఘర్మ జలానికి ఖరీదు కట్టే షరాబుల సంస్కృతి అవతరించేవరకూ శ్రమించటమే జీవిత విధానంగా ఉండేది. అసలు వానర జాతుల నుంచి మానవుడు పరిణామం చెందినది శ్రమ ద్వారానే అని శాస్త్రవేత్తలు నిర్ద్వంద్వంగా చెబుతున్నారు. తిండీ, బట్టా, ఇల్లూ, – ఏదీ శ్రమపడకుండారాదు. ఈ సంగతి పేదవాళ్ళకూ, శ్రమించేవాళ్ళకూ తెలుసు.

వాళ్ళకు తెలియనిదేమంటే, ధనికులకు ఏమీ శ్రమపడకుండా అన్నీ ఎలా వస్తాయన్నది వాళ్ళ కష్టజీవులు. కొందరు సుఖ జీవులుగా ఎందుకుంటారన్నది కష్టజీవులకు అర్థంకాదు కాని అందులో ఏదో అర్థం ఉందనుకోవటానికి విధి నిర్దేశాలూ, కర్మ సిద్ధాంతాలూ, పుణ్యపాపాలూ వీటిలో విశ్వాసం కలిగించటానికి వేలాది కథలూ, ఉపఖ్యానాలూ, పురాణాలూ - చాలా పెద్ద తతంగం ఏర్పాటయింది అదంతా వేరే కథ.

మతాలూ, ఫ్యూడల్ సంస్కృతీ తోడు దొంగలుగా వ్యవహరించిన కాలంలో శ్రమించడం శ్రామికుడి ధర్మం అయింది. శ్రమ ఫలితాన్ని అనుభవించడం దోపిడీ వర్గాల ధర్మమయింది. లలిత కళలూ, దేవదాసీలు ఇతర వైభోగాలూ దోపిడీదార్ల కోసమే ఏర్పాటయినా వాటికి దేవుడి మేలి ముసుగు ఒకటి ఉండేది. ఫ్యూడల్ వ్యవస్థ బాగా పాతుకుపోయి రాజే విష్ణువు అవతారం అయినాక ఈ కాస్త తెరా తొలగిపోయి బూతు ప్రబంధాలూ, శృంగార కవిత్వమూ , తిన్నగా రాజుల కోసమే పుట్టుకొచ్చాయి. శ్రామికులు శ్రమించటం రాజ శాసనం అయింది. అందులో పుణ్యమూ లేదు పాపమూలేదు పీడిత వర్గాల వాళ్ళు శ్రమించకుండా బతికే సదుపాయాలు పూర్తిగా పోయాయి.

తరువాత ధనిక స్వామ్యం వచ్చింది. శ్రమకు డబ్బు విలువ ఏర్పడింది. క్రమంగా వినియోగవస్తువులన్నీ విక్రయ సరుకులు కూడా అయ్యాయి. శ్రమకూడా మార్కెట్ ధర సంపాదించుకున్నది. అంతకు పూర్వం ''గొప్ప'' వాళ్లూ, ''కులీనులూ'' శ్రమ చెయ్యకుండా సుఖజీవనం గడిపేవారు. కాని ఇప్పుడు డబ్బుగలవాడు శ్రమచెయ్యనవసరంలేదు. ఎవడన్నా శ్రమ ఎందుకు చెయ్యాలంటే డబ్బుకోసమే ! శ్రమ జీవిత విధానం కావటం చేత కాదు ! శ్రమ చెయ్యకుండా ఎవరుగాని ఎలా బతకగలరో ఆది మానవులు ఎరుగరు. డబ్బుంటే శ్రమ ఎందుకు చెయ్యాలో ఆధునిక మానవుడికి తెలియకుండాపోయింది కొద్ది శతాబ్దాల కాలంలో మానవ జాతి సాధించిన సాంస్కృతిక పురోగతి ఇదేనని చెప్పవచ్చు.

ఈ సంస్కృతిలో ఇల్లాలు ఇంటి చాకిరి ఎందుకు చేస్తున్నది ? డబ్బు పారేస్తే నౌకర్లూ, చాకర్లూ, వంటవాళ్లూ దొరకవచ్చు. కాని వాళ్ళందరికీ డబ్బు ఇచ్చుకునే శక్తి ఎంతమందికి ఉన్నదంటే నూటికి పదిమందికే. శ్రమ చెయ్యకుండా బతకటానికి ప్రయత్నించినప్పుడు మధ్య తరగతి అనేది మిధ్య అని వెంటనే తెలిసిపోతుంది ! అయితే ఈ సంగతి మధ్య తరగతి వాళ్లు గుర్తించరు. నౌకర్లూ, చాకర్లూ ఏర్పాటు చేసుకునే తాహతులేని కుటుంబీకులు ఆ చాకిరీ అంతా తమ ఆడవాళ్ల చేత చేయిస్తున్నారు.

అంటే ఏమిటి అర్థం ? మధ్య తరగతి ఆడవాళ్లు శ్రామికులకన్న చవక అన్నమాట ! శ్రామికుల దోపిడీ కన్న ఆడవాళ్ళను దోచటం మరింత లాభకరం అన్నమాట.

ధనికస్వామ్యం సంస్కృతితో చూసినప్పుడే ఈ విశ్లేషణకు అర్థం ఉన్నదనీ స్వతహాగా శ్రమించడం జీవికి మౌలిక వ్యాపారమేననీ ఒప్పుకుంటాను. కాని సామాజిక దోపిడీని ఆమోదించేవాళ్లూ ధనిక స్వామ్య సంస్కృతికి కొమ్ముకాసేవారూ ఈ విశ్లేషణను గుర్తించరు. వారు గుర్తించాలి. ఎవరి సామాజిక ప్రవర్తనను వారు అర్థం చేసుకోవటం ఎంతైనా అవసరం.

'మధ్యతరగతి వాళ్లు తాము స్త్రీల శ్రమ శక్తిని కారు చౌకగా కొంటున్నారు.'' ఇది కాదనటానికి వీలులేని విషయం. దీనికి విరుద్ధంగా వాదనలున్నాయి. వాటిని క్రమంగా పరిశీలించుదాం.

అలా పరిశీలించే ముందు ఇంకొక మూల్యాన్ని కూడా మనం మరవరాదు. అది సెక్స్ మూల్యం. సెక్స్ కూడా ధనిక స్వామ్యంలో వెలకు దొరుకుతుంది. వెలయాళ్ళు చాలా ఖరీదు. వేశ్యాలంపటులై తమ ఆస్తిపాస్తులనూ, ఆరోగ్యాన్ని పోగొట్టుకున్నట్టు భయంకరమైన కథలూ, కరుణామయమైన నాటకాలూ ఉన్న సంగతి మనకు తెలుసు. దీన్ని బట్టి ఏమి తేలుతుంది ? భార్యలు భర్తలకు ఇచ్చే సెక్స్ సుఖం మూల్యం ఏమిటి ? భార్యలు వేశ్యలకన్న కారుచవక.

ధనస్వామ్య సంస్కృతి దృష్ట్యా ఆడది ఎలా దోచుకోబడుతున్నదంటే, ప్రతి మగవాడూ తన ఇంటి ఆడది తాను చేసే చాకిరేకీ, ఇచ్చే సెక్సు సుఖానికీ మూల్యం చెల్లించాలనేటట్టుంటే మళ్ళీ నూటికి 90 మంది పాపర్లు తేలుతారు. కనుక ఈ సంస్కృతి దృష్ట్యా చూసినా మధ్య తరగతి మిథ్యా తరగతే !

ఇదంతా కుహనా తర్కమని అనేవాళ్లు కొన్ని అభ్యంతరాలు చెప్పవచ్చు వాటిని పరిశీలించుదాం.

ఆడదానికి కూడా ఒక ఇల్లూ, సంసారమూ కావాలి. అవి అచ్చగా మగవాడి కోరికలే కావు. స్త్రీకి మాతృత్వకాంక్ష ఉంటుంది. కామం ఉంటుంది. ఇవన్నీ శ్రామిక వర్గాలకూ, వేశ్యలకూ కూడా ఉంటాయి. ఇవి ఉన్నంత మాత్రాన ఆడది శ్రామికులకన్నా, వేశ్యలకన్నా చవుక కానవసరంలేదు. అంతేకాదు. ఈ సంస్కృతిలో ఏ ఆడది గాని పెళ్లితో నిమిత్తం లేకుండా తన కామాన్నీ, తద్వారా తన మాతృత్వ కాంక్షనూ తీర్చుకుంటే – అంటే కారుచవగ్గా ఏ అయ్యకో అమ్ముడు పోకపోతే – ఈ సంస్కృతి కోరలూ, గోళ్ళూ చూపించి గర్జిస్తుంది. అందుచేత ఇది శుష్కవాదం.

ప్రేమ సాకు ఒకటి ఉన్నది. ఆడది తన భర్త మీద ప్రేమ కొద్దీ తన పిల్లల మీద

ప్రేమ కొద్దీ వాళ్ళకు చాకిరీ చేస్తుంది. ఇది కూడా కుంటి సాకే – పైపెచ్చు చాలావరకు అబద్ధం. తమ తల్లిదండ్రులను దివాలా ఎత్తించి కట్నం గుంజి తనను పెళ్లి చేసుకున్నవాణ్ణి ఏ స్త్రీ గాని ప్రేమించవలసిన అవసరం లేదు. పెళ్ళి చేసుకోకుండా స్త్రీ స్వేచ్ఛగా బతికే అవకాశాలు దాదాపు శూన్యంగా ఉన్న వ్యవస్థలో స్త్రీ తన భర్తను ప్రేమిస్తున్నదంటే, పోలీసులు అనుమానితుణ్ణి చిత్రహింసలు పెట్టి తాను నేరం చేశానని ఒప్పించినట్టుగా ఉంటుంది. ఆడదానికి పెళ్లి అనివార్యంకాని పరిస్థితి ఏర్పడినప్పుడే ఆడది ప్రేమకోసం పెళ్లి చేసుకుంటుంది. పెళ్లి అన్నది నిర్బంధంగా జరిగినంతకాలమూ ప్రేమ ప్రస్తావన అప్రస్తుతం.

''చాలా మంది స్త్రీలు పెద్ద చదువులు చదివి ఉద్యోగాలు చెయ్యగలిగి ఉండికూడా ఇంటి చాకిరీ చెయ్యడానికే ఇష్టపడతారు. అలా చాకిరీ చెయ్యడం చవగ్గా అమ్ముడు పోవటం అనివాళ్లు అనుకోరు'' అనవచ్చు.

ఇది వాస్తవంగా మనం చూస్తున్నదే గనక కాదలేం. అయితే ఇలా ఉద్యోగాలు మాని ఇంటి చాకిరీకి అంకితమయే వారంతా ఒకేరకం కాదు.

కొందరు భర్తలు తమ భార్యలు ఉద్యోగం చెయ్యకుండా రాహువులల్లే అడ్డుపడతారు. ఉద్యోగాలు చేసే ఆడదానికి శీలం దక్కదని కొందరి భయం. భార్య సంపాదిస్తున్నదంటే తమ మగతనానికి భంగమని కొందరి అనుమానం, ఉద్యోగం చేసే భార్య తనమీద స్వతంత్రిస్తుందని కొందరి నమ్మకం.

కొన్ని సందర్భాలలో భర్తలు ఒప్పుకున్నా భార్యలు ఉద్యోగం చెయ్యటానికి ఇష్టపడరు. ఉద్యోగం చేస్తే తమ స్వేచ్ఛ తగ్గిపోతుందని వాళ్లకు భయం. ఈ ''స్వేచ్ఛ'' ను మనం కొట్టి పారెయ్యటానికి లేదు. ఇది అమెరికన్లు ఆరాధించే స్వేచ్ఛ !. మురుగు కాలవల్లో చావటానికి పెట్టుబడిదారీ వ్యవస్థలో అనేక కోట్ల మంది పేదలకు ఉండే స్వేచ్ఛ ఇదే. అలాటి స్త్రీలకు సామాజిక దోపిడీ అనేది ఒకటి ఉందని కూడా తెలీదు. ఆఫ్ఘనిస్తాన్‌కూ, సోవియట్ యూనియన్‌కూ మధ్య ఒక నది ఉన్నది. నది అవతలితట్టు పచ్చపచ్చని పొలాలూ, తోటలూనూ, ఇద్దరిని పత్ర. ఆఫ్ఘన్ పేదలు రష్యన్ పొలాలలో పనిచేసే వాళ్లను చూసి, ''హు ! బానిస వెధవలు !'' అనుకుంటారుట ! అలాటి మనస్తత్వమే ఈ ఆడవాళ్ళది.

ఇలా ఉద్యోగాలకన్న ఇంటి చాకిరీ మేలనుకునేవారిలో కొందరిది ఫక్తు కార్మిక మనస్తత్వం. ''నా శ్రమ శక్తిని మరొకరు ఎందుకు దోచుకోవాలి. దానిలో నాకు దక్కినంతే దక్కనీ'' అంటే వినియోగపు విలువకు ఎక్కువ ప్రాధాన్యమూ, మారకపు విలువకు తక్కువ ప్రాధాన్యమూ ఇస్తారు. శ్రామిక వర్గం తమ అవసరాలకు తాము చేసే పనికి డబ్బు విలువ ఇయ్యదు. తమకు నిష్ప్రయోజనమైన ఉత్పత్తికి గాను శ్రమించేటప్పుడే

తమ శ్రమను డబ్బుతో కొలుస్తుంది. అది తక్కువని తోస్తే పోరాటానికి దిగుతుంది.

మరొకరకం స్త్రీలు ఉద్యోగం కన్న ఇంటి చాకిరి నయం అనుకునేవాళ్ళు, మన మూల సూత్రాన్ని రుజువు చేస్తారు. వాళ్ళ సంపాదన పని మనుషులు జీతాలకు సరిపోతుంది. లేదా తక్కువవుతుంది. ఇంటి చాకిరీకి మనుషులను పెట్టుకోవటం వల్ల అయ్యే ఖర్చు కన్న చాలా ఎక్కువ సంపాదించగల వాళ్ళూ, ఇంటి చాకిరీ చెయ్యటానికి ముసలమ్మలో, బీద బంధువులో ఉన్నవాళ్ళూ ఉద్యోగాలు మానరు.

*ఆంధ్రజ్యోతి , వారపత్రిక, 21-2-1975.*

# 23. ఆడవాళ్ళ అధోగతీ, పురోగతీ

మగవాళ్ళకన్నా ఆడవాళ్ళు తక్కువ అనటానికి కృత్రిమ శాస్త్రీయ కారణాలు చెప్పేవాళ్ళు ఈనాడు కూడా చాలామంది ఉన్నారు. ప్రకృతే వాళ్ళను అబలలుగా సృష్టించింది. అందుకే వాళ్ళు మగాళ్ళంత ఒడ్డూ, పొడుగూ ఉండరు. వాళ్ళు నెలనెలా ముట్టవుతారు. అడపా దడపా గర్భిణులవుతారు. ప్రసవిస్తారు. కొంతకాలంపాటు పనిపాటలు చేసుకోలేరు....వగైరా, వగైరా.

ఇవన్నీ ఆధునిక వ్యవస్థలో ఉన్న వాళ్ళు తమ సమకాలపు స్త్రీలని చూసి చెప్పే మాటలు అనం.''అలగా '' జనాన్ని చూసి, ''ఎబ్బే, వీళ్ళు ఎలా పైకి వస్తారు ? చదువూ, సంధ్యా లేదు, శుభ్రత లేదు. మంచి బట్టలు వేసుకోరు. ఆరోగ్యమైన తిండి తినరు. సాధారణ లోకజ్ఞానం కూడా లేదు. ఒక మంచి పుస్తకం చదవరు '' అనటంలో అర్థం ఎంత ఉన్నదో, స్త్రీలను గురించి మాట్లాడే దానిలో కూడా అంతే ఉన్నది.

సహస్రాబ్దాలమీద అణచి ఉంచిన స్త్రీలు గాని, ''అలగా'' వాళ్ళుగాని రేసు గుర్రాలల్లే ఎలా ఉంటారు ? మన కళ్ళ ఎదుటనే ఇలాటి ''అలగా'' జనాలు తిరగబడి జారుల రష్యాలోనూ, కొమింటాంగు చీనాలోనూ నూతన వ్యవస్థలు ఏర్పాటు చేసి, ఆ జార్‌లూ, ఆ కొమింటాంగు ప్రభువులూ కలలో కూడా సాధించలేని ప్రగతి సాధించారు. ఆ దేశాలలో ''అలగా'' వాళ్ళూ బిచ్చగాళ్ళూ మంత్రం వేసినట్టు మాయమయ్యారు. అందుచేత ఆడవాళ్ళను గురించి అంచనా వేసేటప్పుడు కొంచెం విశాలదృష్టి అవలంబించటం అవసరం.

ఆదిమ సమాజాలలో స్త్రీలు పురుషులకు తీసికట్టు అన్న భావం ఉన్నట్టు కనబడదు. వాళ్ళు ఆహారం అన్వేషిస్తూ, వేటాడుతూ సంచారం పోతున్నప్పుడు వాళ్ళ వెంట నిండు చూలాళ్ళు కూడా ఉండేవాళ్ళు. మధ్య దారిలో ఎవతెకన్నా ప్రసవం వస్తే ఆ మనిషి ఏ పొదచాటుకో వెళ్ళి, బిడ్డనుకని, తానే బొడ్డుకోసి బిడ్డతోసహా వచ్చేసి ముందు

వెళ్లినవాళ్లను కలుసుకునేదిట. ఆమెకోసం ప్రయాణం ఆగేది కాదుట. ఇది ఈనాటి నాగరికతలో ఊహించరాని విషయం ... అందుచేత మనం బిడ్డలను కనటమనేది ప్రకృతి స్త్రీ జాతికి కలిగించిన ఒక పెద్ద ఆటంకంగా భావిస్తున్నాం.

ఆదిమ జాతుల్లో స్త్రీ పురుషుల మధ్యనేకాక పెద్దల , పిన్నల మధ్య కూడా తారతమ్యానికి అవకాశం లేదు. ఆనాటి మనుషులు తమ జీవితాలకు అవసరమైన పరిజ్ఞానాన్ని అనుభవం ద్వారా నేర్చుకోగలిగేవారు. అందుచేత జీవిత భారాన్ని స్త్రీ పురుష విచక్షణా, పెద్దా, పిన్నా విచక్షణా లేకుండా అందరూ మోసేసేవారు.

అనేక వేల సంవత్సరాల ''అభివృద్ధి''కి గురిఅయిన మనం అప్పటి సమాజాన్ని ఊహించుకోలేం. ఈనాటి జీవిత భారంలోనే చాలా తేడాలున్నాయి. ఒక చివర అధికార భారాన్ని సంపద భారాన్నీ మోసే కొద్దిమంది ఉన్నతులూ, మరో చివర పాకీపనీ, తోళ్ళ పనీ, తవ్వకం పనీ, బరువులు మోసేపనీ లాటి భారాలను మోస్తూ, దారిద్ర్య భారాన్నీ మోసేహీనులు అధిక సంఖ్యలో ఉన్నారు. జీవిత పరిజ్ఞానం పూర్తిగా సంపాదించటం ఏ ఒకరి వల్లాకాదు. అందుచేత చదువుల్లో తేడాలూ, చదువుకోవటాల్లో తేడాలూ విధిగా ఉంటున్నాయి. కనీసం ఇరవయేళ్ళు చదివితేనేగాని ''ఉన్నత'' విద్య పూర్తికాదు. ఆ ఉన్నత విద్యల్లో కూడా శాఖోపశాఖలున్నాయి. అధిక సంఖ్యాకులకు ఏ విద్యారాదు. కొంతమందికి అల్ప విద్య మాత్రమే అందుబాటులో ఉంటుంది. పైపెచ్చు ఈ విద్య బతుకు తెరువుకు ఉపయోగిస్తుందనే నమ్మకం ఏమీలేదు.

ఇంతకన్న కూడా మనకు ముఖ్యమైన విషయం ఏమిటంటే, ఈ గడిచిన అనేక వేల సంవత్సరాల మీద ఆడది బాగా చితకగొట్టబడింది. అందుకు అనుకూలమైన సామాజిక వ్యవస్థ నాగరికత రూపంలో ప్రపంచమంతటా వెలసింది. నిజానికి ఒక దశలో స్త్రీ పురుషుడి మీద ఆధిక్యం సంపాదించింది. సమాజానికి నాయకత్వం వహించి, సమాజాభివృద్ధికి తోడ్పడింది. కాని ఆ దశ ఎంతో కాలం నిలవలేదు. ఆ దశ తాలూకు అవశేషాలే మనకింకా మిగిలి వున్నాయి. ఆ దశలో అందరూ ఆదిశక్తిని కొలిచారు. గ్రామ దేవతలు వెలిశారు. స్త్రీలు సమష్టి వ్రతాలు చేశారు. వాటి అవశేషాలు మనకింకా ఉన్నాయి.

మనకు హిందూ మతాచారాల రూపంలో సంక్రమించిన వైదిక సంస్కృతి స్థూలంగా స్త్రీలను గౌరవించేది కాదన్నది పెద్దగా చర్చించవలసిన విషయంకాదు. చచ్చిన మొగుడితో బతికున్న పెళ్ళాన్ని తగలెయ్యటం మన పూర్వులు ఏర్పాటు చేసినదే. దానికి ప్రత్యామ్నాయంగా వితంతువులకు గుండుచేసి, ఆభరణాలు తీసివేసి, తెల్లగుడ్డ చుట్టి, ఒంటిపూట తిండి పెట్టి, చీటికీ మాటికీ అందరికీ అపశకునంగా ఎదురుకాకుండా మూల

కూర్చోమన్నదీ మన సంస్కృతే వాళ్ళకు వేదాధ్యయనమూ, ఉపనయనమూ నిషేధించి అధమ (శూద్ర) వర్ణంతో సమంగా చూసినది కూడా మన ప్రాచీన సంస్కృతే. ''ఆడది మోసానికి మారురూపం''. ''ఆడది చిన్నప్పుడు తండ్రి అదుపులోనూ, పెళ్లయ్యాక మొగుడి అదుపులోనూ, తరువాత కొడుకు అదుపులోనూ పడి వుండాలి'', ''మర్దనం గుణవర్ధనం'' ఇత్యాది సూక్తులు మన పూర్వీకులు చెప్పినవే. వేదకాలంలోనే విశృంఖలంగా జరిగిన వర్ణ సాంకర్యాన్ని పట్టించుకోకుండా కృష్ణుడు భగవద్గీతలో దుష్టస్త్రీల మూలంగా వర్ణ సంకరం కలుగుతుందని సొడ్డు ఆడవాళ్ళమీద వేసాడు, కాని బ్రాహ్మణులు అన్ని కులాల (వర్ణాల) స్త్రీలను చేసుకొని – అందరూ హీనవర్ణం వారే గనుక ! – పిల్లల్ని కనవచ్చునని ధర్మశాస్త్రాలు చెప్పాయి. అందువల్ల వర్ణ సంకరం జరగలేదని మనం అనుకోవాలి.

ప్రబంధనాయికల కాలంలో స్త్రీ పెద్ద కావ్య వస్తువే అయింది గాని, అదే కాలంలో మానవత్వాన్ని మరింతగా కోల్పోయింది. ప్రతి ఒక్క ప్రబంధ నాయకకూ పది లక్షల మంది బానిస బతుకుస్త్రీలున్నారు. రాజు గారికి నూరు మంది ఉంపుడు గత్తెలైతే, మంత్రిగారికి యాభై మంది. నిన్న మొన్నటి వరకూ కనీసం ఒక పైదాన్ని ఉంచుకోనివాడికి పరువు మర్యాదలు లేవు. శృంగార రసానికి ఆడది ముడిసరుకు, లేదా చాకిరీ చేసే యంత్రం. ఆకాలంలో వారు జీవిత భారాన్ని పంచుకోకపోగా భార్యలు అయ్యారు. వాళ్ల కోసం పుట్టిన అంతులేని ఆభరణాలు – ఏడు వారాల సొమ్ములు – వాళ్ళ పాలిటి గొలుసులుగా పనిచేశాయి.

ఆధునిక కాలంలో కండ బలానికి ప్రాముఖ్యం లేదు. మారణాయుధాలూ, యంత్రాలూ అభివృద్ధికి వచ్చాక కండబలం ప్రదర్శనలకు మాత్రమే పనికివచ్చింది. స్త్రీల అబలత్వం వారిని అణగదొక్కి వుంచడానికి ఒక సాకు కావలసిన పనిలేదు. సగటున వాళ్లు మగవాళ్లకన్న పొట్టిగా వుండడం వాళ్ళు జన్మతః మేలైన వాళ్ళని సూచిస్తుంది (పొట్టితనం ప్రోగ్రసివ్ ఫాక్టర్ అని చెబుతారు).

ఒక్క విషయంలోనే స్త్రీలు మగవాళ్ళ కన్న వాస్తవంగా వెనుకబడివున్నారు– సామాజిక చైతన్యంలో. అనేక వందల తరాలపాటు వంటింటినీ, ఇంటినీ దాటి బయటికి రాకపోతే ఏ ప్రాణికైనా సామాజిక చైతన్యం తరిగిపోతుంది. జీవితమంటే భయం. జైల్లో పుట్టి పెరిగినవాడికి జైలుగోడలే అంగరక్షగా తోచినట్టుగా స్త్రీలకు తమను నిర్బంధంలో ఉంచుతూ వస్తున్న ఆచారాలంటే అమితమైన అభిమానం ఉండటం చూస్తాం. ''స్త్రీల అభివృద్ధికి స్త్రీలే శత్రువులు'' అన్నది సగం నిజం. ఎందుకంటే శత్రుత్వం పురుషులలోనే హెచ్చు. అయినా స్త్రీలలో ఉండటం గమనార్హం. వాళ్లు పైకి రావటం

ఎంత అవసరమో పురుషుల శత్రుత్వం కన్నా స్త్రీల శత్రుత్వం ఎంత బాగా నిరూపిస్తుంది.

స్త్రీలను ఉద్ధరించడానికి జరిగిన ప్రయత్నాలను గురించి కూడా కొంత చెప్పుకోవాలి స్త్రీల బతుకులను సంస్కరించటానికి జరిగిన ప్రయత్నాలు స్త్రీల సమస్యను నిజంగా పరిష్కరించకపోయినా, ఒక్క మేలు చేశాయి – స్త్రీ పునర్వివాహాలూ, స్త్రీ విద్యా, రజస్వలానంతర వివాహాలూ, విడాకులూ, స్త్రీల ఉద్యోగాలూ మొదలైనవి సమాజ వ్యవస్థలో మౌలికమైన మార్పులు కలిగించకపోయినా, జడంగా ఉండిపోయిన ఒక వైరుధ్యానికి ప్రాణం పోసి ఘర్షణ రెచ్చగొట్టాయి. అలాంటి ఘర్షణను, ప్రధాన సంఘర్షణనూ, వ్యవస్థముందుకు పరిణమించటానికి పరోక్షంగా దోహదం చేస్తాయి.

మరికొన్ని రకాల సంస్కరణ వాదాలు ఆ పనికూడా చెయ్యలేదు. అందులో ఒకటి స్త్రీ ఆరాధన. ఆడదాన్ని మాటలతో అందలాలు ఎక్కించి, మగవాడి కన్న ఆడదే ఎక్కువ అని ప్రకటించటం, ఇందువల్ల ఆడదానిలో ఉండే ఆ కాస్త పోరాట శక్తి నీరుగారిపోవటం తప్ప జరిగేదేమీ లేదు. కొద్దిమంది అమాయక స్త్రీలను మభ్యపెట్టటానికి మాత్రమే ఇటువంటి సంస్కారం – ఇది సంస్కారం కూడా అనిపించుకోదు – ఉపయోగపడుతుంది.

నిజానికి ఈనాడు మనదేశంలోనే కాదు. ప్రపంచంలో చాలా ప్రాంతాల స్త్రీలకి లభించవలసినది పురుషుడితో సమత్వం – నిజమైన సమత్వం. ఇది చట్టం ద్వారానూ, సంస్కరణల ద్వారానూ, సంస్కృతి ప్రచారం ద్వారానూ జరిగేది కాదు. కనీసం సోషలిస్టు విప్లవం జరిగేదాకా ఆ మార్పుకు పునాది ఏర్పడదు. కాని పునాది ఏర్పడిన మాత్రాన నిర్మాణం పూర్తికాదు. ''ఇవాళ పని ప్రారంభించినా ఆడది మగవాణ్ణి అందుకోవటానికి నూరేళ్లు పడుతుంది '' అని హెచ్.జి .వెల్స్ ఒకప్పుడు అన్నాడు. 1917లో రష్యాలో ఆరంభమైన సోషలిస్టు వ్యవస్థలోగాని, 1949 లో ప్రారంభమైన చీనాలోని సోషలిస్టు వ్యవస్థలోగాని స్త్రీలు పురుషులతో సమానత్వం సంపాదించే ప్రక్రియ ఇంకా పూర్తిగాకపోతే మనం ఆశ్చర్య పడనవసరంలేదు. అయితే ఒక్క విషయం నిజం. సోషలిస్టు దేశాలలో ఈ ప్రక్రియకు అవాంతరాలుండవు – ఏకారణం చేతనైనా సోషలిజం గుంటపూలు పూయనారంభిస్తే తప్ప.

ఇంతకూ చెప్పవచ్చిందేమంటే, స్త్రీల అభ్యుదయం సోషలిస్టు సామాజిక విప్లవం మీద పూర్తిగా ఆధారపడి ఉన్నది.

*ఆంధ్రజ్యోతి , వారపత్రిక, 4-4-1975.*

# 24. అవివాహిత మాతలు

గర్భ నిరోధక విధానాలు ఇంగ్లండులో అందరికీ తెలిసినవే అయినప్పటికీ, 1969లో బర్మింగ్‌హామ్ నగరంలో మొత్తం కలిగిన జననాలలో అక్రమ సంతానాల శాతం అమితంగా పెరిగిపోయిందట !

అక్రమ సంతానాలంటే పెళ్లికానివారికి సంతానం కావచ్చు. మొగుళ్లకు దూరంగా ఉండి గర్భధారణ చేసినవారి సంతానంకావచ్చు. నైతిక దృష్టిలో రెంటికీ తేడాలేదు. ఇంకోరకం అక్రమ సంతానం ఉన్నది - మొగుళ్ల వెంట ఉంటూనే, ఆ మొగుళ్ళకు తెలిసో, తెలియకుండానో, ఊళ్ళోవాళ్ళకు కనే సంతానం. నైతికంగా ఇదీ అక్రమ సంతానమే అయినా దీన్ని గురించి యాగీ లేదు ; ఇది సమస్యే కాదు.

అక్రమ సంతానాన్ని కన్యలుగాని, భర్తలకు దూరంగా ఉన్నవారు గాని కోరి కనటం జరగదు. బర్మింగ్‌హామ్‌లో అలాటి స్త్రీలకు 'నిరోధక' సౌకర్యాలు లభించడం లేదన్నమాట. మనదేశంలో లభిస్తాయని ఏమిటి ?

అసలు కన్యలు ఎందుకు గర్భం ధరించటం జరుగుతున్నది? ''అష్టవర్షా భవేత్ కన్యా పుత్రవత్పాలితా మయా'' అంటూ ఆడపిల్లలను తల్లిదండ్రులు కన్యాదానం చేసే రోజుల్లో ఈ సమస్యేలేదు. పెళ్ళి చేసుకున్న పిల్ల పరపురుషుడిచేత గర్భధారణ పొందినప్పుడు అమ్మలక్కలు బుగ్గలు నొక్కుకుని ''దీనికేం పొయ్యేకాలం!'' అంటే, అందులో కొంత అర్థం ఉండేది.

''కన్నెచెర'' అన్నారు. ఆ చెర నుంచి బయటపడాలనే ప్రతి వయస్కురాలికీ వుంటుంది. కాని ఈ ''నాగరిక'' సమాజం పెళ్ళి అనేది 'అందని మ్రానిపండు' అయ్యేలా చేసింది. అనాగరిక జాతుల వాళ్లు మనకన్న బతకటం బాగా నేర్చిన వాళ్లు గనక తేలిగ్గా పెళ్ళిళ్లు చేసుకుంటారు. అంత తేలిగ్గానూ పెళ్ళిళ్ల రద్దు చేసుకుని మళ్ళీ పెళ్ళిళ్లు చేసుకుంచారు. మనం అలా కాదే, ముప్పాతిక మువ్వీసం కట్నాలు కక్కలేకా, ఒక పావు వీసం శాఖ వాడూ, జాతకాలు కలిసినవాడు దొరక్కా, రజస్వల అయిన పిల్లను ఏళ్ళ తరబడి ఎండ బెడుతున్నాం.

దీనికి తోడు స్త్రీ పురుష మృగాలమధ్య వెనక వున్నంత ఎత్తుగా గోడలు లేవు. ఈనాటి పిల్ల స్కూలుకో, కాలేజీకో, ఒక్కొక్కప్పుడు ఆఫీసుకో, తరుచు సినిమాలకో, రోజూ వీథిలోకి పోతుంది. ఈనాటి సెక్సును ప్రేమ కలాపంగా చేసుకునేటంత సంస్కృతి మనకింకా దిగుమతి కాని కారణం చేత అది వేటను హెచ్చుగా పోలివుంటున్నది. ఈ వేటలో అక్కడక్కడా ఒక్కొక్క అభాగ్యురాలు దెబ్బ తినడం జరుగుతుంది. అలాటి అభాగ్యురాలు గర్భవతి అయితే ఆమెను గజ్జి కుక్కను చూసినట్టు చూసే సమాజం నాగరిక సమాజం అనిపించుకోదు.

వాళ్లు తప్పుదారినపోయారని, భూతదయ కొద్దీ వారిని మంచిదారికి తెచ్చే ప్రయత్నాలు చెయ్యాలనే వాళ్ళ పేట్రనైజింగ్ ధోరణి కూడా నాకు నచ్చడంలేదు. పిల్లల తల్లిదండ్రులకు మళ్ళీ పెళ్ళి అయినట్టే పిల్లల తల్లులకూ మళ్లీ పెళ్లి కావచ్చు ''ఈ తల్లి ఎవరి భార్యా?'' అన్నది వివేకంలేని ప్రశ్న.

పురుషులలోలాగే స్త్రీలకు కూడా పెళ్ళి లేకుండా జీవించే ఇచ్ఛా, తీర్మానమూ, శక్తీ ఉండేవాళ్ళు పిల్లల్ని కనాలంటే అందుక ఒకరి పర్మిషన్‌తో పని ఉండనసరంలేదని నా నమ్మకం.

కన్యగా ఉండి, అనుకోకుండా పరిస్థితి ప్రోద్బలంచేత తల్లి అయి కూర్చుని, నిస్సహాయురాలైపోయే అరుదైన స్త్రీ మీదనే సంఘం తన ప్రతాపమూ, పేట్రనేజీ, ఉదారతా ప్రకటించేది. ఇలాటి అవసరం లేకుండా తగిన ఏర్పాట్లు జరపవచ్చు. తగినవాళ్ళు పూనుకుంటే ఇది కష్టమేం కాదు.

ఇలాంటి పనులు సంఘంలోని మెజారిటీ ఆమోదంతో ఏనాడూ జరగవు. వితంతు వివాహాలు ఆమోదించినవారు ఆనాడూ, ఈనాడూ కూడా అల్ప సంఖ్యాకులే- అత్యల్ప సంఖ్యాకులు. మన వివాహ వ్యవస్థను ప్రభుత్వం మార్చేదాకా కన్యా మాతృత్వం ఉండనే వుంటుంది. ఇంకా పెరుగుతుందేమో కూడానూ. అందుచేత ఈ రకం మాతలకు రక్షణలు ఎలా కల్పించాలో ఆలోచించటం మన విధి.

*ఆంధ్రజ్యోతి, వారపత్రిక, 1-8-1980.*